

# ద్రావిడ భాషలు

రచయిత :
ప్రొఫెసర్ పి. యస్. సుబ్రహ్మణ్యం



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

ప్రాప్తి
16-6-2003

T

# ద్రావిడ భాషలు


రచయిత :

ప్రొఫెసర్ పి. యస్. సుబ్రహ్మణ్యం

ఎం. ఏ. తెలుగు; ఎం. ఏ. సంస్కృతం; డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్; పి హెచ్ డి.;
డి. లిట్. ఆంధ్రా





పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,

నాంపల్లి, హైదరాబాదు - 4.

1997

DRAVIDABHASHALU
by Prof. P. S. SUBRAHMANYAM

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ సంఖ్య - 141

ద్వితీయ ముద్రణ : 1994
తృతీయ ముద్రణ : 1997
ప్రతుల సంఖ్య : 2000



వెల : రూ. 50-00

ప్రతులకు :
డైరక్టర్, ప్రచురణల విభాగం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 4.

ముద్రణ :
మహాలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్
8-3-949/3, పంజగుట్ట,
హైదరాబాదు - 500 073.
ఫోన్లు : 3742600, 293772

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం



లలిత కళాక్షేత్రం, పబ్లిక్‌గార్డెన్స్
హైదరాబాదు - 500 004.

# సమర్పణ

బోధన పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు - సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985 వ సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత నాటక, లలితాకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలె కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ " మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ. మా ప్రచురణ విభాగం ఈ ధ్యేయాన్నీ, జ్ఞాన ప్రదాన ధ్యేయాన్ని సమానంగా నిర్వహిస్తున్నది.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయం యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యాస్రవంతి శీర్షికను సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మహాత్మ్యం ఉత్తర హరివంశం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు హిందీ భాషల్లోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని, 'హిస్టర్ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపూటాన్నీ ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర' అనే గ్రంథం పునర్ముద్రించడమైనది, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖవారి సహకారంతో డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ రచనలు ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది.

"తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును" అని కేతన, "జనని సంస్కృతంబు సర్వ భాషలకును" అని శ్రీనాథుడు చెప్పిన మాటలు తెలుగుకు సంస్కృతానికి మధ్య/గల ఘనిష్ఠ , సంబంధాన్ని తెలియజేస్తున్నాయి. డా॥ చిలుకూరి నారాయణరావుగారు తమ ఆంధ్రభాషా చరిత్రలో తెలుగును ఇతర ద్రావిడ భాషలతో పాటుగా సంస్కృత ప్రాకృతజన్యంగా నిరూపించడానికి ప్రయత్నించారు. సంస్కృత ప్రాకృత భాషల్లోని అనేక పదాలు తెలుగులో తత్సమ తద్భవాలుగా ప్రవేశించినా తెలుగుకు సంస్కృత ప్రాకృతాలలో జన్య జనక సంబంధం లేదని పరిశోధనల వల్ల తేలింది. ఈ దిశలో మొదట విశేషమైన కృషి చేసినవాడు బిషప్ కాల్డ్వెల్. ఈయన 'కంపారిటివ్ స్టడీ ఆఫ్ ద్రావిడియన్ లాంగ్వేజేస్' అనే గ్రంథంలో తమిళం, కన్నడం, మళయాళం, తెలుగు మొదలైన భాషలను తులనాత్మకంగా అధ్యయనంచేసి, ఇవన్నీ ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషలనీ, మూలద్రావిడ భాష వీటికి మూలభాష అనీ ప్రతిపాదించడం జరిగింది. నాటి నుండి నేటివరకు ద్రావిడ భాషల తులనాత్మక అధ్యయనంలో గణనీయమైన పరిశోధన జరిగి ఎన్నో నూత్న విషయాలు వెలుగులోకి వచ్చాయి.

ద్రావిడ భాషల అధ్యయనంలో ఎంతో కృషి చేసిన ఆచార్య పి. ఎస్. సుబ్రహ్మణ్యంగారు 'ద్రావిడభాషలు' అన్న ఈ గ్రంథాన్ని రచించడం వలన భాషాధ్యయనానికి మహోపకారం లభించింది. ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణాన్ని తెలుగులో విపులంగా వివరించిన మొదటి గ్రంథం ఇది. ఈ గ్రంథంలో ద్రావిడ భాషల నిర్మాణం, మూలద్రావిడ భాషా పునర్నిర్మాణం, మూలద్రావిడ భాష కాలక్రమంగా మార్పులు పొంది వివిధ బాషలుగా ఏర్పడిన వైనం, ద్రావిడ భాషా వర్ణాలు, ప్రత్యయాలు పొందిన పరిణామాలు ఈ గ్రంథంలో ప్రామాణికంగా వివరింపబడ్డాయి. తెలుగు భాషా చరిత్రను తెలుసుకోగోరేవారికి ఈ గ్రంథం బాగా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు. పాఠకలోకానికి దీని ఉపయోగాన్ని, ఇది మూడవ ముద్రణకు రావడమన్న అంశమే వెల్లడిస్తున్నది. ఇప్పుడు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం తెలుగు పాఠకలోకానికి ఈ గ్రంథాన్ని సాదరంగా అర్పిస్తున్నది.

నాయని కృష్ణకుమారి

హైదరాబాదు
21-11-1997

నాయని కృష్ణకుమారి

# పీఠిక

మన తెలుగుభాషా, తమిళం, మలయాళం, కన్నడం, తుళు- ఇంకా పదహారు ఆటవిక భాషలూ జన్మసంబంధం కలవి అనీ, ఈ ద్రావిడ భాషలకీ ఇండో - యూరపియన్ భాషాకుటుంబానికి చెందిన సంస్కృతానికీ జన్మసంబంధం ఏమీ లేదనీ సర్వపండిత సమ్మతమైన సిద్ధాంతం. ద్రావిడ భాషలమీద తులనాత్మక పరిశోధనకి అంకురార్పణ చేసినవాడు. బిషప్‌రాబర్ట్ కాల్డ్‌వెల్. ఈయన తన పరిశోధనా ఫలితాలని పందొమ్మిదో శతాబ్దం మధ్యభాగంలోనే పండితుల దృష్టికి తీసుకువచ్చినా ఆ తరవాత చాలాకాలం వరకూ ద్రావిడ భాషలపై పరిశోధన విస్తృతంగా జరగలేదు. కాని ఇటీవల మూడు నాలుగు దశాబ్దుల నించి మళ్ళీ ఈ పరిశోధన ద్విగుణీకృతోత్సాహంతో జరుగుతోంది. ఈ పునరుద్ధరణకి దారితీసినవారు పాశ్చాత్య పండితులే అయినా సమీపకాలంలో చాలామంది భారతీయ పండితులు కూడా ద్రావిడభాషల మీద పరిశోధన ప్రారంభించి కొనసాగిస్తున్నారు. ఇప్పుడు మన దేశంలోనూ ఇతరత్రా కూడా ద్రావిడభాషల మీద వర్ణనాత్మకంగానూ, తులనాత్మకంగానూ కూడా పరిశోధన శరవేగంగా సాగుతోంది. సాహిత్యవంతమైన భాషలలో ప్రాచీన వ్యాకరణాలు, సాహిత్యగ్రంథాలు, శాసనాలు, ఆధునిక భాషలో మాండలిక భేదాలు మొదలైనవాటిమీద భాషాశాస్త్ర పరిశోధన సాగుతోంది. సాహిత్యరహిత భాషలలో వస్తుసంగ్రహణం చేసి, వాటికి వ్యాకరణాలూ, కోశాలూ తయారుచెయ్యడం కూడా జరుగుతోంది. వీటివల్ల లభించిన కొత్త విశేషాలని ఆధారంగా చేసుకొని జరిగే తులనాత్మక పరిశోధనలో కొత్త కొత్త విషయాలు బయటపడుతున్నాయి.

తెలుగులో లభించే శాసనాలూ, ప్రాచీన గ్రంథాలూ ఆధారంగా తెలుగు భాషా చరిత్రని వివరించే గ్రంథాలు ఇంతకితం కొద్దిగా ఉన్నాయి; ఇటీవల కాలంలో ఇటువంటివి మరికొన్ని ప్రచురితమయ్యాయి. ప్రస్తుత గ్రంథం ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణాన్ని తెలుగువారికి పరిచయం చెయ్యడానికి ఉద్దిష్టమయింది. ఇందులో తెలుగు, దానికి సోదర భాషలైన భాషల నిర్మాణాన్ని వివరించడమే కాక ఈ వర్ణనాత్మక, వస్తువు (**Descriptive material**)

ఆధారంగా మూలద్రావిడభాషా నిర్మాణాన్ని సాధ్యమైనంతవరకూ పునర్ని ర్మించడం కూడా జరిగింది. దీనివల్ల ద్రావిడ భాషలలో ఉన్న పరస్పర సాదృశ్యభేదాలు తెలియడమేకాక, మూలద్రావిడభాష కాలక్రమేణ ఎటువంటి మార్పులు పొంది ఇప్పటి భాషలుగా విడిపోయిందో కూడా పఠితలకి తెలుస్తుంది. మూలద్రావిడభాషా కాలం నించి ఇప్పటి వరకూ తెలుగులోనూ, ఇతర ద్రావిడ భాషలలోనూ వర్ణాలూ, ప్రత్యయాలూ పొందిన పరిణామాలు ఇందులో వివరించ బడ్డాయి. ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణాన్ని తెలుగులో విపులంగా వివరించే గ్రంథం ఇంతవరకూ వెలువడలేదు. కాబట్టి తెలుగులో ఈ అంశంమీద ఇదే ప్రప్రథమ గ్రంథం అని చెప్పవచ్చు. చారిత్రక వ్యాకరణం (Historica Grammar) కన్న తులనాత్మక వ్యాకరణం (Comparative Grammar) ఒక భాష చరిత్రని వివరించడంలో శక్తిమత్తరమనీ, మొదటిది రెండోదానికి చెలికత్తె వంటిదనీ భాషా శాస్త్రజ్ఞుల నిర్ణయం. చారిత్రకాంశాలు కూడా ఈ గ్రంథంలో వీలైనంత వరకు ఇవ్వబడ్డాయి. తెలుగు భాషాచరిత్రని మూల ద్రావిడభాషాకాలం నించి తెలుగువారు తెలుసుకొందుకు ఈ గ్రంథం ఉపయోగి స్తుందని నమ్ముతున్నాను.

ఆధునిక కాలంలో ద్రావిడభాషల వర్ణనాత్మక, తులనాత్మక పరిశోధన మీద ఆంగ్లభాషలో గ్రంథాలు విరివిగా వచ్చాయి, వస్తున్నాయి. ఈ గ్రంథాలలో ఉన్న అంశాలని సంగ్రహంగా తెలుగువారికి తెలుగులో వివరించడమే ఈ గ్రంథం ఉద్దేశం. ఇందులో ఇప్పటివరకూ ద్రావిడభాషలమీద పరిశోధన చేసిన పండితు లందరూ కనుగొన్న నూతన విషయాలు గ్రహించబడ్డాయి. ప్రస్తుత గ్రంథకర్త పరిశోధన ఫలితాలు కూడా ఇందులో చేర్చబడ్డాయని వేరే చెప్పనక్కరలేదు. ఇందులో కొన్ని అంశాలు భారతిలో 1967 - 71 ల మధ్య వ్యాసాలుగా ప్రచురించ బడ్డాయి. వాటికి తెలుగు విద్యార్థి పండితలోకం చూపిన ఆదరణే నన్ను ఈ సమగ్ర గ్రంథాన్ని ప్రచురించడానికి ప్రోత్సాహపరిచింది. తెలుగులో ఇటువంటి గ్రంథం లేకపోవడంవల్ల తెలుగు ఎం.ఏ, బి.ఏ, విద్యార్థులు పడే కష్టం ఈ రచయితకీ, ఇతర విశ్వవిద్యాలయాలలో ఆచార్యులకీ తెలియనిది కాదు. ఈ కొరత ఈ గ్రంథం వల్ల కొంతవరకైనా తీరితే ప్రస్తుత గ్రంథకర్త ఆశయం సఫలమైనట్లే.

పి.ఎస్. సుబ్రహ్మణ్యం.

(ని)

# విషయసూచిక

I. ద్రావిడభాషాకుటుంబం 1—91

1. ఉపోద్ఘాతం (1 - 4) 2. భాషలు (4 - 49) 3. ద్రావిడ భాషల ప్రత్యేక లక్షణాలు (49 - 55) 4. ఆర్యభాషలమీద ద్రావిడ భాషల ప్రభావం (55 - 63) 5. ద్రావిడ భాషల తులనాత్మక పరిశోధన చరిత్ర (63 - 91)

II. తులన చరిత్రాత్మక వర్ణ నిర్మాణం 92—166

1. ధాతువు - నిష్పాదక ప్రత్యయం (91 - 96) 2 మూల ద్రావిడ భాషా వర్ణాలు (97 - 98) 3. *అ (98 - 100) 4. *ఆ (101 - 102) 5. *ఇ (102 - 103) 6. *ఈ (103) 7. *ఉ (103 - 104) 8. *ఊ (104) 9. *ఎ (105 - 106) 10. *ఏ (106) 11. *ఒ (107 - 108) 12 *ఓ (108) 13. ధాతువులో దీర్ఘాచ్చులు హ్రస్వాచ్చులుగానూ, ద్విరుక్త హల్లులు అద్విరుక్త హల్లులుగానూ మారడం (109 - 112) 14. తెలుగులో య ముందు దీర్ఘాచ్చు (113 - 114) 15. దక్షిణ ద్రావిడ భాషలు, తెలుగులలో ఇ/ఎ, ఉ/ఒ ల మార్పు (114 - 118) 16. తెలుగు కువి భాషలలో వర్ణవ్యత్యయం (118 - 122) 17. కొడగు అచ్చులు (123 - 125) 18. కోతలో అచ్చులమార్పు (125 - 126) 19. ద్రావిడ భాషలలో శ్వాసస్పర్శాలు నాదస్పర్శాలుగా మారడం (126 - 133) 20. *క (133 - 139) 21. *చ (140 - 145) 22. *ట (145 - 146) 23. *త (146 - 147) 24. *ప (147 - 149) 25. *త్ర (*ఱ) (149 - 151) 26. *ఞ (152) 27. *ణ (152) 28. *న (దంత్యం), *న (దంతమూలీయం) (153 - 154) 29. *మ (155) 30. *య (155 - 156) 31. *ర (156 157) 32. *ల (157 - 158) 33. *వ (158) 34. *ళ (159 - 160) 35. *ఴ (160 - 162) 36. మూలద్రావిడంలో అనునాసిక సహిత ద్విరుక్తస్పర్శం (162 - 163) 37. తెలుగు వర్ణ నిర్మాణంలో వచ్చిన మార్పులు (163 - 166)

**III. నామవాచకాలు** **167 - 289**

1. ప్రాతిపదికలు (167 - 181) 2. లింగవచన ప్రత్యయాలు (181-215) 3. సంఖ్యాపదాలు (216 - 227) 4. సర్వనామాలు (227 - 252) 5. ఔపవిభక్తికాలు (252 - 270). 6. విభక్తి ప్రత్యయాలు (270 - 289)

**IV. క్రియలు** **290-430**

1. సకర్మక ప్రేరణ ప్రత్యయాలు (291 - 320) 2. భూతకాల ప్రత్యయాలు (320 - 352) 3. వర్తమాన భవిష్యత్కాల ప్రత్యయాలు (352 - 375) 4. వ్యతిరేక ప్రత్యయాలు (375 - 395) 5. పురుషప్రత్యయాలు (395 - 405) 6. తుమర్థక ప్రత్యయాలు (406 - 414) 7. విధ్యాద్యర్థక ప్రత్యయాలు (414 - 430)

**V. ఉపకుటుంబ విభజన** **431 - 449**

1. ఉపోద్ఘాతం (431 - 436) 2. దక్షిణ ద్రావిడోపకుటుంబం (436-440) 3. మధ్య ద్రావిడోపకుటుంబం (440-446) 4. ఉత్తర ద్రావిడోపకుటుంబం (446-449)

# సంకేతాలు

| | | | |
|---|---|---|---|
| త. | తమిళం | పెం. | పెంగో |
| మ. | మలయాళం | మం. | మండ |
| కొ. | కొడగు | కూయి | కూయి |
| కోత | కోత | కు. | కువి |
| తొ. | తొద | కో. | కోలామీ |
| క. | కన్నడం | నా | నాయకీ |
| తు. | తుళు | ప. | పర్జీ |
| తె. | తెలుగు | గ. (ఒ., సా.) | గదబ (ఒల్లారీ, సాలూరు) |
| గోం. | గోండి | కూ. | కూడుఖ్ |
| కొం. | కొండ | మా. | మాల్తో |
| | | బ్రా. | బ్రాహుయీ |

| | |
|---|---|
| మూ. ద. ద్రా. | మూల దక్షిణ ద్రావిడం |
| మూ. మ. ద్రా. | మూల మధ్య ద్రావిడం |
| మూ. ఉ. ద్రా. | మూలోత్తర ద్రావిడం |
| మూ. ద్రా. | మూల ద్రావిడం |

X

# 1981 సెన్సస్ ప్రకారం ద్రావిడభాషా వ్యవహర్తల సంఖ్యలు

(బ్రాకెట్లలో ఉన్న సంఖ్యలు 1961,1971 సెన్సస్‌లలో ఇచ్చినవి.)

మొత్తం (భారతదేశంలో ఉన్న) ద్రావిడభాషా వ్యవహర్తల సంఖ్య సుమారు 15 కోట్లు.

| | | | |
|---|---|---|---|
| తమిళం | 4 కోట్ల 47 లక్షలు | పెంగో | (1,254) |
| ఇరుళ | 5,200 | | |
| మళయాళం | 2 కోట్ల 60 లక్షలు | మండ | — |
| కొడగు | 90 వేలు | కూయి | 5 లక్షలు |
| కోత | 1,300 | కువి (ఖోంద్) | 2 లక్షలు |
| తొద | 900 | కోలామీ | 80 వేలు |
| కన్నడం | 2 కోట్ల 70 లక్షలు | నాయకీ | — |
| తుళు | 14 లక్షలు | పర్జీ | (84,607) |
| తెలుగు | 5 కోట్ల 42 లక్షలు | గదబ | (40,193)[1] |
| గోండీ | 22 లక్షలు | కూడుఖ్ | 13 లక్షలు |
| (కోయతోసహా) | | మాల్తో | 90 వేలు |
| కొండ | (12,298) | బ్రాహుయీ | (3 లక్షలు)[2] |

---

1. ఒరిస్సాలో ఉన్న గదబల సంఖ్య 31,791, ఆంధ్రప్రదేశ్‌లో వారి సంఖ్య 8,402.

2. బ్రాహుయీ పాకిస్తాన్‌లోది కాబట్టి ఇప్పటి వివరాలు తెలియవు, పైన ఇచ్చిన సంఖ్య చాలా పాతది.

# I. ద్రావిడ భాషా కుటుంబం

## 1.1. ఉపోద్ఘాతం

ప్రపంచంలో పెద్ద భాషా కుటుంబాలలో ద్రావిడభాషా కుటుంబం ఒకటి. ద్రావిడభాషలు మాట్లాడే వారి సంఖ్య సుమారు పదిహేను కోట్లు. ద్రావిడభాషా కుటుంబంలో ఇప్పటివరకూ తేలిన లెక్కప్రకారం ఇరవై యొక్క భాషలు ఉన్నాయి. అవి ·

1. తమిళం, 2. మళయాళం, 3. కొడగు, 4. కోత, 5. తొద, 6. కన్నడం (బడగ కన్నడమాండలికం), 7. తుళు, 8. తెలుగు, 9. గోండీ (కోయ గోండీ మాండలికం), 10. కొండ, 11. పెంగో, 12. మంద, 13. కూయి, 14. కువి, 15. కోలామీ (నాయక్డి కోలామీ మాండలికం) 16. నాయకీ, 17. పర్జీ, 18. గదబ, 19. కూడుఖ్, 20. మాల్తో, 21. బ్రాహుయీ.

ఇటీవల కొందరు పరిశోధకులు దక్షిణభారత దేశంలోని మరికొన్ని ఆటవిక జాతుల భాషలని ప్రత్యేక భాషలుగా పరిగణిస్తున్నారు. వాటిలో ముఖ్యమైనవి నీలగిరి కొండలలో ఉన్న ఇరుళ[1]; కుఱుంబ (పాలు కుఱుంబ,

---

1. చూ. Kamil V. Zvelebil, *The Irula Language* (Otto Harrassowitz, Wiesbaden 1973). జ్వెలబిల్ అభిప్రాయంలో ఇరుళభాష తమిళ మలయాళ భాషలతో సన్నిహిత సంబంధం కలదే అయినా అది ప్రత్యేక భాష.
   అర్. పెరియాళ్వార్ 1978. *A grammar of Irula language*, Irula phonology with Vocabulary (Annamalai University)

ఆలు కుఱుంబ, జేను కుఱుంబ, బెట్ట కురుబ అనేవి దీని మాండలికాలు), కాట్టు నాయక;[2] కసబ;[3] కర్ణాటకలో దక్షిణ కనరా జిల్లాలోని కొరగ (ఇది తుళుకి సన్నిహితం);[4] ఒరిస్సాలో కోరాపుట్; కళహంది జిల్లాలలోని ఇంది, అవె (వీటి మీద బి. రామకృష్ణారెడ్డి కొంత పరిశోధన చేశారు). కాని ఇవి ప్రత్యేక భాషలా? కావా? అనే విషయం వీటిపై ఇంకా సమగ్ర పరిశోధన జరిగితే కాని తేలదు. క్రీస్తుకి మూడు నాలుగు వేల ఏళ్ళకి పూర్వం మూల ద్రావిడ భాష (Proto-Dravidian) ఒకే భాషగా ఉండేదనీ అది కాలక్రమాన ఇప్పటి ద్రావిడభాషలుగా విడిపోయిందనీ పండితులు తులనాత్మక పద్ధతి (Compartive method) ద్వారా నిర్ణయించారు (వివరాలకి చూ. చివరి అధ్యాయం).

ద్రావిడ భాషలలో తమిళం, మలయాళం, కన్నడం, తెలుగు అనే నాలుగు మాత్రమే సాహిత్యవంతమైన భాషలు (Literary languages), మిగిలిన భాషలలో ప్రాచీన లిఖిత సాహిత్యం లేనందువల్ల వాటిని సాహిత్య రహిత భాషలు (Non-literary languages) అంటారు. వీటిలో తుళు, కొడగు తప్ప మిగిలినవి ఆటవికుల భాషలు అవడంవల్ల వీటిని ఆటవిక భాషలు (Tribal languages) అని కూడా అంటారు. సాహిత్య రహిత భాషలకి ప్రత్యేకమైన

---

2. ఎస్. నటన సభాపతి, 1986. *The Language of Kattunaika.* *(Annamalai University)*
3. వి. చిదంబరనాథపిళ్లె, 1978. *A grammar of the Kasaba language;* 1976, *Phonology of Kasaba with Vocabulary* (Annamalai University)
4. చూ. D. N. Shankara Bhat, *The Koraga Language* (Poona, 1971). శంకరభట్టు అభిప్రాయంలో 'కొరగ' ఒక ప్రత్యేక భాష. దీనికి ఒంటి (ఉడిపి ప్రాంతంలో), తప్పు (హెబ్రి ప్రాంతంలో), ముదు (కూందపూర్ ప్రాంతంలో) అనే మూడు ముఖ్య మాండలికాలు ఉన్నాయి. రామకృష్ణ, టి. శెట్టి, 1978. *Koraga grammar* (Un Published Ph.D. thesis; University of Poona).

లిపులు లేకపోయినా వాటికి కూడా ప్రాచీన కాలంనుంచీ పరంపరగా వచ్చే కథలూ, గేయాలూ మొదలైన సాహిత్య సంపద పుష్కలంగానే ఉందనే విషయం మనం గుర్తు ఉంచుకోవాలి.

సంస్కృతంలో 'ద్రావిడ' 'ద్రవిడ' అనే పదాలు తమిళులనీ తమిళ భాషనీ సూచించేవి. అందులో 'పంచ ద్రావిడ' అనే పదం 'తమిళం, తెలుగు, కన్నడం, మరాఠీ, గుజరాతీ' భాషలు మాట్లాడే వారికి వర్తిస్తుంది. ఈ ద్రావిడ భాషలకి మొట్టమొదట తులనాత్మక వ్యాకరణం రచించిన బిషప్ కాల్డ్‌వెల్ 'ద్రావిడ' పదం నించి వచ్చిన Dravidian అనే పదాన్ని ఈ భాషా కుటుంబాన్ని సూచించడానికి వాడేరు. ఆయనని అనుసరించి తరువాత పండితులందరూ ఈ పదాన్నే వాడుతున్నారు.

ద్రావిడ భాషలని మాట్లాడే ప్రజలు శరీర నిర్మాణంలోగాని సంస్కృతిలోగాని ఏక జాతికి చెందినవారు కారు. వీరు అనాది కాలంనించీ భారతోపఖండంలో ఉండేవారేనని చాలా మంది పండితుల విశ్వాసం. ఆర్యులు భారత దేశంలో ప్రవేశించేటప్పటికే (క్రీ.పూ. 1500 ప్రాంతం) వీరు అక్కడ ఉన్నట్లు తెలుస్తుంది. అయితే అంతకు ముందు వీరు వేరు ప్రదేశాన్నించి ఆర్యులకి మల్లేనే ఇక్కడికి వచ్చారా? లేక మొదటినించీ వీరు భారతదేశానికి చెందిన వారేనా? అనే విషయం ఇంకా తేలలేదు. ఆర్యులు రాకముందు ద్రావిడప్రజలు మొత్తం భారతోపఖండం అంతటా వ్యాపించి ఉండేవారనీ, ఆర్యులు ఉత్తర భాగం ఆక్రమించడంవల్ల అక్కడ ద్రావిడ భాషలు కొన్ని నశించాయనీ చాలా మంది పండితుల అభిప్రాయం. ఉత్తర భాగంలో ఇప్పటికీ బ్రాహుయీ, కూడుఖ్, మాల్తో జాతులు మిగిలి ఉండడం, ఆర్య భాషలలో ద్రావిడభాషా లక్షణాలు కొన్ని కలిసిపోవడం ఈ అభిప్రాయాన్ని బలపరుస్తాయి. పైదేశం నించి వచ్చిన ఆర్యుల సంఖ్య ద్రావిడుల సంఖ్యకన్న చాలా తక్కువ కాబట్టి ఆర్యులు చాలా ద్రవిడజాతుల్ని తమలో కలుపుకొని ఉంటారు. ఆర్యులలో కలిసిన ద్రవిడ జాతులవారు ఆర్య భాషని మాట్లాడేటప్పుడు వారు అప్రయత్నం

గానే ద్రవిడభాషా లక్షణాలు కొన్నింటిని ఆర్యభాషలో కలిపి ఉంటారు (దీనిపై చర్చకి (4) చూడండి).

ద్రావిడభాషలు ముఖ్యంగా దక్షిణ భారతదేశం (తమిళనాడు, కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్) అంతటా వ్యాపించి ఉన్నాయి. శ్రీలంక ఉత్తరార్థంలో తమిళులు ఉండటం వల్ల అది కూడా ద్రావిడభాషా స్థానంగానే పరిగణించాలి. ఉత్తర భారతదేశంలో కూడా మధ్యప్రదేశ్, ఒరిస్సా, బీహార్ రాష్ట్రాలలో కొన్ని ఆటవిక జాతులవారు ఇప్పటికీ ద్రావిడ భాషలని మాట్లాడుతున్నారు. పాకిస్తాన్‌లో బలూచిస్తాన్ రాష్ట్రంలో ఉండే బ్రాహుయీ జాతివారి భాష కూడా ద్రావిడ భాషే.

## 1.2. భాషలు

ద్రావిడభాషల నన్నింటినీ మూడు పెద్ద ఉప కుటుంబాలుగా విభజింప వచ్చు. కింద ఇచ్చిన వాటిలో తమిళంనుంచి తుళు దాకా ఉన్న భాషలు దక్షిణ ద్రావిడ భాషలని, తెలుగునించి కువిదాకా ఉన్నభాషలు మధ్య ద్రావిడభాషలని, కూడుఖ్, మాల్తో, బ్రాహుయీలు ఉత్తర ద్రావిడభాషలనీ వ్యవహరించ బడతాయి. ఉప కుటుంబాల మీద సమగ్ర చర్చకి చివరి అధ్యాయం చూడండి.

### తమిళం:

తమిళంతో అతి ప్రాచీన సాహిత్య సంపద ఉండడం వల్లా, తమిళులు ఇతర దేశాలలో కూడా స్థిరనివాసం ఏర్పరుచుకొని ఉండడంవల్లా తమిళానికి ద్రావిడ భాషలలో ఒక ప్రత్యేక స్థానం ఉంది. మన దేశంలో తమిళుల సంఖ్య సుమారు నాలుగు కోట్ల నలభై ఏడు లక్షలు. తమిళులు శ్రీలంకలోనూ (సుమారు 20 లక్షలు), బర్మా, మలేషియా, ఇండొనీషియా, ఆఫ్రికా మధ్య దక్షిణ భాగాల లోనూ, గుయానా, ఫిజి, మారిషస్, మడగాస్కర్ మొదలైన దేశాలలో కూడా ఉన్నారు.

తమిళంలోనూ ద్రావిడ భాషా కుటుంబంలోనూ ప్రప్రథమ గ్రంథం. తొల్కాప్పియం. ఇది ఎళుత్తతి కారం (వర్ణాధికారం), చొల్లదికారం (పదాధి కారం), పొరుళతికారం (అర్థాధికారం) అని మూడు భాగాలుగా ఉంది. వీటిలో మొదటి రెండు అధికారాలూ వ్యాకరణం, మూడో అధికారంలో కవిత్వం, ఛందస్సు, అలంకారం మొదలైన విషయాలు చర్చించబడ్డాయి. దీనికర్త అసలు పేరు తెలియదుకాని పండితులు ఆయనని తొల్కాప్పియనార్ అని వ్యవహ రిస్తారు. దీనికాలం నిర్ణయించడానికి ఎటువంటి ఆధారాలూ లేవు. ఇది క్రీస్తు శకారంభం ప్రాంతంలో రచించబడి ఉంటుందని చాలా మంది పండితుల ఊహ.

తమిళంలో గ్రంథ లిపిలోనూ వట్టెళుత్తులిపిలోనూ రాసిన శాసనాలు క్రీ. పూ. మూడో శతాబ్దికాలం నించి దొరుకుతున్నాయి. తమిళలిపి పదకొండో శతాబ్దినాటికి ఈనాటి లిపికి సన్నిహిత రూపాన్ని పొందిందని తంజావూరు బృహదీశ్వరాలయంలో ఉన్న రాజరాజచోళుని శాసనంవల్ల తెలుస్తుంది. మదురై ప్రాంతంలో బౌద్ధ గుహలలో బ్రాహ్మీలిపిలో చెక్కబడిన అతి ప్రాచీన శాసనాలలో భాషలో తమిళ పదాలేకాక ప్రాకృత పదాలు కూడా చాలా ఉన్నాయి. కాని ఈ ప్రాకృత పదాలు తమిళభాష ధ్వని నిర్మాణానుసారంగా మార్పులు పొంది ఉన్నాయి. ఈ శాసనాలలో నాద స్పర్శాలూ మహాప్రాణ ధ్వనులూ ఋ, ౘ లూ మొదలైన తమిళభాషలో లేని ధ్వనులు లేవు.

## సాహిత్యం:

తమిళ సాహిత్యంలో అతి ప్రాచీనమైనదీ అతిమనోహరమైనదీ సంఘ వాఙ్మయం. సంఘ వాఙ్మయంలో వందలాది ప్రాచీన కవుల పద్యాలు సుమారు 1-3 శతాబ్దులకాలంలో సంపుటాలుగా కూర్చబడ్డాయి. దీనిలో యవనులని (గ్రీకు, రోము దేశీయులు) గురించీ, వారు నివసించే పేటలని గురించీ వర్ణనలు ఉన్నాయి. తూర్పుదేశాలతో రోమనుల వ్యాపారం మూడో శతాబ్దితో అంత రించింది కాబట్టి. ఈ వాఙ్మయం మూడో శతాబ్దికి ముందుదే అని నిర్ణయించ

వచ్చు. దీనిలో ఎట్టుత్తొకై,[1] పత్తుప్పాట్టు అనేవి ముఖ్య సంపుటాలు. ఎట్టుత్తొకైలో 8 సంపుటాలు ఉన్నాయి. అవి 1. నట్రిణై. (ఇందులో 175 మంది కవులు అకవల్ ఛందస్సులో ప్రేమపై రచించిన 400 చిన్న పాటలు ఉన్నాయి. ఇవి పాండ్య రాజయిన మారన్ వఙతిచే కూర్చబడినవి.)

2. కుఱుంతొకై. (ఇందులో 204 మంది కవులు ప్రేమపై రచించిన 402 పాటలు పూరిక్కో అనే ఆయనచే కూర్చబడినవి.)

3. ఐంకుఱునూఱు (ఇందులో ఐదుగురు కవులు రచించిన 500 ప్రేమ పాటలు కూటలూర్ కిఝార్ అనే పండితునిచే కూర్చబడ్డాయి. వీటిలో వందపైగా కపిలర్ చే రచించబడినవి.)

4. పతిఱ్ఱుప్పత్తు. (ఇందులో చేరరాజులని పొగడుతూ పది మంది కవులు రచించిన పాటల సముదాయాలు ఉన్నాయి. కాని ఇందులో మొదటిదీ చివరిదీ ఇప్పుడు లభించడం లేదు. ఒక్కొక్క సముదాయంలో పదేసి పాటలు ఉన్నాయి.)

5. పరిపాటల్. (మొదట్లో ఇందులో 70 పాటల సముదాయాలు ఉండేవి. కాని ఇప్పుడు పదముగ్గురు కవులు రచించిన 24 సముదాయాలే లభిస్తున్నాయి. ఇందులో పాటలు విష్ణువు, మురుకన్ (సుబ్రహ్మణ్యస్వామి) మొదలైన దేవతలు, వైకైనది, మధురాపట్టణం, సముద్రం-వీటికి సంబంధించినవి.)

6. కలిత్తొకై. (ఇందులో అనేక ఛందస్సులలో రచించబడిన 150 ప్రేమ గీతాలు ఉన్నాయి.)

7. అకనా నూఱు. (ఇందులో 400 ప్రేమ గీతాలు ఉన్నాయి.)

---

1. తొకై అంటే సంపుటం. ఎట్టుత్తొకై అంటే ఎనిమిది సంపుటాలని అర్థం.

8. పుఱనానూఱు. (ఇందులో యుద్ధానికీ, రాజనీతికి సంబంధించిన 400 గీతాలు - 150 మంది రచించినవి - ఉన్నాయి. ఇందులో రాజులూ, పతివ్రతలూ తమ లక్ష్యాలని వివరించడం, కవులు రాజులకి సలహాలు ఇవ్వడం, రాజులు వాటిని భక్తితో పాటించడం మొదలైన విషయాలు ఉన్నాయి.)

పత్తుప్పాట్టులో పది గీతాలు ఉండడంవల్ల దానికి ఆ పేరు వచ్చింది. ఈ గీతాలు ఎట్టుత్తొకైలో గీతాలకన్న పెద్దవిగా ఉంటాయి. వీటిలో చాలా చిన్నదానిలో 103 పాదాలూ, చాలా పెద్దదానిలో 782 పాదాలూ ఉన్నాయి. ఇవి ఎనమండుగురు కవులచే రచించబడ్డాయి. (నక్కీరర్ అనే ఆయన రెండూ, రుద్రన్ కణ్ణనార్ అనే ఆయన రెండూ, మిగిలిన ఆరుగురూ ఒక్కొక్కటీ రచించారు.) ఇందులో ఉన్న గీతాలు :

1. పొరునర్ అఱ్ఱుప్పడై (ముటత్త మక్కణ్ణియన్ రచించినది. ఇందులో కరికాలచోళుడు హిమాలయాలవరకూ ఉత్తర భారతదేశాన్ని జయించడం, ఆయన న్యాయసమ్మతమైన పరిపాలనా వర్ణించబడ్డాయి.)

2. పట్టినప్పాలై (రుద్రన్ కణ్ణనార్ రచించినది. ఇందులో పూంపుకార్ లేక కావిరిప్పట్టినం అనే ప్రాచీన పట్టణం వర్ణన ఉంది.)

3. ముల్లైప్పాట్టు (నప్పూతనార్ రచించినది, ఇందులో తన భర్త యుద్ధానికి వెళ్ళినప్పుడు ఒక రాణి పడిన విరహ వేదన వర్ణించబడింది.)

4. పెరుంపాణ్ అఱ్ఱుప్పడై (రుద్రన్ కణ్ణనార్ రచించినది. ఇందులో తమిళనాడు ఒక భాగంలో పట్టణాలలోనూ పల్లెలలోను వివిధ జాతులవారి జీవన విధానం వర్ణించబడింది.)

5. చిఱుపాణ్ అఱ్ఱుప్పడై (నల్లూనార్ రచించినది. ఇది నల్లియకోడన్ అనే రాజుమీద స్తుతి.)

6. నెటునల్‌వాటై (నక్కీరర్ రచించినది. ఇందులో పాండ్యరాజయిన నెటుంచెళియన్ జైత్రయాత్రా, ఆయన భార్య చలికాలంలో పడ్డ విరహవేదనా వర్ణించబడ్డాయి.)

7. కురించిప్పాట్టు (కపిలర్ రచించినది. ఇది ఆర్య రాజైన యాళ్ పిరమతత్తన్/పిరకత్తన్‌కి తమిళ కవిత్వంలో ప్రేమతత్త్వాన్ని వివరించడానికి కపిలర్‌చేత రచించబడిందని అంటారు.)

8. మతురైక్కాంచి (మాంకుటి మరుతన్ రచించినది; ఇందులో ఇతి వృత్తం పాండ్యరాజయిన నెటుంచెళియన్ విజయాలూ, ఆయన ధర్మపరిపాలనా.)

9. మలైపటుకటాం (పెరుంకౌచికనార్ రచించినది. ఇందులో ఇతివృత్తం నన్నన్ అనే రాజు స్తుతీ, తమిళదేశం పశ్చిమభాగంలో పర్వతప్రదేశాల వర్ణనా.)

10. తిరుమురు కాట్టుప్పటై (నక్కీరర్ రచించినది. ఇది మురుకన్ -సుబ్రహ్మణ్యస్వామి- మీద స్తుతి.)

తమిళ సాహిత్యంలో శృంగార రసప్రధానమైన కవిత్వాన్ని అకం అనీ, ఇతర కవిత్వాన్ని పుఱం అనీ అంటారు. సంఘ వాఙ్మయంలో కవిత్వం దేనికీ అనుకరణ కాకుండా స్వతంత్రమైనదీ, నిరాడంబరమైనదీ, సహజమైనదీ. దీనిలో ప్రకృతి వర్ణనకి ప్రత్యేక స్థానం ఉంది. సంఘ వాఙ్మయ కవులు ప్రకృతిని కుఱించి (పర్వత ప్రదేశం, పెళ్ళికి ముందు ప్రణయానికి ఇది అనువైన దేశం), ముల్లై (పశువుల మేతకు అనువైన గ్రామసీమ; ఇది శాంతియుతమైన గృహ జీవితానికి అనువైనది), పాలై (ఎడారి, ఇది విరహవేదనని వృద్ధిచేస్తుంది), నెయ్‌తల్ (సముద్రప్రాంతం; ఇది పెళ్ళికి ముందు నాయకుడు కనపడకపోవటం వల్ల నాయికకి వచ్చే విరహాన్ని వృద్ధి చేస్తుంది); మరుతం (పంటలు పండే ప్రాంతం; ఇక్కడ జీవితం సుఖమయంగానూ, వైభవోపేతంగానూ ఉంటుంది; నాయకుడు పరస్త్రీలోలుడు అవడం ఇక్కడే ఉంటుంది) అనే అయిదు భాగా-

లుగా విభజించారు. ఈ ప్రదేశాలు వివిధాలైన శృంగార వర్ణనలకి ప్రాతిపదిక లుగా ఉంటాయి.

సంఘ వాఙ్మయం తరవాత పేర్కొనదగిన మూడు ముఖ్య గ్రంథాలు తిరువళ్లువర్ రచించిన తిరుక్కుఱళ్, ఇళంకో ఆటికల్ రచించిన చిలప్పతికారం, చీత్తలై చాత్తనార్ రచించిన మణిమేకలై. తిరుక్కుఱళ్ ఒకటో శతాబ్దికి చెంది నది. ఇది అఱత్తుప్పాల్ (ధర్మభాగం), పొరుట్పాల్ (అర్థభాగం), కామత్తు ప్పాల్ (కామభాగం) అని మూడు భాగాలుగా విభజించబడింది. ఇందులో మొత్తం 180 అధ్యాయాలూ, ఒక్కొక్క అధ్యాయంలో పది పద్యాలు చొప్పున 1330 పద్యాలూ ఉన్నాయి. ఇందులో ప్రతి మనుష్యుడూ జీవించవలసిన విధానం, ధర్మార్థ కామాల్ని సాధించవలసిన విధానం వివరించబడ్డాయి. తిరువళ్లువర్ కవిత్వం తక్కువ మాటలతో ఎక్కువ అర్థాన్ని సూచించడానికి మచ్చుతునక. ఇందులో పద్యాలు మనోహరమైన భావాలతో, ఉపమానాలతో నిండి ఉంటాయి. ఇది నీతి సూత్రాల్ని వివరించే పద్దెనిమిది గ్రంథాలలో ముఖ్యమయినది.

చిలప్పతికారం సుమారు 2.3 శతాబ్దాల ప్రాంతంలోది: చిలంబు అంటే కడియం కడియానికి సంబంధించిన కథ. ఇందులో ప్రధాన పాత్రలు కణ్ణకి అనే పతివ్రతా, ఆమె భర్త కోవలన్. వారు చోళ రాజధాని అయిన పుకార్ పట్టణంలో ఉండేవారు. కోవలన్ మాతవి అనే వేశ్య ఆకర్షణలో పడి తన ధనం అంతా ఆమెకి ఇచ్చివేస్తాడు. తరవాత పశ్చాత్తాపపడి భార్య కణ్ణకితో పాండ్య రాజధాని అయిన మధుర వెళ్తారు. వీరు మధుర వెళ్ళిననాడే పాండ్యరాజు భార్య కడియం ఒక కంసాలి అపహరిస్తాడు. కోవలన్ తన భార్య కడియం అమ్మడా నికి ఆ కంసాలి దగ్గరకే తీసుకువెళ్తాడు. ఆ కంసాలి కోవలనే దొంగ అని రాజుకి చెప్తే రాజు కోవలన్‌ని చంపిస్తాడు. వెంటనే కణ్ణకి రాజు దగ్గరకి వెళ్ళి తన కడియం బద్దలు కొడుతుంది. అందులోంచి కెంపులు బయటికి వస్తాయి. రాణి గారి కడియంలో ముత్యాలు ఉంటాయి. నిర్దోషిని చంపినందుకు పాండ్యరాజూ, ఆయన భార్య అక్కడికక్కడే మరణిస్తారు. కణ్ణకి కోపంతో తన ఒక స్తనం

చీల్చి మధురమీద పడవేస్తుంది. ఆ పట్టణం కాలిపోతుంది. కణ్ణకి ఆ తరవాత చేరదేశం వెళ్ళిపోయి అలసిపోయి ఒక వేంకై చెట్టుకింద పడివుండగా ఆమెను దేవదూతలు రథంమీద స్వర్గానికి తీసుకుపోతారు. చేరదేశం రాజు కణ్ణకి పాతివ్రత్య మహిమ విని హిమాలయ పర్వతం దగ్గర రాయి తెచ్చి కణ్ణకి విగ్రహం చెక్కించి దానిని గంగాజలంతో అభిషేకించి కణ్ణకికి గుడి కడ్తాడు.

మణిమేకలై చిలప్పతికారం తరవాత రచించబడినది. ఇది కోవలన్, ఆయన ప్రియురాలైన మాతవికి పుట్టిన మణిమేకలై అనే అమ్మాయి కథ. మణిమేకలై రాజుని ప్రేమించి ఆయన మరణానంతరం జ్ఞానోపదేశం పొంది అఱవణ అటికళ్ అనే ముని శిష్యురాలుగా జీవితం గడుపుతుంది. ఈ గ్రంథం బౌద్ధ మతాన్ని వ్యాప్తి చేయడానికి ఉద్దేశించబడినది.

ఆరోశతాబ్ది నుంచి తొమ్మిదోశతాబ్దివరకూ ఉన్న కాలంలో 12 శైవ మతగ్రంథాలు రచించబడ్డాయి. వీటిని అన్నిటినీ కలిపి 'తిరుముఱై' అని వ్యవహరిస్తారు. వీటిలో ముఖ్యమైనవి అప్పర్ (తిరునావుక్కరసు), తిరుజ్ఞాన సంబంధర్, సుందరర్ - ఈ ముగ్గురూ రచించిన 'తేవారం' (దేవహారం), మాణిక్యవాచకర్ రచించిన 'తిరువాచకం', చేక్కిళార్ రచించిన 'పెరియపురాణం' (63 శైవ నాయన్మార్‌ల జీవిత చరిత్ర). 'తేవారం' తరవాత 12 మంది వైష్ణవుల చేత విష్ణుస్తుతి ఇతివృత్తంగా ఉన్న 'నాలాయిర ప్రబంధం' రచించబడింది. వీరిలో ఒకరైన ఆండాళ్ (అముక్త మాల్యద) రచించిన దివ్యప్రబంధం ప్రసిద్ధమైనది.

తొమ్మిది పన్నెండు శతాబ్దుల మధ్యకాలంలో వచ్చిన ముఖ్య గ్రంథం కంపన్ రచించిన 'రామాయణం' (ఉత్తరకాండ కంపన్ ప్రతిస్పర్థి అయిన ఒట్టక్కూత్తన్ రచించారు). ఇది వాల్మీకి రామాయణానికి యథాతథానువాదం కాక స్వతంత్ర కల్పనలతోనూ, దక్షిణదేశంలో ప్రచురంగా ఉన్న గాథలతోనూ నిండి ఉంది. ఈ కాలంలోనే పుకళేంతి అనే కవి మహాభారతంలో ముఖ్య ఘట్టాలనీ, ఉపాఖ్యానాలనీ వెణ్‌పా ఛందస్సులో రచించారు. వీటిలో ముఖ్యమైనది నలవెణ్‌పా అనే నలదమయంతుల కథ.

పన్నెండు పదహారు శతాబ్దుల మధ్యకాలంలో అనేక వేదాంత గ్రంథాలూ, పురాణాలూ రచించబడ్డాయి.

పదహారో శతాబ్ది తరవాత పాశ్చాత్య పండితులు తమిళ భాషకి అపార సేవ చేశారు. వీరిలో ముఖ్యులు బెస్కీ, మెకంజీ, రాబర్ట్ కాల్డ్‌వెల్, రివరెండ్ జి. యు. పోప్, బెస్కీ 1738 లో లాటిన్ భాషలో తమిళానికి వ్యాకరణం రచించారు. యూరపియన్ భాషలో రచింపబడిన మొదటి తమిళ వ్యాకరణం ఇదే. పోప్ వ్యాకరణం రచించడమేకాక తిరుక్కుఱల్ మొదలైన గ్రంథాలని ఆంగ్లంలోకి అనువదించారు.

పందొమ్మిదో శతాబ్దిలో పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు తమిళంలో ప్రవేశపెట్టబడ్డాయి. తమిళంలో మొదటి నవల వేదనాయకంపిళ్ళై రచించిన 'ప్రతాప ముదలియార్ చరిత్రం.' ఆధునిక కవులలో ముఖ్యుడు సుబ్రహ్మణ్య భారతి. ఈయన కృష్ణుడిపై రచించిన 'కణ్ణన్‌పాట్టు'కి తమిళ సాహిత్యంలో శాశ్వత స్థానం ఉంటుంది.

తమిళ సాహిత్య చరిత్రని గురించి చర్చించేటప్పుడు, ఆ భాషలో ఉన్న వ్యాకరణ గ్రంథాలని కూడా మనం గమనించాలి. ఇంతకుముందే సూచించినట్లు తమిళంలో ప్రప్రథమ గ్రంథమైన తొల్కాప్పియంలో మొదటి రెండు అధికారాలూ వ్యాకరణమే. దీని వ్యాఖ్యాత అయిన నచ్చినార్కినియర్. దీని కర్త అసలు పేరు తృణధూమాగ్ని అనీ, ఆయన జమదగ్ని కొడుకు అనీ, అగస్త్యుడి పన్నెండు మంది శిష్యులలో ఒకడనీ చెప్పేడు. తొల్కాప్పియానికి ఉపోద్ఘాతం (పాయిరం) రాసిన పనంపారనార్, తొల్కాప్పియనార్ అంతకు ముందున్న తమిళ వ్యాకరణాలు అన్నింటినీ పరిశీలించి, ఐంద్రవ్యాకరణ పద్ధతిలో ఈ గ్రంథం రచించినట్లూ, ఇది తిరుపతి నుంచి కన్యాకుమారి వరకూ ఉన్న దేశంలో సాహిత్యంలోనూ, వ్యవహారంలోనూ వాడుకలో ఉన్న భాషని పరిశీలించి రాసినట్లూ చెప్పేరు. ఇది మొట్టమొదట పాండ్యరాజు ఆస్థానంలో అతం

కోట్టాచాన్ అనే వైయాకరణుడి సమక్షంలో చదవబడినట్లు కూడా ఆయన చెప్పేరు. దీనివల్ల తొల్కాప్పియానికి ముందు కూడా సాహిత్యం ఉండేదనీ, కొందరు వ్యాకర్తలు కూడా ఉండేవారనీ మనకి తెలుస్తుంది. తొల్కాప్పియనార్‌కి సంస్కృతంలో ప్రాతిశాఖ్యల గురించీ, యాస్కుడి నిరుక్తాన్ని గురించీ తెలుసునని ఆ గ్రంథం వల్ల మనకి తెలుస్తుంది. ఇది పాణినీయంలా పరిపూర్ణమయిన గ్రంథం కాదు; ఇందులో పాణినీయ పద్ధతు లేవీ అనుసరించబడలేదు. అంతమాత్రంచేత ఈయన పాణినికి పూర్వుడని కొందరు చేసే వాదన సమంజసమని తోచదు. ఇందులో పద నిర్మాణానికన్న వాక్య నిర్మాణానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడిందని ఆధునిక పండితుల అభిప్రాయం.

తొల్కాప్పియానికి చాలా మంది వ్యాఖ్యాతలు ఉన్నారు. కాని, వారందరి గ్రంథాలూ ఇప్పుడు దొరకడం లేదు. వీరిలో ఇళంపూరణర్ (10 లేక 12 శతాబ్ది), సేనావరైయర్ (14 వ శతాబ్ది), పేరాచియర్ (కాలం తెలియదు), నచ్చినార్కినియర్ (14 వ శతాబ్ది), తెయ్‌వచ్చిలైయార్ (కాలం తెలియదు), కల్లాటనార్ (కాలం తెలియదు) ముఖ్యులు. వీరి గ్రంథాలు కాక, చొల్లతికారం మీద కర్త పేరు లేని ఇంకొక వ్యాఖ్యానం కూడా దొరికింది. (Manuscript No. 56, Government Oriental Manuscripts Library, Madras.) ఇవి కాక వ్యాకరణ గ్రంథాలు కూడా కొన్ని ఉన్నాయి. వీటిలో ముఖ్యమైనవి: పుత్తమిత్తరనార్ (11 వ శతాబ్ది) రచించిన 'వీరచోళియం', కుణవీరపండితర్ (13 వ శతాబ్ది) రచించిన 'నేమినాతం', పవణంతి (13 వ శతాబ్ది) రచించిన 'నన్నూల్', చుప్పిర మణియ తీట్చితర్ (17 వ శతాబ్ది) రచించిన 'పిరయోక వివేకం', వైత్తియనాత తేచికర్ (17 వ శతాబ్ది) రచించిన 'ఇలక్కణవిళక్కం', చువామినాత తేచికర్ (17 వ శతాబ్ది) రచించిన 'ఇలక్కణక్కొత్తు', అణ్ణామలై విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖలో ఆచార్యులుగా పనిచేసిన డాక్టర్ పి.ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి తొల్కాప్పియానికి రచించిన ఆంగ్ల వ్యాఖ్యానం, దానిని గురించి తమిళేతరులు తెలుసుకొందుకు చాలా ఉపయోగిస్తుంది.

ప్రమాణ గ్రంథాలు :

ఎల్.వి. రామస్వామి అయ్యర్ ప్రాచీన తమిళ గ్రంథాలలో భాషని గురించి అనేక వ్యాసాలు రాశారని ముందు చూస్తాం (1.5.) ఇటీవల కాలంలో మద్రాసు, అణ్ణామలై, మధురై, కేరళ విశ్వవిద్యాలయాలలోనూ ఇతరత్రా అనేకులు తమిళ ప్రాచీన గ్రంథాలు. శాసనాలమీదా, ఆధునిక భాషలో మాండలి కాలమీదా పరిశోధన చేస్తున్నారు. ముద్రిత గ్రంథాలలో కింద ఇచ్చినవి ముఖ్యమైనవి:


అగస్త్యలింగం, ఎస్ , 1967 *A generative grammar of Tamil (A f·agment of Tamil syntax)* (Annamalainagar).

అగస్త్యలింగం, ఎస్., 1977, *A grammar of old Tamil with reference to Patirruppattu* (Annamalai University).

అగస్త్యలింగం, ఎస్., షణ్ముఖం, ఎస్. వి., 1970. *The language of Tamil inscriptions* (1250 - 1350 A. D.) (Annamalainagar).

ఆంద్రొనోవ్, ఎమ్., 1969. *The standard grammar of modern and classical Tamil* (Madras).

ఆర్డెన్, ఎ. హెచ్., 1954. (Reprinted). *A progressive grammar of common Tamil* (Madras).

దామోదరన్, ఎ., 1972 A *grammar Tirukkural* (Delhi).

లేమన్, థామస్ (Lehman, Thomas). 1989 *A grammar of Modern Tamil* (Pondichery).

మీనాక్షిసుందరన్. టి.పి., 1965, *A history of Tamil language* (Poona).

సుబ్రమణ్యం, ఎస్.వి.., 1965 *Cilappatikaaram - Description grammar wih index*. (Madras).

—, 1972, *Grammar of akanaanuuru wih index.* (Trivandrum).

*Tamil Lexicon*, 6 Vols, and supplement. (Madras 1924-39)

## మలయాళం :

పూర్వకాలంలో చేరనాడుగా వ్యవహరించబడి ఇప్పుడు కేరళరాష్ట్రంగా ఉన్న ప్రాంతంలో మళయాళం వ్యవహరించబడుతోంది. మలయాళీల సంఖ్య, ఇప్పుడు సుమారు రెండు కోట్ల అరవై లక్షలు. తమిళం 'మలై', మళయాళం 'మల' అంటే పర్వతం; కాబట్టి మలయాళం అంటే పర్వత ప్రాంతంలో వ్యవహరించబడే భాష అని అర్థం. తమిళానికీ మలయాళానికీ చాలా సన్నిహిత సంబంధం ఉంది. సంఘ వాఙ్మయ కాలంలో తమిళదేశాన్ని (తమిళం) చోళనాడు, పాండియనాడు, చేరనాడు అని మూడు భాగాలుగా విభజించారు. ఆ కాలంలో ఈ మూడు భాగాలలోనూ ఒకే భాష - ప్రాచీన తమిళం - వ్యవహరించబడేది. కాలక్రమంలో చేరనాడులో భాషలో కొన్ని ప్రత్యేకమైన మార్పులు వచ్చి అది వేరు భాషగా ఏర్పడింది. అదే మలయాళం. చేరనాడుకీ మిగిలిన దేశానికీ అడ్డుగా పశ్చిమ పర్వతశ్రేణి (**Western Ghats**) ఉంది. ఇక్కడ పర్వతాలూ, దట్టమైన అడవులూ ఉండడం వల్ల చేరనాడుకీ మిగిలిన ప్రాంతానికీ రాకపోకలు తక్కువగా ఉండేవి. ఇదే మలయాళం వేరు భాషగా తమిళం నించి విడిపోవడానికి హేతువు. మలయాళంలో ప్రత్యేక లక్షణాలు క్రీ.శ. 5-10 శతాబ్దుల మధ్యకాలంలో ఏర్పడి అది ప్రత్యేక భాష అయిందని ఎల్.వి. రామస్వామి అయ్యర్ నిరూపించారు. చేరనాడులో తొమ్మిదో శతాబ్దికి చెందిన శాసనాలలోనే (ఉదా. భాస్కర రవివర్మ కొచ్చిన్ తామ్ర శాసనాలు) మళయాళ భాషా లక్షణాలు ఉన్నాయి. తమిళానికీ మలయాళానికీ ముఖ్యభేదం కింద విషయాలలో ఉంది:

1. తమిళంలో పదాంతంలో 'ఐ' కారం మలయాళంలో 'అ' కారంగా మారుతుంది: త. మలై, మ. మల 'పర్వతం'.

2. తమిళంలో పదాది చకారాన్ని సకారంగా ఉచ్చరిస్తారు. మలయాళంలో 'చ' కారంగానే ఉచ్చరిస్తారు.

3. మలయాళంలో ప్రాచీనమైన అనునాసిక సహితస్పర్శ సముదాయం ('ంక' 'ంత' మొదలైనవి) సాధారణంగా ద్విరుక్తానునాసికంగా మారుతుంది: త. వాంకు. మ. వాఙ్ఙు 'కొను', త. మరుంతు, మ. మరున్ను, తె. మందు.

4. మలయాళంలో క్రియలలో పురుష - లింగ ప్రత్యయాలు ఉండవు: 'వరుం' అనే పదం తెలుగు 'వస్తాను, వస్తాం, వస్తావు, వస్తారు, వస్తాడు, వస్తారు, వస్తుంది, వస్తాయి' అనే వాటికి అన్నిటికీ సమానంగా ఉంటుంది. మలయాళానికీ మిగిలిన ద్రావిడ భాషలకీ ముఖ్యభేదం ఇదే.

ఇటువంటి భేదాలు కొన్ని ఉన్నా ఇప్పటికీ తమిళానికీ మలయాళానికీ చాలా సన్నిహితత్వం ఉంది.

మలయాళ సాహిత్యాన్ని ప్రాచీనయుగం లేక మధ్యయుగం (1350 మొదలు 1800 వరకూ), ఆధునిక యుగం (1800 నించి) అని రెండుగా విభజించవచ్చు. మలయాళంలో మొట్టమొదటి నించీ మూడు రకాల సాహిత్యం ప్రచారంలో ఉంది. వీటిలో మొదటిరకం తమిళభాషా ప్రభావం ఎక్కువగా ఉన్నది. ఈ రకంలో 13 శతాబ్దికి చెందే 'రామచరితం' ముఖ్యమైనది. రెండో రకం సంస్కృత భాషా ప్రభావం ఎక్కువగా ఉన్నది. దీన్నే 'మణిప్రవాళ' శైలి అంటారు. మణిప్రవాళ శైలిలో సంస్కృత పద బాహుళ్యమే కాకుండా సంస్కృత విభక్తి ప్రత్యయాలు కూడా యథా తథంగా ఉపయోగించ బడ్డాయి. మూడోరకం శుద్ధమలయాళంలో రచించబడిన పాటలు జానపదగేయాలు. కేరళలో 'కథాకళి' అనే నాట్య హావభావ ప్రధానమైన నాటక ఫక్కీ కూడా పదిహేడో శతాబ్ది నించి వ్యాప్తిలోకి వచ్చింది.

మలయాళంలో మొట్టమొదటి మహాకావ్యం సుమారు పదమూడో శతాబ్దికి చెందిన 'రామచరితం'. కాళిదాసు మేఘ సందేశం ఫక్కీలో రచించిన 'ఉణ్ణునీలీ సందేశం' దీని తరవాత వచ్చినది. పదిహేనో శతాబ్ది ప్రారంభంలో చెరుశ్శేరి నంబూదిరి రచించిన 'కృష్ణగాథ' మధురమైన కావ్యం. 1550 ప్రాంతంలో

పునం రచించిన 'రామాయణ చంపు' చంపూ గ్రంథాలలో ముఖ్యమైనది. పురాణాలలో ఇతి వృత్తాలని వర్ణించే చంపూ వాఙ్మయం మలయాళంలో పధ్నాలుగో శతాబ్ది నించి ప్రచురంగా ఉంది.

పదిహేనో శతాబ్దిలో సంస్కృత వృత్తాలలో రచించబడిన 'చంద్రోత్సవం' అనే కావ్యంలో ఒక ఊర్లో పండుగ చెయ్యడం విపులంగా వర్ణించబడింది.

పదిహేడో శతాబ్దికి చెందిన తుంజత్తు రామానుజ ఎళుత్తచ్చన్ మలయాళంలో మహాకవి. ఈయన రచనలు అధ్యాత్మ రామాయణం, భాగవతపురాణం, మహాభారతం. ఈయన తన గ్రంథాలన్నీ ఒక చిలక చెప్పినట్లుగా రచించారు. ఈ పద్ధతిని ఈయన తరవాతవారుకూడా అనుసరించారు. ఈ పద్ధతికి పేరు 'కిళిప్పాట్టు' (చిలకపాట).

పద్దెనిమిదో శతాబ్దిలో 'తుళ్లల్' అనే నాట్య ప్రధానమైన నాటకప్రక్రియ వ్యాప్తిలోకి వచ్చింది. వీటిలో ఇతి వృత్తం మన పురాణగ్రంథాలనించి తీసుకొన్నదే. కలకత్తు కుంఛన్ నంబియార్ అనే ఆయన డబ్బైపైన తుళ్లల్ గ్రంథాలు రచించి, వీటికి కావ్యత్వం కల్పించారు. వీటిలో ఇతివృత్తం పురాణాలలోదే అయినా వీటిలో సమకాలీన సాంఘిక పరిస్థితులమీద సున్నితమైన విమర్శ కూడా ఉంది.

పధ్నాలుగో శతాబ్దికి చెందిన 'లీలాతిలకం' ప్రసిద్ధమైన వ్యాకరణ గ్రంథం.

ఆధునిక యుగంలో పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు వ్యాప్తిలోకి వచ్చాయి. టి. ఎమ్. అప్పునెడుఙ్ఙాడి రచించిన 'కుందలత' (1887) మొట్టమొదటి నవల, ఒ. చందు మీనోన్ రచించిన 'ఇందులేఖ' (1883) సాంఘిక నవల. సి. వి. రామన్‌పిళ్ళ 'మార్తాండవర్మ' చారిత్రక నవల, కుమారన్ ఆశాన్ (1871 - 1924) కావ్యంద్వారా సంఘంలో మార్పు తీసుకురావడానికి

ప్రయత్నించారు. ఆధునిక కవులలో ప్రసిద్ధులు : కుట్టిపురత్తు కేశవన్ నాయర్, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్, జి. శంకర కురుప్, కె. కె. రాజా, చజ్ఞంపుళ కృష్ణపిళ్ల.

ప్రమాణ గ్రంథాలు:

మలయాళానికి గుండెర్ట్ చేసిన సేవ అపారమైనది. ఇటీవల కాలంలో ప్రాచీన మలయాళ గ్రంథాలూ, శాసనాలలో భాషమీదా, ఆధునిక మలయాళం మీదా అనేకులు పరిశోధన చేస్తున్నారు. వీరి గ్రంథాలలో ముఖ్యమైనవి:


జార్జి కె. ఎమ్., 1956. *Ramacaritam and the study of early Malayalam* (Kottayam).

గుండెర్ట్, హెచ్. 1851, 1868. (reprinted 1962) *Malayaala bhaasaa vyaakaranam* (Kottayam).

——1872 (reprinted 1962). *Malayaalam - English Dictionary* (Kottayam).

ప్రబోధ చంద్రన్, వి. ఆర్. 1973, *Malayaalam - A linguistic description* (Trivandrum).

రామస్వామి అయ్యర్, ఎల్. వి. 1936, *The evolution of Malayaalam morphology*, (Ernakulam).

శేఖర్, ఎ. సి. 1953, *Evolution of Malayaalam* (Poona).

విమల, ఎల్., 1974, *A descriptive grammar of Eluttacchan's Mahaabhaarata* (Annamalai University, Ph.D, Thesis (Unpublished)

రాజశేఖరన్ నాయర్, 1990. *Auxiliary Verbs in Malayaalam* (Annamalai University).

## కొడగు :

కొడగు జాతివారు కర్ణాటక రాష్ట్రంలో కూర్గు జిల్లాలో ఉన్నారు. వీరి సంఖ్య సుమారు తొంభై వేలు. వీరి భాష కొడగు, కన్నడానికి సన్నిహితమైనదని మొదట్లో పండితులు అనుకున్నారు. కాని ఇటీవల పరిశోధనలవల్ల అది తమిళ - మలయాళాలకి సన్నిహితమైనదని తేలింది. 'కొడగు' అనే పదం త. కుట(కుడ) 'పశ్చిమం' అనే పదానికి సంబంధించినదని అని కాల్డ్‌వెల్ చెప్పేరు. వీరి భాషకి లిపి సాహిత్యం లేకపోయినా వీరు ఆటవికులు కారు.

### ప్రమాణ గ్రంథాలు :

కొడగు భాషకి ఆర్. ఎ. కోల్. (Cole) 1867 లో An elementary *grammar of the Coorg language* (Bangalore) అనే వ్యాకరణం రాశారు. ఎమెనో దీనిమీద పరిశోధన చేసి ఇందులో పదాలు డి ఇడి (ఎస్) లో చేర్చారు.

ఆర్. బాలకృష్ణన్, 1976. *Phonology of Kodagu with Vocabulary* (Annamalai University).

——1977, *A grammar of Kodagu* (Annamalai University).

## కోత :

కోత జాతివారూ తొదజాతివారూ నీలగిరి కొండలలో ఉన్నారు. అందువల్ల కోత, తొద భాషలను నీలగిరి భాషలని అంటారు. ఇవి తమిళ మలయాళాలకి చాలా సన్నిహితమైనవి. కోతజాతివారి సంఖ్య 1,300. అనాదికాలంనించీ నీలగిరి కొండలలో తోద, కోత, బడగ, కురుంబ జాతులవారు కలిసిమెలిసి నివసిస్తున్నారు. కోతలు మిగిలిన జాతులవారికి ఇనప వస్తువులూ కుండలూ తయారుచేసి ఇస్తారు. ఆ జాతులవారి పండగలలో కోతలు భజంత్రీలుగా పని చేస్తారు. వీరు వ్యవసాయం చేస్తారు. కోతజాతి నీలగిరి జాతులన్నిటిలోకి

తక్కువజాతి. వీరు గేదె, ఎద్దు మొదలైన జంతువుల మాంసం తినడమే కాకుండా చచ్చిపోయిన జంతువుల మాంసం కూడా తింటారు.

ప్రమాణ గ్రంథాలు:

ఎమెనో, ఎం. బి., 1944, "A sketch of Kota grammar" Kota Texts 15-35 reprinted in *Dravidian linguistics, ethnology, and folktales*, 1957-pp. 64-90.

——1944-46 *Kota Texts*, 4 *Volumes* (Berkeley).

సుబ్బయ్య, జి. 1985 A *grammar of Kota* (Annamalai University).

## తోద

తొదజాతివారి సంఖ్య 900. తొదజాతివారి ఆచారాలూ, భాషా కూడా చాలా విలక్షణమైనవి. వీరి ముఖ్యవృత్తి గేదెలను పెంచడం; గేదెల పెంపకం వీరి మతంలో ముఖ్యాంశం. వీరు ఆహారంలో పాలు, మజ్జిగ, నెయ్యి ఎక్కువగా వాడతారు. మాంసం తినరు. పాలూ, నెయ్యి అమ్మి వాటికి బదులు తమకు కావలసిన బట్టలు, బియ్యం, జొన్నలు మొదలైనవి కొనుక్కుంటారు. తొద స్త్రీలకి బహు భర్తృత్వం ఉంది. ఒక స్త్రీ గర్భవతి అయినప్పుడు ఆమె భర్తలలో ఒకడు ఆమెకి సంప్రదాయం ప్రకారం విల్లమ్ములు ఇస్తాడు. అతనే ఆమె పిల్లలకి తండ్రిగా పరిగణించబడతాడు. తోదజాతిలో ఒకరు మరణించినప్పుడు కొన్ని గేదెలని కూడా చంపడం వారి ఆచారం.

వీరి ఇళ్ళు కర్రలతో ఒక ప్రత్యేక పద్ధతిలో నిర్మించబడి ఉంటాయి. వీరు పచ్చిక బయళ్ళలో నివసిస్తారు. ఒక్కొక్క ప్రదేశంలో మూడునించి ఏడు దాకా ఇళ్ళు ఉంటాయి.

వీరు ముదురు గోధుమరంగులో ఉండి, మిగిలిన నీలగిరి జాతులవారికన్నా పొడవుగానూ, బలిష్ఠంగానూ ఉంటారు. దీనికి కారణం వీరు ఎక్కువగా పాలూ

నెయ్యి ఉపయోగించడం కావచ్చు. వీరు పాలు పితకడం, గేదెలకి మేత వెయ్యడం మొదలైనవన్నీ శాస్త్రోక్తంగా చేస్తారు. వీరు పాటలు రచించి పాడడంలో నేర్పరులు. పండగలలోనూ శ్రాద్ధ దినాలలోనూ పాటలు పాడతారు.

నీలగిరి జాతులవారిలో తొదజాతివారిదే అగ్రజాతి.

ప్రమాణ గ్రంథాలు :

ఈ భాషమీద ఎం.బి. ఎమెనో చాలా పరిశోధన చేసి ఇందులో పదాలు డి ఇడి (ఎస్)లో చేర్చారు. ఆయన 1984 గ్రంథంలో ఈ భాషకి కూలంకష మైన వ్యాకరణం ఉంది.

ఎమెనో, ఎం.బి. 1957, "Toda, a Dravidian language" *TPh S* (1957) : 15.66.

———1971, *Toda Songs*. (Oxford).

———1984, *Toda grammar and texts* (Philadelphia).

ఎస్. శక్తివేల్, 1976. Phonology of Toda with Vocabulary (Annamalai University).

———1977, *A grammar of the Toda language* (Annamalai University).

## కన్నడం

కన్నడభాష మైసూరు లేక కర్ణాటక రాష్ట్రంలో వ్యాప్తిలో ఉంది. కన్నడ భాషా వ్యవహర్తల సంఖ్య సుమారు రెండుకోట్ల డబ్బై లక్షలు, వెయ్యి సంవత్సరాలకి పూర్వం కన్నడ భాష ఇప్పటి మహారాష్ట్రంలో కొంతభాగంలో కూడా వాడుకలో ఉండేది అనడానికి ఆధారాలు ఉన్నాయి.

కన్నడ భాషలో శాసనాలు అయిదో శతాబ్ది మధ్యనించి లభిస్తున్నాయి. కన్నడభాషలో ఇప్పుడు ఉన్న గ్రంథాలలో అతి ప్రాచీనమైనది "కవిరాజమార్గ." దీని కర్త తొమ్మిదో శతాబ్దికి చెందిన నృపతుంగుడు (814.877) అనే రాష్ట్ర

కూటరాజు అంటారు గాని అసలు ఆయన ఆస్థానంలో ఉన్న శ్రీ విజయుడు అనే పండితుడే దీనిని రచించాడు. తొమ్మిదో శతాబ్దినించి కన్నడంలో విస్తారమైన సాహిత్యం ఉంది.

కన్నడంలో కులానుసారంగానూ స్థలానుసారంగానూ మాండలిక భేదాలు చాలా ఉన్నాయి. కుల మాండలికాలలో (Caste Dialects) ముఖ్యమైనవి గౌడ కన్నడం, హవ్యక కన్నడం, హాలక్కి కన్నడం. స్థల మాండలికాలలో (Regionaf Dialects) ముఖ్యమైనవి ధార్వార్ కన్నడం, మైసూరు కన్నడం, మంగుళూరు కన్నడం, గుల్బర్గ కన్నడం, కోత కన్నడం. నీలగిరిలో ఉండే బడగ జాతివారి భాషకూడా కన్నడ మాండలికమే అయినా దానిపై కొంత తమిళం ప్రభావంకూడా ఉంది. బడగల సంఖ్య (పాత లెక్కల ప్రకారం) 85,463.

## సాహిత్యం

కన్నడ సాహిత్య చరిత్రని స్థూలంగా ప్రాచీన కన్నడ యుగం (800-1150 A. D.; కన్నడంలో పళగన్నడ లేక హళగన్నడ), మధ్యకాల కన్నడ యుగం (1150-1800 A.D.; నడు గన్నడ), ఆధునిక కన్నడయుగం (1800 A.D. నించి; హొస/హొస గన్నడ) అని మూడుగా విభజింపవచ్చు. కన్నడం మొట్టమొదటి గ్రంథం 840 ప్రాంతంలో శ్రీవిజయుడు రచించిన 'కవిరాజ మార్గ' అని ఇంతకుముందే చెప్పేం. ఇది అలంకార శాస్త్రానికీ, కవిత్వ రచనా పద్ధతికీ సంబంధించిన గ్రంథం. ఇందులో అంతకు పూర్వం ఉన్న గ్రంథకర్తల పేర్లు ఇవ్వబడ్డాయి. కాని వారి గ్రంథాలేవీ ఇప్పుడు దొరకడం లేదు. ప్రాచీన కన్నడ యుగంలో చాలామంది కవులు జైనులు. శ్రీవిజయుడు కూడా జైనుడే. ఈయనకి కొంచెం తరవాత కాలంలో గుణవర్మ 'హరివంశం' లేక 'నేమినాథపురాణం', 'శూద్రక' అనే గ్రంథాలు రాశాడు.

పదోశతాబ్దిలో ముఖ్యులైన కవులు పంప, పొన్న, రన్న. వీరు ముగ్గురినీ రత్నత్రయం అంటారు. వీరు ముగ్గురూ జైనులే. పంప హిందూ బ్రాహ్మణుడే

అయినా జైనమతాన్ని స్వీకరించాడు. ఈయన 941 ప్రాంతంలో 'ఆదిపురాణ', 'విక్రమార్జున విజయ' (పంప భారత) అనే గ్రంథాలు రచించాడు, 'ఆదిపురాణ' మొదటి జైనతీర్థంకరుడి జీవిత చరిత్ర. 'విక్రమార్జున విజయ'లో అర్జునుడు నాయకుడుగా మహాభారత కథ వర్ణించబడింది. ఇందులో పంపకవి మూలకథకు చాలా మార్పులు చెయ్యడమే కాకుండా తన రాజైన చాళుక్య అరికేసరినీ అర్జునుణ్ణీ ఒకటిగా స్తుతించాడు. పంపకవి సమకాలికుడైన పొన్నకవి పదహారో జైనతీర్థంకరుడిని గురించిన 'శాంతిపురాణ' రచించాడు. రన్నకవి 993 ప్రాంతంలో రెండో తీర్థంకరుడిని గురించిన 'అజిత పురాణ' రచించాడు. ఈయన 'గదాయుద్ధ' (సాహస భీమవిజయ) అనే గ్రంథం కూడా రచించాడు. పంపకవికిమల్లే ఈయన కూడా ఇందులో కథానాయకుడైన భీముడికీ, తనరాజైన చాళుక్య తైలపకీ అభేదం ఆపాదించి వర్ణించాడు. 984 లో (మొదటి) నాగవర్మ 'ఛందోంబుధి' అని ఛందస్సు మీద ఒక గ్రంథం, బాణభట్టు కాదంబరిని చంపువుగానూ రచించాడు. 1150 ప్రాంతంలో (రెండో) నాగవర్మ 269 సంస్కృత సూత్రాలతో 'కర్ణాటక భాషా భూషణ' అనే వ్యాకరణ గ్రంథం రచించాడు. ఈయన 'కావ్యావలోకన' అనే గ్రంథం కూడా రాసాడు. ఇందులో 'శబ్దస్మృతి' అనే మొదటి అధ్యాయంలో సంగ్రహంగా కన్నడ వ్యాకరణం ఇచ్చాడు; మిగిలిన అధ్యాయాలు అలంకార శాస్త్రానికి సంబంధించినవి.

పదో శతాబ్దిలో కన్నడభాషా ధ్వనులలో ముఖ్యమైన మార్పు ఒకటి జరిగింది. అది పదాదిని ఉన్న పకారం హకారంగా మారడం. ఉదాహరణకి ప్రాచీన కన్నడంలో పత్తు 'పది', పెసర్ 'పేరు', పెరియ 'పెద్ద' అనే మాటలు తరవాత కన్నడంలో హత్తు, హెసరు, హిరియగా మారతాయి. పదాది పకారానికి బదులు హకారాన్ని వాడడం పదోశతాబ్ది శాసనాలలోనే మొట్టమొదట కనపడు తుంది. ఈకాలం కావ్యాల భాషలో కూడా ఈ మార్పు కనపడుతుంది. పన్నెండో శతాబ్ది మధ్యభాగంలో వీరశైవ మతస్థాపకుడైన బసవ వీరశైవమతాన్ని వ్యాప్తి లోకి తెచ్చాడు. దీనివల్ల జైనమత ప్రాబల్యం ఈ కాలంలో తగ్గింది. వీరశైవ కవులు తమ మతసూత్రాలు ప్రజలకి సులభంగా తెలియడంకోసం వచన రచనని

వ్యాప్తిలోకి తెచ్చారు. వీరిలో ముఖ్యులు బసవ, హరీశ్వర లేక హరిహర, రాఘవాంక, కెరెయ పద్మరస, పాల్కురికె సోమ. పాల్కురికె సోమ రచించిన 'సోమేశ్వర శతక' ప్రసిద్ధమైనది.

పదమూడో శతాబ్దిలో ఆండయ్య సంస్కృత పదాలు లేకుండా అచ్చ కన్నడంలో 'కబ్బిగరకావ' లేక 'కావనగెల్ల' (మన్మథ విజయం) అనే కావ్యం రచించాడు. ఈ కాలంలోనే మల్లికార్జున 'సూక్తి సుధార్ణవ' అనే గ్రంథం, అయన కొడుకు కేశిరాజు 'శబ్దమణి దర్పణ' అనే వ్యాకరణ గ్రంథం రచించారు.

విజయనగర రాజులు కూడా కన్నడ సాహిత్యాన్ని పోషించారు. 1369 ప్రాంతంలో భీమకవి 'బసవ పురాణ' రచించాడు. 1400 ప్రాంతంలో నారణప్ప షట్పదీచ్ఛందస్సులో మహాభారతం మొదటి పది పర్వాలూ రచించాడు. ఈయనకి 'కుమారవ్యాస' అనే బిరుదు ఉంది. ఈ గ్రంథ శేషాన్ని కృష్ణదేవ రాయలకి మంత్రి అయిన తిమ్మణ్ణ 1510 ప్రాంతంలో పూరించాడు. పదహారో శతాబ్ది చివర భాగంలో కుమార వాల్మీకి అనే బిరుదుగల కవి షట్పదీ ఛ్ఛందస్సులో రామాయణం రచించాడు.

పదిహేడో శతాబ్ది మొదటి భాగంలో భట్టాలంకదేవ అనే జైనకవి 592 సంస్కృత సూత్రాలతో 'కర్ణాటక శబ్దానుశాసన' అనే వ్యాకరణ గ్రంథం రచించాడు. పద్దెనిమిదో శతాబ్దిలో యక్షగానాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

ఇరవవైయో శతాబ్దిలో కథ, నవల మొదలైన నూతన ప్రక్రియలు వ్యాప్తిలోకి వచ్చాయి. నవలా రచయితలలో ప్రథములు గళగనాథ, ఎమ్. ఎస్. పుట్టణ్ణ, కె.వి. పుట్టప్ప. నవలలో మొదటివి రెంటాల వెంకట సుబ్బరాయ రచించిన 'కేసరి విలాస' (1895), లక్ష్మణబీమరావు రచించిన 'సూర్యకాంతె' (1892), గులవాడి వెంకటరాయరు రచించిన 'ఇందిరాబాయి.' కథారచయిత లలో ప్రసిద్ధులు పంజె మంగేశరావు, కేరూర్ వాసుదేవాచార్య, మాస్తి వెంకటేశ అయ్యంగార్, జి. పి. రాజరత్నం. ఆధునిక కవులలో డి. వి. గుండప్ప, కె. వి. పుట్టప్ప ముఖ్యులు.

ప్రమాణ గ్రంథాలు :

ఆచార్య, ఎ.ఎస్., 1967, *Halakki Kannda.* (Poona)

గోవిందస్వామిరావుగై, 1946, *Historical grammar of old Kannada.* (Poona)

హిరేమఠ్, ఆర్. సి. 1961, *The structure of Kannada.* (Dharwar)

కిట్టెల్, ఎఫ్, 1894, A *Kannda - English Dictionary* (Mangalore; reprinted by Madras University in 4 volumes, 1968 - 1971)

——, 1903, A *grammar of the Kannada language.* (Mangalore) (Reprint : 1982, New Delhi).

కుశలప్పగౌడ. కె., 1963, *Descriptive grammar of Viddaaraadhane* (Annamalai University M. Litt. Thesis (unpublished)

——, 1970, *Gowda Kannada* (Annamalainagar)

——, 1972, A *grammar of Kannada* (Based on the inscriptions of Coorg South Kanara and North Kanara Dts 1000 A.D. to 1400 A.D. (Annamalinagar)

మహాదేవన్. ఆర్. 1968, *Gulbarga Kannada* (*Brahmin Dialect*). (Poona)

నరసింహయ్య, ఎ, ఎన్. 1941, A *grammar of the Oldest Kanarese inscription.* (Mysore)

రామచంద్రరావు, బి. 1972, A *Descriptive grammar of Pampa Bhaarata.* (Mysore)

శంకరభట్టు, డి. ఎన్., 1971, *An outline grammar of Havyaka.* (Poona)

శాస్త్రి, కె.జి. 1971, The *Havyaka dialect of North Kanara*. (Dharwar)

ఉపాధ్యాయ, యు.పి. 1968, *Nanjaugud Kannada (Vakkaliga Dialect)*. (Poona)

——,1971, Coorg *Kannada (Jenu Kuruba Dialect)*. (Poona)

## తుళు

తుళు భాష కర్ణాటక రాష్ట్రంలో దక్షిణ కన్నడ (South Kanara) జిల్లాలో ఉడుపి, బంటవాళ, కార్కళ, మంగుళూరు, పుత్తూరు తాలూకాలలోనూ కేరళ రాష్ట్రంలో కాసరగోడు తాలూకాలోనూ వ్యాప్తిలో ఉంది. తుళు భాషా వ్యవహర్తల సంఖ్య సుమారు పధ్నాలుగు లక్షలు. తుళు భాషకి ప్రాచీన సాహిత్యమూ, ప్రత్యేక లిపీ లేకపోయినా అది ఒక ముఖ్య భాషగానే మనం పరిగణించాలి. ఈ ప్రాంతంలో అనాదినించీ కన్నడం ముఖ్య భాషగా ఉండడం వల్ల తుళులో సాహిత్యం ఉద్భవించలేదు. కాని తమిళ సంఘ వాఙ్మయానికి చెందిన 'అకనానూఱు'లో తుళునాడు, అందులో ఉండే మూదూర్ అనే పట్టణం వర్ణించబడ్డాయి. కాబట్టి తుళు భాష సంఘ వాఙ్మయకాలం నాటికే ప్రత్యేక భాషగా ఉండేదని మనం నిస్సంశయంగా చెప్పవచ్చు. తుళు పదజాలం వల్లకూడా తుళు పరిపూర్ణంగా వృద్ధిచెందిన భాష అని తెలుస్తుంది.

తుళులో కుల మాండలికాలూ, స్థల మాండలికాలూ కూడా ఉన్నాయి. ముఖ్యంగా బ్రాహ్మణుల మాండలికానికి బ్రాహ్మణేతరుల మాండలికాలకి భేదం ప్రస్ఫుటంగా ఉంది. అదే విధంగా ఉడుపిలో మాట్లాడే తుళుకి మిగిలిన ప్రాంతాలలో మాట్లాడే తుళుకి భేదాలు ఉన్నాయి. తుళు మాండలికాలమీద ఇంకా చాలా పరిశోధన జరగవలసి ఉంది. కొరగజాతివారి భాష తుళు మాండలికమే అనడానికి అవకాశం ఉంది.

—

ప్రమాణ గ్రంథాలు :

జలజాక్షి, కె.వి. 1980. *Tulu language* (Unpublished Ph.D. Thesis, Annamalai University).

మరియప్ప భట్, ఎమ్. శంకర కెదిలాయ, ఎ, 1967 *Tulu - English Dictionary* (Madras).

శంకరభట్టు, డి. ఎన్, 1967, *Descriptive analysis of Tulu* (Poona).

రామచంద్రరావు, బి., 1968 "Verb morphology of common Tulu", *JOU*, Part I, 67 - 85

లక్ష్మీనారాయణ భట్టు, ఎస్., 1971. *A grammar of Tulu* (Unpublished University of Wisconsin Ph. D. Dissertation)

రామకృష్ణ శెట్టి, టి. 1986. వర్ణనాత్మక తుళు వ్యాకరణ (ఇది కన్నడంలో ఉంది; పుత్తూర్.)

## తెలుగు

'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స' అని కృష్ణదేవరాయలచేత పొగడబడిన తెలుగుభాష అతిముఖ్య ద్రావిడభాషలలో ఒకటి. తెలుగువారు మన ఆంధ్రప్రదేశ్ లోనే కాక ఇరుగు పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సాలలో కూడా అధిక సంఖ్యలో ఉన్నారు. తెలుగువారి సంఖ్య సుమారు మూడు కోట్ల ఎనభై లక్షలు (37,642,439). మన భారత దేశంలో ఉన్న ద్రావిడభాషా వ్యవహర్తలలో తెలుగువారే అత్యధిక సంఖ్యాకులు. తెలుగునాటిని మొట్టమొదట ఆంధ్ర వంశపు రాజులు పరిపాలించడంవల్ల దీనికి ఆంధ్రదేశమనీ, ఇక్కడ ప్రజలకి ఆంధ్రులనీ, భాషకి ఆంధ్రమనీ కూడా పేర్లు వచ్చాయని చారిత్రకులు చెప్తారు. సంఖ్యాబలాన్ని బట్టి చూస్తే మన దేశంలో హిందీభాషకాక మిగిలిన భాషలు మాట్లాడేవారిలో తెలుగువారే అధిక సంఖ్యాకులు.

తెలుంగు, తెనుంగు పదాల వ్యుత్పత్తిని నిర్ణయించడం సాధ్యం కాదు. ఈ పదాలకి చాలా మంది చాలా రకాలుగా అర్థాలు చెప్పేరు. కాని అవన్నీ వారి ఊహాబలం మీద ఆధారపడినవే. వాటిలో కొన్ని—"తలైంగు జాతివారి భాష కాబట్టి తెలుంగు; "తలైంగ్ అంటే తలస్థానాన్ని ఆక్రమించినవారు, నాయకులు"; "తెలుంగు అంటే తెల్లగా, స్పష్టంగా ఉండే భాష, తేట తెనుగు అనే వాడుక ఇప్పటికీ ఉంది"; "తెన్ను అంటే దారి కాబట్టి 'తెనుంగు' అంటే దారిలో ఉండే వారి భాష; దారి అంటే ఆర్యులు 'దక్షిణాపథం' అని వ్యవహరించిన ప్రాంతం"; "తెలుంగు త్రిలింగ లేక త్రికళింగశబ్దభవం; "శ్రీశైలం, దక్షారామం, కాళేశ్వరం అనే మూడుచోట్ల శివలింగాలు ఉండడంవల్ల ఆంధ్రదేశానికి త్రిలింగదేశం అనే పేరు వచ్చింది" అని ప్రతాపరుద్రీయకర్త అయిన విద్యానాథుడు (13 వ శతాబ్ది) చెప్పేరు. "తెనుంగులో తెన్ అంటే దక్షిణం కాబట్టి తెనుంగు అంటే దాక్షిణాత్యుల భాష" (ఇది సోమయాజి అభిప్రాయం) ఇందులో 'గు' అనేది తెలుగుకి సన్నిహిత భాషలైన కూయి, కువి పదాలలో ఉన్న 'కు' తో తుల్యమని ఈ మధ్య కొత్తగా వచ్చిన ప్రతిపాదన. భాషా శాస్త్రరీత్యా 'తెలుంగు', 'తెనుంగు' పదాలలో తెలుంగే ప్రాచీనమనీ, దానిలో లకారం పక్కనున్న అనునాసికం ప్రభావంవల్ల నకారంగా మారి 'తెనుంగు' ఏర్పడిందనీ చెప్పవచ్చు. ఇటువంటి మార్పు అడంగు > అణుగు, మడంగు > మణుగు మొదలైన మాటలలో ఉంది. అదీ కాక ఇరుగు పొరుగు వారైన తమిళులు మన భాషని 'తెలుంగు' అనే వ్యవహరిస్తారు. కాబట్టి 'తెలుంగు' పదమే ప్రాచీనతరమనీ దీని వ్యుత్పత్తి చాలా భాషల పేర్ల వ్యుత్పత్తులకి మల్లేనే సరిగా తెలియదనీ చెప్పాలి.

జి. ఎన్. రెడ్డి "తెలుగు భాషా చరిత్ర" ప్రథమ ప్రకరణంలో తెనుఁగు దేశ్యమైనదిగ్వాచి అనే సోమయాజి అభిప్రాయం సమంజసమైనదే కావచ్చుననీ, తెలుఁగు శబ్దం తెనుఁగు శబ్దానికి రూపాంతరమే కాని, త్రిలింగ శబ్దభవం కాదనీ ఇందులో న>ల మార్పు ఉందనీ చెప్పేరు.

మన తెలుగు భాషలో మొట్టమొదటి గ్రంథం నన్నయభట్టు పదకొండో శతాబ్ది మధ్య భాగంలో రచించిన మహాభారతంలో ఆది, సభా పర్వాలూ,

అరణ్యపర్వంలో కొంత భాగం. అయితే దీనికి ముందు కాలంలో మన భాషని గురించి తెలుసుకుందుకు మనకి దొరికే శాసనాలు ఉపయోగిస్తాయి.[1] తెలుగు భాషలో శాసనాలు ఆరో శతాబ్దినించీ మనకి దొరుకుతున్నాయి. వీటిలో కడప జిల్లా, కమలాపురం తాలూకా, ఎఱ్ఱగుడిపాడు (కాలం 575-600), కలమళ్ళ (కాలం 576-600)లలో దొరికిన శాసనాలు మొట్టమొదటివి. వీటికి ముందు క్రీ.శ 200 కి చెందిన శాసనం బ్రాహ్మీ లిపిలో ఉన్నది గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకా అమరావతిలో దొరికింది. కాని ఇందులో 'నాగబు' అనే మాట ఒక్కటి మాత్రమే ఉంది (ఈ మాటలో 'బు' అనే తెలుగు ప్రత్యయం ఉండడంవల్ల ఇది తెలుగు శాసనంగా పరిగణించబడుతోంది). నన్నయభట్టు కాలానికి ముందు కాలానికి చెందిన శాసనాలు 269 సేకరించి *Early Telugu Inscriptions upto* **1100 A.D.**) (ప్రాచీనాంధ్ర శాసనాలు) (కీ.శ. 1100 వరకు) అనే గ్రంథంలో డా॥ బూదరాజు రాధాకృష్ణ ఇటీవల ప్రచురించారు (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్-4, 1971). వీటి ఆధారంతో ఆయన 11వ శతాబ్ది ముందు తెలుగుకి సంగ్రహ భాషా చరిత్ర ఇచ్చారు. ఈ కాలపు భాషలో తరవాత కాలంలో తెలుగులో లేని 'ళ' కారం (తమిళం ళ తో సమానమైనది) ఉండేది. తరవాత కాలంలో అది అచ్చుల మధ్యా పదాదినీ డకారంతోనూ, పదాది హల్లు తరవాత రేఫతోనూ కలిసిపోయింది (చూ. రెండో అధ్యాయం). ఈ భాషలో 'సంవత్స రంబుళ్' మొదలైన మాటలలో ప్రాచీన 'ళ' కారం అలాగే నిలిచి ఉంది; తరవాత కాలంలో అది 'ల' కారంగా మారింది. పణి 'పని', కొణి 'కొని'

1. ప్రాఙ్నన్నయ యుగభాషని గురించిన చర్చ కింద ఇచ్చిన గ్రంథాలలో ఉంది: ప్రొఫెసర్ గంటిజోగి సోమయాజి "ఆంధ్రభాషా వికాసము", ప్రొఫెసర్ దివాకర్ల వెంకటావధాని "ప్రాఙ్నన్నయ యుగము" (హైదరాబాదు 1960), ప్రొఫెసర్ కోరాడ మహాదేవశాస్త్రి "*Historical Grammar of Telugu*" (అనంతపూర్, 1969), డా॥ బూదరాజు రాధాకృష్ణ "Early Telugu Inscriptions (upto 1100 A.D.)" (హైదరాబాద్, 1971).

మొదలైన మాటలలో 'ఐ' కారం వాన్డు 'వాఁడు'లో 'న్డ' పెర్ద్దళ్ 'పెద్దలు',లో 'ర్ద' ఈ భాష ప్రాచీనతని నిరూపిస్తాయి.

ఆరో శతాబ్దికి ముందు మన ఆంధ్రప్రాంతంలో శాసనాలు సంస్కృత, ప్రాకృత భాషలలోనే వేసేవారు. వాటిలో ఉన్న ఊళ్ళ పేర్లూ, మనుష్యుల పేర్లూ తెలుగువే. ఈ శాసనాలలో ఉన్న ఆచంట, ఉరవపల్లి, ఏళూరు (ఏలూరు), కురువాడ, చెందలూరు, తాన్టికొన్డ (తాటికొండ), పెణుకబ్బు, రావిరేవ, విర్పఱు మొదలైన ఊళ్ల పేర్లు ఆ కాలంలో సామాన్య ప్రజలు తెలుగే మాట్లాడేవారని నిరూపిస్తాయి.

ఇప్పటి మన భాషకి చాలా స్థల మాండలికాలూ, కుల మాండలికాలూ ఉన్నాయి. వీటిని గురించి పరిశోధన ఇప్పుడిప్పుడే ఆరంభమైంది. మన భాషలో కోస్తా మాండలికం, రాయలసీమ మాండలికం, తెలంగాణా మాండలికం అని మూడు మాండలికాలు ఉన్నాయని స్థూలంగా చెప్పవచ్చు. కాని ఈ ప్రదేశాలలో కూడా ప్రాంతాలనిబట్టీ, కులాలనుబట్టీ భాషలో భేదాలు ఉన్నాయి. మన భాషలో మాండలిక పరిశోధన చేసినవారిలో ప్రొఫెసర్ భద్రిరాజు కృష్ణమూర్తి ప్రథములు. వీరు వివిధ మండలాలలోని వ్యవసాయ పదాలు సేకరించి 'వృత్తి పదకోశం' (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్–4, 1962) అనే గ్రంథంగా ప్రచురించారు. దీని తర్వాత ఇతర పండితులు మరికొందరు మిగిలిన వృత్తులకి సంబంధించిన పదాలు సేకరించి సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో ప్రచురించారు, ప్రచురిస్తున్నారు. చేనేత, వాస్తులకికూడా కోశాలు వచ్చాయి.

## సాహిత్యం :

(11-12 శతాబ్దులు) మన భాషలో లిఖిత సాహిత్యం పదకొండో శతాబ్దంలో నన్నయగారి భారతంతో ప్రారంభమైనదని ఇంతకుముందే చూశాం. కాని తెలుగులో కవిత్వం రాయడం అంతకుముందు కాలంలోనే ఉండేదని మనకు శాసనాలవల్ల తెలుస్తుంది. పండరంగుని అద్దంకి శాసనం (848), యుద్ధ

మల్లుని బెజవాడ శాసనం (885), గుణగవిజయాదిత్యుని ధర్మవరం (848), కందుకూరు (848) శాసనాలలోనూ మరికొన్ని ఇతర శాసనాలలోనూ తరువోజ, సీసం, ఆటవెలది, తేటగీతి, మధ్యాక్కర, రగడ మొదలైన దేశీయచ్ఛందస్సులలో తెలుగు పద్యాలు ఉన్నాయి. దీనివల్ల తెలుగులో కవిత్వ రచన నన్నయ గారికి ముందు చాలా కాలంనించీ ఉండేదని మనకు తెలుస్తుంది. అయితే ఆ కాలంలో తెలుగులో గ్రంథాలు రాశారా లేదా అనేది సందేహాస్పదం. ఒకవేళ గ్రంథాలేమైనా ఉండి ఉంటే అవి మనకి దక్కలేదనుకోవాలి.

నన్నయగారికి ఆదికవి', 'వాగనుశాసుడు' అనే బిరుదులు ఉన్నాయి. 'వాగనుశాసనుడు' అనే బిరుదు ఈయన 'ఆంధ్ర శబ్ద చింతామణి' అనే తెలుగు వ్యాకరణం రాయడంవల్ల వచ్చినదని కొందరి ఊహ. కాని 'ఆంధ్రశబ్ద చింతామణి' నన్నయది కాదనీ, పదహారో శతాబ్దంలో వారెవరో దీనిని రచించి, ప్రామాణికత కోసం నన్నయ పేరు పెట్టారనీ చాలామంది పండితుల నమ్మకం. నన్నయ కాలంలో వాడైన పావులూరి మల్లన 'గణితసార సంగ్రహం' అనే సంస్కృతంలోని గణిత గ్రంథాన్ని అనువదించాడు. 'కవిరాజ శిఖామణి' నన్నెచోడుడు 'కుమారసంభవం' రచించాడు. ఈయన కాలాన్ని గురించి వాదోపవాదాలు ఉన్నాయి. ఈ గ్రంథాన్ని సంపాదించిన మానవల్లి రామకృష్ణ కవిగారి అభిప్రాయంలో ఈయన 940 ప్రాంతం వాడు, నన్నయకు పూర్వుడు, కాని వీరేశలింగంగారి అభిప్రాయంలో యీయన 1160 - 1170 ప్రాంతం వాడు. చాలా మంది పండితులు వీరేశలింగంగారి నిర్ణయాన్నే ఆమోదిస్తున్నారు. వేములవాడ భీమకవి 'రాఘవపాండవీయం' అనే ద్వ్యర్థి కావ్యం రాశాడు అంటారు. కాని, అది పింగళి సూరన్న (1550) కాలానికే దొరకకుండా పోయింది. ఈయన చాటువులు మాత్రం కొన్ని లభిస్తున్నాయి. మల్లియ రేచన 'కవిజనాశ్రయం' అనే ఛందో గ్రంథం రచించాడు.

వీరశైవ మతాన్ని ఆంధ్ర దేశంలో వ్యాప్తిలోకి తెచ్చిన వారిలో మొదటివాడు మల్లికార్జున పండితారాధ్యులు. ఈయన 'శివతత్వసార' మనే శతకం

రచించాడు. వీరశైవ కవులలో ముఖ్యుడు పాల్కురికి సోమన. ఈయన గ్రంథాలలో 'పండితారాధ్య చరిత్ర', 'బసవపురాణం' ముఖ్యమైనవి.

(13 - 14 శతాబ్దులు) పదమూడో శతాబ్ది మొదటి భాగంలో తిక్కన సోమయాజి విరాటపర్వం నుంచి చివరదాకా భారతాన్ని రచించి, నన్నయగారు తలపెట్టిన మహా గ్రంథ రచన పూర్తిచేశారు. ఈయన అంతకుముందు నిర్వచనోత్తర రామాయణం రచించారు. ఈయనకి 'కవిబ్రహ్మ', 'ఉభయకవి మిత్రుడు' అనే బిరుదులు ఉన్నాయి. 'శంభుదాసుడు', 'ప్రబంధ పరమేశ్వరుడు' అనే బిరుదులు గల ఎఱ్ఱాప్రెగ్గడ, నన్నయ అరణ్య పర్వ శేషాన్ని పూరించటమే కాక హరివంశము, నృసింహపురాణము అనే గ్రంథాలు కూడా రచించాడు. ఈయన రామాయణం కూడా రాసినట్టు తెలుస్తోంది. కాని, అది ఇప్పుడు దొరకదు. మూలఘటిక కేతన అనే తిక్కనగారి శిష్యుడు 'దశకుమార చరిత్ర'ని తిక్కనగారికి అంకితం ఇచ్చాడు. ఈయన 'ఆంధ్ర భాషా భూషణం' అనే చిన్న తెలుగు వ్యాకరణం కూడా రచించాడు. తెలుగుకి ఇదే మొదటి లక్షణ గ్రంథం అని ఆయనే చెప్పాడు. అధర్వణకవి ఈ కాలం వాడే. ఈయన రచించిన భారతం దొరకడం లేదు. నాచన సోమన ఉత్తర హరివంశం కూడా ఈ కాలానికి చెందినదే. రంగనాథ రామాయణం అనే ద్విపద కావ్యం కూడా ఈ కాలానిదే.

మహా పండితుడూ, మహా కవీ అయిన శ్రీనాథుడు రచించిన గ్రంథాలలో 'శృంగార నైషధము', 'కాశీఖండము', 'భీమఖండము', 'పల్నాటి వీర చరిత్ర', 'క్రీడాభిరామము' ముఖ్యమైనవి. క్రీడాభిరామం వల్ల ఆ కాలంలో ప్రజల జీవన విధానం తెలుస్తుంది. ఈయన బిరుదు 'కవి సార్వభౌముడు.' ఈయన చాటువులు కూడా ప్రసిద్ధాలు.

(15 వ శతాబ్ది) ప్రసిద్ధ గ్రంథమైన భాగవతాన్ని బమ్మెర పోతన రచించాడు. పిల్లలమర్రి పినవీరభద్రుని 'శృంగార శాకుంతలం' కూడా ఈ కాలానిదే.

(16 - 18 శతాబ్దులు) తెలుగు సాహిత్యంలో శ్రీకృష్ణదేవరాయుల కాలమైన పదహారో శతాబ్దం స్వర్ణ యుగం. కృష్ణదేవరాయల సభలో అష్ట దిగ్గజాలు ఉండేవారు. అయితే, అష్టదిగ్గజాలు ఎవరు అనే విషయంలో పండితు లకి భేదాభిప్రాయాలు ఉన్నాయి. 'మనుచరిత్ర' రచించిన అల్లసాని పెద్దన, 'పారిజాతాపహరణము' రచించిన ముక్కు తిమ్మన, 'కాళహస్తీశ్వర మహా త్మ్యము', 'కాళహస్తీశ్వర శతకము' రచించిన ధూర్జటి, 'పాండురంగ మహా త్మ్యము' రచించిన తెనాలి రామకృష్ణుడు, 'రాజశేఖర చరిత్ర' రచించిన మాదయ్యగారి మల్లన అష్టదిగ్గజాలలో వారేనని నిస్సంశయంగా చెప్పవచ్చు. మిగిలిన ముగ్గురూ తమిళ, కన్నడ కవులు కావచ్చు. శ్రీ కృష్ణదేవరాయలు కవిపండిత పోషకుడే కాక కవి కూడా. ఈయన రచించిన 'ఆముక్తమాల్యద' తెలుగు కావ్యాలలో అగ్రగణ్యం. రాయలవారి కాలంలో వస్త్వైక్యం కలిగి, వర్ణన ప్రధానమైన ప్రబంధాలు ఎక్కువగా రచింపబడటం వల్ల దీనిని ప్రబంధ యుగం అంటారు.

ఈ కాలపు ముస్లిం రాజులుకూడా తెలుగు సాహిత్యాన్ని ఆదరించారు. గోల్కొండ రాజైన ఇబ్రహీం కుతుబ్‌షా (1550 - 1580) ఆస్థానంలో కవు లైన పొన్నికంటి తెలగన 'యయాతి చరిత్ర', అద్దంకి గంగాధరుడు 'తపతీ సంవరణం' అనే అచ్చ తెలుగు కావ్యాలు రచించారు.

రామరాజ భూషణుడు అనే బిరుదుగల భట్టుమూర్తి 'వసుచరిత్ర', 'హరి శ్చంద్ర నలోపాఖ్యానము' అనే ద్వ్యర్థి కావ్యం రచించాడు. పింగళి సూరన 'రాఘవ పాండవీయము' అనే ద్వ్యర్థి కావ్యమూ, 'కళాపూర్ణోదయము' అనే కల్పితకథ కల కావ్యమూ, 'ప్రభావతీ ప్రద్యుమ్నమూ' రచించాడు.

ప్రసిద్ధమైన నీతిశతకం రచించిన వేమన కూడా ఈ కాలంవాడే కావచ్చు.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం తమిళనాడులో తంజావూరు, మదుర, పుదుక్కోటలలో నాయక రాజులు తెలుగు భాషని పోషించారు.

తంజావూరు రాజులలో రఘునాథరాయలు తెలుగులో మంచికవి. ఈయన ఆస్థాన కవి అయిన చేమకూర వెంకటకవి 'విజయ విలాసము' రచించాడు, ఈ కాలంలోనే తంజావూరు దగ్గిర 'తిరువైయూరు'లో నివసించిన త్యాగరాజు కీర్తనలు కర్ణాటక సంగీతానికి అమూల్యాభరణాలు.

(1800 తరువాత) ఆధునిక యుగంలో వచన రచన వ్యాప్తిలోకి వచ్చింది. చిన్నయసూరి బాలవ్యాకరణం, నీతిచంద్రిక రచించి గ్రాంథిక శైలిలో వచన రచనకి మార్గం చూపెట్టారు. కందుకూరి వీరేశలింగం (1848 - 1919) పంతులు గారు సంఘసంస్కర్తే కాకుండా పండితుడూ, గొప్ప విమర్శకుడు. ఈయనే శాస్త్రీయ పద్ధతిలో మొట్టమొదట కవుల చరిత్ర రచించారు. ఈయన రచించిన 'రాజశేఖర చరిత్ర' తెలుగు నవలలో మొదటిది. గిడుగు రామమూర్తి పంతులు గారు సజీవమైన వ్యావహారిక భాషలోనే రచనలు సాగించాలనే ఉద్యమాన్ని ప్రారంభించి విజయం సాధించారు. గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' అనే ప్రసిద్ధ సాంఘిక నాటకాన్ని వ్యావహారిక భాషలో రచించారు. చిలకమర్తి లక్ష్మీ నరసింహం గ్రాంథిక భాషలో నవలలూ, ప్రసిద్ధ నాటకాలూ రచించారు. శతావధానులు తిరుపతి వెంకటకవులు కూడా ప్రసిద్ధులు. భావకవులలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, నండూరి వెంకట సుబ్బారావు, బసవరాజు అప్పారావు ముఖ్యులు. అభ్యుదయ కవులలో శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) ముఖ్యుడు. నేటి కవులలో డా. సి. నారాయణరెడ్డి, దాశరథి, విశ్వనాథ సత్యనారాయణ ముఖ్యులు. కథా రచయితలలో అడవి బాపిరాజు, గోపీచంద్, చలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాచకొండ విశ్వనాథ శాస్త్రి ప్రసిద్ధులు. పైన పేర్కొన్నవారు కాక అన్ని శాఖలలో ఇంకా ముఖ్యులు చాలామంది ఉన్నారు. వారంతా తెలుగుబాష వృద్ధికి అనేక విధాల సేవ చేస్తున్నారు. స్థలాభావం వల్ల వారందరినీ గురించి ఇక్కడ చర్చించడం సాధ్యం కాదు.

తెలుగు వ్యాకరణాలలో ముఖ్యమయినవి : కేతన 'ఆంధ్ర భాషా భూషణము', విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి', గణపవరపు వెంకటకవి

'సర్వలక్షణ శిరోమణి', కూచిమంచి తిమ్మకవి 'లక్షణసార సంగ్రహము' 'ఆంధ్ర శబ్ద చింతామణి' (ఇది నన్నయదని కాదని చాలామంది అభిప్రాయము), 'కారికావళి' లేక 'వికృత వివేకము' (అహోబల పండితుడు తన గ్రంథంలో దానిని అధర్వణుడు రాసినట్లు చెప్పేడు కాని ఇది అహోబల పండితుడు రాసినది కావచ్చు), అహోబలపండితుడి 'కవిశిరోభూషణ' మనే చింతామణి వ్యాఖ్య. పరవస్తు చిన్నయసూరి 'బాలవ్యాకరణము' (1858) ప్రామాణిక గ్రంథం. బహుజనపల్లి సీతారామాచార్యులు 'త్రిలింగ లక్షణ శేషము' లేక 'ప్రౌఢ వ్యాకరణము' (1885) బాలవ్యాకరణానికి పూరణ గ్రంథం.

**ప్రమాణ గ్రంథాలు ;**


ఆర్డెన్, ఎ. హెచ్. 1873 A *Progressive grmmar of the Telugu language* (Madras).

బ్రౌన్, సి. పి. (Brown, C.P.) 1907, A *Telugu – English Dictionay* (Madras).

చిన్నయసూరి, పరవస్తు, 1858, బాలవ్యాకరణము (మద్రాసు).

కృష్ణమూర్తి, భద్రిరాజు, 1961, *Telugu verbal bases : A Comparative and Descriptive study.* (Berkeley).

——, 1962, మాండలిక వృత్తిపదకోశం Vol. I, వ్యవసాయం. (Hyderabad).

——, శివానంద శర్మ, పి., 1968, A *Basic Course in Modern Telugu.* (Hyderabad)

—(సం) 1975, తెలుగుభాషా చరిత్ర (History of the Telugu Language), (Hyderabad).

కృష్ణమూర్తి, భద్రిరాజు & గ్విన్, జె.పి.ఎల్. 1985. A *Grammar of modern Telugu.* Delhi: Oxford University Press.

జోగిసోమయాజి, గంటి, 1947, ఆంధ్రభాషా వికాసము, వాల్తేరు.

రామారావు చేకూరి, 1975, తెలుగు వాక్యం (హైదరాబాదు)

కుమారస్వామిరాజా. ఎన్. 1975. A *Generative Grammar of Rajapalayam Telugu* (Annamalai University Ph. D. Thesis).

మహాదేవశాస్త్రి, కోరాడ, 1969, *Historical grammar of Telugu with special refernce to* Old *Telugu* (200 B.C.— 1000 A.D). (Tirupati, Ananthapur).

రాధాకృష్ణ, బూదరాజు, 1971, *Early Telugu inscriptions* (upto 1100 A.D). (Hyderabad).

లిస్కర్, ఎల్. 1963, *Introduction to spoken Telugu.* (New York).

శంకరనారాయణ, పి. 1927, A *Telugu-English Dictionary* (Madras).

సుబ్రహ్మణ్యం. పి. ఎస్. 1974, *An introduction to modern Telugu.* (Annamalainagar).

సూర్యరాయాంధ్ర నిఘంటువు, బెజవాడ. 1936.—

## గోండీ :

సాహిత్య రహిత భాషలలో గోండికి ప్రత్యేక స్థానం ఉంది. గోండులు సుమారు ఇరవై రెండు లక్షల మంది ఉన్నారు. వీరి సంఖ్య సాహిత్య రహిత భాషలు మాట్లాడే వారందరి సంఖ్యలలోకి పెద్దది. పూర్వకాలంలో గోండు రాజులు మన దేశంలో కొంత భాగాన్ని పరిపాలించేవారు. గోండులు నివసించే ప్రాంతాన్ని 'గోండ్‌వానా' అని వ్యవహరించేవారు. ఇప్పుడు గోండులు మహారాష్ట్ర తూర్పు, ఉత్తర ప్రాంతాలలోనూ మధ్యప్రదేశ్ లోనూ ఎక్కువగా ఉన్నారు. ఒరిస్సాలో కూడా కొంతమంది గోండులు ఉన్నారు. మన ఆంధ్ర ప్రదేశ్‌లో అదిలాబాద్ జిల్లాలో రాజ్ గోండులూ, ఖమ్మంలో కోయలు ఉన్నారు. గోండులలో చాలా జాతులవారు ఉన్నారు. వీరిలో రాజ్ గోండులూ, మడియా గోండులు, మురియా గోండులూ; బస్తర్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లలో ఉండే కోయలూ ముఖ్యులు.

'గోండులు, గోండీ' అనే మాటలు ఇతర భాషలవారు వాడేవి. గోండులు తమ జాతివారిని 'కోయ్‌తూర్' అనీ, తమ భాషని 'కోయాజ్' అనీ వ్యవహరిస్తారు.

గోండుల ముఖ్యదైవం 'భీమాల్' (భీముడు). గోండులకి పరంపరగా వచ్చిన కథలూ, పెళ్ళిపాటలూ మొదలైన పాటలూ, పొడుపు కథలూ చాలా ఉన్నాయి. లిపి లేకపోయినా గోండీ భాష చాలా పరిపుష్టమైన, సుందరమైన భాష. రాకపోకల సౌకర్యాలు లేని అరణ్యప్రాంతాలలో మాట్లాడే భాష కనక దీనికి చాలా మాండలికాలు ఉన్నాయి. ఈ మాండలికాలలో కోయ మాండలికానికీ మిగిలినవాటికీ చాలా వ్యత్యాసం ఉంది. మాండలిక భేదాలతో ముఖ్యమైనది పదాది సకారం మార్పు. అది ఉత్తర పశ్చిమ ప్రాంతాలలో నిలిచి ఉంది, తూర్పు దక్షిణ ప్రాంతాలైన ఛాండా, బస్తర్ జిల్లాలలో అది హకారంగా మారితే, మడియా, కోయ మాండలికాలలో నశించింది, ఉదా. సొవోర్, హొవోర్, ఒవోర్ 'ఉప్పు'. ఉత్తర, పశ్చిమ మాండలికాలలో కొన్ని మాటలలో పదాది 'ర' కారం ఉంటే తూర్పు దక్షిణ మాండలికాలలో 'ల'కారం ఉంది. ఈ రెండూ మూ.ద్రా. "ళ' కారం రూపాలు, ఉదా. (రోన్/లోన్ < *ఉళన్ 'ఇల్లు') మడియా మాండలికంలో 'ఱ' కారం నిలిచిఉంది. బెతూల్ ప్రాంతంలో రకారం ఢగా మారింది. దీర్ఘాచ్చు మీది మూ.ద్రా. *న్ఱ ఉత్తర పశ్చిమ ప్రాంతాలలో 'ంద' గానూ, తూర్పు దక్షిణప్రాంతాలలో 'ండ' గానూ మారింది. ఉదా. మూంద్ / మూండ్ 'మూడు' < మూన్ఱు.

ప్రమాణ గ్రంథాలు :

స్టీఫెన్. ఏ, టైలర్ (Tyler). 1969. *Koya; an out line grammar.* (Berkeley).

నటరాజన్, జి. వి. 1985, A bujhmadia grammar, Mysore.

భట్టాచార్య, సుధీభూషణ్, 1968, Muria morphology. BASI 17:336-73.

బరో, టి., భట్టాచార్య, ఎస్. 1960, "A comparative Vocabulary of the Gondi dialects *JAS* 2.73 - 251.

సేతు మాధవరావు, పి., 1954, *A grammar of the Gondi* language (Hyderabad) (అదిలాబాద్ మాండలికం)

సుబ్రహ్మణ్యం, పి, ఎస్., 1968, *A Descriptve grammar of Gondi*, (Annamalainagar) (అదిలాబాద్ మాండలికం, కోయమాండలికం)

ట్రెంచ్, సి.జి.సి. (Trench, C.G.C.) 1919 - 21, *Grammar of Gondi as spoken in the Betul District., Central provinces, India*, Vol. i - *Grammar*, Vol, ii - *Vocabulary*, **Folk - tales, etc.** (Madras)

ఉమామహేశ్వరరావు, జి. 1987. **A Comparative study of the Gondi dialects, (Unpublished Ph.D, thesis; Osmania University)**

## కొండ (లేక కూబి) :

కొండ దొరలు (కొండ కాపులు, ఓజలు, పాండవ రైతులు) అనే ఆటవిక జాతివారు విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో ఏజన్సీ ప్రాంతంలోనూ, ఒరిస్సాలో కోరాపుట్ జిల్లాలో ఆగ్నేయ ప్రాంతంలో పర్వతభూములలోనూ ఉన్నారు. 1961 సెన్సస్ ప్రకారం వారి సంఖ్య 12,298. 'కొండదొరలు' అనే మాట తెలుగువారు వాడే మాట. వీరు తమ జాతివారిని కూబిజ్ (జ్ బహువచన ప్రత్యయం) అంటారని డా. భద్రిరాజు కృష్ణమూర్తి కనుగొన్నారు.

వీరిది ఒక ప్రత్యేక ద్రావిడ భాష అని చాలా ఇటీవల కాలంలోనే తెలిసింది. ఈ భాషని గురించి మొట్టమొదట పరిశోధన చేసినవారు సుదీభూషణ్ భట్టాచార్య. ఈయన కోరాపుట్ జిల్లాలో సెంబ్లిగూడ అనే ప్రాంతంలో వాడే

మాండలికాన్ని గురించి 1953 లో ఒక వ్యాసం ప్రచురించారు.[1] ఆ తరువాత డా. భద్రిరాజు కృష్ణమూర్తి ఈ భాషమీద రెండేళ్ళపాటు సమగ్ర పరిశోధన చేసి (Konda or Kubi (A Dravidian Language) Tribal Cultural Research & Training Institute, Hyderabad, 1968) అనే గ్రంథం ప్రచురించారు. అందులో ఆయన వ్యాకరణం, కథలు, పదపట్టిక ఇచ్చి, ఈ భాషలో మాండలిక భేదాలని, వారి సాంఘిక జీవితాన్ని గురించికూడా చర్చించారు.

కొండ భాషలో మూల ద్రావిడ *ఱ కారం, *న్ట నేటికీ ఉన్నాయి; మూ.ద్రా. *ఌ శ్వాసమైన (Voiceless) ఱ కారంగా మిగిలివుంది. దీనిలో మాండలిక భేదాలు తక్కువ, ఉన్నభేదాలు వర్ణ నిర్మాణంలోనే ఉన్నాయి. మూ.ద్రా. ళ కారం అరకు పశ్చిమ, వాయవ్య ప్రాంతాలలో ఢ కారంగానూ, దక్షిణ ఆగ్నేయ ప్రాంతాలలో లకారంగానూ మారింది. ఉదా. ఆడు / ఆలు 'భార్య'. సొవ మాండలికంలో వర్ణవ్యత్యయం ఉంది. (మ్రాను 'చెట్టు' ప్డేల్ 'పేలు') అరకుమాండలికంలో లేదు (మరన్, పెడెల్). కృష్ణమూర్తి పరిశోధన వల్ల కాశిపట్నానికి తూర్పు ప్రాంతంలో భాషని ఒక ప్రధాన మాండలికంగానూ అనంతగిరి నుంచి కోరాపుట్ జిల్లాలో వాడే భాషని ఇంకొక ప్రధాన మాండలికంగానూ పరిగణించవచ్చునని తేలింది. వీరి అభిప్రాయంలో, కూబి జాతి వారి ప్రాచీన నివాసస్థలం అరకుకి ఈశాన్యంగా పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న 'సురకందెల్', 'మెటకందెల్' అనే ఊళ్ళ ప్రాంతం.

## పెంగొ :

పెంగొ జాతి వారిని 'జాని' అని కూడా అంటారు. వీరు ఒరిస్సాలో కోరాపుట్ జిల్లాలో నవరంగపూర్, దసమంతపూర్ తాలూకాలలోనూ, కళహంది

1 "Konda language (Grammar and Vocabulary)" *Bulletin of the Department of Anthropology* 2.1.17-48 (Jan. 1958, Published 1956).

జిల్లాలో ధువముల్‌రాంపూర్, కాశిపూర్ తాలూకాలలోనూ ఉన్నారు. వీరిలో చాలామంది తమ భాష మాట్లాడటం మానేసి, ఒరియా మాట్లాడుతున్నారు. పెంగొ భాష మాట్లాడే వారి సంఖ్య (1961 సెన్సస్ ప్రకారం) 1,254. ఈ జాతి వారిని గురించిన నివేదిక 1891 సెన్సస్‌లోనే ఉంది. కాని, ఈ భాషను గురించి అతి సమీపకాలం వరకూ ఎవరికీ తెలియదు. 1957, 1964 - 65 లలో శ్రీ టి. బరో, సుధీభూషణ్ భట్టాచార్య దీనిపై పరిశోధన చేసి, The Pengo Language (Oxford, 1970) అనే గ్రంథం ప్రచురించారు. వీరి పరిశోధన నవరంగపూర్ తాలూకాలోని భాష మీద జరిగింది. పెంగొలో మాండలిక భేదాలు ఎక్కువ లేవని వీరి అభిప్రాయం. పశ్చిమ ప్రాంతం పెంగొలో 'జ' (j), 'జ఼' (z) అనే రెండు భిన్న ధ్వను లున్నాయి. కాని, తూర్పు మాండలికంలో 'జ఼' (z), 'జ' (j) తో కలిసిపోయింది. కళహంది జిల్లా ధువముల్ రాంపూర్ ప్రాంతం పెంగొలో 'జ఼' (z) 'య' (y) గా మారింది.

## మండ :

మండ జాతి వారు ఒరిస్సాలో కళహంది జిల్లా ధువముల్‌రాంపూర్ తాలూకాలో ఉన్నారు. వీరిలో కొంతమంది నవరంగ్‌పూర్ తాలూకా సరిహద్దులో కూడా ఉన్నారు. వీరి భాష కూడా ద్రావిడ భాషే. దీనిని కనుగొన్న ఘనత శ్రీ బరో, భట్టాచార్యులకు దక్కింది. వీరు పెంగొపై పరిశోధన చేస్తూ ఉండగా మండ జాతి వారిని కలుసుకోవడం తటస్థించింది. మండ భాష మాటలు కొన్ని A Dravidian Etymological Dictionary, Supplement (1968) లో బరో, ఎమెనో ఇచ్చారు ఇటీవల దీనిమీద సమగ్ర పరిశోధన బి. రామకృష్ణా రెడ్డి చేశారు.

పెంగొ, మండలకు అతి సన్నిహిత సంబంధం ఉంది.

బరో, టి. 1976. A sketch of Manda grammar in comparison with Pengo. *Dravidian Linguistics* - V, PP. 39 - 56 (Annamalai University).

## కూయి :

కూయి భాష మాట్లాడే వారిని కోండులు, ఖోండులు లేక కంధులు అంటారు. వారు మాత్రం తమ జాతి వారిని 'కూఇంగ' ('ంగ' బహువచన ప్రత్యయం) అంటారు. వీరు ఒరిస్సాలో మహానదికీ, విశాఖపట్టణం జిల్లాకీ మధ్య ఉన్న పర్వత ప్రాంతాలలో ఉన్నారు. ఒరిస్సాలో దసపల్ల, ఔద్, ఖోండ్‌మల్స్, పుల్బాని, కళహంది జిల్లాలలోనూ, గంజాంలో గుంసూర్, ఉదయగిరి, చిన్న కిమెడి తాలూకాలలోనూ, విశాఖపట్టణం జిల్లా బిసంకటక్, గుణుపూర్ తాలూకాల లోనూ వీరు ఉన్నారు. వీరి సంఖ్య సుమారు అయిదు లక్షలు (5,10,907).

కూయిలో మాండలికాలు ఉన్నాయి గాని, వాటి మీద వివరాలు ఇంకా తెలియవు. పదాది స కారం, పశ్చిమ ప్రాంతంలో హ కారంగా మారుతుంది. ఉదా: సల్బ/హల్బ 'పోవు.' కూయిలో వర్ణవ్యత్యయం ఉంది. కాని, వర్ణ వ్యత్యయంలేని మాండలికం కూడా ఉంది. ఉదా: క్డుఅ - కుధ 'భార్య.' కొన్ని మాండలికాలలో ఉన్న ల కారం మరికొన్ని చోట్ల ద కారంగా మారింది. ఉదా: పాలు/పాడు 'పాలు', పలు/పడు 'పన్ను.' కోరాపుట్ జిల్లా ఈశాన్య ప్రాంతంలో 'కుట్టియా' అనే జాతివారు ఉన్నారు. వీరు బిసంకటక్, గుణపూర్, రాయిఘడ, చంద్రపూర్ తాలూకాలలో అడవులలో ఉన్నారు. వీరి ఆచార వ్యవ హారాలలో చాలా ప్రాచీన లక్షణాలు మిగిలివున్నాయి కాబట్టి మిగిలిన కంధులకి వీరికి చాలా భేదం ఉంది. వీరి భాష కూయి మాండలికమే అయినా అది పక్క నున్న కువి భాషని పోలి ఉంటుంది.

ప్రమాణ గ్రంథాలు :

బరో, టి., భట్టాచార్య, ఎస్., 1961, "Some notes on the Kui dialect as spoken by the Kuttia Kandhs of Northeast Koraput" *IIJ* 5.118-35.

విన్‌ఫీల్డ్, డబ్ల్యు. డబ్ల్యు. (Winfield, W. W.) 1928, *A grammar of the Kui language* (Calcutta).

——1929, *A vocabulary of the Kui Language (Kui — English)* (Calcutta).

## కువి :

కువి భాష కూయి భాషకి అతి సన్నిహితమైనది. ఈ భాష మాట్లాడే కంధ్ జాతివారు విశాఖపట్టణం ఏజన్సీ ప్రాంతాలలో (అరకు, సాలూరు ప్రాంతాలలో), జయపూర్, పాలకొండ ప్రాంతాలలో ఉన్నారు. వీరి సంఖ్య సుమారు రెండులక్షలు (1.68 027). కువిలో కంఠమూల స్పర్శం (Glottal stop) ప్రచురంగా ఉంది.

ప్రమాణ గ్రంథాలు :

బరో. టి., భట్టాచార్య, ఎస్. 1963, "Notes on Kuvi with a short vocabuary", *IIJ* 6: 231-289.

ఇజ్రాయెల్, ఎమ్. 1979. *A grammar of the Kuvi language* (Trivandrum).

ఫిట్‌జరాల్డ్, ఎ. జి. (Fitzgerald, A. G.), 1913, *Kuvinga Bassa The Khond language* as spoken by the Parjas of the Madras Presidency (Calcutta).

షుల్జ్, ఎఫ్. వి. పి. (Schulze, F.V.P.), 1911, *A grammar of the Kuvi language* (Madras).

——, 1913, *Vocabulary of Kuvi—Kond Language* (Madras).

## కోలామీ :

కోలాములు మహారాష్ట్రలో వార్ధా, యోట్మల్ జిల్లాలలోనూ మన రాష్ట్రంలో అదిలాబాద్ జిల్లాలోనూ ఉన్నారు. వీరి సంఖ్య సుమారు నలభై అరువేలు (46,065). వీరిలో అధిక సంఖ్యాకులు యోట్మల్ జిల్లాలో ఉన్నారు.

కోలాములు తమ భాషని కొలవగొట్టి' (గొట్టి < సం. గోష్ఠి) అనీ తమ జాతి వారిని 'కోలవార్' అనీ వ్యవహరిస్తారు. కోలాములు గోండులతో కలిసి నివసించడంవల్లా, గోండులు సంఖ్యాబలంవల్లా సాంఘిక స్థానంవల్లా వీరి కన్న ముఖ్యులు అవడంవల్లా కోలాములు అందరికీ గోండీ వస్తుంది. కాని గోండులకి కోలామీ తెలియదు. అదిలాబాద్‌లో కోలాములూ గోండులూ మరాఠీ, ఉర్దూ కూడా మాట్లాడతారు. మహారాష్ట్రలో కోలాములు మరాఠీ, గోండీకూడా మాట్లాడతారు. అదిలాబాద్‌లో తెలుగువచ్చిన కోలాములు చాలా కొద్దిమందే ఉన్నారు అయినా కోలామీలో తెలుగునించి ఎరువు తెచ్చుకొన్న మాటలు చాలా వున్నాయి. కాబట్టి మొట్టమొరట కోలాముల నివాసస్థానం ఆంధ్ర దేశంలోనే వుండేదని మనం ఊహించవచ్చు.

కోలామీలో మాండలిక భేదాలు ఉన్నాయి. వార్ధా మాండలికంమీద ఎం. బి. ఎమెనో పరిశోధన చేశారు. (*Kolami, a Dravidian Language* (Berkely, 1955; reprinted by Annamalai University, Annamalinagar, 1961). అదిలాబాద్ మాండలికం మీద పి. సేతుమాధవరావు ఒక చిన్న పుస్తకం ప్రచురించారు.) *A grammar of the Kolami Language* (Hyderabad, 1950). కాని యోట్మల్ అదిలాబాద్ మాండలికాల మీద ఇంకా సమగ్ర పరిశోధన జరగాలి.

కోలామీకి అదిలాబాద్-కిన్వట్ ప్రాంతంలో నాయక్డి అనే మాండలికం కూడా ఉంది. దీనిని డిఇడిలో నాయకీ అని తప్పుగా ఇచ్చారు. ఈ తప్పుని డి ఇడి ఎస్ లో సవరించారు. నాయక్డి మాండలికంలో ప్రాచీనమైన శకారంలో తాలవ్యాచ్చుల తరవాత నిలిచి వుంది కాని మిగిలిన మాండలికాలలో ఇది లకారంతో కలిసిపోయింది. ప్రస్తుత గ్రంథకర్త కూడా ఈ భాష అదిలాబాద్ మాండలికంమీదా, నాయక్డి మీదా పరిశోధన చేస్తున్నారు.

## నాయకి

మహారాష్ట్రలోని చాందాజిల్లాలో 'ముల్' అనే పట్టణ ప్రాంతంలో దద్వే గోండులు అనే జాతివారు వున్నారు. వీరిని నాయక్‌లు అనికూడా అంటారు.

ఈ జాతివారు తమని 'ఎర్కు' అని వ్యవహరిస్తారు. వీరిలో చాలామంది ఇప్పుడు మరాఠీయే మాట్లాడుతున్నా కొందరుమాత్రం వారి ప్రాచీన భాషని మాట్లాడుతున్నారు. దీని పేరు 'నాయకీ, దీనిని 1957 - 58 లో ప్రొఫెసర్ బరో, భట్టాచార్య తమ పర్యటనలో కనుగొన్నారు. తరవాత భట్టాచార్య మరికొంత పరిశోధన చేసి "Naiki of Chanda" *Indo-Iranian Journal* V (1967). 85 - 117 అనే వ్యాసం ప్రచురించారు.

నాయకీ కోలామీకి చాలా సన్నిహితమైన భాష.

## పర్జి

మధ్యప్రదేశ్ బస్తర్ జిల్లాలో జగదల్‌పూర్‌కి దక్షిణ ప్రాంతం నించి సుక్మ జమీందారీవరకూ ఉన్న ప్రాంతంలో (కంగేర్ అడవితోసహా) పర్జ అనే జాతివారు వున్నారు. వీరువున్న ప్రాంతం జయపూర్ సంస్థానానికి ప్రక్కనే వుంది. 'పర్జ' సంస్కృతం 'ప్రజా' నించి వచ్చింది. (ఒరిస్సాలో 'పోరొజ' (< సం. ప్రజా) అనే మాటని పెంగ్ పోరొజ, బొంద పోరొజ మొదలై అనేక భిన్న జాతుల వారికి ఉపయోగిస్తారు.) పర్జలు తమని 'దుర్వ' అని అంటారు. గోండులు వీరిని కాపులు అంటారు. (పర్జలు గోండుల్ని బోయిలు అంటారు). పర్జలలో చాలామందికి ముఖ్యవృత్తి వ్యవసాయం. అందువల్లనే గోండులు వీరిని 'కాపులు' అంటారు. పాత సెన్సస్‌ల ప్రకారం వీరి సంఖ్య సుమారు ఎనభై అయిదు వేలు (84, 607.)[1]

పర్జిభాష చాలాకాలం వరకూ గోండీ మాండలికంగా పరిగణించబడింది. లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా, వాల్యూమ్ IV (1906) లో అది గోండీ మాండలికంగానే ఇవ్వబడింది. బరో, భట్టాచార్య 1950 - 51 లో చేసిన

---

1. మధ్యప్రదేశ్ (బస్తర్) పర్జాల సంఖ్య 24,718. మిగిలిన అరవై వేల మందీ ఒరిస్సాలోవారు. కాబట్టి వారు పర్జీ మాట్లాడేవారు కాక కూయి, కువిలు మాట్లాడేవారు అయి ఉంటారు.

పర్యటనలో ఇది ప్రత్యేక భాష అనీ, గోండీ మాండలికం కాదు అనీ గుర్తిం చారు. వీరు దీనిమీద సమగ్ర పరిశోధన చేసి *The Parji Language (A Dravidian language of Bastar)* (*Hertford*, 1953) అనే గ్రంథం ప్రచురించారు.

పర్జీలో మూడు ముఖ్య మాండలికాలు ఉన్నాయి. అవి వాయవ్య మాండ లికం (బరో, భట్టాచార్య ముఖ్యంగా పరిశోధన చేసినది), ఈశాన్య మాండలికం. దక్షిణ మాండలికం, మూల ద్రావిడభాషలోని ఱ, ఱ్ఱ, న్ఱ అనే దంతమూలీయాలు (alveolars) ఈశాన్య మాండలికంలో మూర్ధన్యాలుగానూ (డ, ట, ండ), మిగిలిన రెండు మాండలికాలలోనూ దంత్యాలుగానూ (ద, త, ంద) మార తాయి. ఉదా. పుత్ర/పుట్ట <*పుఱ్ఱు 'పుట్ట', పెంద్/పెండ్ <*పన్ఱి 'పంది', దక్షిణ మాండలికంలో తెలుగులోంచి వచ్చిన మాటలు ఎక్కువగా ఉన్నాయి. దీనికి కారణం అది తెలుగుభాష సరిహద్దుకి దగ్గరలో ఉండడమే.

## గదబ

గదబ జాతివారు కోరాపుట్ జిల్లాలో జయపూర్ ప్రాంతంలోనూ శ్రీకాకుళం జిల్లా సాలూరు ప్రాంతంలోనూ ఉన్నారు. వీరిలో గుతోబ్ (మొడ్/ బోడా) గదబలు, ఒల్లార్ గదబలు, కొండేకోర్ గదబలు (వీరిని మొదట్లో కొందరు 'పోయ' అని తప్పుగా వ్యవహరించారు) అని మూడు శాఖలవార ఉన్నారు. గుతోబ్ గదబల భాష కొలారియన్ భాష. కోరాపుట్‌లో ఒల్లార్ గదబలూ, శ్రీకాకుళం జిల్లా సాలూరు ప్రాంతంలో కొండేకోర్, కాణేకోర్ గదబలూ మాట్లాడే భాష ద్రావిడభాష. ఈ రెండింటికీ బేధం చాలా తక్కువ గానే ఉంది. కాబట్టి ఇవి ఒక భాష మాండలికాలే. ఒల్లార్ గదబల భాషని మొట్టమొదట కనుగొన్నవారు భట్టాచార్య. ఆయన దీనిమీద *Ollari, a Dravidian speech* (Department of Anthropology, Government of India, Memoir No. 3. 1956; Published 1957) అనే గ్రంథం రాశారు. పేరి భాస్కరరావు *Konekor Gadaba* (1980, Pune: Deccan

College) అనే గ్రంథంలో సాలూరు ప్రాంతపు భాషకి వ్యాకరణం, కథలూ, నిఘంటువూ ఇచ్చారు. కొణేకోర్ గదబలకి 'ముంద్లి' అనే ప్రాచీనమైన పేరు కూడా ఉంది.

గదబ పర్జీకి అతిసన్నిహితమైన భాష. గదబల సంఖ్య 1951 సెన్సస్ ప్రకారం 54,454; 1961 సెన్సస్ ప్రకారం 40,194. ఈ రెండూ మొత్తం గదబల సంఖ్యలే కాబట్టి ఇందులో ఎందరు ద్రావిడభాష మాట్లాడే గదబలో తెలియదు (1931 సెన్సస్ ప్రకారం ఒల్లారీ గదబల సంఖ్య 800.)[1]

## కూడుఖ్ :

ఉత్తర ద్రావిడ భాషలలో కూడుఖ్ (Kurux) ముఖ్యమైన భాష. కూడుఖ్ జాతివారు ఛోటానాగపూర్‌లో వున్నారు. వీరిలో ఎక్కువమంది రాంచీ జిల్లాలో ఉన్నారు. పలమవ్, గంగపూర్, జష్‌పూర్ జిల్లాలలో కూడా వీరు అధిక సంఖ్యలో ఉన్నారు. అస్సాం తేయాకు తోటలలో కూడా చాలా మంది కూడుఖ్‌లు కూలీలుగా పనిచేస్తున్నారు. కూడుఖ్ జాతివారిని 'ఒడాయన్‌లు' అని కూడా అంటారు. వీరి సంఖ్య సుమారు పదమూడు లక్షలు.

కూడుఖ్‌లు ముండా (కొలేరియన్) జాతివారితో కలిసి ఉంటారు. వీరి ప్రాచీన గాథలు వీరు మొదట కర్ణాటక ప్రాంతంలో ఉండేవారనీ, అక్కడనించి నర్మదాతీరానికి వెళ్ళి, బీహార్‌లో సోనేనది ప్రాంతంలో స్థిరపడ్డారని చెప్తాయి. వీరిలో కొందరు గంగానదిని అనుసరించి వెళ్ళి రాజమహల్ కొండలలో స్థిరపడ్డారు. వారిని మాలెర్ అనీ, వారి భాషని మాల్తో అనీ అంటారు. కూడుఖ్‌కీ మాల్తోకి ఇప్పటికీ చాలా సన్నిహిత సంబంధం ఉండడంవల్ల ఈ గాథలో కొంత

1. 1961 సెన్సస్‌లో ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న గదబల సంఖ్య 8,401గా ఇవ్వబడింది కాబట్టి ఇది ద్రావిడ భాష మాట్లాడే కొండేకోర్ గదబల సంఖ్య కావచ్చు.

సత్యం ఉందనవచ్చు. కాని వీరు మొదట్లో కర్ణాటక ప్రాంతంలో ఉండేవారని నిరూపించడానికి ఏమీ ఆధారాలు లేవు.

సాహిత్యరహిత భాషలలో సంఖ్యాబలాన్నిబట్టి చూస్తే గోండి తరవాత ముఖ్యమైన భాష కూడుఖ్.

ప్రమాణగ్రంథాలు :

గ్రిగ్‌నార్డ్, ఎ. 1924, *An Oraon - English Dictionary* (Calcutta, Vienna)

,———1924, *A grammar of the Oraon language.* (Calcutta)

పెర్డినాండ్‌హాన్, (Hahn), 1900, *Kurukh grammar* (Calcutta).

——, 1903, *Kurukh (Orao)-Euglish Dictionary,* Part I. (Calcutta).

## మాల్తో

మాల్తో బీహార్‌లో సంతాల్ పరగణాలలో రాజమహల్ కొండలలో నివసించే మాలెర్ అనే జాతివారిభాష. మాలెర్‌మల (త. మలై 'కొండ') అనే పదానికి సంబంధించినది. కాబట్టి మాలెర్ అంటే 'కొండలలో ఉండేవాళ్లు' అని అర్థం చెప్పవచ్చు. మాలెర్ మాట్లాడే భాష మాల్తో. మాల్తో మలయాళ శబ్ద వ్యుత్పత్తులు ఒకటే. మాలేర్ జాతివారు సుమారు తొంభై వేల మంది ఉన్నారు. మహాపాత్ర, బి.పి. ఈ భాషపై ఇటీవల మంచి పరిశోధన చేసి 1979 లో వ్యాకరణం ప్రచురించారు.

కూడుఖ్‌ల పరంపరా కథనం ప్రకారం కూడుఖ్‌లూ మాల్తోలూ ఒకటే జాతివారనీ, వారు మొదట్లో సోనే నది ఒడ్డున ఉండేవారనీ, వారిలో కొందరు గంగానదిని అనుసరించి వచ్చి రాజమహల్ కొండలలో స్థిరపడ్డారనీ తెలుస్తుందని ఇంతకుముందే చెప్పేం. కూడుఖ్‌కీ, మాల్తోకీ అతి సన్నిహిత సంబంధం ఉండడం వల్ల ఈ గాథలో కొంత నిజం వుండవచ్చు.

మాల్తో మాట్లాడే ప్రాంతం బెంగాలీ, బీహారీ, సంతాలీ భాషల మధ్యలో ఉంది. మాలెర్ పూర్వకాలంలో తమ ప్రదేశాలకు వచ్చి కొల్లగొడుతూ వుండే వారు. పద్దెనిమిదో శతాబ్ది చివరి భాగంలో అగస్టస్ క్లీవ్‌లాండ్, భాగల్పూర్ కలక్టరు, రాజమహాల్ కొండల ప్రాంతం భూములు వారికి వ్యవసాయం చేసు కోమని ఇచ్చి, కొల్లగొట్టడం మానమని చెప్పేడు. కాని వారు వ్యవసాయం చేయక ఆ భూములు సంతాలులకి ఇచ్చివేశారు.

ప్రమాణ గ్రంథాలు :

ఎర్నెస్ట్ డ్రూసే (Ernest Droese) 1884, *Introduction to the Malto language* (Agra).

శిశిర్ కుమార్ దాస్, 1973, *Structur of Malto* (Annamalai nagar).

మహాపాత్ర, బి.పి. 1979, *Malto : An ethnosemantic Study*, Mysore : C IIL.

## బ్రాహుయీ

బ్రాహుయీ జాతివారు పాకిస్తాన్‌లో బలూచిస్తాన్ రాష్ట్రంలో వున్నారు. బలూచిస్థాన్‌లో ఖనతే ముఖ్యపట్టణమైన కాలత్ ప్రాంతంలో వీరు అధిక సంఖ్యలో ఉన్నారు. అఫ్ఘనిస్తాన్‌లో షొరావక్ దగ్గరకూడా బ్రాహుయీలు ఉన్నారు. వీరి సంఖ్య సుమారు రెండులక్షల డబ్భై అయిదువేలు.

బ్రాహుయీలది ఒకేజాతి కాదు. వీరిలో ఇరవై మూడు శాఖలు వున్నాయి. వీరిలో నిజమైన బ్రాహుయీలు అహమద్‌జై (కాలత్ ఖాన్ శాఖ), ఇల్తజై, మిర్వారీ, గుర్‌గార్నీ, సుమలారీ, కలంద్రరీ అనే ఆరు శాఖలకి చెందినవారేనని వారి నమ్మకం. ఈ శాఖలవారు అలెప్పొనించి వచ్చారని వారు నమ్ముతారు. మిగిలిన శాఖలలో కొంధను బలూచీలు, కొందరు అఫ్ఘన్‌లు. కొందరు పర్షియానించి వచ్చినవారు, కొందరు జట్‌లు, మహమ్మద్ షాహి, నిచారీ శాఖలవారు ప్రాచీన

కాలంనించీ అక్కడే ఉన్నవారు, ఈ అభిప్రాయం నిజమైనా కాకపోయినా బ్రాహుయీలలో భిన్నజాతులవారు ఉన్నారనే విషయాన్ని ఇది ధ్రువపరుస్తుంది. కాలత్‌ఖాన్ బ్రాహుయీ లందరికీ నాయకుడు. ఇప్పుడు బ్రాహుయీలు ముస్లిం మతస్థులు, సున్నీ శాఖకి చెందినవారు అయినా అనాదికాలం నుంచీ వచ్చిన ఆచారాలు, దెయ్యాలమీద నమ్మకం, రక్తబలి మొదలైనవి ఇప్పటికీ వారిలో ఉన్నాయి. కాబట్టి ఇటీవల కాలంలోనే వీరు ముస్లిం మతాన్ని స్వీకరించి ఉంటారు.

వీరి ముఖ్యవృత్తి మేకలనీ గొర్రెలనీ పెంచడం, కొన్ని చోట్ల గుర్రాలనీ ఆవులనీ కూడా పెంచుతారు. వీరిలో సరవాన్, ఝలవాన్ అనే రెండు ముఖ్య భాగాలు ఉన్నాయి. సరవాన్‌లు పర్వత ప్రదేశాలలోనూ, ఝలవాన్‌లు సమ ప్రదేశాలలోనూ ఉంటారు.

బ్రాహుయీలని గురించి 15-16 శతాబ్దాల నుంచి చారిత్రకాధారాలు ఉన్నాయి. ఆ కాలంలో బ్రాహుయీల ముఖ్య పట్టణమైన కాలత్‌ని మొగలులు జయించారు. కాని అనతికాలంలోనే బ్రాహుయీలు మళ్ళీ కాలత్‌ని గెలుచుకొన్నారు. మన పురాణాలలో 'బాహ్లిక' జాతిని గురించి ప్రస్తావన ఉంది. బ్రాహుయీలే బాహ్లికులనీ, ఖుడుఖ్‌లే కరూశ, కరూఖ జాతులనీ, మాల్తోలే మలదులనీ ప్రొఫెసర్ బరో అభిప్రాయం.

బ్రాహుయీలు ఉండే ప్రదేశాలలో చలీ ఎండా కూడా ఎక్కువ, కాబట్టి చలికాలంలో ఝలవాన్‌లు ములా కనుమగుండా సింద్‌కి వెళ్తారు; సరవాన్‌లు బోలన్ కనుమగుండా కచ్చికి వెళ్తారు.

బ్రాహుయీలలో అనేక జాతులు కలిసిపోవడంవల్ల వారి భాష మీద ఆ జాతుల భాషలైన బలూచి, పర్షియన్, సింధి, పంజాబీ భాషల ప్రభావం ఎక్కువగా ఉంది. కాని ఆ అన్య భాషా ప్రభావం అవసరమైన మాటలు ఎరువు తెచ్చుకోవడం వరకే పరిమితం - ప్రత్యయాలు మాత్రం ద్రావిడ భాషలకి

సంబంధించిన ప్రత్యయాలే. బ్రాహుయిలలో బహువచన ప్రత్యయం, సర్వ నామాలు, ఒకటి (అసిట్), రెండు (ఇరట్), మూడు (ముసిట్) అనే అంకెలూ, క్రియలలో నిర్మాణం అది ద్రావిడ భాషేనని స్పష్టంగా రుజువు చేస్తాయి. కాల్డ్వెల్ దీనికి ఇతర ద్రావిడ భాషలకీ ఉన్న సంబంధాన్ని గుర్తించినా దీనిని ద్రావిడ భాషగా అంగీకరించలేదు. కాని దీనిమీద అతి సమగ్ర పరిశోధన చేసిన సర్ డేనిస్ డె. ఎస్. బ్రే (Bray), ఐ. సి. ఎస్. *The Brahui Lauguage, Part I- Introduction and Grammar* (Calcutta, 1909). అనే గ్రంథంలో ఇది ద్రావిడ భాషేనని నిరూపించారు.

బ్రాహుయీకి దగ్గర భాషలు కూడుఖ్ మాల్తో లు. ఈ మూడూ ఉత్తర ద్రావిడోపకుటుంబంగా పరిగణించబడతాయి.

**ప్రమాణ గ్రంథాలు :**

బ్రే, డేనిస్, డె. ఎస్. ,1909, *The Brahui language*, Part I- *Introduction and Grammar* (Calcutta).

——, 1934, *The Brahui language*, Part II-The Brahui Problem: Part III- *Etymological vocabulary*, (Delhi).

ఎమెనో, ఎం. బి. 1962, *Brahui and Dravidian Comparative Grammar* (Berkeley).

# 1.3. ద్రావిడ భాషల ప్రత్యేక లక్షణాలు

ద్రావిడ భాషలలో చాలా వాటికి సమానంగా ఉన్న లక్షణాలు ఆ భాషలని మిగిలిన భాషలనించి వేరుచేస్తాయి. ద్రావిడభాషా తులనాత్మక వ్యాకరణ పితామహుడైన కాల్డ్వెల్ ద్రావిడ భాషలకీ సంస్కృతానికీ జన్యజనక సంబంధం లేదని నిరూపించడానికి వీటిని పేర్కొన్నారు. వాటిని ఈ కింద కొన్ని ఆవసరమైన మార్పులు చేర్పులతో ఇస్తున్నాం: (చూ. నా. "The Charac-

teristic Features of the Draivdian Languages." *Papers and Talks*. (Presented and delivered at the Summer School of linguistics), Central Institute of Indian Languages, Mysore, ed. H.S. Biligiri, 1970, 103-05.)

1. ద్రావిడభాషల వర్ణ నిర్మాణంలో చాలా ప్రత్యేకతలు ఉన్నాయి. హ్రస్వ 'ఎ' కార 'ఒ' కారాలు ద్రావిడభాష లన్నిటిలోనూ ఉన్నాయి. సంస్కృతంలోనూ ఇప్పటి ఆర్యభాషల దేశ్య పదాలలోనూ అవి లేవు. ద్రావిడ భాషలలో మూర్ధన్యాక్షరాలైన ట, ణ, ళ, ఴ ఉన్నాయి. మూర్ధన్యాక్షరాలు మన దేశంలో ఉన్న ఆర్యభాషలలో తప్ప మిగిలిన ఇండో యూరపియన్ భాష లలో లేవు. ఆర్య భాషలలో ఇవి ఉండడం ద్రావిడభాషా ప్రభావమే అని పండితుల నమ్మకం. మూలద్రావిడభాషలో *క, *చ, *ట, *త, *ప, *ఱ/*త్త అని ఆరు స్పర్శాలు ఉన్నాయి (ఱ కారం కూడా మొదట్లో స్పర్శమే). వీటిలో *ఱ కారం ద్రావిడ భాషలలోనే ఉంది. ఇది మలయాళం, కోత (ద్విరుక్తంగానూ, అనునాసికం తరువాతా), తొద, కొండలలో ఇప్పటికీ మిగిలి ఉంది. ఇతర భాషలు చాలావాటిలో ఇది రేఫతో కలిసిపోయింది; ద్విరుక్త రూపంలోనూ, అనునాసికం తరువాతా ఇది కొన్ని భాషలలో దంత్య స్పర్శంతోనూ, మరికొన్నింటిలో మూర్ధన్య స్పర్శంతోనూ కలిసిపోయింది. తుళు, పెంగొ - మండ - కూయి - కువిలలో ఇది తాలవ్య చకారంతో కలిసి పోయింది.

2. ద్రావిడ భాషలలో లింగభేదం సహజలింగభేదానికి దగ్గరలో ఉంటుంది. అంటే సంస్కృతంలో 'కళత్రం' (స్త్రీని సూచించే పదమైనా నపుంసకం) 'లతా' (జడపదార్థాన్ని సూచించేదైనా స్త్రీలింగం), 'వృక్షః' (జడపదార్థాన్ని సూచించేదైనా పుంలింగం) మొదలైన మాటలలో సహజలింగానికీ వ్యాకరణ లింగానికీ భేదమున్నట్లు ద్రావిడ భాషలలో ఉండదు. ఇండో యూరపియన్ భాషలలో సంస్కృతంలోకి మల్లేనే సహజలింగానికీ వ్యాకరణ లింగానికీ చాలా భేదం ఉంటుంది.

ద్రావిడ భాషలలో లింగభేదాల్ని నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు. తొద, బ్రాహుయీలలో లింగభేదం లేదు.

మొదటి రకం : (తొద తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలు)

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| పుంలింగం | స్త్రీ - లింగం |
| స్త్రీ లింగం | |
| నపుంసకం | నపుంసకం |

రెండో రకం : (తెలుగు, కూడుఖ్ – మాల్తో; కూడుఖ్– మాల్తోలలో నపుంసక బహువచనం లేదు).

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| పుంలింగం | స్త్రీ - పుంలింగం |
| స్త్రీ - నపుంసకలింగం | నపుంసకం |

మూడోరకం : (తెలుగు, పెంగో – మంద తప్ప మిగిలిన మధ్య ద్రావిడ భాషలు.)

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| పుంలింగం | పుంలింగం |
| స్త్రీ - నపుంసకలింగం | స్త్రీ - నపుంసకలింగం |

నాలుగోరకం : (పెంగో – మందలలో)

| ఏకవచనం | బహువచనం |
|---|---|
| పుంలింగం | పుంలింగం |
| స్త్రీలింగం | స్త్రీలింగం |
| నపుంసకం | నపుంసకం |

ఈ నాలుగింటిలో రెండో రకమే మూలద్రావిడ భాషకి చెందినదని చాలా మంది పండితుల అభిప్రాయం (చూ. 3.2).

3. ద్రావిడ భాషలలో నామవాచకాలలో ప్రత్యయాలు ఈ కింద వరసలో ఉంటాయి :

నామం + (బహువచన ప్రత్యయం) + (ఔపవిభక్తిక ప్రత్యయం)

+ { విభక్తిప్రత్యయం / విభక్త్యనుబంధం (Postposition) }

ఔపవిభక్తిక ప్రత్యయమూ, కొన్ని ప్రత్యేక పదాలని విభక్త్యర్థాలలో విభక్త్యనుబంధాలుగా వాడడం ద్రావిడభాషల ప్రత్యేక లక్షణాలు, సంస్కృతం, లాటిన్, గ్రీకు మొదలైన ప్రాచీనకాలపు ఇండోయూరపియన్ భాషలలో విభక్తి ప్రత్యయాలు భిన్న వచనాలలో భిన్నంగా ఉంటాయి. ఉదా. సం. దేవేన (లా, deo) 'దేవుడిచేత,' దేవాభ్యాం 'ఇద్దరు దేవుళ్ల చేత,' దేవేభిః / దేవైః, (లా. a deis) 'దేవుళ్లచేత', దేవే 'దేవుడిలో' దేవయోః 'ఇద్దరు దేవుళ్లలో' దేవేషు 'దేవుళ్లలో', (లా. దొమి 'ఇంట్లో', దొమిస్ 'ఇళ్లలో', ద్రావిడభాషలకి ఇండోయూరపియన్ భాషలకీ ఇది ఒక ముఖ్య భేదం. (ఇప్పటి ఆర్యభాషలలో నిర్మాణం ద్రావిడభాషల నిర్మాణానికి దగ్గరగా ఉంటుంది.)

4. దక్షిణ ద్రావిడభాషలలోనూ ఉత్తర ద్రావిడభాషలలోనూ అమనుష్య బహువచన ప్రత్యయం వైభాషికమైనది: ఉదా. త. ఇరంటు మరం, మ. రండు మరం, క. ఎరడు మర 'రెండు చెట్లు'; వీటిలో బహువచన ప్రత్యయమైన 'కళ్' చేర్చ నక్కరలేదు. ఇదే విధంగా బ్రాహుయిలో కూడా ఇరా మార్ / మాక్ 'ఇద్దరు కొడుకులు' అని బహువచనప్రత్యయమైన క కారం చేర్చీ, చేర్చకుండా కూడా చెప్పవచ్చు. మూల ద్రావిడ భాషలో కూడా అమనుష్య బహువచనప్రత్యయం వైభాషిక మైనదే. కాని మధ్య ద్రావిడభాషలలో ఇది నిత్యమైనదిగా మారింది.

5. ద్రావిడభాషలలో విశేషణాలలో లింగభేదం ఉండదు. వీటికి స్వతంత్ర ప్రతిపత్తి లేక వీటి తరవాత నామపదాన్ని అపేక్షిస్తూ ఉంటాయి. ఉదా. త. నల్ల పైయన్ / పెణ్ / మరం. తె. మంచి అబ్బాయి / పిల్ల / చెట్టు. ఇండోయూరపియన్ భాషలలో విశేషణాలు వాటికి సంబంధించిన నామపదాల లింగవచన విభక్తులలో ఉండి, వాక్యంలో స్వతంత్రంగా ఉంటాయి. ఉదా. సం. సుందరః పురుషః, సుందరీనారీ, సుందరం వనం.

6. చాలా ద్రావిడభాషలలో రెండు ఉత్తమపురుష బహువచన సర్వనామాలు ఉన్నాయి. ఒకటి మధ్యమపురుష సర్వనామాన్ని కలుపుకోనిదీ

(Exclusive) 'మేము', రెండోది మధ్యమపురుష సర్వనామాన్ని కలుపుకొనేదీ (inclusive) 'మనము', 'మేము' < మూ. ద్రా. * యాం. మనము < మూ. ద్రా. * నాం. (చూ. 3. 4) ఇటువంటి భేదం ఇండోయూరపియన్ భాషలలో లేదు. (ద్రావిడ భాషలకి ఇరుగుపొరుగు భాషలైన మరాఠీ, గుజరాతీ వంటి కొన్ని ఆర్య భాషలలో ద్రావిడభాషా ప్రభావం వల్ల ఆర్వాచీన కాలంలో ఇటు వంటి భేదం ఏర్పడింది.)

7. ద్రావిడభాషా కుటుంబంలో క్రియాజన్య విశేషణాలు ప్రముఖ పాత్రని వహిస్తాయి. వీటి నిర్మాణం ఈ కింద ఇచ్చినట్లుగా ఉంటుంది:

ధాతువు (ప్రేరణార్థకం) + కాలప్రత్యయం / వ్యతిరేక ప్రత్యయం + విశేషణప్రత్యయం (*అ / *ఇ), వీటిలో మూడు రకాలు ఉన్నాయి : భూత కాలికం ('చేసిన'), అభూత కాలికం ('చేసెడి, చేసే'), వ్యతిరేకం ('చేయని'), ఇటువంటివి ఇండోయూరపియన్ భాషలలో లేవు కాబట్టి ఈ రెండు భాషా కుటుంబాలకీ ఇది ఒక ముఖ్య భేదం.

8. ద్రావిడభాషలలో అసమాపక క్రియల ప్రయోగం సర్వసాధారణం. అసమాపక క్రియలలో ధాతువు తరవాత కాలప్రత్యయం (భూతం, అభూతం) గాని వ్యతిరేక ప్రత్యయంగాని ఉంటుంది (చేసి, చేయుచున్/చేస్తూ, చేయక). ఒక వాక్యంలో ఎన్ని అసమాపక క్రియలైనా ఉండవచ్చు. ఆర్య భాషలలో అసమాపక క్రియల ప్రాచుర్యం ద్రావిడభాషా సాహచర్య ఫలితం అని పండితుల సిద్ధాంతం.

9. ద్రావిడభాషలలో కూడుఖ్ - మాల్తోలు తప్ప మిగిలిన అన్నింటి లోనూ వ్యతిరేక క్రియారూపాలు ఉన్నాయి (కూడుఖ్-మాల్తోలలో ఈ నిర్మాణం నశించింది.) వ్యతిరేక క్రియలు ద్రావిడ భాషల ముఖ్య లక్షణం. వీటి నిర్మాణం ఈ కింద ఇచ్చిన విధంగా ఉంటుంది:

ధాతువు + (ప్రేరణార్థకం) + వ్యతిరేక ప్రత్యయం + పురుష ప్రత్యయం, ఉదా. త. చెయ్య్-φ-ఏన్, క. గెయ్-φ-ఎం,తె. చేయ్-అ-ను, గోం. కియ్య్-ఓ-న్, కోలా. కక్క్-ఏ-న్.

ద్రావిడ భాషలలో వ్యతిరేకక్రియావిశేషణం (చేయక), వ్యతిరేక క్రియా జన్య విశేషణం (చేయని), వ్యతిరేక క్రియానామం (చేయమి) కూడా ఉన్నాయని గమనించాలి.

ఇండో యూరపియన్ భాషలలో వ్యతిరేకతని సూచించడానికి వాక్యంలో ప్రత్యేక పదాన్ని వాడాలి; సం. న కరోమి 'చేయను.'

తెలుగు, గోండీ తప్ప మిగిలిన మధ్య ద్రావిడభాష లన్నింటిలోనూ భూతవ్యతిరేక క్రియలు కూడా ఉండడం విశేషం. వీటిలో భూతకాల ప్రత్యయం వ్యతిరేక ప్రత్యయానికి తరువాత వస్తుంది. ఉదా. కోలా. సీ-ఏ-త్-ఆన్ 'నేను ఇవ్వలేదు.'

కొండ. కి-?-ఎత్-అ 'నేను చెయ్యలేదు', పెం. హుడ్-ప-త్-అఙ్ 'నేను చూడలేదు'.

10. ఇండో యూరపియన్ భాషలలో ప్రచురంగా ఉన్న కర్మణి ప్రయోగం (Passive Voice), సంబంధ సర్వనామాలు (Relative Pronouns) ద్రావిడ భాషలలో లేవు. సాహిత్యవంతమైన ద్రావిడ భాషలు నాలుగింటిలోనూ 'పడు' (మ. పెడు) ధాతువు కర్మణి ప్రయోగానుబంధంగా వాడబడుతోంది. ఉదా. త. చొల్లప్పటు కిఱతు, మ. పఱయప్పెటున్ను, ప్రాచీన క. పేళల్ పడువుదు, తె. చెప్పబడుతోంది. (ఆధునిక కన్నడంలో ఇటువంటి ప్రయోగం లేదు.) ఇటువంటి ప్రయోగం ఈ భాషలలో సంస్కృతభాషా ప్రభావం వల్లనే వచ్చింది. వ్యవహారంలో ఇది ఏ భాషలోనూ లేకపోవడమూ, లిఖిత భాషలో కూడా దీనిని అవసరమైన చోట్లనే వాడడమూ ఇది ఈ భాషలలో స్థిరపడలేదని సూచిస్తాయి.

ద్రావిడ భాషలలో క్రియాజన్య విశేషణాలు ఉండడం వల్ల సంబంధ సర్వ నామాల ప్రయోజనం లేదు. సం. 'యశ్చకార సః'—తె. చేసినవాడు, త.మ. చెయ్‌తవన్, క. మాడిదవను. ప్రశ్నార్థక సర్వనామాలని సంబంధ సర్వనామా లుగా సాహిత్యంలో వాడడం సంస్కృతభాషా ప్రభావం వల్లనే అని చెప్పాలి ఉదా. "ఎవ్వనిచే జనించు జగము ......వానిన్........శరణంబు వేఁడెదన్."

# 1.4. ఆర్యభాషలమీద ద్రావిడ భాషల ప్రభావం

రెండుకాని అంతకన్న ఎక్కువ భాషలుగాని ఒకే ప్రదేశంలో వ్యవహా రంలో ఉన్నప్పుడు ఆ భాషలు ఒకదానివల్ల ఒకటి ప్రభావితం అవుతాయనే విషయం సర్వసామాన్యం. ఇటువంటి ప్రభావం ఆ భాషలు భిన్న భాషాకుటుం బాలకి చెందినవైనా సరే కనపడుతూ ఉంటుంది. భిన్న భాషా కుటుంబాలకి చెంది, ఒకే ప్రదేశంలో ఉండి, అన్యోన్య ప్రభావానికి లోనైన భాషలు ఉన్న ప్రదేశాన్ని జర్మన్ భాషలో 'Sprachbund' అనీ ఇంగ్లీషులో 'Linguistic Area' అనీ అంటారు. తెలుగులో దీనిని 'బహుభాషాప్రదేశం' అనవచ్చు. మన దేశంలో ఆర్యభాషలు, ముండా (కొలేరియన్) భాషలు, ద్రావిడ భాషలు - ఈ మూడు భాషాకుటుంబాలు ఉన్నాయి కాబట్టీ ఈ భాషలలో అన్యోన్య ప్రభావం కనపడుతోంది కాబట్టీ మన దేశాన్ని 'బహుభాషాప్రదేశం' (Linguistic Area) అనవచ్చు. చూ. ఎం. బి. ఎమెనో "India as a Linguistic Area," Language 32 (1956) : 3 - 16).

ద్రావిడ భాషలమీద సంస్కృత భాషా ప్రభావం అందరికీ తెలిసినదే. ద్రావిడభాష లన్నిటిలోనూ వేలకొలద్దీ సంస్కృత పదాలు వచ్చి చేరాయి. సాహిత్యవంతమైన భాషలలో కర్మణి ప్రయోగం సంస్కృత ప్రభావంవల్లనే ఏర్పడిందని ఇంతకుముందు చూశాం. మలయాళంలో 'వాడు మంచివాడు' అన డానికి 'అవన్ నల్లవన్ ఆణు' (వాడు మంచివాడు (ఉన్నాడు) ) అంటారు.

ఇందులో 'అణు' అనే సంయోజక క్రియ (Copula verb) ఉంది. కాని తెలుగులోనూ తమిళంలోనూ కన్నడంలోనూ ఇటువంటి వాక్యంలో క్రియ ఉండదు. సంయోజక క్రియ లేకపోవడమే ద్రావిడభాషలకి సహజం. మలయాళంలో దీని ప్రయోగం సంస్కృతభాషా ప్రభావ ఫలితమేనని చెప్పాలి. ఇదే విధంగా ద్రావిడ భాషలలో యత్తదర్థక సర్వనామ ప్రయోగం ('చేసిన వారు' అనడానికి బదులు 'ఎవరు చేశారో వారు' అనడం) కూడా సంస్కృత ప్రభావం వల్లనే ఏర్పడింది.

ద్రావిడ భాషలమీద సంస్కృత భాషా ప్రభావం ఉన్నట్లే సంస్కృత భాషమీదా దాని నించి పుట్టిన ఆ ఆధునికార్యభాషలమీదా ద్రావిడభాషా ప్రభావం ఉంది. ఈ ద్రావిడభాషా ప్రభావం రెండు విధాలుగా ఉంది. ఒకటి ఆర్య భాషా నిర్మాణం మీదా, రెండోది నిఘంటువు మీదా. ఆర్యులు మన దేశంలోకి ప్రవేశించే టప్పటికే మన దేశంలో వారు గొప్ప నాగరకతతో పాడిపంటలతో ఉండేవారు. ఆ కాలానికే వారికి రాయడం కూడా చేతనవునని హరప్పా - మొహెంజొదారోలలో దొరికిన ఆధారాలవల్ల తెలుస్తుంది. కాని, హరప్పా - మొహెంజొదారోలలో దొరికిన శాసనాలలో ఉన్నలిపి ఇంతవరకూ ఎవరూ సరిగా చదవలేదు గనక ఆ భాష ద్రావిడ భాష అని ఇదమిత్థంగా నిర్ణయించలేము.[1] ఆర్యులు

1. ఇది ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషేనని నిరూపించడానికి ప్రయత్నించినవారిలో ప్రథముడు ఫాదర్ హీరాస్. ఈ శాసనాలు సుమారు 2000 దొరికాయి. హరప్పా సంస్కృతికాలం క్రీ. పూ. 2500 - 1800. వీటిలో లిపి ఒక పదం సూచించే పదార్థం రూపానికి సన్నిహితంగా ఉంటుంది. వీటిలో గుర్తులు సుమారు మూడు వందలే ఉన్నాయి. ఇటీవల కాలంలో స్కాండినేవియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ [కోపెన్ హేగన్]కి చెందిన ఆస్కో పర్పోలా, సెప్పొ కొస్కెనిమి, సిమొ పర్పోలా, పెంటి ఆల్టో, *Decipherment of the Proto - Dravidian Inscriptions of the Indus Civilization* (1969) లో ఈ భాష ద్రావిడభాష అని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది ద్రావిడభాష కావడానికి అవకాశముంది. కాని ఆ లిపి చదవడానికి పైన చెప్పబడిన పండితులు చేసిన ప్రయత్నాలు ఇంత వరకూ ఫలించ లేదనే చెప్పాలి.

మన దేశంలో ప్రవేశించక పూర్వం ద్రావిడులే మన దేశంలో ఉన్నత నాగర కతలో ఉండేవారని ప్రాచీన తమిళ సాహిత్యం వల్ల తెలుస్తుంది. కాబట్టి సింధు నది ప్రాంతంలో ప్రాచీన నాగరికత ద్రావిడులదే కావచ్చు. ఆ కాలంలో ద్రావిడులు మన దేశం ఉత్తర భాగంలో కూడా (ఇప్పటి పాకిస్తాన్‌తో సహా) ఉండే వారనడానికి ఇప్పటికీ ఆ ప్రాంతాలలో మిగిలిన ఉన్న బ్రాహుయీ, కూడుఖ్ - మాల్తో భాషలు ప్రత్యక్ష సాక్ష్యాలు. అదీ కాక, ఆర్యుల ప్రాచీన గ్రంథమైన ఋగ్వేదంలోనే కొన్ని ద్రావిడభాషా పదాలు కనపడుతున్నాయి. కాబట్టి ఆర్యులు భారతోపఖండంలోకి ప్రవేశించగానే వారు ద్రావిడులని కలుసుకున్నారని మనం నిర్ణయించవచ్చు. ఆర్యులు అనార్యజాతులతో యుద్ధాలు చేసి, వారి ప్రాంతాలు ఆక్రమించుకొన్నట్టు వేదాలలోనూ పురాణాలలోనూ అనేక గాథలు ఉన్నాయి. ఆర్యులు విదేశం నించి రావడం వల్ల వారి సంఖ్య తక్కువ, ద్రావిడుల సంఖ్య ఎక్కువ. కాబట్టి ఆర్యులకి ద్రావిడులతో సంపర్కం అనివార్యం. దీనివల్ల కొన్ని ద్రావిడ జాతుల వారు ఆర్యులలో కలిసిపోయి ఉంటారు. ఈ కలియడం ఫలితంగా ద్రావిడులు ఆర్య భాష యైన సంస్కృతాన్నీ, తమ భాషనీ భిన్న సందర్భాలలో వాడి ఉంటారు. దీనివల్లనే సంస్కృతం మీద ద్రావిడ భాషా ప్రభావం ఏర్పడింది. సంస్కృతం మీద కొలారియన్ భాషల ప్రభావం కొన్ని పదాలకి మట్టుకే పరిమితం.

సంస్కృత భాషా నిర్మాణం మీద ద్రావిడ భాషల ప్రభావం ఈ కింద విషయాలలో కనపడుతోంది:

1. సంస్కృతంలో మూర్ధన్యాక్షరాలైన ట, ఢ, ణ ఉన్నాయి. కాని, మిగిలిన ఏ ఇండోయూరోపియన్ భాషలలోనూ ఇవి లేవు. అందువల్ల, సంస్కృతంలో ఇవి ఉండడానికి కారణం, ద్రావిడ భాషా ప్రభావం అయి ఉంటుంది. సంస్కృతంలో ఇవి ద్రావిడ భాషలలో నుంచి వెళ్ళిన కుటిల, మణి, కఠిన మొదలైన పదాలలోనే కాక, ఇండో యూరపియన్ పదాలలో కూడా ఉన్నాయి. ఉదాహరణకి, నీడ 'గూడు' (<*nizdo; Lat. niidus, Engl. nest),

మీఢ 'బహుమతి' (<Av. *mizda* Goth. *mizdoo*), మృడీక 'దయ' (Av. *mṛrṛzdiika*), ఊఢ 'మోయబడిన' (వహ్ - ధాతువునించి వచ్చినది; <*uzu* + *ta*) అనే పదాలు తీసుకోవచ్చు. వీటిలో మూర్ధన్యాలు ఒక ఊష్మం, దాని తరవాత దంత్యం కలిసి ఒకే వర్ణంగా మారడంవల్ల ఏర్పడ్డాయి. ఇటువంటి చోట్ల దంత్యం మూర్ధన్యంగా మారడం ద్రావిడ భాషా ప్రభావ ఫలితమే. న కారం ర, ష ల తరవాత ణ కారంగా మారడం (ఈ రెండిటి మధ్యా కొన్ని వర్ణాలు ఉన్నప్పటికీ) సంస్కృత వ్యాకరణంలోనే ఉంది. (రషాభ్యాం నో ణ స్సమానపదే, అష్టాధ్యాయి 8. 4. 1, ఆస్తీర్ణం, పుష్ణాతి. అట్ కుప్వాఙ్‌నుమ్ వ్యవాయేఽపి 8, 4, 2, కరణమ్, గిరిణా, అర్కేణ, గర్భేణ).[1] ఇది కూడా మూర్ధన్యాలు సంస్కృత భాషలో తరవాత కాలంలో వచ్చినవనే వాదాన్ని సమర్థిస్తుంది. కొన్ని సంస్కృతం మాటలలో అన్యవర్ణ ప్రభావం లేకుండానే ప్రాచీన దంత్యవర్ణాలు మూర్ధన్యాలుగా మారిపోయాయి. ఉదా: స్థూణా 'స్తంభం' (Av. *stuunaa*), అట్-'తిరుగు' (వైదిక రూపం అత్-, 'అతిథి'లో ఉన్నది), బాణ, వీణా, పండా, పండిత (పర్షియన్ పంద్ - 'సలహా'). ఇటువంటి చోట్ల కూడా మనం ద్రావిడ భాషాప్రభావాన్ని కారణంగా ఊహించవచ్చు.

2. సంస్కృతంలో 'త్వా' ప్రత్యయంతో ఏర్పడే అసమాపక క్రియ ఉంది. గ-త్వా 'వెళ్ళి', కృ-త్వా 'చేసి' (వైదిక భాషలో దీనికి 'త్వాయ', 'త్వీ' అనే రూప భేదాలు కూడా ఉన్నాయి), ఉపసర్గ ఉన్నప్పుడు దీనికి 'య' (వైదిక భాషలో 'యా' కూడా) అనే ఆదేశం ఉంది: ప్రహృత్య 'కొట్టి', ఈ ప్రత్యయాలు ఇండో యూరపియన్ నించి వచ్చినవే అయినా ఈ క్రియాపదం ద్రావిడభాషలలో క్త్వార్థకాలకిమల్లేనే పూర్వకాలిక క్రియని సూచించడానికి

---

1. ఈ సూత్రాలకి అర్థం : ఒకేపదంలో ర, ష లలో ఒకదాని తరవాత వచ్చే న కారం ణ గా మారుతుంది; ర, ష లకీ, న కీ మధ్య అచ్చూ, హ, య, వ, క వర్గ, ప వర్గ, ఆఙ్ అనే ఉపసర్గ, నుమ్ అనే ఆగమం (అనుస్వార రూపంలో) ఉన్నాకూడా న ణ గా మారుతుంది.

ఉపయోగిస్తుంది. అంటే, సంస్కృతంలో కూడా, ద్రావిడభాషలలోకిమల్లేనే ఈ క్రియారూపాన్ని ఒక వాక్యంలో ఎన్నిసార్లైనా వాడవచ్చు. ఉదా: 'వాడు వచ్చి, నీళ్ళు పోసుకుని, అన్నం తిని, కూచుని....వెళ్ళాడు.' ఇటువంటి అసమాపక క్రియా ప్రయోగం, మిగిలిన ఇండోయూరోపియన్ భాషలలో (ఇరానియన్‌తో సహా) లేదు. కాబట్టి సంస్కృతంలో ఇది ద్రావిడ భాషా ప్రభావంవల్ల ఏర్పడి ఉండవచ్చు.

3. సంస్కృతంలో ఇతి శబ్దం ఒక విషయాన్ని యథాతథంగా చెప్పేటప్పుడు ఆ విషయాన్ని సూచించే వాక్యం (Quotation) తరవాత వస్తుంది. ద్రావిడ భాషలలో తె. అని, త. ఎన్ఱు, క, ఎందు, గోం. ఇంజి అనే పదాలు సంవాదాంశం (Quotation) తరవాతనే వస్తాయి. మిగిలిన ఇండోయూరోపియన్ భాషలలో సంవాదక పదం సంవాదాంశానికి ముందు వస్తుంది: ఇంగ్లీషు 'He said *that*.....'

4. ఆర్యభాషలలోనూ ద్రావిడ భాషలలోనూ ధ్వన్యనుకరణ శబ్దాలు (పటపట, కరకర), అనుకరణ శబ్దాలూ (ఇల్లూ గిల్లూ) ఎక్కువగా ఉన్నాయి. ఇటువంటివి మిగిలిన ఇండో యూరపియన్ భాషలలో లేవు. సంస్కృతంలో కటకటాపయతి (పళ్ళు కొరకడానికి అనుకరణ), కిలకిలాయతే (నవ్వుకి అనుకరణ) మొదలైన ధ్వన్యనుకరణ పదాలు ఉన్నాయి. ఇప్పటి ఆర్య భాషలలో కూడా ఇటువంటివి ఉన్నాయి, ఉదా. హిందీ ఘడ్‌ఘడానా 'ఉరుము', మరాఠీ గద్‌గద్‌ణే 'దొల్లు', హిందీ సర్‌సరానా 'చరచరా పాకు', మరాఠీ సర్‌సర్ మొ. 'బుద్బుదం' (బుడగ) అనే పదం వైదిక భాషలోనే ఉంది.

5. సంస్కృతంలోనూ దానినించి వచ్చిన భాషలలోనూ ప్రేరణ క్రియలు మిగిలిన ఇండోయూరపియన్ భాషలలో కన్న చాలా ప్రచురంగా ఉన్నాయి: సం. హారయతి 'మోయిస్తున్నాడు', కారయతి 'చేయిస్తున్నాడు.' ద్రావిడభాషలలో అన్నిటిలోనూ ప్రేరణ క్రియలు ఉన్నాయి. కాబట్టి ఇందులో కూడా సంస్కృతం మీద ద్రావిడ భాషాప్రభావం ఉండవచ్చు.

6. సంస్కృతంనించి పుట్టిన ఆర్యభాషలలో నామాలలో బహువచన ప్రత్యయం చేరిన తరవాత విభక్తి ప్రత్యయాలు చేరతాయి. ఈ నిర్మాణం ద్రావిడభాషా నిర్మాణానికి సన్నిహితం.

7. అధునాతనార్యభాషలలో క్రియానిర్మాణానికీ ద్రావిడ భాషలలో క్రియా నిర్మాణానికీ సాన్నిహిత్యం ఉంది. మరాఠీ, కొంకణీ, నేపాలీలలో ద్రావిడభాషలలోకి మల్లే వ్యతిరేకక్రియలు ఉండడం ఆశ్చర్యకరమైన విషయం.

8. మరాఠీలోనూ తెలుగులోనూ దంత్య చ, జలు ఉన్నాయి. (ఇవి దక్షిణ ఒడియాలోనూ, ఉత్తర కన్నడంలోనూ, కొలారియన్ భాష అయిన కుర్కులోనూ కూడా ఉన్నాయి.) ఇది ఈ భాషలలో స్వతంత్ర పరిణామమా? (కాశ్మీరీలోకూడా ఇవి ఉన్నాయి.) లేకపోతే తెలుగులోనించి మరాఠీకి వెళ్ళిందా లేక మరాఠీ నించి తెలుగులోకి వచ్చిందా? అనే విషయం ఇంకా తేలలేదు.

సంస్కృత భాషలో అతిప్రాచీన కాలంనించీ ద్రావిడ భాషలనించి వచ్చిన పదాలు కనపడుతున్నాయని పందొమ్మిదో శతాబ్దిలోనే కాల్డ్‌వెల్, గుండెర్ట్, కిట్టెల్ మొదలైన పండితులు గుర్తించారు. వారి పరిశోధనని ఇటీవలి కాలంలో జూల్‌బ్లాక్, బరో, ఎమెనో కొనసాగించారు. ఇటువంటి పదాలు సుమారు 750 ఉంటాయని పండితుల అంచనా, ఋగ్వేదంలోనే ఉలూఖల. కటుక, కుండ. ఖల, దండ, పిండ, బల, బిల, మయూర అనే ద్రావిడభాషల నించి వచ్చిన పదాలు ఉన్నాయి. తరవాత భాషలో ఇటువంటి పదాల సంఖ్య ఎక్కువ అయింది.[1] కొన్ని పదాలు ఉదాహరణకి ఈ కింద ఇస్తున్నాం: (వీటిలో

1. కొలారియన్ భాషలనించి కూడా కొన్ని పదాలు సంస్కృతంలోకి వచ్చాయి. ఉదా. అలాబు 'సొర/ఆనపకాయ', కదలీ 'అరటి', కర్పాస 'పత్తి', జంబాల 'బురద', తాంబూల 'తమలపాకు', మరిచ 'మిరియం', లాంగల 'నాగలి', సర్షప 'ఆవ'. కాని ఈ అంశంమీద ఇంకా పరిశోధన జరగాలి.

కొన్ని ముఖ్య ద్రావిడ భాషలలో పదాలే ఇస్తున్నాం. పూర్తి వివరాలకి DED చూడవచ్చు.) ఈ పదాలలో ఎక్కువ మన దేశంలో జంతువులనీ, చెట్లలో రకాలనీ సూచించేవి అనే విషయం గమనించదగినది.[2]

అగురు : త. మ, అకిల్.

అర్క 'జిల్లేడు' : త. ఎరుక్కు, మ, ఎరిక్కు. క. ఎర్కె. ఎక్కె.

ఉలూఖల 'రోలు' : త. ఉలక్కై, 'రోకలి', మ. ఉలక్క, క. ఒలకె.

ఏడ 'గొర్రె', 'మేక' : త. యాటు, అటు, మ. ఆటు, క. ఆడు, తె. ఏట.

కలుష 'బురదనీరు' : త. కలుళ్, 'బురదఅగు', కలంగు, తె. కలఁగు.

కాక : త. కాక్కై, మ. కాక్క, క. కాకె, తె. కాకి, బ్రా. ఖాఖో.

కాంచిక, కాంజిక : త, కంచి, మ. కఞ్ఞి, క. తు. తె. గంజి.

కానన : త. కా, కాన్ 'అడవి', మ. కానల్ 'అడవి'.

కుటి 'ఇల్లు, పాక' : త. మ. కుటి, 'ఇల్లు', క. తు. తె. గుడి.

కుట, కుండ 'కుండ' : త. మ. కుటం, క. కొడ.

కుంతల 'తలవెంట్రుకలు', త. మ. కూంతల్.

కోరక 'మొగ్గ' : త. కుఱై, కూయి. కోడు, కూడుఖ్. ఖోర్ 'లేతఆకు.'

ఖల 'నూర్చేచోటు' : త. మ. కళం, క. కళ, కణ, తె. కలను.

---

2. సంస్కృతంలో ఒక పదం ద్రావిడభాషలనించి వచ్చిందని చెప్పడానికి ఈ కింద విషయాలు తోడ్పడతాయి: 1. మిగిలిన ఇండో-యూరపియన్ భాలలో దానికి సజాతి పదాలు (Cognates) లేకపోవడం, 2. ద్రావిడ భాషలలో ఆ పదం ప్రచురంగా ఉండడం; 3. ద్రావిడభాషలలో దానికి వ్యుత్పత్తి ఉండడం లేక దాని ధాతువునించి వచ్చిన ఇతర పదాలుకూడా ఉండడం; 4. సంస్కృతంలో అదే అర్థాన్ని సూచించడానికి ఇతర పదాలుకూడా ఉండడం; 5. ఆ పదం మన దేశంలోనే ఉండే జంతువులూ, వృక్షాలూ మొదలైనవాటిని సూచించడం.

చందన : త. మ. చాంతు 'చందనగంధం', త. చాత్తు 'పూయు.'
చుంబ్ 'ముద్దుపెట్టుకొను' : త. చూప్పు, చూంపు 'చీకు.'
తాల : క. తాళ్, తె. తాడి.
దండ : త. తంటు 'కఱ్ఱ', క. దంటు, తె. దంటు.
నీర 'నీళ్లు' : చాలా ద్రావిడభాషలు *నీర్, బ్రా. దీర్.
పల్లీ : త. మ. క. తు. పల్లి, తె. బల్లి.
పిండ 'ముద్ద' : క. తె. పిండు.
పుత్రికా 'చెద, పుట్ట' : త. పుట్టు, క. పుత్తు, తె. పుట్ట.
బల : త. వల్ 'బలమైన', వలం 'బలం', తె. బలిమి.
బిడాల, బిరాల, 'పిల్లి' : త. మ. వెరుకు, క. బెర్కు, కూడుఖ్. బెర్ ఖా.
బిల్వ 'మారేడు' : త. మ. విళా, తె. వెలగ.
మయూర 'నెమలి' : త. మ. మయిల్, గోం. మల్, ప. మణీల్.
మాలా 'దండ' : త. మాలై, మ. మాల, క. మాలె.
మీన 'చేప' : చాలా ద్రావిడ భాషలు *మీన్.
వలయ 'కడియం' : త. వళై, (క్రియ) వంగు.
శవ : చాలా ద్రావిడ భాషలు *చా 'చచ్చు', *చావు.
హేరంబ 'గేదె' : త. ఎరుమై, మ. ఎరిమ, క. ఎమ్మె, గోం. ఎర్మీ.
ఈ అంశంమీద వివరాలకి ఈ కింద గ్రంథాలూ వ్యాసాలూ చూడవచ్చు:

Bloch, Jules. 1965. *Indo-Aryan from the Vedas to Modern Times* (Original French Version (1934) revised and translated by Alfred Master). Paris.

Burrow, T. 1955. *The Sanskrit Language*. London.

Chatterji, S. K. 1926. *The Origin and Development of the Bengali Language*. Calcutta.

Emeneau, M.B. 1954, "Linguistic Prehistory of India." *Proceedings of the American Philosophical Society*, 98 : 282 - 92.

——. 1956 "India as a Linguistic Area." *Language* 82 : 3 - 16.

——. 1969, "Onomatopoetics in the Indian Linguistic Area," *Language* 45 : 274 - 99.

—— "1971, "Dravidian and Indo - Aryan : The Indian Linguistic Area." in *Symposium on Dravidian Civilization* (ed - Andree F. Sjoberg. Austin) pp. 33 - 71.

Kuiper. F.B.J. 1967. "The Genesis of Linguistic Area." *Indo - Iranian Journal* 10 : 81 - 102 (reprinted *IJDL* 3 (1974) : 135 - 153)

# 1.5. ద్రావిడభాషల తులనాత్మక పరిశోధన చరిత్ర

ఇప్పుడు మనం ద్రావిడ భాషలు అని వ్యవహరించే వాటిలో చాలావాటిని ఒక భాషా కుటుంబంగా మొట్టమొదట పరిగణించిన ఘనత ఫ్రాన్సిస్ వైట్ఎలిస్ (Francis Whyte Eillis) అనే ఇండియన్ సివిల్ సర్వీస్‌లో పనిచేసిన ఆయనకి దక్కుతుంది. ఆయన 1816 లో ఎ. డి. కేంబెల్ (A. D. Campbell) వ్రాసిన A grammar of the Teloogoo Language అనే గ్రంథానికి ఉపోద్ఘాతంగా Note to Introduction : *Dissertation of the Telugu Language* రాశారు. ఇందులో అయన తమిళం, మలయాళం, కన్నడం తెలుగు, తుళు, కొడగు, మాల్తో ఒకే భాషా కుటుంబానికి చెందినవనీ వీటికీ సంస్కృతానికీ జన్మ సంబంధం లేదనీ చెప్పారు. ఈ సిద్ధాంతాన్ని నిరూ

పించడానికి వీటిలో సమానంగా ఉన్న కొన్ని పదాలనీ, కొన్ని వ్యాకరణాంశాలనీ ఎత్తి చూపారు. ఇందులో 32 పేజీలు ఉన్నాయి. దీనిని నిడుదవోలు వెంకట రావు *Annals of Oriental Research of the University of Madras* 12-1-35 (Madras, 1954-55) లో సంపాదక వ్యాఖ్య చేర్చి పునర్ముద్రించారు. ఎలిస్ ఈ భాషలని "dialects of Southern India" అని అన్నారు.

ఎలిస్ సంగ్రహంగా ప్రతిపాదించిన ఈ సిద్ధాంతానికి సమగ్రాధారాలతో కూలంకష చర్చతో స్థిరత్వాన్ని కల్పించినది తులనాత్మక ద్రావిడభాష పరిశోధన పితామహుడని ప్రసిద్ధి కెక్కిన బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్[1] (Robert Caldwell) (జననం మే 7, 1814, మరణం - ఆగష్టు 28, 1891). ఈయన రచించిన గ్రంథం *A Comparative Grammar of the Dravidian or South - Indian Family of Languages* మొదట 1856 లో ప్రచురించబడింది; ఆయనే దీనికి కొన్ని మార్పులు చేసి రెండో ఎడిషను 1875 లో లండన్‌లో ప్రచురించారు. మూడో ఎడిషన్ మార్పులతో రివరెండ్ జె. ఎల్. వ్యాట్ (J. L. Wyatt), టి. రామకృష్ణపిళ్లై 1913 లో లండన్‌లో ప్రచురించారు. ఈ మూడో ఎడిషన్ మద్రాసు యూనివర్శిటీవారు 1956, 1961 లలో పునర్ముద్రించారు. కాల్డ్‌వెల్ గ్రంథం అప్పటికీ ఇప్పటికీ పండితులకి

---

1. కాల్డ్‌వెల్ ఐర్లండ్‌లో ఆర్ట్రిమ్‌లో జన్మించారు. ఈయన విద్యాభ్యాసం గ్లాస్గో యూనివర్సిటీలో. చదువుకొనే రోజుల్లోనే ఈయన తాను అపరిచిత భాషలు మాట్లాడే జాతుల వారితో కలిసి జీవించి వారి భాషల మీద ప్రపంచానికి ఉపయోగపడే గ్రంథం రాయాలని శపథం పట్టారు. ఈయన మిషనరీగా మద్రాసు జనవరి 8, 1838 న వచ్చారు. తిరునెల్ వేలి జిల్లాలో సుమారు ఏభై ఏళ్ళు మిషనరీగా పనిచేశారు. ఈయనని గురించిన వివరాలు డి. సుగంధరాజ్ *The Sunday Standard, January 14, 1968* లో ఫోటోతో సహా ప్రచురించారు.

శిరోధార్యమే. భాషా శాస్త్రం ఆ కాలంలో ఇంకా శైశవదశలోనే ఉన్నా కాల్డ్‌వెల్ ఉపయోగించిన పద్ధతి చాలావరకూ శాస్త్రీయమైనదే కాని ఆయన సిద్ధాంతాలలో ముఖ్యంగా వర్ణ నిర్మాణానికి సంబంధించిన వాటిలో కొన్ని లోటుపాట్లు లేక పోలేదు. దీనికి ఆ కాలంలో భాషాశాస్త్రం వృద్ధిచెందక పోవడమూ, ఈ భాషల మీద సమగ్ర పరిశోధన జరగక పోవడమూ కారణాలుగాని ఆయన ప్రయత్న లోపం కాదు. 1856 నాటికి **Neogrammarians** (యువ వ్యాకర్తలు) తమ భాషా శాస్త్ర మూల సూత్రాలని ప్రతిపాదించలేదనే విషయం మనం జ్ఞాపకం పెట్టుకోవాలి. పద నిర్మాణ పరిశోధనలో ఈయన చేసిన సిద్ధాంతాలు చాలా యుక్తియుక్తాలు; వాటిలో చాలావరకూ ఇప్పటికీ ఆమోదయోగ్యాలే.

కాల్డ్‌వెల్ కాలం నాటికి ఇప్పుడు మనకి తెలిసిన ద్రావిడ భాషలన్నీ వెలుగులోకి రాలేదు. కాబట్టి అయన ఈ కింద ఇచ్చిన 12 భాషలనీ ద్రావిడ భాషలుగా పరిగణించారు :

(నాగరక భాషలు) **1.** తమిళ్, **2.** మలయాళం, **3.** తెలుగు, **4.** కన్నడం, **5.** తుళు, **6.** కొడగు (లేక కూర్గ్); (అనాగరక భాషలు) **1.** తొద, **2.** కోత **3.** గోండి, **4.** కూయి (లేక ఖోంద్), **5.** కూడుఖ్ (లేక ఒడాయన్), **6.** రాజమహాల్ (మాల్తో). ఆయనకి బ్రాహుయిని గురించి అందులో ద్రావిడ భాషా లక్షణాలు ఉన్నాయనీ తెలుసు. గ్రంథానికి చివర ఇచ్చిన అనుబంధం, **Dravidian Element in Brahui** (పేజీలు 633-35) లో బ్రాహుయిలో యుష్మదస్మదర్థక సర్వనామాలూ, ఆత్మార్థక సర్వనామాలూ, ఒకటి, రెండు, మూడు అనే అంకెలూ, బహువచన ప్రత్యయం, కొన్ని మాటలూ దానికీ మిగిలిన ద్రావిడ భాషలకీ మధ్య ఉన్న సాన్నిహిత్యాన్ని సూచిస్తాయని ఆయనే చెప్పారు. అయినా ఆయన బ్రాహుయిని ద్రావిడ భాషగా పరిగణించక దాన్ని ద్రావిడేతర సిథియన్ భాషగా పరిగణించి దానిలో ద్రావిడభాషా లక్షణాలు బ్రాహుయిలలో

కలిసిపోయిన పురాతన ద్రావిడజాతి అవశేష చిహ్నాలుగా పరిగణించారు.[1] దీనికి కారణం బ్రాహుయిలో ద్రావిడభాషా లక్షణాలు చాలా తక్కువగా ఉండడమూ, ఆ కాలంలో పండితులు యూరప్, ఆసియా ఖండాలలో ఉన్న భాషలలో ఇండో యూరపియన్. సెమిటిక్ భాషలు తప్ప మిగిలినవి అన్నీ సిథియన్ (Scythian) అనే ఒకే కుటుంబానికి చెందినవిగా భావించడమూ.[2]

కాల్డ్‌వెల్‌కి సాహిత్యవంతమైన నాలుగు భాషలలోనూ మంచి పరిచయం ఉంది. వాటిలో అన్నిటికన్నా తమిళం (ప్రాచీన, ఆధునిక మాండలికాలతో సహా) లో ఆయనకి విశేష పాండిత్యం ఉంది. మిగిలిన భాషల విషయంలో ఆయన తమకు లభ్యమైన గ్రంథాలూ వ్యాసాలమీద ఆధారపడ్డారు. కాని ఆ గ్రంథాలూ, వ్యాసాలూ నిర్దుష్టమైనవీ, శాస్త్రీయమైనవీ కాకపోవడం వల్ల సాహిత్య రహిత భాషలమీద ఆయన చేసిన పరిశీలనలు విలువ పోగొట్టుకున్నాయి.

---

1. ...it appears to me that the theory I advocated (not that the Brahui was a Dravidian language, but that "it evidently contained a Dravidian element, an element which was probably derived from the remnant of some ancient Dravidian race incorporated with the Brahuis") has been confirmed. (Caldwell. *op. cit.* p. 633).

2. చూ. "I have not included, however. the Brahui in the list of Dravidian languages which are to be subjected to systematic comparison (though I shall refer to it occasionally for illustration), because the Dravidian element contained in its bears but a small proportion to the rest of its component elements." (Caldwell, *op. cit., p.* 39).

మొత్తంమీద కాల్డ్‌వెల్ కృషిలో ఈ కింద ఇచ్చిన నాలుగూ ముఖ్యాంశాలని చెప్పవచ్చు :

1. ఆయన కాలానికి తెలిసిన పన్నెండు భాషలని ఒక భాషా కుటుంబమని సోపపత్తికంగా నిర్ణయించి, ఈ భాషా కుటుంబానికి ద్రావిడ భాషా కుటుంబమని పేరు పెట్టడం (సంస్కృతంలో 'ద్రావిడ' పదం ముఖ్యంగా తమిళాన్నీ, తమిళులనీ మాత్రమే సూచిస్తుంది. దానిని కాల్డ్‌వెల్ భాషా కుటుంబ పరంగా వాడేరు.)

2. ద్రావిడ భాషల ప్రత్యేక లక్షణాలని వివరించి, ద్రావిడ భాషలకీ సంస్కృతానికీ ఉన్న భేదాల్ని ఎత్తి చూపి ఇవి సంస్కృతం నించి పుట్టినవి కావు అని నిర్ణయించడం.

3. ద్రావిడ భాషలకి మొట్టమొదట అతి విపులమైన తులనాత్మక వ్యాకరణాన్ని రచించడం.

4. కొన్ని ద్రావిడ భాషా పదాలు సంస్కృతంలో చేరేయనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఈ అంశం మీద పరిశోధన ప్రారంభించడం. (ఈ గ్రంథంలో 567-575 పేజీలలో ఇటువంటి పదాల పట్టిక ఉంది. గుండెర్ట్, కిట్టెల్‌లు సేకరించిన పట్టికలని కూడా పరిశీలించి వాటిలో నిస్సంశయంగా ద్రావిడ భాష నించి సంస్కృతంలోకి వెళ్ళినవని తమకు తోచిన పదాల్ని కూడా కాల్డ్‌వెల్ 577-579 పేజీలలో ఇచ్చారు.)

కాల్డ్‌వెల్ గ్రంథం ప్రచురణ తరవాత పందొమ్మిదో శతాబ్దిలో తులనాత్మక పరిశోధన సాగలేదు. దీనికి కారణాలు ఆ కాలం భారతీయులకి ఈ విధమైన పరిశోధనలో నైపుణ్యమూ ఆసక్తీ లేకపోవడమే. పైగా కాల్డ్‌వెల్ సిద్ధాంతాలు "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అనే పాత సిద్ధాంతాన్ని నమ్మే ఆ కాలపు పండితుల దాకా వ్యాపించలేదు. ఆ కాలంలో పాశ్చాత్యులైన

మిషనరీలూ, ప్రభుద్వోద్యోగులూ తులనాత్మక పరిశోధన జోలికి పోక, సాహిత్య రహిత భాషలకి సంగ్రహ వ్యాకరణాలూ, నిఘంటువులూ రచించడంతో తృప్తి పడ్డారు.[1] కాల్డ్‌వెల్ కాలంలోనే సి.పి. బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (1852), హెచ్. గుండెర్ట్ మలయాళం - ఇంగ్లీషు నిఘంటువు (1872), ఎఫ్. కిటెల్ కన్నడ - ఇంగ్లీషు నిఘంటువు (1893) రచించారు.

1873-1919 మధ్య జూలియన్ విన్‌సన్ (Julien Vinson) ద్రావిడ భాషల మీద కొన్ని వ్యాసాలు ఫ్రెంచి పత్రికలలో ప్రచురించారు. ఈ వ్యాసాలలో కొన్ని ద్రావిడ భాషల వర్ణ నిర్మాణానికీ, పద నిర్మాణానికీ సంబంధించినవి; వీటిలో ద్రావిడ భాషలోనూ బాస్క్‌లోనూ తుల్యంగా ఉన్న పదాలకి సంబంధించిన వ్యాసం కూడా ఒకటి ఉంది.

సర్ జార్జ్ గ్రియర్సన్ జనరల్ - ఎడిటర్‌గా ప్రచురించబడిన *Linguistic Survey of India* సంపుటాలలో నాలుగోది ముండా (కొలేరియన్) భాషలకీ ద్రావిడ భాషలకీ సంబంధించినది. దీనిని కూర్చినవారు డా. స్టెన్ కొనో (Sten konow) అనే నార్వే దేశపు పండితుడు. (ఇది 1906 లో ప్రచురించబడి, 1967 లో మోతీలాల్ బనార్‌సీదాస్, ఢిల్లీచేత పునర్ముద్రించబడింది.) ఇది చాలా ఉపయోగకరమైన గ్రంథమే అయినా దీనిలో కొన్ని లోపాలు ఉన్నాయి. ఇందులో దక్షిణ భారత ప్రాంతాలైన మద్రాస్ ప్రెసిడెన్సీ, మలబార్ మైసూర్, కూర్గ్, హైదరాబాద్ సంస్థానాలు చేర్చబడలేదు కాబట్టి వీటిలో ఉన్న భాషలు ఇందులో లేవు. పైగా ఇందులో అవలంబించిన సేకరణ పద్ధతి సంతృప్తి కరమైనది కానందువల్లా మధ్య భారత ప్రాంతంలో అన్ని ప్రదేశాలలోనూ

---

1. ఈ కాలంలో కొడగు (ఆర్. ఎ. కోల్ వ్రాసినది). తుళు (ఎ. మేనర్ వ్రాసినది), గోండీ (హెచ్. డి. విలియమ్‌సన్ వ్రాసినది), కూయి (లింగం లక్ష్మాజీ వ్రాసినది), కుడుఖ్ (హాన్ వ్రాసినది), మాల్తో (ఎ. డ్రూసే వ్రాసినది), బ్రాహూయీ (ఎమ్.వి. కోల్సన్, ఎర్నెస్ట్‌ట్రంప్ రచించినవి) భాషల మీద కొన్ని గ్రంథాలు ప్రచురితమయ్యాయి.

సేకరణ జరగనందువల్లా దీని ఫలితాలు తృప్తికరమైనవిగా లేవు. ఇందులో ఉన్న వివరాలు చాలా క్లుప్తమైనవి కాబట్టి దీనివల్ల మనం ఆయా భాషలని గురించి తెలుసుకునేది చాలా స్వల్పం. ఇందులో పర్జీభాషని గోండీ మాండలికమని (పే. 554 - 560) తప్పుగా యిచ్చారు. కోలామీ, నాయకీ (ఛాందా) లని గోండీ నించి వేరుచేసి ఇచ్చినా వాటి స్థానం దీనివల్ల తెలియదు. కొండ, పెంగొ, మండ, గదబ భాషలని గురించిన ప్రస్తావనే ఇందులో లేదు.

స్టెన్‌కొనో ద్రావిడభాషా భాగం ఉపోద్ఘాతంలో ద్రావిడ భాషల పరస్పర సాన్నిహిత్యాన్ని గురించి కొంత చర్చించారు. తమిళం ప్రాచీన భాషే అయినా తమిళమే ప్రాచీన లక్షణాలని నిలుపుకొంది అనడం సరికాదనీ, కొన్ని విషయాలలో తెలుగు మొదలైన ఇతర భాషలలోనే తమిళంలో లేని ప్రాచీన లక్షణాలు ఉన్నాయనీ ఆయన చెప్పారు.[1] ఆయన తమిళానికీ తెలుగుకీ ఉన్న భేదాన్ని స్పష్టంగా గుర్తించి తమిళం, మలయాళం, కన్నడం మొదలైన భాషలు తమిళ శాఖకీ (Tamil group), తెలుగు ఆంధ్ర శాఖకీ (Andhra group) చెందినవని వివరించారు ఈ విభజన తరవాత కాలంలో పండితులు చేసిన దక్షిణ ద్రావిడం, మధ్య ద్రావిడం అనే విభజనకి నాందీప్రస్తావన వంటిది.

---

1. "Tamil has usually been considered to be the Dravidian language which has preserved most traces of the original from of speech from which all other Dravidian dialects are derived. Some points will be drawn atten- tion to in the ensuing pages where this does not appear to be the case, and in many peculiarities other Dravidian languages such as Telugu have preserved older forms and represent a more ancient state of development. It would therefore be more correct to describe Tamil as a dialect like the other ones, with- out any special claim to anitiquity." (*op. cit.*, *p.* 283).

కూయి గోండీలకి, తెలుగుకి ఉన్న సాన్నిహిత్యాన్ని కూడా ఈయన గుర్తించారు.[1] కాని కూడుఖ్ - మాల్తోలు తమిళ కన్నడాలకి సన్నిహితాలనడంలోనూ బ్రాహుయీకి వాటికీ ఉన్న సంబంధాన్ని గుర్తించలేక, దానిని ప్రత్యేక శాఖగా పరిగణించడంలోనూ మరికొన్ని వివరాలలోనూ ఆయన పొరపాటు పడ్డారు. మొత్తం మీద ద్రావిడ భాషలలో ఉప కుటుంబ విభజనని గురించి చర్చించినవారిలో స్టెన్‌కొనో ప్రథములని చెప్పవచ్చు.

1900 - 1947 మధ్యకాలంలో ద్రావిడ భాషలమీద పరిశోధన ఈ కింద ఇచ్చిన నాలుగు అంశాలలోనూ జరిగింది:

1. అన్ని భాషలలోనూ ఉన్న సజాతి పదాలని (Cognates) సేకరించి వాటి మూలరూపాలని పునర్నిర్మించడానికి ప్రయత్నం చెయ్యడం.

2. అంతవరకూ సరిగా వివరాలు తెలియని సాహిత్యరహిత భాషలమీద పరిశోధన చెయ్యడం.

3. ద్రావిడ భాషలకీ సంస్కృతానికీ మధ్యఉన్న పరస్పర ప్రభావాన్ని గురించి పరిశోధించడం.

4. ద్రావిడభాషా కుటుంబానికి ఇతర భాషాకుటుంబాలకీ సంబంధం ఉందా - లేదా అనే విషయాన్ని చర్చించడం. ఈ కాలంలో పరిశోధన చేసిన పండితులలో పేర్కొనదగినవారు - భారతీయులైన కె.వి. సుబ్బయ్య, ఎల్.వి. రామస్వామి అయ్యర్, ఫ్రాన్సు దేశీయులైన జూలియస్ విన్సన్ (Julien Vinson), జూల్‌బ్లాక్ (Jules Bloch), పియేర్ మేల్ (Pierre Meile), ఇంగ్లాండు దేశీయులైన అల్‌ఫ్రెడ్ మాస్టర్ (Alfred Master), టి. బర

1. Both languages gradually merge into Telugu, and they may be described as being links between that language and Tamil - Kanarese. (*op cit.*, P. 284).

(T. Burrow), అమెరికా దేశీయులైన ఇ. హెచ్. టటిల్ (E.H. Tuttle), ఎం. బి. ఎమెనో M. B. Emeneau).

కె.వి. సుబ్బయ్య 1909-11 మధ్య ఇండియన్ ఏంటిక్వరీలో "A Primer of Dravidian Phonology" *op.cit*,. 38:159-170, 188-221 (1909) "A comparative grammar of the Dravidian languages", *op. cit.*, 39-145.158 (1910), 40.184-189, 241-246 (1911) అనే రెండు వ్యాసాలూ, *Dravidic studies No. II : The Pronouns and pronominal terminations of the first person in Dravidian* (Madras, 1923) అనే చిన్న పుస్తకమూ వ్రాశారు. ఈయన సాధారణంగా కాల్డ్‌వెల్ సిద్ధాంతాలనే ఆమోదించినా వర్ణ నిర్మాణంలో కాల్డ్‌వెల్ సరిగా చర్చించక వదలిపెట్టిన విషయాలు కొన్నింటిని చర్చించారు. అటువంటి వాటిలో క/చ, ప/హ, ఆ/ఏ మొదలైన వర్ణ సాదృశ్యాలూ తెలుగు మొదలైన కొన్ని భాషలలో వర్ణవ్యత్యయం ముఖ్యమైనవి, త. మ. ఇ, ఉ = తె. క ఎ, ఒ విషయంలో కాల్డ్‌వెల్‌ని అనుసరించి తమిళంలో అచ్చులే మూలద్రావిడంలో ఉండేవని ఈయన అన్నారు. (కాని ఇది సరికాదని తరవాత బరో నిరూపించారు). ఈయన సజాతీ పదాలని సేకరించడం మెచ్చుకో దగినదే కాని ఈయన పునర్నిర్మించిన రూపాలూ, మూలద్రావిడంలో అస్మదర్థక బహువచన సర్వనామానికి ఉభయార్థకానికీ భేదం లేదనడం వంటి అభిప్రాయాలూ ఆమోదయోగ్యాలు కావు. Dravidian studies II, III కి కాలిన్ (Collin) చేర్చిన విమర్శ నిపుణమైనది.

కాల్డ్‌వెల్ తరవాత ఉన్న ద్రావిడభాషా పరిశోధకులలో ఎల్. వి. రామస్వామి అయ్యర్‌కి ఒక ప్రత్యేక స్థానం ఉంది. ఈయన వివిధాంశాలమీద సుమారు వంద వ్యాసాలూ, ఈ కింద ఇచ్చిన మూడు గ్రంథాలూ రచించారు:

1. *A Brief Account of Malayalam Phonetics, Calcutta*, 1925.

2. *Grammar in Lilatilakam*, Trichur, 1944.

3. *The Evolution of Malayalam Morphology*, Ernakulam, 1936.

ఈయనకి తమిళ మలయాళాలలో మంచి పాండిత్యం ఉంది. ఈయన మహారాజా కాలేజి, ఎర్నాకుళంలో ఇంగ్లీషు ప్రొఫెసరుగా ఉండేవారు. కాబట్టి ఆయనకి ఇండో-యూరపియన్ తులనాత్మక వ్యాకరణంతో పరిచయం తప్పకుండా ఉండే ఉంటుంది. ఆధునిక భాషాశాస్త్రంలో కూడా ఆయనకి ప్రవేశం ఉంది. రామస్వామి అయ్యర్ తులనాత్మక వర్ణనిర్మాణం, తులనాత్మక పద నిర్మాణం, తుల్యపదాల సేకరణ, పదాల అర్థవిచారణ, ద్రావిడభాషలకి ఇతర భాషలకి ఉన్న సంబంధం, ప్రాచీన తమిళ, మళయాళ గ్రంథాలలో భాష మొదలైన వివిధాంశాలమీద వ్యాసాలు వ్రాశారు. కాబట్టి ఈయన చర్చించని పరిశోధనా విభాగం లేదనడం అతిశయోక్తి కాదు. ఈయన ప్రాచీన తమిళ గ్రంథాలైన తిరుక్కుఱళ్, కలిత్తొకై మొదలైన వాటిలో భాషని గురించి చాలా వ్యాసాలలో చర్చించారు. ఈయన సంఘ వాఙ్మయ గ్రంథాలలో క్రియా నిర్మాణాన్ని గురించిన వ్యాసం అతిముఖ్యమైనది. ప్రాచీన మలయాళానికి చెందిన శాసనాలూ, గ్రంథాలూ పరిశోధించి ఆ భాషలో కాలానుగుణంగా వచ్చిన మార్పులు *The Evolution of Malayalam Morphology* అనే గ్రంథంలో క్షుణ్ణంగా చర్చించారు. మలయాళం 9-10 శతాబ్దులలోనే ప్రత్యేక భాషగా ఏర్పడిందని, అంతకుముందు అది తమిళభాషా మాండలికమే అని ఈ పుస్తకంలో ఈయన సహేతుకంగా ప్రతిపాదించిన సిద్ధాంతం పండితులందరికీ ఆమోదయోగ్యం అయింది. ద్రావిడభాషా తులనాత్మక పరిశోధనలో చారిత్రకాంశాలని ప్రవేశపెట్టి వాటి విలువని గుర్తించిన ఘనత రామస్వామి అయ్యర్‌కి దక్కుతుంది. ఈయన తుళు భాషమీద స్వయంగా కొంత విషయ సేకరణ చేసి రెండు వ్యాసాలు వ్రాశారు. అవి :

1. "Materials for a sketch of Tulu Phonology" *Indian Linguistics*, 6.1.6. 385.439 (1936),

2. "Tulu prose texts in two dialects", *BSOHS* 6.897-931.

ఈయన వ్యాసాలన్నీ ముఖ్యమైనవే అయినా వాటిలో ఈ క్రింద ఇచ్చినవి అతిముఖ్యమైనవి :

"Causal Verbs in Dravidian," *Educational Review*, Madras (ERM) March, 1928.

"Brahui forms and Dravidian Origins," *ERM*, 1929.

"Dravidic Sandhi," *QJMS* 25-28, 91-112 (1934-35).

"The morphology of the old Tamil Verb," *Anthropos* 33 (1938), 747-81.

"Indigenous grammars on the verbs 'come' and 'give' ", *JAOS* 67 (1947).

"The history of the Tamil-Malayalam alveolar plosive", *Jonrnal of Oriental Research* 8:3-4 (reprints PP. 1-32,1-51) (Madras, 1937)

జూల్ బ్లాక్ 1946 లో *Structure grammaticale des langues dravidiennes* (Paris : *The grammaticale structure of Dravividian languages*, transl. by R. G. Harshe, Poona, 1954) ప్రచురించారు. ఇందులో పేరుకి తగినట్టు పదనిర్మాణమే చర్చించబడింది కాని

వర్ణ నిర్మాణాన్ని గురించిన చర్చలేదు. ఈ కాలానికి సాహిత్య రహిత భాషలైన గోండీ, కూయి, కూడుఖ్, మాల్తో బ్రాహుయీల మీద గ్రంథాలు వెలువడ్డాయి, కాబట్టి ఆ భాషలలో ప్రత్యేకతలకి ఈ గ్రంథంలో ప్రాముఖ్యం ఇచ్చారు. ఈ గ్రంథంలో ఈయన స్వప్రతిభతో పునర్నిర్మాణ విషయంలో కొన్ని మంచి సూచనలు చేశారు. ఈయన ఇండో-ఆర్యన్ మీద ద్రావిడ భాషల ప్రభావాన్ని గురించి పరిశోధన చేసిన విషయం ఇంతకుముందే చెప్పేము.

పియేర్ మేల్ "Sur la siffiante en dravidien" *JA* 234. 73-89 (1943-45) అనే వ్యాసంలో మూల ద్రావిడ చకారం దక్షిణ ద్రావిడ భాషలలో లోపించిందని నిరూపించారు.

ఇ. హెచ్. టటిల్ 1919-1938 మధ్య వ్యాసాలు రచించారు. ఈయన తన పరిశోధనా ఫలితాలని *Dravidian Developments* (Language monograph series No 5, *LSA*, Philadelphia, 1930) లో క్రోడీకరించారు. ఈయన వర్ణనిర్మాణం, పద నిర్మాణాలలో ఉన్న అనేక సమస్యలని గురించి చర్చించారు. కాని ఈయన సిద్ధాంతాలు చాలావరకూ ఆమోదయోగ్యాలు కాలేదు. ఈయనకి ఏ ఒక్క ద్రావిడ భాషతోనూ పరిచయం లేకపోవడం దీనికి కారణం.

ద్రావిడభాషా తులనాత్మక పరిశోధనని ఆధునిక భాషా శాస్త్రపద్ధతులలో జరిపి దానికి శాస్త్రీయతని సమకూర్చి స్థిరమైన పునాది ఏర్పరచినవారు టి. బరో, ఎం. బి. ఎమెనో. వీరిద్దరూ తమ ద్రావిడ భాషా పరిశోధనలని 1930-40 మధ్య ప్రారంభించారు. వీరిద్దరూ తమ పరిశోధనలు దీర్ఘకాలం కొనసాగించడం ద్రావిడభాషలు చేసుకొన్న అదృష్టం. బరో 1938-48 మధ్య *Bulletin of the School of Oriental and African Studies* (BSOAS), 9-12 వాల్యూమ్‌లలో వ్రాసిన వ్యాసపరంపరలో తులనాత్మక వర్ణనిర్మాణంలో అనేక సమస్యలమీద శాస్త్రీయమైన చర్చ చేశారు. (ఈ వ్యాసాలన్నీ కలిపి *Collected Papers on Dravidian Linguistics* అనే గ్రంథంగా అణ్ణామలై యూని

వర్సిటీ వారు 1968 లో పునర్ముద్రించారు). ద్రావిడభాషలలో నాద, శ్వాస స్పర్శాలనిగురించీ దక్షిణ ద్రావిడంలో ఇ/ఎ, ఉ/ఒల మార్పుని గురించీ, మూల ద్రావిడ ధ్వనులైన *క, *చ, *య *ఇల పరిణామాలని గురించీ ఈయన విషయ సంగ్రహణ చేసి కూలంకుషంగా చేసిన చర్చలూ, సిద్ధాంతాలూ తులనాత్మక వర్ణ నిర్మాణానికి ప్రాతిపదికలు. కాల్డ్‌వెల్, కిటెల్, గుండెర్ట్ సంస్కృతంలో చేరిన ద్రావిడపదాలమీద చేసిన పరిశోధనని కొనసాగిస్తూ బరో మూడు వ్యాసాలు వ్రాశారు. ద్రావిడ భాషలకీ, యురాలియన్ భాషలకీ మధ్య సంబంధం ఉందనే వాదాన్ని సమర్థిస్తూ వ్రాసిన "Dravidian studies IV : The Body in Dravidian and Uralian" (*BSOAS* 11 : 328-350 (1943-46) అనే వ్యాసంలో ద్రావిడభాషలోనూ యురాలియన్ భాషలలోనూ దేహాంగాలని సూచించే పదాలలో ఉన్న సామ్యాలని ఎత్తిచూపేరు.

ఎమెనో సంస్కృతంలోనూ, మానవశాస్త్రం (Anthropology) లోనూ, భాషాశాస్త్రం (Linguistics) లోనూ పండితుడు. ఈయన ఎజెర్టన్, స్టర్ట్‌వాంట్, సపీర్‌ల శిష్యుడు. ద్రావిడ భాషలలో పరిశోధన బరో ప్రారంభించినప్పుడే ఈయనా ప్రారంభించారు. మూడేళ్ళు (1935-38లలో) తొద, కోత, కొడగు, కోలామీల మీద క్షేత్రపరిశోధన (Field work) చేసి సామాగ్రి సేకరించారు. ఈయన మొదట్లో వ్రాసిన వ్యాసాలు నీలగిరి జాతులవారి ఆచార వ్యవహారాలకి సంబంధించినవి. తులనాత్మక పరిశోధనలో ఈయన మొదటి వ్యాసం "The Dravidian Verbs 'come' and 'give' " (*Language* 21. 184-213) 1945 లో ప్రచురితమైంది. ఈయనకి తులనాత్మక పరిశోధనలో అమితాసక్తీ, నైపుణ్యం ఉన్నట్లు ఈ వ్యాసంలోనే స్పష్టమవుతుంది.

1947 తరవాత వచ్చిన పరిశోధనలలోకూడా ఎమెనో, బరోలదే అగ్ర స్థానం వహిస్తుంది. వీరుకాక ఈ కాలంలో కొత్తగా ద్రావిడభాషా తులనాత్మక వ్యాకరణంలో పరిశోధన మొదలుపెట్టిన పండితులు కొందరు ఉన్నారు. వారిలో పరిశోధనా సారం దృష్ట్యా పేర్కొనదగినవారు భద్రిరాజు కృష్ణమూర్తి

ఎన్. కుమారస్వామిరాజా, ఎస్. వి. షణ్ముఖం, పి. ఎస్. సుబ్రహ్మణ్యం. డి. ఎన్. శంకరభట్టు, సుధీభూషణ్ భట్టాచార్య, జెకొస్లొవేకియాకు చెందిన కమిల్ జ్వెలబిల్ (Kamil Zvelebil), రష్యాకు చెందిన ఎమ్. ఆంద్రొనోవ్ (M. Andronov), యూరి గ్లాసోవ్ (Yuri Glasov), అమెరికాకు చెందిన విలియం బ్రైట్ (William Bright), జర్మనీకి చెందిన మార్టిన్ ఫైఫర్ (Martin Pfeiffer). 1947 తరవాత జరుగుతూన్న పరిశోధనని ఈ క్రింద ఇచ్చినట్టు విభజించి చర్చించవచ్చు: 1. వర్ణనిర్మాణం (Phonology), 2. పద నిర్మాణం(Morphology), 3. సజాతిపద పరిశోధన (Etymological suudy), 4. ఉప కుటుంబ విభజన (Subgrouping), 5. ద్రావిడభాషలకి ఇతర భాషా కుటుంబాలకీ ఉన్న (లేక ఉంది అనుకొన్న) సంబంధం (Affinity between Dravidian and other language families), 6. వాక్యనిర్మాణం (Syntax).

(i) వర్ణనిర్మాణం : తులనాత్మక వర్ణ నిర్మాణానికి బరో వ్యాసాలు పునాది అని ఇంతకుముందే చెప్పేం, వర్ణనిర్మాణం మీద ఈ క్రింద ఇచ్చిన ఆరు పుస్తకాలు వెలువడ్డాయి:

1. Krishnamurti, Bh. *Telugu verbal bases: a comparatiive and descriptive study* (1961, Berkeley and Los Angeles; reprinted. 1972, Delhi).

2. Kumaraswami Raja, N., *Post-nasal voiceless plosives in Drauidian* 1969, (Annamalainagar).

3. Emeneau, M. B. *Dravidian Compartive Phonology: A Sketch* (1970, Annamalai University, Annamalainagar).

4. Zvelebil, K., *Compararitive Drauidian Phonology* (1970, The Hague, Paris).

5. Pfeiffer, Martin, *Elements of Kurux historical Phonology* (1972, Leiden).

6. Subrahmanyam, P. S., *Dravidian Comparative Phonology*. (1983 Annamalai University).

ఎమెనో పుస్తకంలో మూలద్రావిడ ధ్వనులూ, అవి ఇప్పటి భాషలలో చెందిన మార్పులు సంగ్రహంగా వివరించబడ్డాయి. జ్వలబిల్ పుస్తకం చాలావరకు దీనిమీద ఆధారపడినదేగాని ఇందులో విపులమైన చర్చ ఉంది. ఫైఫర్ మూల ద్రావిడ ధ్వనులు కూడుఖ్‌లో పొందిన మార్పులు సమగ్రంగా చర్చించారు. కుమారస్వామి రాజా మూలద్రావిడంలో *ంక్క, *ంట్ట మొదలైన అనునాసిక సహిత ద్విత్వాక్షరాలు ఉండేవనే కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించి సోదాహరణంగా నిరూపించారు. (చూ. 2. 36).

భద్రిరాజు కృష్ణమూర్తి తెలుగు (ప్రాచీనభాష, ఇప్పటి భాష) లో ఉన్న క్రియాపదాలు సేకరించి, వాటికి ఇతర భాషలలో ఉన్న సజాతి పదాలు కూడా సేకరించి (ఆయన ఈ పరిశోధన చేసిన కాలంలో బరో, ఎమెనో రచించిన *Dravidian Etymological Dictionary* (1961) ప్రచురితం కాలేదు) తెలుగు ధ్వనులు ఏయే మూలద్రావిడ ధ్వనులనించి వచ్చాయో సమగ్రంగా నిరూపించారు. ఈయన ఈ పరిశోధనలో చాలా కొత్త విషయాలు వివరించారు; అంతక్రితం చర్చించబడిన ధ్వని పరిణామాల విషయంలో కూడా అవసరమైన మార్పులు, చేర్పులు చేశారు. ఈ గ్రంథంలో చర్చ తెలుగుకే పరిమితం కాక మిగిలిన భాషల పరిణామం విషయం కూడా ఉంది. తులనాత్మక పరిశోధనలో బరో వ్యాసాల తరవాత ముఖ్యమైన గ్రంథం కృష్ణమూర్తిదే. ఈయన కొన్ని వ్యాసాలలో కూడా తులనాత్మక వర్ణనిర్మాణం చర్చించారు. "The history of vowel-length in Telugu verbal bases" (*JAOS* 75 : 237-252 (1955) లో ద్రావిడ భాషలలో, హ్రస్వ దీర్ఘాచ్చుల సంబంధాన్ని పరిశీలించారు. "Proto-Dravidian *Ẓ" (*IL* 19. 259-293

(1958)) లో మూ|ద్రా *ళ వర్ణం పొందిన మార్పులు చర్చించారు. "Alternations i/e and u/o in South Dravidian" (*Lg.* 34 : 458 - 468 (1958)) లో ఇ/ఎ, ఉ/ఒ మార్పుల మీద బరో అభిప్రాయాన్ని విపులీకరించి మూలద్రావిడంలో *ఇ, *ఎ, *ఉ, *ఒ అనే నాలుగు అచ్చులూ అకారం ముందు మూల దక్షిణ ద్రావిడంలో *ఎ, *ఒ లుగా మారేయనీ ఆ తరువాత ప్రాచీన తమిళ మలయాళాలలో అవి ఇ, ఉలుగా మారేయని సిద్ధాంతీకరించారు. "Dravidian nasals in Brahui" (*Dravidian Linguistics* (*Seminar Papers*) 1969, pp. 65 - 74) లో మూ. ద్రా. *న తాలవ్యాచ్చుల ముందు బ్రాహుయీలో దకారం అవుతుందని నిరూపించారు. ఈయన ఇటీవల మూ. ద్రా. *అ, *ఆ లు పర్జీలో ఎ, ఏలుగా దంత మూలీయవర్ణం ముందు మారతాయని నిరూపించి, దీనికి ప్రత్యుదాహరణలుగా కనపడే వాటికి తృప్తికరమైన వివరణ ఇచ్చారు. "Areal and lexical diffusion of sound change: evidence from Dravidian" (*Language* 54 (1978) : 1-20) అనే ఈయన వ్యాసంలో తెలుగు - కువి సముదాయంలో వర్ణవ్యత్యయం మీద సమగ్ర చర్చ ఉంది.

బరో "The treatment of primitive Dravidian -ṟ- in Kurukh and Malto" (*Sudies in Indian Linguistics Professor M. B Emeneau sastipurti volume*). 1968, pp. 62-69) లో మూ. ద్రా. *ళ కూడుఖ్, మాల్తోలలో లోపించింది; అది వీటిలో చ/సగా మారింది అనడం సరికాదని నిరూపించారు. బరో, భట్టాచార్య ఇటీవల పర్జీ, కూయి, కువి, గోండీ, పెంగోలమీద వ్రాసిన వ్యాసాలు, గ్రంథాలలో ఈ భాషలలో మూల ద్రావిడ ధ్వనులు పొందే మార్పులు విపులంగా చర్చించారు.

ఎమెనో "Proto-Dravidian *c-; Toda t-" (*BSOAS* 15,98-112 (1953) లో పదాదిని మూ. ద్రా. *చకారం తొదలో తకారంగా మారుతుందని చెప్పేరు. "North Dravidian velar stops" (Te, Po. Mi.

*manivilaamalar* (Coimbatore 1961), *pp*. 371-388)లో మూ. ద్రా. *చకారం ఉత్తర ద్రావిడ భాషలలో *ఉ, *ఊ, *ఎ, *ఏల ముందు కకారంగా మారుతుందని నిరూపించారు. *Brahui and Dravidian Comparative Grammar* (1962, Berkeley and Los Angeles)లో Brahui vowels అనే రెండో అధ్యాయంలో బ్రాహుయీ అచ్చులు మూలద్రావిడంలో అచ్చుల నించి వచ్చిన విధానం వివరించారు. "Kodagu vowels" (JAOS 90. 145-158 (1970))లో కొడగు అచ్చులు మూలద్రావిడంలో అచ్చులనించి ఎలా వచ్చినదీ విపులంగా చర్చించారు. "Kodagu and Brahui developments of Proto - Dravidian *l̲" (*Indo Iranian Journal* - 13.176-198 (1971))లో మూ.ద్రా. *ళ కొడగు, బ్రాహుయీలలో పొందిన మార్పులు చర్చించారు. (ఎమెనో వ్యాసాలు 33, *Dravidian Linguistics Ethnology and Folktales Collected papers*) అనే గ్రంథంగా 1967లో అణ్ణామలై యూనివర్శిటీవారు ప్రచురించారు.) "A Kota vowel shift" (*Journal of Tamil Studies* 1. 1. pp, 21-34 (1969)లో *ఉ, *ఊ, *ఒ, *ఓలు *-అయ్ ముందు కోతలో క్రమంగా ఇ, ఈ, ఎ, ఏలుగా మారతాయని నిరూపించారు. ఈయన "Proto- Dravidian*c- and its developments" (JAOS 198: 239 68 (1988)లో మూ. ద్రా*చకారం దుహితృ భాషలలో పొందిన మార్పులు విపులంగా చర్చించారు.

డి.ఎన్. శంకరభట్టు "*Studies in Tulu*" (*BDCRI* 25.11.31 (1966))లో తుళులో మూ. ద్రా. *అ పొందే మార్పులూ, మూ. ద్రా, *కకారం కొరగ మాండలికంలో చకారంగా మారడం, తుళులో వచ్చిన మరికొన్ని మార్పులు చర్చించారు. Velar consonants in Kudux" (*IL* 31.177-181 (1970) లో మూ. ద్రా. *క కూడుఖ్‌లో పొందే మార్పులు విపులంగా చర్చించారు.

ఎ.ఐ. సుబ్రహ్మణ్యం "A Problem in the reconstruction of the Proto - Dravidian nasal phonemes" (*Pratidhvanam* 1968

pp. 344 - 847)లో అనునాసికాల పునర్నిర్మాణంలో ఉన్న సమస్యలని చర్చించారు. "Rules of nasal assimilation in Malayalam" (*IJDL*. 1. 137 - 143 (1972)) లో మలయాళంలో ద్విత్వానునాసికాల చరిత్ర సమీక్షించారు.

ఎస్. వి. షణ్ముఖం "Dental and alveolar nasals in Dravidian" (*BSOAS* 35 : 74-84 (1972))లో దంత్య దంత మూలీయ నకారాలు రెండింటిని మూలద్రావిడ భాషకి పునర్నిర్మించడం అవసరమా కాదా అనే విషయం విపులంగా చర్చించారు. ఇందులో ఈ విషయం మీద ప్రాచీన తమిళంలో సాక్ష్యం సమగ్రంగా ఇవ్వబడింది. అయితే దంత్య నకారం మూలద్రావిడంలో ప్రత్యేక వర్ణం కాదు అనే ఈయన అభిప్రాయం సమంజసమైనది కాదని తోస్తుంది.

ఎన్. కుమారస్వామి రాజా తమ 1969 గ్రంథంలో మూలభాషలో అనునాసిక సహిత ద్విరుక్త స్పర్శం ఉండేదని సోపపత్తికంగా నిరూపించారు. (వివరాలకి చూ. 2.36)

పి.ఎస్. సుబ్రహ్మణ్యం "Long vowels before *y* in Telugu Bases" (*IL* 31: 79-73 (1970))లో తెలుగులో చేయు, చేయి, కోయు మొదలైన పదాలలో యకారం ముందు దీర్ఘాచ్చు హ్రస్వాచ్చునించి వచ్చిందనీ, ఇటువంటి చోట్ల హ్రస్వం దీర్ఘంగా మారడం చేసి (<*కెయ్-సి) కోసి (<*కొయ్-సి) వంటి రూపాలలో యకార లోపంవల్ల జరిగిందనీ నిరూపించారు. "Quantitative Variation in Dravidian" (*IL* 36. (1975): 1-15)లో నామవాచకాలలో దీర్ఘాచ్చు హ్రస్వంగానూ ద్విరుక్తహల్లు అద్విరుక్తంగానూ మారడం వివరిస్తూ సాంబశివరావు, జ్యులబిల్‌ల ప్రతిపాదనలలో లోపాలని ఎత్తి చూపేరు. "Proto - Dravidian **a*, **aa* : Toda *a/a*, *aa/oo*" తొదలో అ, అలు నిలిచే పరిసరాలు వివరించారు. "The Toda Reflexes

of Proto - Dravidian *l and *l"లో తొదలో మూ.ద్రా. *లకారం ల, స్ర లుగానూ, మూ.ద్రా. *ళకారం ళ్ల కారంగానూ మారుతుందని నిరూపించి, తొదలో ల, ళ లతో ఉన్న పదాలు ఎరవు తెచ్చుకొన్నవని వివరించారు. ఈయన 1983 గ్రంథం తులనాత్మక వర్ణ నిర్మాణంపై జరిగిన కృషిని సమగ్రంగా వివరించే ప్రమాణ గ్రంథం. ఇందులో మొదటి అధ్యాయంలో ఈ అంశంపై జరిగిన చరిత్ర సమీక్ష ఉంది. ఇది తులనాత్మక వ్యాకరణంలో కొత్త అంశాలని వివరించే గ్రంథమూ, పాఠ్య గ్రంథమూ కూడా.

జి. సాంబశివరావు "On Proto - Dravidian morpho - phonemics" (*IJDL* 2, 217 - 242 (1973))లో కృష్ణమూర్తి, ఎమెనో, బ్యాలబిల్ ఇచ్చిన సంధిసూత్రాలని చర్చించి వాటికి ప్రత్యుదాహరణలుగా కనబడే వాటికి వివరణ ఇవ్వడానికి ప్రయత్నించారు.

(ii) పదనిర్మాణం : తులనాత్మక పదనిర్మాణంలో సమగ్ర పరిశోధన చాలా ఇటీవల కాలంలోనే మొదలైంది. కాల్డ్‌వెల్, జూల్‌బ్లాక్‌లు వారి కాలానికి దొరికిన భాషల ఆధారంలో పద నిర్మాణంమీద కొంత పరిశోధన చేశారు. ఎల్.వి. రామస్వామి అయ్యర్ వ్యాసాలలో పద నిర్మాణానికి సంబంధించినవి: "Causal verbs in Dravidian'' (ERM, March, 1928), "The Tulu verbs" (ERM, December, 1928), "Dravidian notes I : The Brahui verb" (JBORS) 15: 116-23 (1929), "The Kurukh verb" (*ERM*, September, 1929), "The Kui verb'' (*ERM*, 1929), "The Gondi verb" (*ERM*, October, 1929). ఆయన *The Evolution of Malayalam morphology* (Ernakulam, 1936) కూడా ఈ విభాగంలోకే వస్తుంది.

ఎమెనో "Dravidian Kinship terms" (*Language* 29. 339-353 (1953) ) లో ద్రావిడ భాషలలో బంధువాచక పదాలు ఎప్పుడూ బహు

వచన సర్వనామాలతో కలిసి ఉంటాయనీ, ఈ నిర్మాణం మూలద్రావిడ భాషకే చెందినదనీ నిరూపించారు; ఉదా: త. ఎంక్లై 'మా చెల్లెలు', ఎంపి 'మా తమ్ముడు', నుంక్లై/ఉంక్లై 'మీ చెల్లెలు', నుంపి/ఉంపి 'మీ తమ్ముడు', తంక్లై 'వాళ్ళ చెల్లెలు', తంపి 'వాళ్ళ తమ్ముడు' (వీటిలో ఉన్న 'క్లై'కి 'చెల్లెలు' అనీ, 'పి'కి 'తమ్ముడు' అనీ అర్థం). "Numerals in Comparative linguistics (with special reference to Dravidian)" *BIHP* 29. 1.10 (1957)) లో ద్రావిడ భాషలలో సంఖ్యావాచకాల నిర్మాణాన్ని గురించీ వాటిలో సామ్యంవల్ల వచ్చిన మార్పులని గురించీ చర్చించారు. *Brahui and Dravidian Comparative Grammar*, Brahui n/r verbs అనే అధ్యాయంలో కన్/కర్ 'చేయు', మన్న్/మర్ 'ఉండు', తిన్/తిర్ 'ఇచ్చు' మొదలైన క్రియలలో నకారాంత రేఫాంత ధాతురూపాలు వచ్చిన విధానం సమీక్షించారు. "The South Dravidian languages" (*JAOS* 87: 365-412 (1967))లో తుళు తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలలో భూతకాలిక క్రియా నిర్మాణాన్ని సమగ్రంగా పరిశోధించారు. "Some South Dravidian noun formatives" (IL 27 (1966) : 21–30) లో దక్షిణ ద్రావిడ భాషలలో కొన్ని కృత్ప్రత్యయాలని గురించి చర్చించారు. "Studies in dravidian verb stem formation" (*JAOS* 95: 1-24 (1975))లో కూడుఖ్ - మాల్తో, పెంగో-కువి క్రియలలో కొన్ని ప్రత్యయాల చరిత్ర పరిశోధించారు.

కృష్ణమూర్తి *Telugu Verbal Bases* రెండో అధ్యాయంలో తెలుగులోనూ ఇతర ద్రావిడ భాషలలోనూ క్రియలలో ధాతువు తరవాత వచ్చే ప్రత్యయాలని విపులంగా పరిశోధించారు. "Dravidian personal pronouns" (*Studies in Indian Linguistics* 1968, pp. 189-205) లో యుష్మదస్మదర్థక రూపాలని గురించి పరిశోధించారు. ఇందులో ఈయన చేసిన సిద్ధాంతాలలో లోపాలు పి. ఎస్. సుబ్రహ్మణ్యం ఈ విషయం మీద వ్రాసిన వ్యాసంలో చూపేరు. ఇటీవల కృష్ణమూర్తి "Gender and number in Proto-Dravidian" (IJDL 4: 348-850 – (1975) లో ఆయన అంత క్రితం

Telugu verbal bases లో సంగ్రహంగా ఇచ్చిన సిద్ధాంతాలని విపులీకరించి వాటిపై తరవాత పరిశోధకులు చేసిన విమర్శలకి సమాధానం ఇవ్వడానికి ప్రయత్నించారు.

ఎస్. వి. షణ్ముఖం *Dravidian Nouns (a Compartive study)* (Annamalainagar, 1971) ద్రావిడ భాషలలో నామవాచక పద నిర్మాణ తులనాత్మక పరిశోధనకి ముఖ్యమైనది. ఇందులో ఆయన అన్ని భాషలమీదా వివరాలు ఇచ్చి, ఆయా అంశాలమీద పండితుల విభిన్నాభిప్రాయాలు సేకరించి ఇచ్చారు. "Tamil numerals" (Proceedings of the first international conference of Tamil studies; Vol-II, pp. 729-734, Kuala Lumpur, 1966) లో మూలద్రావిడ. సంఖ్యావాచకాలు తమిళంలో పొందిన మార్పులు వివరించారు.

పి. ఎస్. సుబ్రహ్మణ్యం *Dravidian verb morphology (a comparative study)* (Annamalainagar, 1971) ద్రావిడభాషలో క్రియా పదనిర్మాణ తులనాత్మక పరిశోధనకి ప్రాతిపదిక. ఇందులో ప్రతి ద్రావిడ భాషలోనూ క్రియాపదాల వర్ణన ఇచ్చి దాని ఆధారంగా మూలభాషలో క్రియా ప్రత్యయాలరూపాలని పునర్నిర్మించారు. ఇందులో పద నిర్మాణంలో అనేకమైన కొత్త విషయాలు వివరించబడ్డాయి. పద నిర్మాణం మీద ఈయన రచించిన ఇతర వ్యాసాలు : "Two problems in Parji verb forms" (*IL* 25: 47 - 55 (1964) ), "The intransitive and transitive suffixes of Kui" *JAOS* 85; 551-565) ), "The personal pronouns in Dravidian" (*BDCRI* (1967-68: 28; 112-126 (1968) ), "The gender and number categories in Dravidian" (*JAU* 26; 79-100 (1969) ), "Tense formation in Kota-Toda ; A Comparative Study" (*Studies in Dravidian General Linguistics* 1991 : 49-72 (Hyderabad); also JAU 34 (1988) : 139-170).

(iii) సజాతిపద పరిశోధన :

తులనాత్మక పరిశోధన త్వరితంగా శాస్త్రీయంగా సాగడానికి ముఖ్యంగా అవసరమైనది వ్యుత్పత్తి నిఘంటువు (Etymological dictionary), ఇటువంటి గ్రంథం రచించడానికి ప్రయత్నించినవారు కోరాడ రామకృష్ణయ్య (*Dravidian Cognates*, Madras University Telugu series, No. 11, 1944). ఆర్.పి. సేతుపిళ్లై, తదితరులు సంపాదకులుగా *Dravidian Comparative Vocabulary* Vol I (Madras, 1959) వెలువడింది. కాని ఇందులో కొన్ని చోట్ల సజాతిపదాలు కాక ధ్వని సామ్యంలేని సమానార్థకాలు కూడా ఇవ్వబడ్డాయి. ద్రావిడ భాషలకి సమగ్రమైన, శాస్త్రీయమైన వ్యుత్పత్తి నిఘంటువు బరో, ఎమెనో రచించిన A *Dravidian etymological Dictionary* (*DED*) Oxford, 1961), ఇందులో 4,572 పద సముదాయాలు ఉన్నాయి. ఇది వెలువడిన తరవాత దీనిలోనించి వివరాలు తీసుకోకుండా ద్రావిడ భాషలమీద వ్యాసం వ్రాసిన రచయిత లేడనడం అతిశయోక్తి కాదు. దీని ప్రచురణ తరవాత ద్రావిడ భాషలతో పరిశోధన సత్వరంగా సాగుతోంది. బరో, ఎమెనోలే దీనికి 1961 తరవాత మూడు పూరక గ్రంథాలు రచించారు. అవి:

*Dravidian borrowings from Indo - Aryan* (DBIA) (Berkeley 1962)

A *Dravidian etymological dictionary : supplement* (*DEDS*) (Oxford 1962).

"Dravidian etymological notes pt . I & pt . II" (*DEN*) (*JAOS*) 92 (1972) : 397-418; 475-491).

1962 గ్రంథంలో సంస్కృతం నించి ద్రావిడ భాషలోకి వచ్చిన పదాలలో అన్ని భాషలలోనూ వ్యాప్తిలో ఉన్నవి లేక అర్థధ్వని విపరిణామం

వల్ల అసక్తికరమైనవీ అయిన 336 పద సముదాయాలు ఇవ్వబడ్డాయి. 1968 గ్రంథంలో 889 కొత్త పదసముదాయాలతో పాటు 1961 గ్రంథంలో పద సముదాయాలలో చేయవలసిన మార్పులు, చేర్పులు కూడా ఇవ్వబడ్డాయి. ఇందులో పెంగో, మండలలో పదాలు కూడా ఇవ్వబడ్డాయి. 1972 వ్యాసంలో 77 కొత్త పద సముదాయాలూ, పూర్వ గ్రంథాలలో చేయవలసిన మార్పులు, చేర్పులూ ఉన్నాయి. వీరు ఇటీవల 1984 లో ఈ మూడింటినీ సమైక్యం చేసి, చాలా మార్పులతో *A Dravidian Etymological Dictionary*: (Second Edition; *DEDR*; Oxford) అనే గ్రంథం ప్రచురించారు. ఇందులో 5,557 పద సముదాయాలు ఉన్నాయి. ఇవి కాక ఇందులో ఇండో-అర్యన్ భాషలనించి ద్రావిడ భాషలలోకి వచ్చినవిగా కొత్తగా గుర్తించబడిన పదాలు 61 సముదాయాలుగా ఇవ్వబడ్డాయి.

బరో, ఎమెనోలు 1961 గ్రంథానికి ముందు రచించిన కోలామీ, పర్జీ భాషలమీద గ్రంథాలలోనూ ఆ తరవాత రచించిన వ్యాసాలూ, గ్రంథాలలో కూడా తుల్యపద పరిశోధన చేశారు. ఎమెనో *Brahui and Dravidian comparative grammar*, "New Brahui Etymologies" (American Oriental Service 47 (1962) : 59-69) లలో బ్రాహుయీ పదాల మీద పరిశోధన స్మరించదగినది.

కృష్ణమూర్తి *Telugu verbal Bases* చివర 1236 తెలుగు క్రియలకి తుల్యపదాలూ (ఇందులో కొన్ని ఆయన స్వయంగా సేకరించినవి), వాటి మూల ద్రావిడ రూపాలూ ఇచ్చారు.

పి. యస్. సుబ్రహ్మణ్యం "Notes on Dravidian etymological notes" (*IL* 34 (1973): 138 - 146) లో *DED(S)*, *DEN* లో కొన్ని పద సముదాయాలలో చేయవలసిన మార్పులు సూచిస్తూ, ఆ గ్రంథాలలోకి ఎక్కని తెలుగు, గోండి భాషలలోని మాటలు కొన్ని ఇచ్చారు.

(IV) **ఉప కుటుంబ విభజన :**

ద్రావిడ భాషలలో ఉప కుటుంబ విభజనని గురించిన చర్చ మొదలు పెట్టినది కూడా బిషప్ కాల్డ్‌వెలే ఆయన తమిళ, మలయాళాలు అత్యంత సన్నిహిత భాషలనీ, తమిళానికీ, తెలుగుకీ చాలా భేదం ఉందనీ, తుళుకీ దాని సమీప భాషలకీ మధ్య వైవిధ్యం ఉందనీ గమనించారు. ఉప కుటుంబ విభజన మీద సమగ్ర పరిశోధన 1950 తరవాతనే మొదలయిందని చెప్పవచ్చు. బరో, భట్టాచార్య *The Parji Language* (Hertford, 1953) ఉపోద్ఘాతంలో పర్జీ, గదబ, కోలామీ, నాయకీలకి సన్నిహితమైన దని గోండి - కొండ, కూయి - కువిలకి సన్నిహిత సంబంధం ఉందనీ సూచించారు. ఎమెనో కోలామీ గ్రంథం (1955) లో కోలామీ - నాయకీ, పర్జీ - గదబలు నాలుగూ ఒక ఉప కుటుంబమని చెప్పడానికి ఆధారాలు ఇచ్చారు. ఆయన "Toda a Dravidian language" (*TPHS* (1957) 15 - 66 లో తొద, తమిళ, మలయాళాలకి సన్నిహితమైనదని నిరూపించారు. "The South Dravidian languages" (1967) లో తుళు తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలలో అంతర్విభాగాలను గురించి చర్చించారు.

కృష్ణమూర్తి *Telugu verbal bases* లో నాలుగో అధ్యాయం "The place of Telugu in the Dravidian family" లో తెలుగు మధ్య ద్రావిడ భాష అనీ, అది కూయి - కువి - కొండలకి సన్నిహితమైనదనీ నిరూపించారు.

ఎమెనో *Brahui and Dravidian comparative grammer* (Berkely, 1962) లో అయిదో అధ్యాయం "The Position of Brahui in the Dravidian family" లో కుడుఖ్, మాల్తో, బ్రాహుయీలు ఉత్తర ద్రావిడోపకుటుంబమని నిరూపించే ఆధారాలు ఇచ్చారు.

పి. ఎస్. సుబ్రహ్మణ్యం "The central Dravidian languages" (*JAOS* 89 (1969) : 789 - 750) లో మధ్య ద్రావిడోపకుటుంబంలో

ప్రత్యేకతలు వివరించి, అందులో తెలుగు - కూయి భాషలని ఒక ఉపోప కుటుంబంగా ఏర్పరచడానికి ఉన్న ఆధారాలు ఇచ్చారు. **"The position of Tulu in Dravidian"** (*IL* 29 (1968) : 47 - 66) **లో** తుళు దక్షిణ ద్రావిడభాషే అనీ, అది మూల దక్షిణ ద్రావిడనించి మొట్టమొదట విడివడిన భాష అనీ సమగ్రాధారాలతో నిరూపించారు. ఆయన *Dravidian verb morphology (a comparative study)* (**1971**) కి చేర్చిన అనుబంధం **"Sub groups in Dravidian" లో** ఈ అంశం మీద సమగ్రంగా చర్చించారు.

ఉప కుటుంబ విభజన మీద సమగ్ర చర్చకి ఈ గ్రంథం చివరి అధ్యాయం చూడవచ్చు.

## (V) ద్రావిడ భాషలకి ఇతరభాషా కుటుంబాలకి సంబంధం :

కాల్డ్‌వెలూ ఆ కాలంలో ఇతర పండితులూ ద్రావిడ భాషలు 'సిథియన్' (Scythian) లేక 'ట్యూరానియన్' (Turanian) భాషా కుటుంబానికి చెందినవని నమ్మారు. వారు యూరప్‌లోనూ, ఆసియాలోనూ ఉన్న ఇండోయూరపియన్, సెమిటిక్ భాషలు తప్ప మిగిలిన భాషలన్నీ ఒకే కుటుంబమని నమ్మి, దానికి సిథియన్ అని పేరుపెట్టారు. కాని ఈ సిథియన్ సిద్ధాంతం సరిఅయినదని చెప్పడాని కేమీ ఆధారాలు లేవు. ఈ సిథియన్ సముదాయంలోనే చేరిన ఫిన్నో-ఉగ్రియన్ కుటుంబానికీ ద్రావిడభాషలకీ ప్రత్యేక సంబంధం ఉన్నట్లు కాల్డ్‌వెల్ చెప్పేరు. ఈ విషయంమీద తరవాత పండితులు కూడా కొంత పరిశోధన చేశారు. వారిలో బరో ఒకరు. ఆయన *Dravidian studies* IV: **'The body in Dravidian and Uralian'** (**BSOAS 11** (**1946**): **328-356** లో ద్రావిడభాషలలోనూ, యురాలియన్ భాషలలోనూ (యురాలియన్ అంటే ఫిన్నో-ఉగ్రియన్ భాషలూ సమొయెడిక్ (**Samoyedic**) భాషలూ కలిసిన కుటుంబం) దేహాంగవాచక పదాలలో ఉన్న సామ్యాలు ఎత్తి చూపేరు. కారల్ బౌదా, కారల్ హెచ్. మెంజెస్ కూడా ద్రావిడభాషలకీ, ఉరాల్-అల్టెయిక్ భాషలకీ మధ్య సంబంధం ఉన్నట్లు వ్యాసాలు వ్రాశారు. కాని వీరు కొన్ని

సర్వసాధారణమైన ధ్వని పరిణామాలని ఆధారంగా చూపడంవల్ల వీరి పరిశోధన తృప్తికరంగాలేదు. (ఉరాలియన్ భాషలకీ, అల్టెయిక్ భాషలకీ మధ్య సంబంధం లేదని ఇప్పటికి పండితుల అభిప్రాయం.)

బరో ఉరాలియన్ భాషలకీ, ద్రావిడ భాషలకీ దేహాంగవాచకపదాలలో ఉన్నాయని చూపిన సామ్యాలు నమ్మదగినవిగానే ఉన్నాయి. ఎం. ఆంద్రొనోవ్ **Dravidian and Uralian: A peep into the pre-history of language families**, (*Two*) *lectures on the historicity of language families*, (**Annamalainagar, 1961, pp. 14-32**) లో ఈ రెండు కుటుంబాలకీ పదనిర్మాణంలో కూడా సామ్యాలు ఉన్నాయని చెప్పి బరో సిద్ధాంతాన్ని బలపరిచారు. ఈయన ద్రావిడభాషలలో భూతకాలప్రత్యయాలైన *త్, *చ్, *క్, భవిష్యత్కాల ప్రత్యయాలైన *క్, *ప్, బహువచన ప్రత్యయాలైన *ళ్, *క్, చతుర్థీవిభక్తి ప్రత్యయమైన *క్ మొదలైనవాటి ప్రతిరూపాలు ఉరాలియన్ భాషలలో ఉన్నాయని చెప్పారు. ఇప్పటివరకూ వచ్చిన సిద్ధాంతాలు అన్నింటిలోకి ఇదే కొంతవరకూ ఆమోదయోగ్యంగా ఉన్నట్లు కనపడుతోంది.

లహోవరి (*Dravidian Origins and the west*, **Madras, 1963**) బాస్క్‌కి ద్రావిడభాషలకీ, మెడిటరేనియన్ దగ్గర భాషాకుటుంబాలకీ ద్రావిడభాషాకుటుంబానికీ సంబంధం ఉందని నిరూపించడానికి చేసిన ప్రయత్నం తృప్తికరమైన ఆధారాలు లేనిదీ, సాహసమూలమైనదీ.

అణ్ణామలై యూనివర్సిటీ భాషాశాస్త్ర విభాగంలో పరిశోధన చేసిన సి.టి. ఇంజాయ్ (**Ndiaye**) ఆఫ్రికాలో సెనెగల్ దేశంలో ముఖ్య భాష అయిన ఒలఫ్ (**Wolof**) కీ ద్రావిడభాషలకీ మధ్య సంబంధం ఉందని అభిప్రాయపడ్డారు. ఈయన ఈ భాషలలో పదాలలో ఉన్న సామ్యాలు చాలా సేకరించారు. ఉదాహరణలు—ఒ. యాయ్ 'తల్లి'; త. యాయ్; ఒ. ఒన్న్ 'తాగు'; త. ఉణ్; ఒ. రూ 'దున్ను'; త. ఉళు; ఒ. సూనః; తె. జొన్న; ఒ, వేర్ 'చంద్రుడు'

త. పిశై; ఒ, ఎల్లెక్ "రేవు"; తె, ఎల్ల, తు, ఎల్లగు; ఒ, నగ్ 'అవు'; కోత, నాగ్ 'గేదెదూడ'; ఒ, సాయిః త, దా, తె, చచ్చు, ఈయన పదనిర్మాణంలో కూడా కొన్ని సామ్యాలు చూపేరు. ద్రావిడభాషలు మాట్లాడేవారు కొందరు ప్రాచీనకాలంలో సెనెగల్ వెళ్ళి స్థిరపడ్డారని ఈయన అభిప్రాయం. సెనెగల్ లో ఒలఫ్ ముఖ్య భాష; దీనికి సన్నిహితమైన భాషలు పులార్, సెరేర్, జొల, సొనింకె, మండెజ్; ఇవికూడా సెనెగల్ లో ఉన్నవే. దీనిమీద ఇంకా పరిశోధన జరిగితే కాని ఇది ఆమోదయోగ్యంకాదు.

ద్రావిడ భాషలకి కాకాషియన్ భాషలకి, ద్రావిడ భాషలకి కొరియన్‌కి, ద్రావిడ భాషలకి ఈజిప్షియన్‌కి, ద్రావిడ భాషలకి సుమేరియన్‌కి సంబంధం ఉందని నిరూపించడానికి కొందరు పండితులు ప్రయత్నించారు. కాని వీరు ఉపయోగించిన పద్ధతులు తృప్తికరమైనవి కాదు కాబట్టి ఈ సంబంధాలని గురించి చర్చించడం అనవసరం. డేవిడ్ W. మెకాల్పిన్ (Mc Alpin) Proto-Elamo-Dravidian (1981) అనే గ్రంథంలో ద్రావిడభాషలకి ఈలమైట్‌కి సంబంధం ఉందని వాదించారు. సుసుము ఓనో (Susumu ohno) తమ గ్రంథాల లోనూ, వ్యాసాలలోనూ జపనీస్ భాషకీ తమిళానికీ జన్మ సంబంధం ఉందని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నారు. ఆధారాలు అసమగ్రంగా ఉండడంవల్ల ఈ ఇద్దరి పరిశోధనలూ కూడా పండితుల పూర్తి ఆమోదం పొందలేదు.

### (vi) వాక్య నిర్మాణం :

ద్రావిడ భాషలలో వాక్య నిర్మాణంపై పరిశోధన ఇటీవలే ప్రారంభమైయింది. ఈ అంశంపై పరిశోధనచేసే వారిలో ముఖ్యులు ఎస్. అగస్త్యలింగం (తమిళం), ఇ. అణ్ణామలై (తమిళం), చేకూరి రామారావు (తెలుగు). వీరు కాక ఇతరాంశాల మీద పరిశోధనచేసే పండితులు కూడా వాక్య నిర్మాణం మీద పరిశోధనలు చేస్తున్నారు.

ద్రావిడ భాషలో చాలా భాషలు ఆటవికుల భాషలు అవడంవల్ల ఈ భాషల మీద పరిశోధన ఇటీవల కాలంలోనే మొదలయింది. వీటిలో కొన్నిటి

మీద మన దేశాన్ని ఆంగ్లేయులు పరిపాలించే కాలంలోనే ప్రభుత్వోద్యోగులు, మిషనరీలు పరిశోధనచేసి వ్యాకరణాలు, నిఘంటువులు రచించారు. తులనాత్మక పరిశోధన చేసేవారుకూడా ఈ భాషల ప్రాముఖ్యాన్ని గుర్తించి, అవి ఉన్న స్థలాలకి వెళ్ళి పరిశోధన చేస్తున్నారు. వీటిలో కూడా చాలా మాండలిక భేదాలు ఉండడంవల్లా, వీటి మీద భాషా శాస్త్రజ్ఞులు కానివారు చేసిన పరిశోధనలు సమగ్రం కాకపోవడంవల్లా వీటి మీద ఇంకా ఎక్కువ పరిశోధన చెయ్యవలసిన అవసరం ఉంది. సాహిత్యవంతమైన నాలుగు భాషలలో కూడా ప్రాచీన గ్రంథాలని వ్యాకరించడం, భిన్న కాలాలలో ఉన్న శాసనాల భాషని పరిశోధించడం, కుల స్థల మాండలికాలలో ప్రత్యేకతలని సేకరించడం మొదలైన అంశాల మీద పరిశోధన ఇటీవల కాలంలోనే మొదలయింది. ఇటువంటి వర్ణనాత్మక పరిశోధన తులనాత్మక పరిశోధనకి పునాది కాబట్టి అది తులనాత్మక పరిశోధన నిర్దుష్టంగానూ సమగ్రంగానూ వృద్ధిపొందడానికి ఉపయోగిస్తుంది. ఇటువంటి పరిశోధన ఒక్కొక్క భాష మీద ఎంతవరకూ జరిగిందో ఇంతకు ముందే ఆయా భాషల కింద చూశాం. ద్రావిడ భాషల తులనాత్మక పరిశోధనలోనూ వర్ణనాత్మక పరిశోధనలోనూ చెయ్యవలసినది ఇంకా చాలా ఉంది. ద్రావిడ భాషలు మాట్లాడే ప్రాంతంలో విశ్వవిద్యాలయాలలో పండితులూ ఇతర దేశాలలో పండితులూ ఈ భాషల మీద ఇతోధికంగా పరిశోధనలు సాగిస్తున్నారు.

## ఈ అంశానికి ఆధారాలైన గ్రంథాలు :

అగస్త్యలింగం, ఎస్. & శక్తివేల్, ఎస్. 1973, *A Bibliography of Dravidian Linguistics* (Annamalainagar).

ఎమెనో ఎం. బి., 1969, "The non-literary Dravidian languages" (*Current Trends in Linguistics*, vol 5. (ed. Sebeok, T.A.,) p.p. 334-342)

కృష్ణమూర్తి, భ., 1969, "Comparative Dravidian studies" *ibid.*, pp. 309-333.

జ్వెలబిల్ కె., 1956, "One hundred years of Dravidian comparative philology", *ArO* 24 : 599-609 (reprinted in *TC* 9 (1961): 181-202)

-----, 1972, Review of *Current Trends in Linguistics*, vol. 5 *Lingua* 30.79-88.

-----1990 *Dravidian Linguistics - An Introduction*, Pondicherry.

సుబ్రహ్మణం, పి. ఎస్. 1988, Comparative Dravidian Studies from 1980 *IJDL* 17:59-71.



# II. తులనచరిత్రాత్మక వర్ణనిర్మాణం

## 2.1 ధాతువు - నిష్పాదక ప్రత్యయం.

సోదర భాషలలో ఉన్న వర్ణాలూ, భిన్న భాషలలో ఉన్న వర్ణాల పరస్పర సంబంధం ఆధారంగా తులనాత్మక పద్ధతి (Comparative Method) సాహాయ్యంతో మూలభాషలో వర్ణాలని పునర్నిర్మించవచ్చు. ఆ విధంగా మూల ద్రావిడ భాషాధ్వనులను పునర్నిర్మించడానికి భాషా శాస్త్రజ్ఞులు కృషి చేశారు; ఇంకా చేస్తున్నారు. ఇంతవరకు దీనిపై జరిగిన కృషిని వివరంగా మొదటి అధ్యాయంలో సమీక్షించాము. ఈ అధ్యాయంలో మూలద్రావిడ భాషకి చెందిన వర్ణాలుగా శాస్త్రజ్ఞులు నిర్ణయించిన వర్ణాలు ఏవి? అవి ఇప్పటి భాషలలో ఎటువంటి మార్పులు పొందేయి? అనే విషయాలు పరిశీలిద్దాము.

తులనాత్మక పరిశోధనలో ధాతువు (Root), నిష్పాదక ప్రత్యయం (Derivative suffix) ఈ రెండింటికీ ఉన్న భేదం తెలుసుకోవడం అవసరం. సోదర భాషలలో ఉన్న సజాతి పదాల (Cognates) లో మొదటి కొన్ని వర్ణాలే తుల్యంగా ఉంటాయి. ఇలా అన్ని భాషలలోనూ తుల్యంగా ఉన్న వర్ణసముదాయాన్ని ధాతువు అంటారు. ధాతువులో వర్ణాలు తుల్యంగా లేకపోయినా కొన్ని భాషలలో నియతమైన ధ్వని పరిణామాలు పొంది ఉండవచ్చు. ధాతువు తరవాత ఉన్న వర్ణ సముదాయాన్ని నిష్పాదక ప్రత్యయం అంటారు; కొన్ని సందర్భాలలో నిష్పాదక ప్రత్యయం లేకుండా కేవలం ధాతువు మాత్రమే ఉండవచ్చు. ఉదాహరణకి-

త. మ. ఎలి, కోత. ఎయ్జ్, క. ఎలి, ఇలి, తె. ఎలుక, ప. ఎల్, బ్రా. అల్, (833).[1]

పై వ్యుత్పత్తి సముదాయం (Etymological Group) లో *ఎల్– అనేది అన్ని భాషలలోనూ ఉంది. కాబట్టి ఇందులో అదే ధాతువు. దీనిలో లకారం కోతలో జకారంగా మారింది; ఎకారం కన్నడం ఇలిలో ఇకారంగానూ, బ్రాహుయిలో అకారంగానూ మారింది. ఈ మార్పులు ఈ భాషలలో నియత మైనవే కాబట్టి *ఎల్– ని ధాతువుగా పరిగణించడానికి ఇవి ప్రతిబంధకాలు కావు (వీటిని గురించిన చర్చ ఈ అధ్యాయంలో కింద ఉంటుంది). *ఎల్ – తరవాత ఉన్న త. మ. క. – ఇ, కోత – య్ (కోతలో యకార జకారాలు వర్ణవ్యత్యయం పొందేయి), తె. – ఉక నిష్పాదక ప్రత్యయాలు, పర్జీ, బ్రాహు యిలలో ధాతువు మాత్రమే ఉంది; నిష్పాదక ప్రత్యయంలేదు. దీనినిబట్టి అన్ని భాషలలోనూ తుల్యంగా ఉండే ధాతువే మూలద్రావిడ భాషలో ఉండేది అని నిస్సంశయంగా చెప్పవచ్చు. అయితే మూలద్రావిడ భాషలో నిష్పాదక ప్రత్యయం ఉండేదా? ఉంటే ఇప్పటి భాషలలో కనపడే వాటిలో ఏది మూల ద్రావిడ భాషకి చెందినది? అనే ప్రశ్నలకి సమాధానాలు చాలా సందర్భాలలో ఇదమిత్థంగా చెప్పలేము. కొన్ని పదాలలో భిన్నోపకుటుంబాలకి చెందిన భాష లలో ధాతువుతో పాటు నిష్పాదక ప్రత్యయాలుకూడా తుల్యంగా ఉండవచ్చు. అటువంటిచోట్ల ఆ నిష్పాదక ప్రత్యయంకూడా మూలద్రావిడ భాషలో ఉండేది అని చెప్పవచ్చు. సర్వసాధారణంగా నిష్పాదక ప్రత్యయాలు తరవాత కాలంలో ప్రత్యేక భాషలలోగాని, ప్రత్యేకోపకుటుంబాలలోగాని చేరినవి అయి ఉంటాయి.

1. సజాతిపద సముదాయాల తరవాత కుండలీకరణాలలో ఉన్న సంఖ్యలు బరో, ఎమెనో, 1984. DED (2nd edition) లో ఉన్న పద సముదాయాల సంఖ్యలని సూచిస్తాయి. ఒక పద సముదాయంలో అన్ని భాషలలో పదాలకి సాధారణంగా తెలుగు పదానికి ఉన్న అర్థమే ఉంటుంది. విశేషార్థం ఉన్నచోట అది సూచించబడింది. తెలుగు పదం లేని సముదాయాలతో మొదటి పదం తరువాత ఇచ్చిన అర్థమే అన్ని భాషలకి వర్తిస్తుంది. పూర్తి వివరాలకి ఆ గ్రంథం చూడాలి.

ద్రావిడభాషా కుటుంబంలో ధాతువులని వాటి స్వరూపాన్ని బట్టి ఆరు రకాలుగా విభజించవచ్చు. ( (హ) = హల్లు ఉండవచ్చు, లేకపోవచ్చు; అ = హ్రస్వాచ్చు; ఆ = దీర్ఘాచ్చు).

1. (హ) అ - :

ఉదా : అ-, ఇ- (అక్కడ, ఇక్కడ, అంత, ఇంత మొదలైన వాటిలో నిర్దేశవాచక ధాతురూపాలు);

త. వ - ంతు, 'వచ్చి' మ. వ-న్ను, క. బ..ందు - వీటిలో వరు- 'వచ్చు' రూపాంతరమైన వ - (5270);

త. త-ంతు, 'ఇచ్చి' మ. త-న్ను, క. త - ందు - వీటిలో తరు - 'ఇచ్చు' రూపాంతరమైన త - (3098);

ఈ రకం ధాతువులు చాలా స్వల్పం; ఉన్నవి కూడా మిగిలిన రకాలకి చెందిన ధాతువుల రూపాంతరాలుగానే ఉంటాయి.

2. (హ) ఆ - :

త. మ. కొడ. క. తు. కా - , తె. కా - చు, 'రక్షించు' ప. గ. కూయి, కా - (1416)

త. మ. ఆ, ఆ-న్, కోత. అ-వ్, క. ఆ, ఆ-పు, తె. ఆ-వు. (334)

త. ఈ. మ, ఈ-చ్ఛ, కోత. ఈ - ప్, తొ. ఈ - ప్య్, తె. ఈ - (గ, కో. నా. నీ - ంగ, (533)

3. (హ) అహ - :

త.మ.ఇటు,కోత.ఇడ్-,క.తె.ఇడు,ప.ఇడ్-,గోం.ఇర్ - (442)

త.మ.నిల్,కోత.నిల్,క.తు.నిల్.తె.నిల్ - ఉచు,ప.నిల్ - (3675)

త. ముళ్-అంకు, మ. ముళ్-అజ్జు, క. మొళ్-అగు,

తె. మ్రో-(గు, మ్రో-యు - (4989)

4. (హ) అహ - :

త. మ. అటు, కోత. ఆడ్-, తొ. ఓడ్-, క. తు. తె. అడు, కో. నా, ఆడ్ -, (347)

త. మ. క. అర్-, తె. అర్-చు, ప. అర్-, (367)

త. మ. తేళ్, క. తేళ్, తేళు, తు. చేళు, తేలు, తె. తేలు, మా. తేల్-ఎ, బ్రా. తేల్-, (3470)

5. (హ) అహహ - :

త. కట్టు, మ. కట్టు, కెట్టు, కోత. కట్-, తొ. కొట్-, క. తు, తె. కట్లు, ప. కట్ట్-, గోం. కట్ట్-, (1147)

త. కుప్ప్-అం, కప్ప్-అల్, కుప్-ఐ, మ. కుప్ప్-అ, కోత. కిప్, క. కుప్ప్-ఎ, తె. కుప్ప్-అ, ప. కుప్ప్-అ, కూ. కుప్ప్-అ, (1731)

త. మ. నంపు, కోత. నంబ్-, తొ. నొబ్-, క. తు. నంబు, తె. నమ్ము, (3600)

త. కన్ఱు, మ. కన్ను, తొ. కొఱ్, క. కఱు(వు), కందు, తు. కంజి, తె. కందు, 'చిన్న పిల్ల(వాడు),' (1411)

(అయిదో రకం ధాతువులని ఇంతవరకూ పండితులు మూడోరకంలో అంతర్భాగంగానే పరిగణించారు. వారి మతంలో వీటిలో ద్విత్వ, సంయుక్తాక్షరాలలో మొదటి హల్లు ధాతువుకి చెందినది; రెండవది నిష్పాదక ప్రత్యయ భాగం. కాని చాలా భాషలలో ఈ ద్విత్వ సంయుక్తాక్షరాలు ఉండడంవల్ల వీటిలో రెండో హల్లుని కూడా ధాతు భాగంగానే పరిగణించడం సమంజసం. ఈ అభిప్రాయాన్ని బలపరచడానికి ఇతర కారణాలు కూడా ఉన్నాయి.)

6. (హ)అహహ.:

త.మ. పాంపు, కోత.పాబ్, తొ.పోబ్, క. పావు, కొడ. -
పాంబు, తు.హావు, తె.పాము, కో.నా.పాం, ప.గ.బాం. (4085)
త.మ.తాంటు, కోత.దాట్-, తొ.తోట్-, క.తాంటు,
దాంటు, తు.దాంటు, తె.దాఁటు. (3158)
త.తాన్ట్-ఇ, మ.తాన్న్-ఇ, క.తాట్-ఇ, తాట్-ఎ,
తు.దాండ్-ఇ, తె.తాఁడ్-ఇ, ప.దేండ్-ఇ, దేన్-ఇ,
గోం.తాహ్-కా. (3198)

(ఈ రకం ధాతువులని కూడా ఇంతవరకూ పండితులు ప్రత్యేకంగా పరిగణించలేదు. ఇవి నాలుగో రకానికి చెందినవి అనే వారి ఉద్దేశం సమంజసం కాదు. పై ఉదాహరణలలో స్పష్టత కోసం ధాతువూ నిష్పాదక ప్రత్యయమూ విడివిడిగా ఇవ్వబడ్డాయి. ధాతువు తరవాత ఉకారం మాత్రం ఉంటే దానిని విడిగా ఇవ్వలేదు.)

నిష్పాదక ప్రత్యయంలో మొదటి అచ్చు సాహిత్య రహిత భాషలలో సాధారణంగా లోపిస్తూ ఉంటుంది. అటువంటి అచ్చు తరవాత హల్లు ఉంటే కన్నడంలో కూడా ఆ అచ్చు లోపిస్తుంది. కొర్వు, కొబ్బు, < *కొళ్-ఉవు 'కొవ్వు', నిష్పాదక ప్రత్యయంలో మొదట అచ్చు ఉంటే అది అ, ఇ, ఉలలో ఒకటి అయిఉంటుంది. ధాతువు అజంతమైతే నిష్పాదక ప్రత్యయం మొదట హల్లు ఉంటుంది. హలంత ధాతువు తరవాత వచ్చే నిష్పాదక ప్రత్యయం మొదట సాధారణంగా అచ్చు ఉంటుంది; కాని అరుదుగా హలంత ధాతువు తరవాత హల్లుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం కూడా ఉంటుంది. ఒక భాషలోనే ఒక ధాతువు తరవాత భిన్న నిష్పాదక ప్రత్యయాలు ఉండి కొంత అర్థ భేదాన్ని కల్గిస్తుండవచ్చు. ఉదా: త.కుళ్-అల్ 'పిల్లనగ్రోవి', కుళ్-ఐ, కుళ్-అయ్ 'గొట్టం'; కుళ్-ఇ 'గొయ్యి', కుళ్-ఉంకు 'గొయ్యి'; తె.చెట్-అ, చెట్-ఉవు; వెల్-ఉఁగు, వెల్-ఉతురు; కొమ్మ్-ఉ, కొమ్మ్-అ.

## ౨.౨. మూల ద్రావిడభాషా వర్ణాలు :

మూలద్రావిడభాషలో ఈ క్రింద ఇచ్చిన వర్ణాలు ఉండేవి అని తులనాత్మక పరిశోధనవల్ల తేలింది.

అచ్చులు

| | అగ్రం | కేంద్రం | పశ్చిమం |
|---|---|---|---|
| ఉన్నతం : | ఇ ఈ | | ఉ ఊ |
| మధ్యమం : | ఎ ఏ | | ఒ ఓ |
| నిమ్నం : | | అ ఆ | |

(ఐకారం అయ్‌తో తుల్యం; ఔకారం అవ్‌తో తుల్యం కాబట్టి వీటిని ప్రత్యేకాచ్చులుగా గ్రహించ నక్కరలేదు)

హల్లులు

| | కంఠ్యం | తాలవ్యం | మూర్ధన్యం | దంతమూలీయం | దంత్యం | ఓష్ఠ్యం |
|---|---|---|---|---|---|---|
| స్పర్శం | క | చ | ట | త̱ | త | ప |
| అనునాసికం | | ఞ | ణ | న̱ | న | మ |
| అంతస్థ | | య | | | | వ |
| కంపితం | | | | ర | | |
| పార్శ్వికం | | | ళ | ల | | |
| ఈషత్ స్పృష్టం | | | ఴ | | | |

మూలద్రావిడ భాషలో మూర్ధన్యవర్ణాలైన ట, ణ, ళ, ఴ, ఝా, దంతమూలీయవర్ణాలైన త̱, న̱, ర, లలూ పదాదిని ఉండవు. తెలుగు - కువి ఉపకుటుంబంలో మాత్రం ఇవి వర్ణ వ్యత్యయంవల్ల కొన్ని పదాలలో పదాదికి

వచ్చాయి. పైన ఇచ్చిన హల్లులలో ర, ళలు తప్ప మిగిలిన అన్ని ద్విరుక్తంగా కూడా ఉంటాయి. మూల భాషలో కంఠ్యానునాసికం కకారం ముందే ఉంటుంద కాబట్టి అది ప్రత్యేక వర్ణం కాదు. దంతమూలీయ న̱కారమూ, దంత్య నకారమూ ఇంతవరకూ ప్రత్యేక వర్ణాలుగా పరిగణించబడలేదు; కాని అవి ప్రత్యేక వర్ణాలని చెప్పడానికి కొన్ని ఆధారాలు ఉన్నాయి (చూ. 2.28).

మూలద్రావిడ భాషలో నాదస్పర్శాలు (గ, జ, డ, ద, బ) ప్రత్యేక వర్ణాలుగా లేవు. తమిళ-మళయాళాలు తప్ప మిగిలిన భాషలలో ప్రాచీనమైన శ్వాసస్పర్శాలు (క, చ, ట, త̱, త, ప) కొన్ని పదాలలో నాదస్పర్శాలుగా తర్వాత కాలంలో మారేయి (చూ. 2.19). మూలద్రావిడభాషలో ద్విరుక్త స్పర్శాలూ, అనునాసిక సహితస్పర్శాలూ కొన్ని భాషలలో ప్రత్యేకమైన మార్పులు పొందేయి. అవి ఈ అధ్యాయంలో ఆయా స్పర్శాల కింద విడిగా చర్చించబడతాయి. దంతమూలీయస్పర్శమైన త̱ బండి అ మూలరూపం.

## అచ్చులు

2. 3. *అ.

మూ. ద్రా. * అకారం తొద, పర్జీలలో తప్ప మిగిలిన అన్ని భాషల లోనూ అకారంగానే ఉంటుంది. ఉదా :

త. అరై, మ. అర, తొ. కోత. అర్, క. తు. అరె. తె. అర, 'సగం'. (229)

త. పల్, మ. పల్, పల్లు తొ. పస్̱, కోత. పల్, క. పల్, కొడ. పల్లు, తు. పరు, తె. పలు, పల్లు, పన్ను, కో. నా. పల్, ప. పెల్, గ. గోం. కొం. పల్, కూయి. పడు, పలు, కువి. పల్లు, కూ. పల్లా్, మా. పలు. (3986)

త. మ. క. కణ్, కోత. కణ్, తొ. కొణ్, కొడ. కణ్ణు, తు. కణ్ణు, తె. కను, కన్ను, కో. నా. ప. కన్, గ. (ఒ.) కణ్ (సా) కను, గోం. కన్,

కథ్, కొం. కణ్, పె. కణ్గ, మం. కన్, కూయి. కను, కువి, కను, కూ. ఖన్, మా. ఖను, బ్రా. ఖన్. (1159)

తొదలో *అకారానికి అ, ఒ అనే రెండు ప్రతిరూపాలు (Reflexes) ఉన్నాయి. ఈ భాషలో అకారం *ర, *ల, *ఴ, ల ముందూ, *-అయ్ ముందూ, అకారానికి ముందు ఉండే మూర్ధన్యాక్షరం ముందూ— ఈ మూడు పరిసరాలలోనూ అకారంగానే ఉంటుంది: (ఈ మార్పు తరవాత *-అయ్, *-అలు తొదలో లోపిస్తాయి).

తొ. నర్య్ 'నక్క' : త. మ నరి, (3606)

తొ. మద్ 'మందు' : త. మరుంతు, క. మర్దు, మద్దు, (4719)

తొ. కబ్ 'చెరుకు' : త. కరుంపు, క. కర్బు, కబ్బు, (1288)

తొ. పల్ 'వల' : త. వలై, మ. వల, (5288)

తొ. పస్రొఫ్ 'పనస' : త. పలవు, పలా, (3988)

తొ. అట్య్ 'ఎరుగు' : త. మ. క. అటి, (314)

తొ. మట్య్ 'చిన్న జంతువు' : త. మ. మఱి, (4764)

తొ. అఫ్, అపుఫ్ 'అమ్మ' : త. అవ్వై, తె. అవ్వ, (273)

తొ. మద్ 'తల' : త. మంతై, (4682)

తొ. మన్ 'ఇల్లు' : త. మనై, క. మనె, (4776)

తొ. అళ్ 'కొలుచు' : త. మ. అళ, (295)

తొ. నధ్ 'నడచు' : త. మ. నట, క, నడె, (3582)

మొదటి అక్షరంలో మిగిలిన పరిసరాలల్లోనూ, రెండో అక్షరంలో అన్ని చోట్లా *అకారం ఒగా మారుతుంది:

తొ. ఒజ్ 'భయపడు' : త. మ. అంచు, (55)

తొ. కొఙ్ 'గేదెదూడ' : త. కన్ఱు (1411)

తా. పొణ్య్ 'పని' : త. మ. క. పణి. (3884)

తా. కొనాఫ్ 'కల' : త. కనవు, కనా. (1407)

తొాద ఎరువు తెచ్చుకొన్న కొన్ని పదాలలో *అకారం అకారంగానే మిగిలి ఉంటుంది : తా. కక్ - 'కక్కు' (< త. కక్కు-), తా. కత్య్ 'గాడిద' (<క. కత్తె), అణిల్ 'ఉడత' (< త. మ. అణిల్). ఈ పదాలు తొాదలో *అకారం ఒకారంగా మారడం పూర్తి అయ్యాక ఆ భాషలోకి వచ్చినవి.

పర్జిలో *అకారం ప్రాచీన దంతమూలీయవర్ణాలు, అంటే *ఱ, *న్ట, *ర, *ల లముందు ఎకారంగా మారుతుంది; మిగిలిన వర్ణాల ముందు అకారం గానే ఉంటుంది :

ప. వెద్ప్ 'వేయించు' : త. మ. వఱు. (5325)

ప. తెంద్ 'తండ్రి' < *తన్ట్ : తె. తండ్రి, కూయి, తంజి. (3067)

ప. మెన్ 'ఉండు' : తె. మను, గోం, గ, మన్. (4778)

ప. కెల్ 'రాయి' : త. మ. క. కల్. (1298)

ప. వెర్ 'వచ్చు' : త. మ. వరు, క. బరు (5270)

ప. కన్ 'కన్ను' : త. మ. క. కణ్, తె. కన్ను. (1159)

ప. కడ్ప 'దాటు' : త. మ. కడ, తె. కడచు. (1109)

*అకారం ముందు *య, *చలు ఉండే దంతమూలీయ వర్ణం పరంగా ఉన్నా అది ఎ గా మారదు.

ప. అన్ - (అన్ 'నేను' ఔపవిభక్తికరూపం) < *యన్ - (5160)

ప. చర్ 'మెడ' : తె. అఱు, అఱ్ఱు. (2419)

ప. చర్ప 'తోలు (క్రియ' : గ (ఒ.) సర్ప్, (సొ.) సర్ప్ - (2362)

2.4 *అ.

మూ. ద్రా. *ఆకారం తొద, పర్జిలలో తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఆకారంగానే ఉంటుంది.

త. మ. కాల్, తొ. కోల్, కోత. క. కాల్, కొడ. కాలు, తు. కారు, తె. కాలు, కో. కాల్, ప. కేల్, గ (ఒ.) కాల్, గోం. కొం. పె. మం. కాల్, కూయి, కాడు, కువి. కాలు. (1479)

త. మ. ఆటు, కోత, ఆడ్-, తొ. ఓడ్-, క. తు. అడు, తె. ఆడు, కో. నా. ఆడ్- (347)

త. మ. పాటు, కోత, పాడ్య్-, తొ. పోడ్-, క. పాడు, కొడ. పాడ్-, తె. పాడు (క్రియ), కో. నా. ప. పాడ్-, గ. పార్-, గోం. పార్-, వార్-, కొండ. పాత్-, కువి పాచ్-, కూ. మా. పాథ్-. (4065)

త. మ. కోత. పాల్, తొ. పోస్, క. పాల్, తు. పేరు, తె. పాలు, కో. పాల్, ప. పేల్, గోం. కొం. పాల్, కూయి. పాడు, పాలు. కువి. పాలు, బ్రా. పాల్. (4096)

తొదలో *ఆకారానికి ఆ, ఓ అనే రెండు ప్రతిరూపాలు ఉన్నాయి. ప్రాచీనమైన *-అయ్ ముందు *ఆకారం ఆగానే ఉండిపోతుంది; మిగిలినచోట్ల *ఆ ఓగా మారుతుంది :

తొ. కాక్ 'కాకి' : త. కాక్కై, మ. కాక్క, క. కాకె, కాగె, తె. కాకి. (1425)

తొ. పార్ 'గునపం' : త. పారై, మ. పార, క. పారె, తె. పార. (4093)

తొ. పాస్ 'ఒక చెట్టు' : త. పాలై, మ. పాల, క. పాలె, తె. పాలగరుడ. (4100)

తొ. ఆస్ 'ఏనుగు' : త. యానై, మ. ఆన, క. ఆనె, తె. ఏనుగు. (5161)

తొ. పావ్ 'అరటి' : త, వాళై, మ. వాళ, క. బాళె (5373)

తొ. ఓళ్ 'మనిషి' : త. మ. క. ఆళ్. (399)

తొ. కోడ్ 'పొలం' : త. మ. కాటు 'అడవి' క. తె. కాడు. (1438)

తొ. పోన్ 'ఆకాశం' : త.మ. వాన్. వానం. క. బాన్. తె. వాన. (5381)

(దీనివల్ల తొదలో *అ, *అలు ఒ,లు ఓగా మారేటప్పుడు *-అయ్ ఉండి దాని ముందు *అ, *ఆకారాలు మారకుండ ఆపి, తరవాతనే అది లోపించిందని తెలుస్తుంది.)

పర్జిలో ఆకారం ప్రాచీన దంతమూలీయ వర్ణాలముందు ఏ గా మారుతుంది; మిగిలిన వర్ణాలముందు ఆగానే ఉంటుంది.

ప. ఏద్-, ఏడ్- 'చల్లారు' : త. మ. క. తె. ఆఱు. (404)

ప. దేంది, దేని 'తాడి' : తాన్ని, క. తాటి, తె. తాఁడి. (3198)

ప. వేల్ - 'ఎగురు, దూకు' : గ (ఒ.) పాల్-. (5368)

ప. కాల్ - 'కాలు, మండు' : మ. కాళు, తె. కాలు. (1500)

ప. తాక్ - 'నడుచు' : గ. కూయి, గోం, తాక్-. (3151)

## 2.5 *ఇ.

మూ.ద్రా. *ఇకారం అన్ని భాషలలో ఇకారంగానే ఉంటుంది. తొదలో మాత్రం దీనికి ఇ, ఇ̈ అనే రెండు ప్రతి రూపాలు ఉన్నాయి (వీటిలో ఇ̈ చ,చ̄, సల ముందు మాత్రమే ఉంటుంది.)

త. మ. విల్, తొ. పి̈స్ కోత: విళ్య, క. బిల్, 'బిల్లు' కొడ. బిల్లు. ఘు. భిల్లు, బిరు, తె. విలు, విల్లు, కో. ప. విల్, గ. విండు, గోం. కొం. పె. మం. విల్, కూయి విడు, విలు కువి. వెల్లు, బ్రా. బిల్. (5422)

త. మ. ఇల్, ఇల్లం, తు. ఇల్లు, తె. ఇల్లు, కో. నా. ఎల్ల, ప. ఇల్ పొది 'ఇంటి కప్పు', కొం. ఇలు, కూయి. ఇడు, కువి. ఇల్లు, పెం. మం.ఇల్. (494)

త. పిళ్ళై. మ. పిళ్ల, కోత. పయ్‌ళ్, క. పిళ్లై, పిళ్ల, కొడ. పళ్ళై, తు. పిళ్ళై, తె. కో. నా. పిల్ల, కూ, పెల్లో, మా. పెలి 'స్త్రీ', బ్రా. పిల్లోత. (4198)

## 2.6. *ఈ.

మూ.ద్రా. *ఈకారం అన్ని భాషలలోనూ ఈకారంగానే ఉంటుంది :

త. ఈ. మ. ఈచ్చ, తొ. ఈప్య్, కోత. ఈప్, తె ఈఁగ, కో. నా. నీంగ, కూ. మా. తీన్-ఈ. 'తేనెటీగ', బ్రా. ఈల్. (533)

త. మ. కోత. క. తీర్, 'పూర్తి అవు', కొడ. తీర్. తు. తె. తీరు కో. నా. తీర్-? కూ. తీర్. 'వెనకపడు, ఆలస్యం చేయు', మా. తీర్ 'వెళ్ళిపోవు.' (3278)

త. మ. నీర్, ఈర్/ఈరం 'తడి' తొ. కోత. క. నీర్, కొడ తు. నీరు, నీళ్లు, కో. నా. నా (ఛాం.) ఈర్, ప. గ. నీర్, కొం. నీర్ మసు 'మంచు', కూయి. నీరు 'రసం', బ్రా. దీర్ 'నీరు, రసం.' (3690)

## 2.7. *ఉ.

మూ.ద్రా. *ఉకారం అన్ని భాషలలోనూ ఉకారంగానే ఉంటుంది; తొదలో మాత్రం దీనికి ఉ, ఉ, ఇ మూడు ప్రతిరూపాలు ఉన్నాయి. ఉ అనే ధ్వని ఇ, య, చల ముందూ, ఇ ఓష్ఠ్యానికి (ప, మ) అకారానికి మధ్యా, ఓష్ఠ్యం ముందూ, ఉ మిగిలిన చోట్లా వస్తాయి.

త. మ. ఉళ్, తొ. విళ్డ్-. కోత. ఒళ్-, క. ఉళ్, క. ఉళ్, ఒళ్, కొడ. తు. ఉళ్ల్-, తె. ఉండు, బ్రా. ఉట్. (697)

త. మ. కుత్తు 'గుచ్చు, తవ్వు,' కోత. తొ. కుత్-, కొడ. కుత్-, తు. కుత్తు, గోం. గుహ్ట్-, కొం. గుత్-, పె. కుంద్-, మం. కుత్-, కుంద్-, కూయి, కువి కుత్-, బ్రా. ఖుత్-. (1719)

త. నుంకు 'మింగు', తొ. నుగ్, కోత. నుంగ్-, క. నుంగు, తు. నింగు, కూయి. నునుఖ్-, మా. నుంగ్-, బ్రా. నుఘుష్-. (3697)

త. మ. పులి, కో. పుజ్, తొ. పుస్రియ్, క. పులి, తు. పిలి, తె. పులి, కో. నా. పుల్, గ(ఒ.)బెర్‌పుల్, (సా.) పుల్లు, గోం. పుల్లీ. (4307)

## 2.8. *ఊ.

మూ. ద్రా. *ఊకారం అన్ని భాషలలోనూ ఊకారంగానే ఉంటుంది :

త. మ. కోత. తొ. క. ఊర్, కొడ. ఊరు, తె. ఊరు, కో. నా. ఊర్, బ్రా. ఉరా 'ఇల్లు, భార్య'. (752)

త. మ. నూల్, తొ. నూస్ర్, కోత. క. నూల్, కొడ. తు, నూలు, తె. నూలు, కో. ప. గ. గోం. నూల్, కొం. నూలు, పె. మం. నూల్, కూయి. నూడు, కువి. లూలు. (3726)

త. పూ, మ. పూ, పూవు, కోత. పూ. తొ. పూఫ్, క. కొడ. తు. పూ, తె. పూ, పూవు, పువ్వు, కో. పువ్, నా. పూత, ప. గ. పూ, గోం. పుంగార్, కొం. పూజ్, పెం. మం. పుయ్, కూయి. పూజు, కువి. పూయు, కూ. పూప్, పూంప్. మా. పూపు. (4345).

## 2.9. *ఎ.

మూ. ద్రా. *ఎకారం అన్ని భాషలలోనూ ఎకారంగానే ఉంటుంది. తొదలో దీనికి ఎ, ఒ అనే రెండు ప్రతిరూపాలు ఉన్నాయి; ఎ అనునాసికేతర దంత మూలీయ వర్ణం (ఱ, ర, ల) ముందూ, ఒ మిగిలిన చోట్ల ఉంటాయి.[1] గోండిలో ట్రెంచ్ వర్ణించిన బెతూల్ మాండలికంలో *ఎ అగా మారుతుంది. పర్జీలో కూడా కొన్ని పదాలలో *ఎ అగా మారింది.[2] బ్రాహుయిలో *ఎ కొన్ని పదాలలో ఇ గానూ మరికొన్నింటిలో అగానూ మారింది.

త. మ. చెవి, తొ. కి ఫ్య్, కోత. కెయ్వ్. క. కివి, కొ. కెవిఁ, తు. కెబి. తె. చెవి, కో. నా. నా (ఛాం.) కెవ్, ప. గ. కెకొల్, గోం. కవీ, కెవ్

1. కొన్ని పదాలలో *ఎ కారం తొదలో ఇగా గాని ఇగా గాని మారుతుంది. ఇటువంటి చోట్ల *ఎ కారం తరవాత తాలవ్య హల్లు (*య, *చ, *ంచ లలో ఒకటి) గాని (తరవాత అక్షరంలో) *ఇ గాని * ఉ గాని ఉంటాయి. ఉదా : తొ: కిఫ్య్ <* కెవి 'చెవి'. తొ. ఇస్ర్య్ <* ఎలి 'ఎలుక', తొ. ఇయ్, 'తెలియు' <* ఎయ్, నిజ్ <* నెంచ్ 'గుండె', ఇర్ <* ఎరుమయ్ 'గేదె', ఇటువంటి చోట్ల మధ్యాచ్చు, ఉచ్చాచ్చుగా తరవాత వచ్చే తాలవ్య హల్లు లేక ఉచ్చాచ్చు ప్రభావంవల్ల మారిందన్న మాట. ఇటువంటి మార్పు ప్రాచీన కన్నడంలో కూడా ఉంది. (చూ. 2.15)

2. పర్జీలో *ఎ > అ కి ఉదాహరణలు : ప. మర్స్ - 'మెరియు' ( : కొ, మెర్ప్-), ప. వంద 'వేలు' ( : కో. వెందె.).

కొం. గిబి, పె. కితుల్, మం. గియ్, కూ. ఖెద్దా, మా. ఖెత్వు, బ్రా. ఖఫ్. (1977).

త. మ. ఎలి, తొ. ఇస్రయ్, కోత. ఎయ్‌ఙ్, క. ఎలి, ఇలి, కొడ. ఎలి, తు. ఎలి, ఇలి, తె. ఎలుక, కో. నా. ఎల్క, నా. (ఛాం.) ఎల్లి, ప. ఎల్, గ. (ఒ.) సిర్-ఎల్, గోం. అల్లీ, ఎల్లీ, కొం. ఎల్క, బ్రా. అల్. (833)

త, మ. పెరు, పెరియ 'పెద్ద', పెరుకు 'పెరుగు', కోత, పె., 'పెద్ద' తొ. పె., పెర్, క, పెర్, కొడ, పెరు(ం)- 'పెద్ద' పెరు- 'పెరుగు', తు. పెరి, పెరియ 'పెద్ద', పెర్చు 'పెరుగు', తె. పెద్ద, పెరుగు, కో. నా. పెర్గ్-, ప. బెర్తొ, 'పెద్ద', గో. పెర్స 'పెద్ద', కొం. పెర్, పెరి, కూయి. బెరిబెరిఇస్ - 'వాచు', ? కూ. పర్ద్ - 'పెరుగు', బ్రా. పిర్ - 'వాచు' (4411).

## 2. 10. ఏ.

మా. ద్రా. *ఏ కారం అన్ని భాషలలోనూ ఏ కారంగానే ఉంటుంది. తొదలో దీనికి ఏ, ఓ అనే రెండు ప్రతిరూపాలు ఉన్నాయి; వీటిలో ఏ యకారం ముందూ, ఓ మిగిలినచోట్లా వస్తాయి. పర్జిలో *ఏ అ గా వార్ < *వేర్ 'వేరు'లో కనపడుతోంది.

త. మ. తేళ్, క. తేళ్, తేళు, కొడ. తేళు. తు. తేళు, తె. తేలు, మా. తేలె, బ్రా. తేల్ర్. (3470)

త. మ. వేర్, తొ. పోర్, కోత. వేర్, క. బేర్, కొడ. బేరు, తు. బేరు. తె. వేరు, కో. నా. వేర్, ప. వార్, గ. వేర్, కొం. వేల, కువి. వే?ల. (5535)

త. మ. కోత. మేయ్-, తొ. మీయ్-, క. మేయు, కొడ. మేయ్-, తు. తె. మేయు, కో. నా. మీయ్-, ప. గోం. కూయిమేయ్, కూ. మెన్-, మా. మిన్-, బ్రా. బెఇ 'మేతకువేసే గడ్డి.' (5093)

## 2. 11. ఒ.

మూ. ద్రా. *ఒ కారం తొద, బ్రాహూయీలు తప్ప మిగిలిన భాషలలో ఒకారంగానే ఉంటుంది. తొదలో దానికి వ, వి, ఇ అనే మూడు ప్రతిరూపాలు ఉన్నాయి. వీటిలో వ, *అయ్ ముందూ అనునాసికేతర దంతమూలీయ (ఙ, ర, ల) ముందూ వస్తుంది; మిగిలినచోట్ల వి వస్తుంది; ప కారం తరవాత ఇందులో వ కారం లోపించి ఇది ఇ గా ఉంటుంది. బ్రాహుయీలో *ఒ, ఓ, ఉ, అ లలో ఒకటిగా మారుతుంది (వీటి పరిసరాలు నిర్ణయించడం సాధ్యంకాదు). బ్రాహుయీలో మూ. ద్రా. *ఎ, *ఒ లు పోవడానికి కారణం, దాని చుట్టూ ఉన్న ఇండో - ఆర్యన్, ఇరానియన్ భాషల ప్రభావమని అంటారు.

తె. బొగ్గు, కో. బొగ్, ప. బొగ్, బొగుం, గ. జొగ్గె, కువి. బొగు, బ్రా. పోఖ్. (4467)

త. మ. చొటి, తొ. త్వఛ్య్, కోత తోయ్ర్, క. తుటి తుటికె, తు. తొజ్జి, తె. దురద, ప. చొద్- 'దురదపెట్టు', గ. సొయ్-, గోం. చొహ్-, చొహ్క్-, కూయి సొహ 'తామర.' (2865)

త. ఒట్టై 'బద్దలవు', తొ. వడ్- (946)

త. మ. కోత. పొన్, తొ. పిన్, క. పొన్, కొడ. తు. తె. పొన్ను 'బంగారం.' (4570)

మూ ద్రా. *ఒ > బ్రా, ఉ. అ లకి ఉదాహరణలు :

త. చొట్టు 'చుక్క' : బ్రా. చుట్ 'చుక్క' చుట్ట్ 'కారు'

త. చోర్, చొరి 'ప్రవహించు' : బ్రా. చుర్ర్- 'ప్రవహించు'

త, ఒన్ఱు, తె, ఒండు : బ్రా, అసిట్ 'ఒకటి'

త, కొల్ 'చంపు' : బ్రా, ఖల్ల్ - 'కొట్టు, చంపు'

## 2. 12. *ఓ.

మూ. ద్రా. *ఓ కారం తొద తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఓ కారంగానే ఉంటుంది. తొదలో దానికి వా, వీ, ఈ అనే మూడు ప్రతి రూపాలు ఉన్నాయి. (వా *-అయ్ ముందు వస్తుంది; *ప తరవాత *ఓ ఈ గా మారుతుంది; మిగిలిన చోట్ల వీ గా మారుతుంది).

త. తోంటాన్, క. తోళ, తు. తోళు, తె. తోఁడేలు, బ్రా. తోల 'నక్క' (3548)

త. చోలై '(పూల)తోట', మ. చోల, తొ. త్వాస్. కోత. తేల్, 'అడవి' (2891)

త. మ. కోత. పోర్, తొ. పీర్. క. పోర్, తె. కూయి పోరు. (4540)

త. మ. కోత. తోల్, తొ. ట్వీస్. క. తోలు, తొగల్, తొవల్, కొడ. తోలు, తు. తుగలు, తొలికై, తె. తొక్క, తోలు, కో. నా. ప, గ. గోం.కొం. పెం. తోల్, కువి. తోలు. (3559)

(మనం పైన మూలద్రావిడభాష అచ్చులు వివిధ భాషలలో పొందిన సాధారణ పరిణామాలు చూశాము. కొన్ని భాషలలో కొన్ని అచ్చులకి ప్రత్యేక మైన పరిణామాలు ఉన్నాయి. అవి ఈ క్రింద 2.13-18లలో చర్చించబడతాయి.)

## 2.13. ధాతువులో దీర్ఘాచ్చులు హ్రస్వాచ్చులుగానూ, ద్విరుక్త హల్లులు అద్విరుక్త హల్లులుగానూ మారడం.

ద్రావిడభాషా ధాతువులలో దీర్ఘాచ్చు ధాతువు తరవాత, నిష్పాదక ప్రత్యయం లేనప్పుడూ, హల్లుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం ఉన్నప్పుడూ దీర్ఘాచ్చుగానే ఉంటుంది. కాని ధాతువు తరవాత అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం వచ్చినప్పుడు మాత్రం ధాతువులో దీర్ఘాచ్చు హ్రస్వంగా మారుతుంది. ఈ మార్పు క్రియలలో అపవాదరహితంగా కనపడుతుంది. కాని నామవాచకాలలో త్ర్యచ్కాల (Trisyllabics) లోనే ఇది సాధారణంగా వస్తుంది; ద్వ్యచ్కాల (Disyllabics) లో ఇటువంటి మార్పు సాధారణంగా రాదు. కొన్ని ద్వ్యచ్కాలలో మాత్రం మార్పు వచ్చిన రూపం, రాని రూపం కూడా ఉన్నాయి. ఇటువంటి పరివర్తనగల చోట్ల దీర్ఘాచ్చు ఉన్న రూపం ఒకటి రెండు భాషలలో మాత్రమే ఉన్నా కూడా అది మూలభాషకి చెందినదిగానే గ్రహించాలి. ద్విరుక్త హల్లు ఉన్న రూపం విషయం కూడా అంతే.

ఇటువంటి మార్పు (కొన్ని పదసముదాయాలలో) చాలా ద్రావిడభాషలలో కనబడుతూ ఉండడంవల్ల ఇది మూలద్రావిడభాషలోనే మొదలై ఉంటుంది అని ఊహించవచ్చు. అందువల్ల కొన్ని పదసముదాయాలలో ఒకే భాషలో దీర్ఘాచ్చుగల ధాతురూపమూ (నిష్పాదక ప్రత్యయం లేకుండా), హ్రస్వాచ్చుగల ధాతురూపమూ (అచ్చుతో మొదలయ్యే నిష్పాదకప్రత్యయంతో) మనకు కనిపిస్తూ ఉంటాయి. కొన్ని భాషలలో ధాతువులో హ్రస్వాచ్చుకి కారణమైన నిష్పాదక ప్రత్యయం మొదటి అచ్చు లోపించడం కూడా ఉంది.

త. ఆర్, అరఞ్ఞు, కోత. ఆర్-, క. ఆర్, అర్బిసు, కొడ. అర, తు. అద్క-, అరటు, తె. ఆర్చు, గ. అర్గ్-, ప. కూ. అధ్- (క. అర్బిసు, గ. అర్గ్‌లలో ప్రాచీనకాలంలో రేఫ తరవాత అచ్చు ఉండేది. అది ధాతువులో

అచ్చుని హ్రస్వంగా మార్చిన తరవాత లోపించింది). మూ.ద్రా. *అర్-అర్-అ.[1] (367)

త. కిఱావు '(నెమలి) అరుచు', కోత. కిర్య్-, తొ. కిఃచ్-, క. కిఱచు, కిఱిచు, కిఱుచు, కిర్చు, తె. చీఱు 'పిలుచు' కూయి, కిహ - 'అరుచు', మూ.ద్రా. *కీఱ్-/*కిఱ్-అ. (1590)

త. పొరు, పొరుతు 'యుద్ధంచేయు', పోర్ 'యుద్ధం', క. పోర్, తె. పోరు, గ (ఒ.) పొరు- 'కోపపడు'. మూ.ద్రా. పోర్-/*పొర్-అ (4540)

త. నెరునల్, నెరునై, నెన్నల్, నేఱ్ఱు, కోత. నేర్, బ్రా. దరో (>*నెరో) 'నిన్న', మూ.ద్రా. *నెఱ్ఱ్/-నేఱ్-/*నెర్-అ (3758)

త. కుళంతై 'పిల్లవాఁడు', క, కొణసు 'అడవి జంతువు పిల్ల', తె. కొడుకు, కోడలు, కూయి. కోడు 'లేతకొమ్మ, మొగ్గ', కూ. ఖోర్, 'చిగురు, చిగుర్చు', మా. ఖోరొ 'పిల్ల(వాడు)'. మూ.ద్రా. *కోళ్ -/ *కొళ్ - అ(2149).

త. మ. పఱ, పఱి, పాఱు, క. పాఱు, తె. పఱచు, పాఱు, మూ.ద్రా. *పాఱ్ -/ *పఱ్ - అ. (4020).

మ. చేఱు, క. కేఱు, తె. చెరుగు, చేట, కో. ప. కేద్-, కూ. మా. కేస్-మూ.ద్రా. కేఱ్ - /తె. *కెఱ్ - ఉకు. (2019).

త. పొఴుతు, పోఴ్తు, మ. పొఴుతు, పోతు, క. పొత్తు, తె. ప్రొద్దు, గోం. పోడ్ద్. మూ.ద్రా. *పోఴ్ -/ *పొఴ్ - అ. (4559).

త. మూఴ్, మూఴ్కు, ముఴుకు, క. ముఴుంగు, తె. బ్రుంగు, మునుఁగు' ప. బూడ్ -, మూ.ద్రా. *మూఴ్ -/ *ముఴ్ - అ. (4993).

---

1. ఇటువంటి పునర్నిర్మిత రూపాలలో అ = ఏదో ఒక అచ్చు (అ,ఇ,ఉ); దాని తరవాత హల్లు(లు) కూడా ఉండవచ్చు. అచ్చే ధాతువులో మార్పుకి కారణం కాబట్టి దాన్ని మాత్రం సూచిస్తారు.

త.మ. అఱుపతు, ఆఱు, క. అఱువత్తు, ఆఱు, తె. అఱువది, ఆఱు' మూ.ద్రా. *ఆఱ్ -/ *అఱ్ - ఉ(పత్తు. (2485).

ఇటువంటి మార్పు యుష్మదస్మదర్థక సర్వనామాలలోనూ (మూ. ద్రా. *యాన్ 'నేను', విభక్తులముందు యన్ -, మొ.) ఆత్మార్థక సర్వనామాల లోనూ (తె. తాను, తన; తాము, తమ) సంఖ్యావాచకాలలోనూ (తె. ఆఱు, అఱువది; ఈరేడు, ఇరువది; నాలుగు, నలువది, మొ), కొన్ని విశేషణాలలోనూ (త. చిఱ్ - అటి 'చిన్న అడుగు', చిఱుకతై 'చిన్నకథ', పేర్ - అవై "పెద్ద సభ', పెరుంపులి 'పెద్దపులి', తె. పేరోలగము, పెద్ద < *పెర్ద మొ), కూడా చాలా భాషలలో కనపడుతోంది.

ద్వ్యచ్క నామవాచకాలలో అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం ఉన్నా ధాతువులో దీర్ఘాచ్చు సాధారణంగా మారదు. ఉదా :

త. కాక్కై, మ. కాక్క, క. కాకె/కాగె, తె. కాకి

త. మ. క. కోళి, తె. కోడి

త. పానై, మ. పాన, తె. బాన

ఇటువంటి నామవాచకాలలో మార్పుకి ఉదాహరణలు క్వాచిత్కంగానే ఉన్నాయి: త. ఊళై 'నక్క/కుక్క అరుపు', ఉళై 'ధ్వని'; త. కూళై, కుళై 'బురద', త. నీళల్, నిళల్ 'నీడ', త. మూరి, మురి 'వంకర', త్ర్యచ్క నామవాచకాలలో ధాతువులో దీర్ఘాచ్చు నిత్యంగా హ్రస్వం అవుతుంది:

త. పేతై 'స్త్రీ'. పెతుంపై '8-11 మధ్య వయస్సుగల పిల్ల'

త. మాళై. మళ, మళలై 'చిన్నతనం'

త. పోళ్తు, పొళుతు 'పొద్దు'

అచ్చుతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం ముందు ధాతువులో దీర్ఘాచ్చు హ్రస్వమైనట్లుగా ద్విరుక్త హల్లు కూడా అద్విరుక్తంగా మారుతుంది. పదంలో అక్షరాల సంఖ్య ఎక్కువ అవడమే ఈ మార్పులకి అసలు కారణం. హల్లులలో మార్పు కూడా క్రియలలోనూ త్ర్యచ్క నామవాచకాలలోనూ అపవాద రహితంగా ఉంటుంది; ద్వ్యచ్క నామవాచకాలలో మాత్రం ఇది క్వాచిత్కంగానే కనపడుతుంది.

త. కొట్టు '(తేలు) కుట్టు', కొటుక్కు 'తేలు కుట్టడం' క. కుటుకు 'కుట్టు', ప. కొడ్క్-, కొట్ట్-. (2064)

త. పుకై, తె పొగులు, పొక్కు 'చింతించు' (4456)

త. క. ముచ్చు 'మూయు', తె. ముసుఁగు, మూయు (4915)

త. మ. క. కప్పు, కవి, తె. కప్పు, కవియు[1] (1221)

త. మ. తప్పు, తవఱు, తె. తప్పు (3071)

త. కిళ్లై, కిళి, తె. చిలుక (1584)

త. మ. చెటి, తె. చెట్టు (1941)

త. పొత్రై, పొట్టై 'కొండ' (4567)

త. ఇఱ్ఱి, ఇఱైచ్చి, తె. ఎఱచి 'మాంసం' (529)

క. తొట్టు, తొడంబె, తె. తొడిమ (3487)

త. మ. వెళ్లై 'వెల్ల', వెళుప్పు 'తెలుపు', వెళిచ్చం, 'వెలుగు', క. బెళ్ళి 'వెండి', బెళుపు బెళ్పు, తె. వెల్ల. వెండి, వెలుఁగు. (5496)

---

1. అచ్చుల మధ్య అద్విరుక్తపకారం వకారంగా మారడం ద్రావిడ భాషలలో సార్వత్రికం (చూ. 2.24).

## 2. 14. తెలుగులో య ముందు దీర్ఘాచ్చు

తెలుగులో యకారాంతాలైన క్రియలలోనూ నామవాచకాలలోనూ దీర్ఘాచ్చే ఉంటుంది. దీని స్థానంలో మిగిలిన భాషలలో కొన్ని పదసముదాయా లలో హ్రస్వాచ్చూ మరికొన్నింటిలో దీర్ఘాచ్చూ ఉంటాయి. ఇతర భాషలలో హ్రస్వాచ్చుకి ఉదాహరణలు :

తె. ఏయు : త. మ. తు. ప. ఎయ్–, క. ఎసు, ఎయ్ (805)

తె. కోయు : త. మ. కోత. క. కొడ. తు. వ. గోం. కొయ్. (2119)

తె. నేయు : త. మ. క. తు. నెయ్ (3745)

తె. చేయి : త. మ. కై. క. కొడ. తు. గోం. కయ్, కోత, కయ్, తొ. కొయ్, కువి కెయ్యు. కో నా. కీ. ప. కెయ్, గ. కి, కొం. కియు, పెం. కెయ్, కూ. కజు. (2023)

తె. నేయి : త. మ. క. కొడ. తు. కో. ప. నెయ్. (3746)

అన్ని భాషలలోనూ దీర్ఘాచ్చుకి ఉదాహరణలు :

తె. మేయు : త. మ. క. కొడ. తు. గోం. ప. మేయ్. (5093)

తె. వేయు 'to thatch' : త. వేయ్, మ. మేయ్, కోత. వేజ్., తొ.: పేయ్. - (5532).

మిగిలిన భాషలలో హ్రస్వాచ్చుకి తుల్యంగా తెలుగులో దీర్ఘాచ్చు ఉన్న చోట హ్రస్వాచ్చే ప్రాచీన రూపమనీ అది తెలుగులో దీర్ఘంగా మారిందనీ చెప్పాలి. తెలుగులో హల్లుతో మొదలయ్యే కొన్ని ప్రత్యయాల ముందు యకారం లోపించి దానిముందు హల్లు దీర్ఘమయింది, ఉదా : > * కొయ్ – సి > కోసి, * కొయ్ - ంత > కోత దీని సామ్యంవల్ల అజాది ప్రత్యయాల ముందున్న

రూపాలలో కూడా హ్రస్వం దీర్ఘమయింది : కోయ్ - అక. వ్యావహారిక భాషలో కొయ్యక, కొయ్యడం మొదలైన రూపాలు (ప్రాచీన భాషారూపాలైన కోయక, కోయుట మొదలైన వాటికి బదులు) హ్రస్వాచ్చుతోనే ఉండడం గమనించదగినది. ఇటువంటిచోట్ల వ్యావహారిక రూపాలే గ్రాంథికరూపాలకన్న ప్రాచీనమైనవి.

## 2. 15. దక్షిణ ద్రావిడ భాషలు, తెలుగులలో ఇ/ఎ, ఉ/ఒల మార్పు:

అకారంలో మొదలయే నిష్పాదక ప్రత్యయం ముందు దక్షిణ ద్రావిడ భాషలు, తెలుగులలో ఒక ముఖ్యమైన మార్పు ఉంది. ప్రాచీన తమిళ మలయాళాలలో రెండో అక్షరంలో అకారం ఉన్నప్పుడు ధాతువులో అ, ఇ, ఉ - ఈ మూడింటిలో ఏదో ఒకటే ఉంటుంది. (ఎ, ఒలు సాధారణంగా ఉండవు). కాని కన్నడం తెలుగులలో రెండో అక్షరంలో అకారం ఉన్నప్పుడు ధాతువులలో అ, ఎ, ఒ - ఈ మూడింటిలో ఏదో ఒకటే ఉంటుంది (ఇ, ఉలు ఉండవు.) ఈ నియతి మొదటి అచ్చుకీ రెండో అచ్చుకీ మధ్య ఒక హల్లు మాత్రం ఉంటేనే కనబడుతుంది. ఇంతే కాకుండా, ఈ నియతి ధాత్వచ్చు హ్రస్వమైనది అయినప్పుడే ఉంటుంది. దీర్ఘాచ్చులలో ఈ నియతి లేదు. ఇటువంటి నియతివల్ల కొన్ని పదాలలో తమిళ మలయాళాలలో మూ. ద్రా. *ఎ, *ఒలు అకారంముందు *ఇ, *ఉలతో కలిసి పోయాయనీ, కన్నడం తెలుగులలో మూ. ద్రా, *ఇ, *ఉ లు అకారం ముందు *ఎ, *ఒ లతో కలిసిపోయాయనీ మనం ఊహించవచ్చు. కోత, తొద, కొడగులలో కన్నడంలోలాగే అకారం ముందు ఎ, ఒలే ఉంటాయి కాని ఇ, ఉలు ఉండవు. తుళులో కొన్ని మాండలికాలలో ఇటువంటి మార్పు లేదని కొందరి అభిప్రాయం. వ్యావహారిక తమిళ - మలయాళాలలో కూడా అకారం ముందు ఎ, ఒలే ఉండడం, ఇ, ఉలు లేక పోవడం గమనించదగినది. గోండీ - కువి భాషలలో కూడా అకారం ముందు ఎ, ఒలే ఉంటాయి; ఇ ఉలు ఉండవు.

పైన చెప్పిన నియతివల్ల ఒక పదంలో తమిళ - మలయాళాలలో ఇ/ఉ ఉంటే మిగిలిన భాషలలో దానికి బదులు ఎ/ఒ ఉండడం సంభవించింది.

అందువల్ల ఇటువంటి చోట్ల మూలద్రావిడ భాషలో ఉన్న అచ్చుని పునర్నిర్మిం చడం ఒక పెద్ద సమస్య అయింది. (ఉదా త. మునై: తె. మొన; మూ.ద్రా.లో * మునై / * మొనై ?)

ఇటువంటి మార్పులున్న పదసముదాయాలలో మూల భాషలోని అచ్చు ఏది అని తెలుసుకోవడం ఆ పదాలకి సంబంధించినవై ఉండి నిష్పాదక ప్రత్యయం లేనివిగాని, అకారంతో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం లేనివి గాని అయిన పదాలు ఉంటేనే సాధ్యమవుతుంది.[1] ఇటువంటి సంబంధి పదాలు ఈ కింద ఇచ్చిన మూడు రకాలుగా ఉంపవచ్చు:

(i) నిష్పాదక ప్రత్యయం లేనివి;

(ii) ఇ, ఉలు గాని హల్లుగాని, మొదట ఉన్న నిష్పాదక ప్రత్యయం గలవి;

(iii) ధాతువులో దీర్ఘాచ్చు లేక ద్విరుక్తహల్లు ఉన్నవి (ఇటువంటి వాటిలో నిష్పాదక ప్రత్యయం అకారంతో మొదలయ్యేదిగా ఉన్నా ఫరవాలేదు. దీర్ఘాచ్చులలోనూ హ్రస్వాచ్చు తరవాత ద్విరుక్తహల్లు ఉన్నప్పుడూ. ఈ మార్పు లేకపోవడమే దీనికి కారణం).

---

1. ఈ సమస్యని కూలంకషంగా చర్చించి ఇటువంటిచోట్ల మూలద్రావిడ భాషలో అచ్చుని కనుగొనడానికి సరియైన మార్గం మొట్టమొదట చూపిన వారు ప్రొఫెసర్ బరో (Dravidian Studies II, *BSOAS* 1940-2). తరవాత భద్రిరాజు కృష్ణమూర్తి (*Language* 34) (1958): (458-68) కూడా దీని చర్చించారు. బరో వ్యాసానికి ముందు కాలంలో కాల్డ్‌వెల్, రామస్వామి అయ్యర్, సుబ్బయ్య మొదలైనవారు అన్ని సందర్భాల లోనూ తమిళ - మలయాళాలలో ఇ, ఉలే ప్రాచీనమైనవనీ అవి కన్నడం, తెలుగులలో ఎ, ఒలుగా మారేయనీ నమ్మారు.

పై మూడు రకాల పదాలలో ధాత్వచ్చు చాలా భాషలలో మారకుండానే ఉంటుంది; కొన్ని భాషలలో అది మారినా ధ్వని సూత్రానుసారంగానే మారుతుంది. ఇటువంటి సంబంధి పదం దక్షిణ భాషలలోనే ఉండవచ్చు; లేకపోతే మధ్యోత్తర భాషలలోది అయినా కావచ్చు.

త. చితర్, చితై. చింతు, మ. చితఱు, క. కెదఱు, తె. చెదరు, చింతు (త. చింతు, తె. చిందువల్ల ఇందులో *ఇకారం ప్రాచీనమైనది; వీటిలో నిష్పాదక ప్రత్యయం లేదు; ఉకారం ఉచ్చారణార్థకం మాత్రమే). (1546)

త. చిలై 'చప్పుడుచేయు', చిల్ 'చప్పుడు', మ. చిలె- 'చప్పుడు చేయు', క. కలె 'అరుచు', తె. చెలఁగు, గోం. కిలీ- 'ఏడ్చు' (త. చిల్, గోం. కిలీ-ల వల్ల ఇందులో * ఇ ప్రాచీనమైనది) (1574)

త. ఇరంటు, మ. రండు, క. ఎరడు, తె. రెండు (ఇరు-అనే దీని విశేషణంలో నిష్పాదక ప్రత్యయం ఉకారం ఉంది; ఇందులో ధాతువులో * ఇ ఉంది కాబట్టి ఈ పదసముదాయంలో అదే ప్రాచీనమైనది). (474)

త. చెఱి 'జనం ఎక్కువగా ఉండు, చేర్చు', చిఱై 'చెఱ', మ. చెఱి చిఱ, క. కఱె 'చెరువు', తె. చెఱ, చెఱువు, ప కెద్ - 'మూయు', గోం. కెహ్ - (త. చెఱి, తె. చెఱువు, ప. గోం, ల వల్ల ఇందులో * ఎకారం ప్రాచీనమైనది). (1980)

త. పిణై, పిణవల్, పిణవు 'ఆడజంతువు', పెణ్ 'స్త్రీ', మ. పెణ్ 'స్త్రీ' పెంటి 'పిల్ల', క. పెణ్ 'స్త్రీ', తె. పెంటి (త. మ. క. తె. పెణ్, పెంటివల్ల ఇందులో * ఎకారం ప్రాచీనమైనది). (4395)

త. విళంకు 'ప్రకాశించు', విళక్కు 'దీపం', వెళ్ 'తెలుపు', వెళ్ళై 'వెల్ల', మ. విళఙ్ఙు 'ప్రకాశించు', వెళ్ళ 'వెల్ల', క. బెళగు 'ప్రకాశించు', బెళకు 'దీపం', బెళ్ 'తెలుపు', తె. వెలుఁగు, వెండి, వెల్ల (త. వెళ్, క. బెళ్, తె. వెల్ల లవల్ల ఇందులో * ఎ ప్రాచీనమైనది). (5496)

త. కుళల్ 'పిల్లనగ్రోవి', కుళి 'గొయ్యి', కుళంపు 'గొయ్యి', మ. కుళల్, కుళి, క. కొళల్, కుళి, తె. క్రోవి, ప. కుడుట్ 'గొయ్యి' గ (ఒ,) కుడుప్ 'నుయ్యి' (త. కుళి మొ. వాటివల్ల ఇందులో *ఉ ప్రాచీనం) (1818)

త. కుఱు 'పొట్టి', కుఱై 'తగ్గు, తక్కువ', మ. కుఱు, కుఱయ్-, క. కుఱు, కొఱె, తె. కుఱుచ, కొఱ, కొఱంత (త. కుఱు, తె. కుఱుచ వల్ల ఇందులో *ఉ ప్రాచీనం) (1851)

త. మునై, మ. మున, క. మొనె, తె. మొన (ఇవి మున్, ముందులకి సంబంధించినవి కాబట్టి వీటిలో *ఉ ప్రాచీనం), (5020)

త. మ. ఉఱై, ఒటి 'విరుగు', క. ఒడె, ఒడి (ఒటి, ఒడి, వల్ల ఇందులో *ఒ ప్రాచీనం). (946)

త. కొళుంతు 'లేత ఆకు', కుళంతై పిల్ల(వాడు)', మ. కొళున్ను 'లేత ఆకు', క. కొణసు 'అడవిజంతువు పిల్ల', తె. కొడుకు, కోడలు, కూయి. కోడు 'లేత ఆకు', కూ, మా, ఖోర్—'చిగుర్చు' (తె, కూయి, కూ, మా, లలో దీర్ఘాచ్చు, త, కొళుంతులవల్ల ఇందులో *ఒ ప్రాచీనం), (2149)

త. మ. పుతర్, పొతుంపు, క. పొదఱు, తె. పొద, పొదరు (త. పొతుంపువల్ల ఇందులో *ఒ ప్రాచీనం), (4509)

చూ. త. పుకై (2, 20 (iii).)

భద్రిరాజు కృష్ణమూర్తి ఉద్దేశంలో అకారంముందు మూ. ద్రా, *ఇ, *ఎలు *ఎగానూ, *ఉ, *ఒలు *ఒగానూ మూల దక్షిణ ద్రావిడ భాషా కాలంలో మారేయి. ఆ *ఎ *ఒలు ప్రాచీన తమిళ మలయాళాలలో అకారం ముందు వర్ణభేదనం (Dissimilation) వల్ల ఇ, ఉలుగా మారేయని ఆయన అభిప్రాయం, దీనికి కారణం వర్ణ భేదనం అనడంకన్న మూలబాషలో *ఇ' *ఉలు ఉన్నపదాలు *ఎ, *ఒలు ఉన్న పదాలకన్న సంఖ్యలో హెచ్చుగా ఉండడం అని చెప్పడం సమంజసం.

ఈ సందర్భంలో కన్నడంలో జరిగిన ఒక మార్పు గమనించదగ్గది. కన్నడంలో ధాతువులో *ఎ, *ఒలు తరవాత అక్షరంలో ఇ గాని ఉ గాని ఉంటే అవి క్రమంగా ఇ, ఉలుగా మారతాయి, అంటే, ఉన్నతాచ్చులముందు మధ్యాచ్చులు ఉన్నతాచ్చులుగా మారతాయి. కొన్నిచోట్ల ఈ మార్పు ఉన్న రూపం, లేనిరూపం కూడా ఉంటాయి :

క. ఇదిర్ : త. మ. ఎతిర్, తె. ఎదురు, (795)

క. ఇలి : త. మ. ఎలి, తు. ఎలి, తె. ఎలుక. (833)

క. కివి : త. మ. చెవి, తె. చెవి; గోం, కెవ్. (1977)

క. బిదిర్ : త. మ. వెతిర్, తె. వెదురు. (5485)

క. కుడు 'ఇచ్చు' : త. మ. కొటు. (2053)

క. పుడి : త. మ. పొటి, తె. పొడి. (4481)

క. పుసి 'అబద్ధం' : త. మ. పొయ్, తె. బొంకు. (4531)

(ఇటువంటి కన్నడ రూపాలు ఆధారంగా మూలభాషలో ధాత్వచ్చు *ఇ, *ఉ అని అపోహపడకూడదు.)

తమిళంలో పెయర్, పేర్ 'పేరు', పెఱ్ఱై 'కోడిపెట్ట', తొటంకు 'మొదలు పెట్టు', తొళై 'రంధ్రం' వంటి కొద్ది పదాలలో అకారంముందు ఎ, ఒలు ఉన్నాయి; ఈ భాషలో అకారంతో మొదలయ్యే కృత్ప్రత్యయం ముందు ధాతువులోని ఎ, ఒలు ఇ, ఉలుగా మారవు : చెయల్ 'పని' (<చెయ్ 'చేయు'), పెయల్ 'వాన' (<పెయ్ 'కురియు'), కొలై 'హత్య' (<కొల్ 'చంపు') పొఱై 'బరువు' (<పొఱు 'భరించు'), కొటై 'దానం' (<కొటు), చెలవు 'పోవడం, ఖర్చు' (<చెల్ 'పోవు')

## 2.16. తెలుగు-కువి భాషలలో వర్ణవ్యత్యయం

తెలుగు - కువి భాషలలో (తెలుగు, గోండీ, కొండ, పెంగొ, మండ, కూయి, కువి) కొన్ని మూలద్రావిడ ధాతువులలో అచ్చూ దాని తరవాత హల్లూ

పరస్పరం స్థానం మార్చుకొంటాయి, అంటే వర్ణ వ్యత్యయం (Metathesis) పొందుతాయి. గోండీ, కొండలలో ఈ వర్ణవ్యత్యయం ధాతువు మొదట హల్లు లేని పదాలలోనే కనిపిస్తుంది. మిగిలిన అయిదు భాషలలోనూ ఇది అజాది పదాలలోనూ హలాది పదాలలోను కూడా వస్తుంది. ఈ మార్పు తెలుగు - కువి భాషలు ఏకభాషగా ఉన్న కాలంలోనే ప్రారంభమైంది. ఈ మార్పుని మొదట్లో కొందరు ఆద్యచ్చు లోపించు ద్వితీయాచ్చు దీర్ఘమవడం అని భ్రమించి దీనికి "aphaeresis" అని పేరు పెట్టేరు. భద్రిరాజు కృష్ణమూర్తి (1955) దీనిని వర్ణవ్యత్యయం అని గుర్తించి. సవిస్తరంగా చర్చించారు. అంతకుముందు కోరాడ రామకృష్ణయ్య దీనికి 'metathesis' అనే పేరు వాడేరు అని గుర్తించాలి.

తెలుగులో వర్ణ వ్యత్యయం జరిగిన సందర్భాలకి ఈ కింద ఇచ్చిన సూత్రాలు వర్తిస్తాయి. ధాతువు మొదట హల్లు లేకపోతే వర్ణవ్యత్యయం పొందే హల్లు *ట (డ), *ఴ, *ళ, *ల, *ర, *ఱ లలో ఒకటి అయిఉంటుంది. సర్వనామాలలో మరికొన్ని హల్లులు (*వ, *త, *న, *మ) ఉన్నప్పటికీ కూడా వర్ణవ్యత్యయం జరిగింది.[1] దీనివల్ల పదాదికి వచ్చిన *ఴకారం డకారం గానూ (తరవాత అది దకారంగానూ), *ళకారం లకారంగానూ తెలుగులో మారతాయి. ధాతువు మొదట హల్లు ఉంటే వర్ణవ్యత్యయం పొందే రెండో హల్లు *ఴ, *ర లలో ఒకటిగా ఉంటుంది. ఈ రెండూ వర్ణవ్యత్యయం తరవాత కావ్యభాషలో ఈ స్థానంలో ఱ గా మారతాయి. (ఈ రేఫ వ్యావహారిక భాషలో నశించింది.) ప్రాఙ్నన్నయకాల శాసన భాషలో *ఴ, ళలు మారకుండా అలాగే ఉన్నాయి.

---

1. వాఁడు < *అవన్డు, వీఁడు < ఇవన్డు, వారు < *అవర్, వీరు < *ఇవర్, వీరు < *ఇవర్, దాని < *అతని-, దీని < *ఇతని-, వాటి < *అవట్టి-, వీటి. < *ఇవట్టి-, వాని., వీని - అనే ప్రాచీన భాషలో అవి, ఇవిల ఔపవిభక్తిక రూపాలు క్రమంగా *అవని-, *ఇవని-ల నించి వచ్చినవి. 3:4(1) కూడా చూడండి.

వర్ణవ్యత్యయం జరిగిన పదాలలో ధాతువు మొదట ఉండే హల్లు క, గ, త, ద, ప, బ, మ, వ, స లలో ఒకటి అయి ఉంటుంది. వర్ణవ్యత్యయం జరిగిన తరవాత ధాత్వచ్చూ నిష్పాదక ప్రత్యయంలో మొదట ఉన్న అచ్చూ మధ్య వ్యవధానం లేకుండా ఉంటాయి. కాబట్టి వాటిలో ఈ కింద ఇచ్చిన మార్పులు జరుగుతాయి. నిష్పాదక ప్రత్యయంలో మొదటి అచ్చు ఇ కాని ఉ కాని అయితే అది పోతుంది. అది అకారం అయితే ధాత్వచ్చూ అదీ ఈ విధంగా మారతాయి.

అ + అ → ఆ;

ఎ + అ → ఏ;

ఒ + అ → ఓ;

(ద్విత్వాక్షరం ముందు ఆ, ఏ, ఓ లు హ్రస్వాలుగా మారతాయి.) ఈ సందర్భంలో మూలద్రావిడంలో *ఇ, *ఉలు అకారం ముందు తెలుగులో ఏ, ఓ లుగా మారతాయి అనే విషయం గుర్తుంచుకోవాలి. ఈ మార్పు జరిగిన తరువాతనే వర్ణవ్యత్యయం జరిగింది.

కూయి - కువిలకి కూడా పై సూత్రాలే చాలావరకూ వర్తిస్తాయి. కాని వీటిలో ధాతువు మొదట హల్లు ఉన్నప్పుడు రెండో హల్లు *ఴ, *ర, *ఱ లే కాక *ట, *ల, *ళ లు అయినా కూడా వర్ణవ్యత్యయం జరుగుతుంది. (*ళ తరవాత ల గా మారుతుంది; ఴ ఢ గా మారుతుంది.)

పెంగొలో వర్ణవ్యత్యయం తరవాత పదాదిని ఏర్పడిన సంయుక్తాక్షరాలలో ప్రథమాక్షరమైన *న, *వ, *స లు లోపిస్తాయి.

పెం. ఢిగ 'నీడ' <*న్ఢిగ <నీఢ్గ (కొం, నీఢ్గ)

పెం. లేంజ్ 'చంద్రుడు' (గోం, నేలేంజ్, లెలేంజ్)

పెం. లేకిజ్ 'వెదురుబద్దలు' (కూయి, ప్లేక)

పెం. ఢ్రాయ్ 'గాలి' (త. వళి)

పెం. రింగ్ 'వదులు అవు' (కూయి. స్రింగ)

పెం. రేక 'ఇప్పచెట్టు' (గోం, సెరేకా)

పెం. డ్రాపి 'పేడ' (గోం, సడ్రాపీ)

బ్రాహుయిలో కూడా కొన్ని పదాలలో వర్ణవ్యత్యయం కనపడుతుంది : బ్రా, ప్రించ్ - 'పిండు' (త. మ. క. పిళి, తె. పిండు), బ్రా. త్రంప్ 'నీటి బొట్టు' (: త. మ. చోరి 'వాన, జల్లు, రక్తం').

తె. రాలు, కో. నా. రాల్-, గోం. కొం. అర్-. (233)

త. మ. ఇర (వు), ఇరా, క. ఇరుళ్, తె. రేయి, రే-. (2552)

త. మ. ఉరల్, క. ఒరల్, తె. రోలు (651)

త. చిఱై, చిఱకు, ఇఱై, ఇఱక్కై, క. ఎఱకె, తె. ఎఱక, ఱెక్క, కొం. ఱెక.

త. ఇఱై, మ. ఇఱాన్, క. ఎఱె, తె. ఱేఁడు. (527)

త. ఇళ, ఇళం, ఇళై, మ. ఇళ, క. ఎళ, ఎళె, తె. లేఁత, లేఁ-, గోం. రైయోల్ / లెయోర్ 'యువకుడు'. (513)

త. మ. ఉళ్ 'లోపల', క. ఉళ్, ఒళ్, తె. లో, లోపల, లోఁగిలి, లొంగు, లోఁగు గోం. రోన్/లోన్ 'ఇల్లు.' (698)

త. మ. క. కీళ్, తె. క్రి-, కూ. కియ్యా, బ్రా. కేరగ్. (1619)

త. మ. కొళు, క. కొర్వు, తె. క్రొవ్వు, గోం. కొఢ్వింజ్, పెం, క్డో- 'లావుగా ఉండు', మం. క్డుఁఅ, కూయి. క్డోగ, కువి. కొఢ్ వ. (2146)

త. కుళి 'తవ్వు', తె. గ్రొచ్చు, క్రొచ్చు (శా. క్రోచె). (1818)

త. అటంకు, క. అడంగు, తె. డాఁగు, దాఁగు, కూయి డా-. (63)

త. క. ఇళి, తె. డిగు, డిగ్గు, దిగు, కూయి. డీ-. (502)

త. మ. ఎళుపతు, క. ఏళ్పత్తు, ఎప్పత్తు, తె. డెబ్బది, డెబ్బయ్. (910)

త. అర, అరా, అరవం, మ. అరవు, తె. త్రాఁచు, గోం. తరాస్, కొం. సరస్, పెం. రాచ్, మం. త్రెహె, కూయి స్రాసు, కు. రాచు. (2359; తెలుగు తప్ప మిగిలిన భాషలలో పదాలకి 'పాము' అని మాత్రమే అర్థం.)

త. మ. ఉళు, క. ఉళ్, తె. దున్ను, కొం. ఢు-, పెం. కూయి. ఢూ-. (688)

త. మ. క. పళ, తె. ప్రాఁత, ప్రా-, గోం. పఢానా, కొం. పడయ్, పెం. ప్డాన్, మం. ప్డాం (చ), కూయి. ప్డాడి, కువి. ప్డా? ఇ. (3999)

త. మ. పొళుతు, పోళు, క. పొళు, తె. ప్రొద్దు, గోం. పోడ్డ్ (4559)

త. మ. పొరి 'వేగు, ఎండు', తె. ప్రొయ్యి, కూయి, ప్రొంద్- 'మండు' కూయి. బ్రోడ్-. (4537)

క. పొళల్ 'ఊరు', తె. ప్రోలు (శా. ప్రోల్). (4555)

త. వాళ్, క. బాళ్, బళ్ దుంకు, తె. బ్రదుకు, బ్రతుకు. (5372)

త. మ. మరం. తె. మ్రాను, మ్రాఁకు, గోం. మరా/మార, పెం. మం. కూయి. మ్రహ్ను' కువి. మ్రాను. (4711)

త. వరై, క. బరె, బరి, తె. వ్రాయు, కూయి వ్రీస్-. (5263)

త. మ. విరల్, క. బెరల్, తె. వ్రేలు, గోం. వఢంజ్. కొం. ఢస్క, పెం. వచ్క, మం. వెహ్పె., కూయి కువి. వంజు, కో. నా. వెందె. (5409)

త. చురుంకు 'ముడుచుకొను, తగ్గు' చురుక్కు 'తగ్గించు', క. సుర్కు 'ముడుచుకొను, తగ్గు', తె. స్రుక్కు, ప. చుర్క్-. (2687)

త. తలై, మ. తల, క. తలె, తె. తల, కూయి. త్లడ, కువి. త్రాయు. (3103)

(సర్వనామాలలో వర్ణ వ్యత్యయానికి చూ. 3.4)

**2.17, కొడగు అచ్చులు.**

కొడగులో అకారం ముందు మూ. ద్రా. *ఇ, * ఎలు ఎ గానూ, *ఉ, *ఒ లు ఒ గానూ మారేయని ఇంతకుముందే చూశాము. కాని ఈ భాషలో ధాతువులో *ఇ, *ఎల తరవాత మూర్ధన్యాక్షరమూ దానితరవాత అ కారంగాని ఎ కారం (<*-అయ్) గాని ఉంటే అవి అ కారంగా మారతాయి:

కొడ. కళ- 'తవ్వు' : త. కెళ్ళై, కిళ్ల (1588)

కొడ. పళ్లె 'ఆడజంతువు' : త. పిళ్ళై, తె. పిల్ల (4198)

కొడ. కడకె 'పరుపు' : త. కిటక్కై. (1524)

(ఇటువంటివాటిలో మొదటి హల్లు *క, *చ, *ప, *మ లలో ఒకటిగా ఉంటుంది.)

ఈ మార్పులుకాక అగ్రాచ్చులు (Front vowels) అయిన *ఇ ఈ* *ఎ *ఏలకి కొడగులో మరికొన్ని ప్రత్యేకమైన మార్పులు ఉన్నాయి.

ప్రాచీనమైన అగ్రాచ్చు మూర్ధన్యాక్షరం లేక *అ (>కొడ. ర) ముందు దానికి సవర్ణమైన పశ్చిమాచ్చు (Back vowel) గా కొడగులో మారుతుంది. ఈ పశ్చిమాచ్చు దానిముందు ఓష్ఠ్యాలైన ప, మ, బ (<*వ)లు ఉంటే ఓష్ఠీకృతం (Rounded) గానూ ఇతరత్రా అనోష్ఠీకృతం (Unrounded) గానూ ఉంటుంది. అంటే ఈ మార్పులు ఈ విధంగా ఉంటాయి:

(ఓష్ఠ్యం తరవాత)

*ఇ < ఇ̈, ఉ

*ఈ < ఈ̈, ఊ

*ఎ < ఎ̎, ఒ

*ఏ < ఏ̎, ఓ

ఈ మార్పు జరిగిన తరవాత కొన్ని పదాలలో దీనికి కారణమైన మూర్ధన్యంలేక *అ లోపిస్తుంది. అది లోపించినా ఈ అచ్చులు అలాగే ఉంటాయి కాబట్టి కొడగులో ఇ̎, ఈ̎, ఎ̎, ఏ̎, అనే నాలుగు కొత్త అచ్చులు ప్రత్యేక వర్ణాలు అయ్యాయి.

కొడ. ఇ̎డ్ : త. మ. ఇటు, క, తె. ఇడు (442)

కొడ. ఇ̎ళి 'దిగు' : త. మ. క. ఇళి, తె. డిగు, దిగు (502)

కొడ. కి̎ర్̎కె 'చిన్న' : త. మ. చిఱు, క. కిఱు, తె. చిఱు (1594)

కొడ. కీ̎ఱ̎ : త. మ. క. కీళ్, తె. క్రింద (1619)

కొడ. తీ̎ర్-(తీ̎రువ్-, తీ̎ందద్.) : త. మ. తీర్, తె. తీరు (క్రియ) (3278)

కొడ. ఎ̎ళు̎ద్ - 'వ్రాయు' : త. మ. ఎళుతు (853)

కొడ. ఎ̎రంగ్ - 'దిగు' : త. ఇఱంకు, క. ఎఱఁగు, తె. ఎఱఁగు, (516)

కొడ. కే̎ళ్-(కే̎ప్-, కే̎ట్-) 'అడుగు, విను' : త. మ. క. కేళ్ (2017)

కొడ. తే̎ర్ - (తే̎ంద్-) ఎదుగు' : త. తేఱు (3471)

కొడ. బుడ్- : త. మ. విటు, క. బిడు, తు, బుడు, తె. విడుచు (5393)

కొడ. పురుకు 'దోమ' : మ. పిఱుక్కు (4203)
కొడ. బూడు 'ఈడిగవాడిపాక' : త. మ. వీటు 'ఇల్లు' క. బీడు
కొడ. మూర్- : త. మ. క. తె. మీఱు (4884)
కొడ. పొట్టి : త. మ. క. తె. పెట్టి (4388)

కొడ. పొణ్ణు 'భార్య, స్త్రీ' : త. మ. క. పెణ్, తు. పొణ్ణు (4395)
కొడ. బొరద్- : త. విఱ, వెఱి, తె. వెఱచు 'భయపడు', (5489)

కొడ. బోటె : త. వేట్టై, మ. వేట్ట, క. బేటె, తు. బోంటె, తె. వేఁట (5527)
కొడ. పోర్- 'జంతువుచేత మోయించు' : మ. క. పేఱు (4446)

తుళులో కూడా ఓష్ఠ్యానికీ మూర్ధన్యానికీ మధ్యనున్న ప్రాచీన అగ్రాచ్చు పశ్చిమాచ్చుగా మారడం ఉంది. ఈ మార్పు తుళు నుంచి దాని పక్కభాష అయిన కొడగుకి వ్యాపించిందని ప్రొఫెసర్ ఎమెనో అభిప్రాయం.

## 2.18. కోతలో అచ్చుల మార్పు

మూ. ద్రా. *ఉ, *ఊ, *ఒ, *ఓలు, *-అయ్ ముందు కోతలో క్రమంగా ఇ, ఈ, ఎ, ఏ, లుగా మారతాయి. *-అయ్ ముందు-కోత కాలంలో *ఎ గా మారి దానిముందున్న పశ్చిమాచ్చుని అగ్రాచ్చుగా మార్చింది. ఈ మార్పు జరిగిన తరవాత *ఎ (<*అయ్) లోపించింది.

కోత. కెథ్ : త. కుటై, మ. కుట, క. కొడె, తె. గొడుగు:, (1663)

కోత. కిక్ 'చిన్న గుండ్రవి బుట్ట' : క. కుక్కె, తు. కుక్కె, (1629)
కోత. కిప్ : త. కుప్పై, మ. కుప్ప, క. కుప్పె, తె. కుప్ప, (1731)
కోత. తిబ్ : క. తుంబె, తె. తుమ్మెద, (3328)
కోత. మీళ్ 'ఎముకలో ఉండే మెత్తటి పదార్థం' : త. మూళై, తు. మూళె. (5051)

కోత. పీచ్ 'పిల్లి' : త. పూచ్చై, తు. పూచె, (4355)
కోత. పెగ్ : త. పుకై, మ, పుక, క. పొగె, తె. పొగ. (4240)
కోత. ఏడ్ 'ఒకరకం వెదురు, రెల్లు' : త. ఓటై, మ. ఓట, క. ఓటె. (1043)
కోత. తేల్ 'అడివి' : త. చోలై, 'తోట', మ. చోల, తొ. త్యాస్. (2891)

కోతలో ఈ మార్పులేని పదాలుకూడా కొన్ని ఉన్నాయి. ఉదా : ఓల్ 'తాటాకు' (త. ఓలై, క, ఓలె), కూడ్ 'చేట' (త. కూటై, క. గూడె), తొడ్ 'గొంతుక' (త. తొంటై), మొట్ 'గుడ్డు' (క. మొట్టె) ఇటువంటి పదాలు కోతలో ఈ మార్పు పూర్తి అయిన తరవాత దానిపక్కనున్న తమిళంలోనించి కాని కన్నడంలోనించి కాని ఎరువు తెచ్చుకొన్నవి.

## హల్లులు

### 2.19. ద్రావిడభాషలలో శ్వాసస్పర్శాలు నాదస్పర్శాలుగా మారడం.

ద్రావిడ భాషలలో తమిళ-మలయాళాల దేశ్యపదాల (Native Words) లో గ, జ, డ, ద బ లు ప్రత్యేక వర్ణాలు (Phonemes) కావు. ఈ ధ్వనులు అచ్చుల మధ్యా, అనునాసికం తరవాతా మాత్రమే ఉంటాయి. క, చ, ట, త, ప లు పదాదినీ పదమధ్యంలో ద్విరుక్తంగానూ ఉంటాయి. ఈ రెండు రకాల ధ్వనులకీ పరిపూరక ప్రవృత్తి (Complementation) ఉంది కాబట్టి ఈ రెండు భాషలలో గ, జ, డ, ద, బ లు క, చ, ట, త, ప లకి సవర్ణాలు (Allophones), అందుచేతే సాధారణ తమిళ లిపిలో గ, జ, డ, ద, బ లకి గుర్తులు లేవు. వీటికి క, చ, ట, త, ప, లనే వాడతారు. ప్రాచీనమైన గ్రంథ లిపిలో మాత్రం వీటికీ, మహాప్రాణాలకీ, మిగిలిన సంస్కృతాక్షరాలకీ గుర్తులు ఉన్నాయి. గ్రంథ లిపిని సంస్కృతం రాయడానికి ఉపయోగించేవారు. మలయాళ లిపిలో అన్నివర్ణాలకీ గుర్తులు ఉన్నా దేశ్యపదాలలో గ, జ, డ, ద, బ లకి క, చ, ట, త, ప లే ఉపయోగిస్తారు.

తమిళ-మలయాళాలు తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ క,చ,ట,త,పలూ గ, జ, డ, ద, బ లూ ప్రత్యేక వర్ణాలే. క, చ, ట, త, ప లకి మల్లే గ,జ,డ, ద,బ లు కూడా పదాదిని, పదమధ్యంలో ద్విరుక్తంగానూ, అద్విరుక్తంగానూ అనునాసికం తరవాతా ఉంటాయి. కాని తొదలో ఇప్పటికీ నాదస్పర్శాలు పదాదిని లేవని గుర్తించాలి.

నీటికి ఉదాహరణలు :

కన్నడం :

కరి 'బొగ్గు'/గరి 'ఈక'; సాకు 'చాలు'/సాగు 'సాగు'; ముక్కు 'ఆశగా తిను'/ముగ్గు 'కుళ్ళు'; మంక 'మూడుడు'/మంగ 'కోతి'

చోళ 'చోళుడు'/జోళ 'జొన్న', కచ్చి 'కరిచి'/కజ్జి 'గజ్జి' (కురుపు), అంచు 'అంచు'/అంజు 'భయపడు'

తుటి 'పెదవి'/తుడి 'అదుర్దాపడు'; అట్ట 'పై అంతస్తు'/అడ్డ 'అడ్డం' గంటు 'ముడి, పొట్లం,/గండు 'మొగ'

తడ 'ఆలస్యం'/దడ 'ఒడ్డు'; కత్తు 'మెడ'/ఉద్దు 'మినుములు'; అంతు 'అలా'/అందు 'అరోజు'

పాల 'వంతెన'/బాల 'తోక'; కప్పు 'నలుపు'/కబ్బు 'చెరుకు'; ఇంపు 'తీపి, సువాసన'/ఇంబు 'ఆశ్రయం'

తెలుగు :

కట్టు/గట్టు; ఆకు/త్రాగు; మొక్క/మొగ్గ; డొంక/దొంగ

చరుపు/జరుపు, కాఃచు/బూజు; మంచు/ముంజె

టేకు/డేకు; పాడు/పాట; గుట్ట/గుడ్డ; పెంట/ఎండ

తడి/దడి; బాతు/బాదు; ఎత్తు/ఎద్దు; అంత/అందం

పండు/బండి; తలుపు; ఉప్పు/డబ్బు; చెంప/చెంబు
మిగిలిన భాషలకి కూడా ఇటువంటి ఉదాహరణలు ఇవ్వఇచ్చు; కాని గ్రంథ విస్తరభీతివల్ల ఇవ్వలేదు.

మూలద్రావిడ భాషలో నాదస్పర్శాలు ప్రత్యేక వర్ణాలా? కావా? అనే ప్రశ్న దీనివల్ల వస్తుంది. అంటే, ఈ విషయంలో మూల ద్రావిడభాష తమిళ - మలయాళాలని పోలిఉందా? తెలుగు - కన్నడం మొదలైన వాటిని పోలిఉందా? జూల్ బ్లాక్, సునీల్‌కుమార్ ఛటర్జీ మూలద్రావిడంలో నాదస్పర్శాలేకాక మహా ప్రాణాలు కూడా ఉండి ఉంటాయని అన్నారు. వీరి వాదం కేవలం ఊహమీదనే ఆధారపడి ఉంది. కాల్డ్‌వెల్, సుబ్బయ్య, బరో మొదలైన పండితులు మూల ద్రావిడంలో నాదస్పర్శాలు ప్రత్యేక వర్ణాలు కావని చెప్పేరు. బరో "Convertibility of surds and sonants" (1968 : 1.17) అనే వ్యాసంలో దీనిని సమగ్రంగా చర్చించి మూల ద్రావిడంలో నాదస్పర్శాలు ప్రత్యేత వర్ణాలుగా లేవనీ, తమిళ - మళయాళాలు ఈ విషయంలో ప్రాచీనతని నిలుపుకున్నాయనీ, మిగిలిన భాషలలో నాదస్పర్శాలు ప్రత్యేక వర్ణాలు అవడం అర్వాచీన పరిణామ మనీ సిద్ధాంతీకరించారు. దీనికి ఆయన ఈ కింద ఇచ్చిన నాలుగు కారణాలు చెప్పేరు;

1. కన్నడం, తెలుగులలో నాదస్పర్శాలు మొదట ఉన్న పదాలలో చాలా వాటికి తమిళంలో సజాతి పదాలు లేవు.[1] క. తు. తె. గాసి 'నెప్పి, కష్టం'; క. గాళ, తె. గాలము; క. తె. గుంజు 'లాగు'; క. గొజ్జు, తె. గుజ్జు, క. జిగట.

1. ఒక పదానికి సజాతి పదాలు అన్ని భాషలలోనూ ఉండవు. కాల క్రమాన ఒక భాషలో కొన్ని పదాలకి బదులుగా కొత్తపదాలు వస్తూఉంటాయి: తె. తేరు, రథం; అని, పోరు, యుద్ధం. తమిళంలో లేనంతమాత్రాన ఈ పదాలు మూలభాషలో లేవని చెప్పలేము. ఇవి తమిళంలో పోయిఉండవచ్చు. కాబట్టి ఈ పదాలు (శ్వాస స్పర్శంతో) మూలభాషలో ఉండి ఉండవచ్చు. కాబట్టి బరో ఇచ్చిన మొదటి రెండు కారణాలూ హేతువాదానికి నిలిచేవికావు. ఈ నాలుగింటిలో మూడు, నాలుగు కారణాలే పటుత్వం ఉన్నవీ, అసలైనవీ.

తె. జిగట; క. తు. జింకె, తె. జింక; క. తు. తె. జుట్టు; క. దట్ట, తె. దట్టము; క. దొరె, తె. దొరకు; క. బంకె, తె. బంక; క. తె. బీడు, క. బువ్వె, తె. బువ్వ, క. తె. బూతు.

2. ఇటువంటి పదాలకి కొన్నింటికి సజాతి పదాలు తమిళ మలయాళాలలో ఉన్నా అవి అర్వాచీన కాలంలో తెలుగు, కన్నడాలనించి అప్పు తెచ్చుకొన్నవే: త. కట్టం< తె. గడ్డము; త. కటు, కెటు< క. గడు, తె. గడువు; త. కుట్టై< తె. గుడ్డ; త. కూడై<తె. గూడ, క. గూడె; త. కెట్టి< తె.క. గట్టి, త. పుట్టి< తె. క. బుడ్డి; త. పొమ్మై< తె. బొమ్మ; త. పలప్పం; వలప్పం< తె. బలపము.

3. అన్ని భాషలలోనూ ఉన్న పదాల విషయంలో కూడా (పదాదిని) నాదస్పర్శాలు ఉండడంలో సోదర భాషలలో ఏకీభావం లేదు. అంటే, కొన్ని చోట్ల ఒక పదంలో కన్నడంలో నాదస్పర్శం ఉంటే తెలుగులో శ్వాసస్పర్శం ఉంటుంది; కన్నడంలో శ్వాసస్పర్శం ఉంటే తెలుగులో నాదస్పర్శం ఉంటుంది. ఇటువంటి అనైక్యం కన్నడం తెలుగులమధ్యే కాకుండా మిగిలిన భాషలలో కూడా కనపడుతుంది కొన్ని పదాలలో ఒకే భాషలో నాదస్పర్శం ఉన్న రూపమూ, శ్వాసస్పర్శం ఉన్న రూపమూకూడా ఉన్నాయి. దీనివల్ల మూలభాషా కాలంలో నాదస్పర్శాలు పదాదిని ఉండేవికావని తెలుస్తుంది. మూలభాషలో నాదస్పర్శాలు ఉంటే కొన్ని పదాలలోనైనా అన్ని భాషలూ వాటిని నియతంగా నిలుపుకొని ఉండేవి.

కన్నడంలో నాదస్పర్శానికి బదులు తెలుగులో శ్వాసస్పర్శం:

క. గరువలి, తె. కరువలి; క. గిడ, గిడు, తె. చెట్టు<*కెట్టు;

క. గుడి, కుడి, తె. కొడి, క. జిల్లి, తె. చిల్లు;

క. జేను, తేను, తె. తేనె; క. జొల్లు, తె. చొల్లు.

కన్నడంలో శ్వాసస్పర్శానికి బదులు తెలుగులో నాదస్పర్శం :
క. కళ్, తు. కత్తె, తె. గాడిద; క. కాదల్, తె. గాదిలి; క. కొడె, తె. గొడుగు; క. కున్ని, తె. గున్న, కూన, క కురుడు, తె. గ్రుడ్డి; క. సణబు, తె. జనుము; క. కుటి, తె. గొటియ. గొఱ్ఱె,
క. పల్లి, తె. బల్లి (<సంస్కృతం పల్లి),[1]

మిగిలిన భాషలలోకూడా కొన్నిచోట్ల శ్వాసస్పర్శం ఉండవలసినచోట్ల నాదస్పర్శం కనపడుతుంది: ప. బాం, తె. పాము, క. పావు, త. పాంపు; ప. బెర్తో, తె. పెద్ద, త. పెరియ, క. హిరియ; ప. బుర్కా 'ఆనప/సొర కాయ', గోం. పుర్కా; పెం. గజ 'పెద్ద', కువి. కజ్జ; పెం. గిల్ 'చిగుర్చు', త, కిళై, పెం. గుహ 'పొట్టి', త. కుఱు తె. కుఱుచ; పెం. గెహ్-'మూయు', గోం. కెహ్ -; పెం. బొంగ్ -, త. పొంకు, తె. పొంగు, కూయి. పొంగ్-,

1. ద్రావిడభాషలలోనించి సంస్కృతంలోకి వెళ్ళినపదాలలో పదాదిని శ్వాస స్పర్శమే ఉంటుంది. క. తె. గంజి (>సం. కాంచికా); క. తె. గుడి (>సం. కుటి): క. కుంటె, గుండ, గుండి, తె. కుంట, గుంట (*>సం. కుండ), ఈ పదాలు సంస్కృతంలో ప్రవేశించినప్పుడు ద్రావిడ భాష (ల)లో శ్వాసస్పర్శమే ఉండేది అన్నమాట.
కన్నడం తెలుగు తద్భవాలలో శ్వాసస్పర్శాలు నాదస్పర్శాలుగా మారడం కూడా ఉంది: క. తె. గాజు <సం. కాచ; క. తె. గుద్దలి<సం. కుద్దాల; తె. గేదగి, గేదంగి <సం. కేతకీ: తె. క. గేలి 'పరిహాసం' <సం. కేలీ; తె. గొడ్డలి < సం. కుఠార; తె. క. బంతి < సం. పంక్తి; తె. బట్ట, క. బట్టె <సం. పట్ట. చూ. పెంగొ గదడ్ 'అరటి' <సం. కదళీ.
కొన్ని భాషలలో తద్భవాలలో ప్రాచీన నాదస్పర్శాలు శ్వాసాలుగా మారడం కూడా ఉంది: గోం. కోడ్హా 'గుఱ్ఱం' <సం. ఘోటక: పెం. కాస్ 'గడ్డి' <సం. ఘాస; ప. పూద 'భూతం' <సం. భూత. ఈ పరిణామం తమిళంలో సర్వసాధారణం.

ఇటువంటి చోట్ల శ్వాసస్పర్శం ఎక్కువ భాషలలో, నాదస్పర్శం ఒకటి రెండు భాషలలో ఉండడం గమనించదగినది.

ఒకే భాషలో రెండు రకాల స్పర్శలూ ఉన్న పదాలు :

కన్నడం : కంపు, గంపు 'కంపు'; గీఱు, కీఱు, 'గీఱు'; గుడి, కుడి 'వృత్తం'; గూను, 'కూన్', కూను 'గూను', గెణె, గెళె, కెళె 'కలియడం'; గెరె, కెరె 'గీకు', గొట్ట, కొట్ట 'గొట్టం', దడి, తడి 'కర్ర'; దిడ్డు, తిట్టు 'గుట్ట', ఇటువంటివి కన్నడంలో చాలా ఉన్నాయి.

తెలుగు : గడచు, కడచు; గుంట, కుంట; దిన్నె, తిన్నె; దోగు, తోగు.

పర్జీ; చెర్రి, జెర్రి 'జెర్రి', చెల్ల, జెల్ల 'కొమ్మ'.

పెంగో. తార్, దార్ 'చీమ' (కూయి. తారు); గర్ంజి, కర్ంజి 'ఒక చెట్టు.'

ఈ సందర్భంలో బరో చెప్పనిదీ మనం చేర్చుకోవలసినదీ ఒక అంశం ఉంది. తెలుగులో కావ్యభాషలో పరుషాలు (క, చ, ట, త, పలు) ప్రథమా విభక్తి తరవాతా, ద్వంద్వ సమాసంలో ద్వితీయ పదం మొదటా గ, స, డ, ద, వలుగా బహుళంగా మారడం ఉంది; వాఁడు గొట్టె / కొట్టె, వారు వోరు / వోరు; కూరగాయలు, కాలుసేతులు, తల్లిదండ్రులు, అన్నదమ్ములు (చూ. బాలవ్యాకరణం. సంధి 13, 15). అదేవిధంగా ద్రుతప్రకృతికం మీద నున్న పరుషాలు సరళాలుగా (గ, జ, డ, ద, బలు) గా మారతాయి (బాలవ్యాకరణం, సంధి, 16) : పూచెంగలువలు, తోఁచెంజుక్కలు, మొగిడెంబద్మము.

కన్నడంలో కూడా ఇటువంటి మార్పు ఉంది. పంప భారతం (చూ, Dr. B. Ramachandra Rao, *A Descriptive Grammar of Pampa Bharata*, Mysore 1972 : 34 - 38) లో క, త, పలు అచ్చులు, అను నాసికాలు, అంతస్థల తరవాత సమాసంలోనూ, అసమాసంలోనూ కూడా గ, ద, బ/వలుగా మారతాయి :

పుడి 'పొడి' + కత్తురి 'కస్తూరి' > పుడిగత్తురి 'కస్తూరి పొడి'
గండు 'మొగ' + కూసు 'పిల్ల(వాడు)' > గండుగూసు 'మొగపిల్లవాడు'
కెయ్ 'చెయ్యి' + కన్నడి 'అద్దం' > కెయ్‌గన్నడి 'చేతి అద్దం'
మేరె 'మేర' + తప్పు > మేరెదప్పు 'మేరతప్పు'
పెణ్ 'ఆడ' + తుంబి 'తుమ్మెద' > పెణ్‌దుంబి 'ఆడ తుమ్మెద'
బెళ్ 'తెల్ల' + తింగళ్ 'చంద్రుడు' > బెళ్ దింగళ్ 'వెన్నెల'
కణ్ 'కన్ను' + పని 'బొట్టు' > కణ్‌బని 'కన్నీరు'
పెర్ 'పెద్ద' + పులి > పెర్బులి 'పెద్దపులి'
తోల్ 'తోలు' + పుల్లె 'లేడి' > తోల్‌పుల్లె 'తోలులేడి'.

4. కన్నడం తెలుగులలో కొన్నిపదాలలో నాదస్పర్శాలు అర్వాచీనాలని ఆ భాషలలో అంతస్సాక్ష్యంవల్లనే నిరూపించవచ్చు. ఉదాహరణకి తె. బెబ్బులిలో బె - అనేదీ పెద్ద అనేదీ రెండూ *పెర్ - నించి వచ్చినవే. మొదటి దాంట్లో *పకారం బకారంగా మారింది కాని 'పెద్ద'లో మారలేదు. తె. గుఱించి (త. కుఱిత్తు) ప్రత్యయం ఒక పదం తరవాతనే ఉంటుంది. కాబట్టి అందులో *క గగా మారింది. తె. క. గూడు 'కూడు' అనే క్రియకి సంబంధించినది; క్రియలో శ్వాసం నామవాచకంలో నాదంగా మారింది. కన్నడం. కెయ్, గెయ్ 'చేయు' అనే క్రియలో గకారయుక్త రూపం అది సహాయక క్రియగా ఉపయోగించడంవల్ల ఏర్పడింది.

తెలుగులో వర్ణవ్యత్యయం వల్ల మొదట్లో పదమధ్యంలో ఉండే నాద స్పర్శాలు పదాదికి వచ్చాయి. గోరు (త. ఉకిర్, క. ఉగుర్), డిగు, దిగు (త. క. ఇళి), డాఁగు దాఁగు (త. అటంకు, క. అడఁగు).

పై చర్చవల్ల మూలద్రావిడంలో నాదస్పర్శాలు (ప్రత్యేక వర్ణాలుగా) లేవనీ, శ్వాస స్పర్శాలు మాత్రమే ఉండేవనీ, అవి తమిళ - మలయాళాలు తప్ప మిగిలిన భాషలలో కొన్ని పదాలలో నాదాలుగా మారేయనీ తేలింది. ఇటువంటి

మార్పుకి ఈ భాషలలో చేరిన సంస్కృతంలో నాదస్పర్శాలతో మొదలయ్యే మాటలు కొంత దోహదం చేసి ఉండవచ్చు అయితే మూలద్రావిడంలో అచ్చుల మధ్యా, అనునాసికం తరవాతా ఉన్న స్పర్శాలు నాదాలుగా ఉండి ఉండవచ్చు. ఇప్పటి భాష లన్నింటిలో అద్విరుక్తమైన ప్రాచీన స్పర్శం ఈ స్థానాలలో నాదంగా ఉండడమే ఈ ఊహకి ఆధారం. (తెలుగు కన్నడం మొదలైన భాషలలో ఈ స్థానాలలో ఉండే శ్వాస స్పర్శాలు మూలద్రావిడంలో ద్విరుక్తాలని గమనించాలి : తె. కాకి, క. కాకె <*కాక్కయ్). అయినా మూలభాషలో అతి ప్రాచీనకాలంలో అన్ని స్థానాలలో స్పర్శాలు శ్వాసాలుగానే ఉండి ఉంటాయి అనడానికి మూడు ఆధారాలు ఉన్నాయి : 1. ద్రావిడ భాషలలోనించి సంస్కృతంలోకి వెళ్ళిన కాంచికా 'గంజి,' కుటి 'గుడి, ఇల్లు,' కేతకీ 'గేదంగి' మొదలైన పదాలలో ఆ పదాదిని శ్వాసస్పర్శమే ఉంది. అంటే ఇవి సంస్కృతంలోకి వెళ్ళిన కాలంలో ఈ స్థానాలలో స్పర్శం నాదంగా మారలేదన్నమాట. 2. క్రీస్తు శకారంభంనాటి తొల్కాప్పియంలో ఇటువంటి ఉచ్చారణభేదం ఉన్నట్లు ఆ గ్రంథకర్త చెప్పలేదు. కాబట్టి ఆ కాలానికి తమిళంలోనే ఇటువంటి మార్పు రాలేదని చెప్పడానికి ఆస్కారం ఉంది. 3. మూలభాషలో అద్విరుక్త క, చ, ట, త, ప లు శ్వాసాలుగానే ఉండేవి అనడానికి కన్నడంలో ఆధారం ఉంది. *ఎరుతు > క. ఎర్తు, ఎత్తు 'ఎద్దు'; *పొఴుతు > క. పొళ్తు, పొర్తు, పొత్తు, హొత్తు. ఇటువంటిచోట్ల ఉకార లోపం వల్ల కన్నడంలో ర్/ళ్ + త్ > ర్త్, త్త్ అనే మార్పు వచ్చింది; ఈ సంయుక్తాక్షరాలలో తకారం, ఇతర స్పర్శాలూ శ్వాసాలుగానే ఉండడం గమనించదగినది. అనునాసికం ఉన్న పదాలలో మాత్రమే కన్నడంలో ఇటువంటిచోట్ల నాదస్పర్శం వస్తుంది. ఉదా : *మరుంతు > మద్దు 'మందు.' దీనివల్ల మూలభాషలో మొదట్లో అనునాసికం తరవాత మాత్రమే శ్వాస స్పర్శం నాదంగా మారిందని తెలుస్తుంది.

## 2. 20. *క

(i) మూ. ద్రా. (పదాది) *క-కారం తమిళం, మలయాళం, తెలుగు-మూడు ఉత్తర ద్రావిడ భాషలు తప్ప మిగిలిన భాషలలో అలాగే ఉంటుంది. కొన్ని పదాలలో కొన్ని భాషలలో అది గగా మారవచ్చు.

తమిళ - మలయాళాలలో అగ్రాచ్చులైన ఇ, ఈ, ఎ, ఏల ముందు వీటి తరవాత మూర్ధన్య వర్ణం లేకుండా ఉంటే మూ. ద్రా. *క కారము చకారంగా మారుతుంది. కిచ్చుకిచ్చు 'కీచుకీచు,' కిల్‌కిల్ 'గలగల' మొదలైన ధ్వన్యనుకరణ శబ్దాలలో ఈ మార్పు రాదు. అగ్రాచ్చుల తరవాత మూర్ధన్యం ఉంటే వాటి ముందు ఉన్న *క చగా మారదు.

మూ. ద్రా. *క తెలుగులో అగ్రాచ్చుల ముందు చగా మారుతుంది. వీటి తరవాత మూర్ధన్యం ఉన్నా అది తెలుగులో ఈ మార్పుని ఆపదు. తెలుగులో ఏ గా మారిన *అయ్ ముందు కూడా *క చగా మారుతుంది. ఈ మార్పుని తాలవ్యీకరణం (Palatalization) అంటారు. ప్రాఙ్నన్నయ యుగ శాసనాలలో 8 వ శతాబ్ది దాకా 'చేయు' (<*కేయు) అనే క్రియరూపాలైన కేచిన 'చేసిన' (ముంజేరు శాసనం), కేసి 'చేసి' (కొత్తూరు శాసనం), కేసిన 'చేసిన,' కేసిరి 'చేసిరి' (భైరవకొండ శాసనాలు) కకారంతో ఉన్నాయి. కాని క్రీ.శ. 395-410 కాలానికి చెందిన పెదవేగి శాసనంలో 'చెం చెఱువ,' 'కంబురాంచెరువ' అనే మాటలలో చెఱువు శబ్దం (<*కెఱువు) చకారంతో ఉండడడవల్ల ఆనాటికే తెలుగులో తాలవ్యీకరణం జరిగింది అనవచ్చు. అయితే పైన ఇచ్చిన 'కేచిన' మొదలైన రూపాలలో లేఖన సంప్రదాయంవల్ల క కారం నిలిచి ఉండవచ్చు. లేక కొన్ని మండలాలలో ఎనిమిదో శతాబ్దినాటికి తాలవ్యీకరణం వ్యాపించి ఉండకపోవచ్చు.

త. మ. చెవి, చెళ్ళి, కోత. కిర్, క. కెఱు, తు. కెరి, కిరు, తె. చెఱు, చెఱుత. (1594).

త. మ. కిళి, క. తు. గిళి; గిణి; తె. చిలుక, ప. కిల్, గ. (సా) కిల్లిజ్ (1584).

త. మ. చీ, చీళ్, క. తు. కీవు, తె. చీము, చీడ, చీమిడి, (1606).

త. కీళ్, మ. చీళ్, క. గీఱు, తె. చీలు. (1622).

త. మ. కెటు, క. కెడు, కిడు, తె. చెడు. (1942).

త. చితర్, చింతు, మ. చింతు, క. కెదఱు, తె. చెదరు, చిందు, (1546).

త. చెయ్, మ. చెయి, క. కెయ్, తె. చేను, కో.ప. కేన్, (1958).

త. మ. చెయ్, క. కెయ్, గెయ్, తె. చేయు, గోం. కీ-, (1957).

త. చిత్తై, మ. చిఱ, కోత. కెర్, క. కెఱె, తు. కెదు, తె, చెఱ, చెఱువు. (1980).

త. మ. కై, క. కయ్, తె. చేయి. ప. కెయ్, గోం. కయ్, కొం. కియు, పెం. ఖెయ్; కూయి. కజు. (2023).

త.మ. కయ, కచ, 'చేదుగా ఉండు', క. కయ్, కయ్పు 'చేదు', తె. చేఁదు, మం.కెంబెల్. (1249).

త. మ. చెవి. చెవిటు, క. కివి, కివుడు, తె. చెవి చెవుడు, కో.నా. కెవ్. గోం. కెవ్/కెవి, కొం. గిబి, మంగియ్. (1977).

తెలుగులో కిట్టు, కినియు, కినుక, కెడయు, కెంపు, కెలయు మొదలైన కొన్ని పదాలలో తాలవ్యాచ్చు ముందున్న క కారం చ కారంగా మారలేదు. కాబట్టి ఇటువంటి పదాలు తెలుగులో తాలవ్యీకరణం జరిగి ఆగిపోయిన తరవాత కన్నడం నించి ఎరువు తెచ్చుకున్నవి అయి ఉండాలి.

తమిళ - మలయాళాలలో తాలవ్యీకరణానికీ, తెలుగులో తాలవ్యీకరణానికీ రెండు ముఖ్యభేదాలు ఉన్నాయి. 1. తమిళ - మలయాళాలలో తాలవ్యాచ్చు తరవాత మూర్ధన్యం ఉంటే ఈ తాలవ్యీకరణం జరగదు. తెలుగులో ఇటువంటి నియమం లేదు. 2. తెలుగులో*అయ్‌నించి వచ్చిన ఏకారం ముందుకూడా తాలవ్యీకరణం జరుగుతుంది.తమిళ-మలయాళాలలో ఈ మార్పు లేదు.ఈ రెండు భేదాల వల్లా తెలుగులో తాలవ్యీకరణం తమిళ - మలయాళాల్లో తాలవ్యీకరణం వేరు వేరుగా జరిగినవేకాని ఈ మూడు భాషలూ ఒకటిగా ఉన్న కాలంలో జరిగినవి కావు అని బరో (1968:45) నిర్ణయించారు. తమిళంలో తొల్కాప్పియం కాలం నించీ తాలవ్యీకృతరూపాలే ఉన్నాయి. కాని తెలుగులో ప్రాచీన శాసనాలలో (8 వ

శతాబ్దిముందు) తాలవ్యీకరణం లేని రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తున్నాయి. కాబట్టి తెలుగులో ఈ మార్పు తమిళంలో మార్పుకి కొంత అర్వాచీనమని చెప్ప వచ్చు. తమిళం (మలయాళం) తెలుగులలో ఈ మార్పు సదృశపరిణామమే (Parallel Development) కాని సంయుక్త పరిణామం (Shared Innovation) కాదు.

తమిళ - మలయాళాలలో పద మధ్య * కకారం కూడా కొన్ని పదాలలో ఇకారంముందు ఛకారంగా మారుతుంది :

త. అరిచి, అరీ 'బియ్యం', మ. అరి, క.తు. అక్కి (<*అర్కి) (215).

త. ఞాంచిల్, నాలచిల్ 'నాగలి', మ. ఞేఞ్ఞిల్, క. నేగల్, నేగిల్, తె. నాఁగలి. (2907).

త. ఎచ్చిల్, తె. ఎంగిలి. (780).

(ii) ఉత్తర ద్రావిడ భాషలైన కూడుఖ్, మాల్తో, బ్రాహుయిాలలో మూ.ద్రా. * క - కారం ఉన్నతాచ్చులైన * ఇ, * ఈ, * ఉ, * ఊలముందు కకారంగానే ఉంటుంది కాని మిగిలిన అచ్చుల ముందు ఇది కూడుఖ్, బ్రాహుయిాలలో ఈషత్ స్పృష్టం (Fricative) గానూ, మాల్తోలో కంఠ పశ్చిమ స్పర్శంగానూ మారుతుంది.[1]

---

1. బరో * ఇ, * ఈల ముందే * కకారం స్పర్శంగా ఉంటుందని చెప్పారు. కాని ఇటీవల మార్టిన్ పైపర్ (19 2 : 63-65) పరిశోధనలవల్ల * ఉ, * ఊల ముందు కూడా ఇది స్పర్శంగానే ఉంటుందని తేలింది. బ్రాహుయిా విషయంలో ఇంకా పరిశోధన జరగాలి. మాల్తోలో ఈ ధ్వని కంఠ పశ్చిమ స్పర్శం (Post - velar stop) అని ఇటీవల నిర్ణయం అయింది. ఈ పుస్తకంలో ఈ ఉత్తర ద్రావిడ ధ్వనులకి 'ఖ' అనే గుర్తే వాడబడింది. మహాప్రాణమైన ఖ దేశ్యపదాలలో ఉండదు కాబట్టి దీనివల్ల ఇబ్బంది ఉండదు.

తె. గిచ్చు, గోం. కిస్క్ - .. కూయు, కిస్ -., కూ. కిచ్చ్ - 'విరుచు', కిస్స్ - 'గుచ్చు', బ్రా. కిష్క్ - .. 'కోయు, విరుచు' (1513)

త. మ. చేంపు, క. కేసవె, కేసు, కెసవు, తె, చేమ (దుంప), ప. కీబి, గ. కియుబ్, కూ, కిస్ గా (< * కిచ్ -., * కిచుంప్). (2004)

త. మ. చీ, క. కీ, తె. చీకు, చివుకు, కూ. కిత్ -., మా. కిత్ -., బ్రా. కిష్ 'చీము' (1606)

త. మ. క. కీళ్, తె. క్రింద, కూ. కియ్యా, కీత, బ్రా. కి -., కీ -., కేరగ్, (1619)

క. తె. కుట్టు, కో. నా. ప. కుట్ -., కూ. కుడ్ -., కుడ్ -., (1672)

కూయి. గుంద్-'చిగుర్చు',కూ. మా. కుంద్-'చిగుర్చు, పుట్టు'. (1729)

తె. కూర్కు 'నిద్ర', ప. గ. గోం. కూర్క్ - 'నిద్రలో తలఊపు', కూ. మా. కూగ్ - 'నిద్రపోవు'. (1902)

త. మ. క. కణ్, తు. కణ్ణు, తె. కన్ను, గోం. కూయి. కన్, కూ. బ్రా. ఖన్, మా. ఖను, బ్రా. ఖరీన్క్ 'కన్నీరు'. (1159)

త. మ. క. కల్ 'రాయి', బ్రా. ఖల్. (1298)

త. మ. కల, కలక్కు, క. కలకు, తె. కలఁచు, కూ. ఖలఖ్, మా, ఖల్గ్ .. (1303)

త. కాక్కై, మ. కాక్క, క. కాకె, కాగె, తె. కాకి, కూ. ఖాఖా, మా. ఖాగె, బ్రా. ఖాఖో. (1425)

త. మ. తె. చెవి, క. కివి, తు. కెబి, కూ, ఖెబ్దా, మా. ఖెత్వ్యా, బ్రా. ఖఫ్. (1977)

త. చె, చేయ్ 'ఎరుపు', క. కె -., కేసు, కూ. ఖేఁసొ 'ఎరుపు, రక్తం', మా. ఖేసొ 'ఎరుపు', ఖేసు 'రక్తం', బ్రా. ఖీసున్ 'ఎరుపు'. (1931)

త. మ. క. కొయ్, తె. కోయు, కూ. మా. ఖొయ్ .. (2119)

త. మ. కొళుంతు 'చిగురు' కూయి, కోడు, కూ, ఖోర్ - 'చిగుర్చు', ఖోర్ 'చిగురు', మా. ఖోరొచ్ 'చిగుర్చు', ఖోరొ 'చిగురు', బ్రా. ఖర్ - 'చిగుర్చు', ఖరున్ 'పచ్చ'. (2149)

(iii) * -క .. మూ. ద్రా. * కకారం పదమధ్యంలో చాలా భాషలలో గకారంగా మారుతుంది. తొదలోనూ తమిళంలోనూ కంఠ్యశ్వాసైషత్ స్పృష్టం (**Velar voiceless fricative**) గా మారుతుంది. పర్జీమాండలికాలలో గ కి బదులుగా య, వలు కూడా వున్నాయి. గోండి, కువిలలో అది యగా మారుతుంది. * కూడుఖ్ - మాల్తోలలో దీర్ఘాచ్చు తరవాత క కారంగానే ఉంటుంది. కాని హ్రస్వాచ్చు తరువాత ఈషత్ స్పృష్టంగా మారుతుంది (ఇది కూడుఖ్ లో శ్వాసం, మాల్తోలో నాదం). ఇది బ్రాహుయిలో ఖ-గా మారుతుంది.

త. పుకై, మ. పుక, కోత. పెగ్, తొ. పఖ్, క. కొడ. పొగె, తు. పుగె, పొగె, తె. పొగ, కో. నా. గ. పొగ్, గోం. పోయా, కొం. పొగా, కువి. బొ:యి. (4240)

కో. ఏగ్ 'ఆకు,' నా. నా. (ఛాం). ఎగ్, ప. ఎవ్, గ. (ఒ) ఎగ్ (సా), ఎగు, ఏగ్. (775)

ప. తోయ్ 'తొగరు', గ. తోయ్, గోం. తోయా, కొం. పెం. తోగ, మం. తూగె, కూయి. తోగ, కువి. తో:య. (3537)

త. ఏకు, తె. ఏగు, కూ. మా. ఏక్.. (871)

త. ఉకిర్, తె. గోరు, కూ. ఒరొఖ్, మా. ఒర్గ. (561)

పద మధ్యంలో *-క- క్వాచిత్కంగా వ-గా మారుతుంది: తె. పగలు/పవలు (త. మ. పకల్ (3805)), తె. నగు, నవ్వు (త. మ. నకు, క. నగు (3569).

(vi) *-క.. మూ. ద్రా. ద్విరుక్తస్పర్శం తమిళ మలయాళాలలో అలాగే ఉంటుంది. కన్నడం, కొడగు, తుళు, తెలుగు, గోండిలలో ఇది హ్రస్వాచ్చు తరవాత అలాగే ఉంటుంది గాని దీర్ఘాచ్చు తరవాత అద్విరుక్తంగా మారుతుంది. బ్రాహుయిలో ఖ గా మారుతుంది. కూడుఖ్‌లో దీర్ఘాచ్చు తరవాత ఖ్ఖ గానూ

హ్రస్వాచ్చు తరవాత ఖ/క్కలు గానూ మారుతుంది. మాల్తోలో గ గా మారుతుంది. మిగిలిన భాషలలో అద్విరుక్త క కారంగా మారుతుంది.

త. మ. నక్కు, కోత. నక్, తొ. నాక్-, క. కొడ. తు. నక్కు, తె. నాకు, కో. నా. గ. గోం. కొం. పెం. నాక్-, ప. మం. నేక్-, కూయి కువి నాక్-. (ఇందులో దక్షిణ భాషలలో హ్రస్వాచ్చూ, మధ్య భాషలలో దీర్ఘాచ్చూ ఉన్నాయి. ఈ భేదానికి కారణం తెలియదు.) (3570)

త. కాక్కై, మ. కాక్క, కాకె, కాగె, తె. కాకి, కూ. ఖాఖా, మా. ఖాగె, బ్రా. ఖాఖో. (1425)

త. అక్కా, మ. క. తు. అక్క, తె. అక్క, గోం. తక్కా. (23)

(v) *-ంక- (ఙ్క-). మలయాళంలో ఇది సాధారణంగా ఙ్ఙ గా మారుతుంది. కన్నడంలో ప్రథమ హ్రస్వాచ్చుకి తరవాత వేరు హల్లేమీ లేకుండా అనునాసిక సహితస్పర్శం ఉంటే అందులో అనునాసికం ఉంటుంది; మిగిలిన చోట్ల అది లోపిస్తుంది. గోండీ కొండ, పెంగొలలో ఇది జ గా మారుతుంది. తొదలో దీనిలో అనునాసికం లోపిస్తుంది. మిగిలిన భాషలలో ఇది 'ంగ' అవుతుంది.

త. పొంకు, మ. పొఙ్ఙు, కోత. పొగ్-, తొ. పి̈గ్-, క. పొంగు, కొడ పొఙ్ఙు-, తు. బొంగు, తె. పొంగు, కో. నా. పొంగ్-, గోం, పోజ్-, కొం, పొజి-, పెం. బొజ్-, కూయి. కువి, పొంగ్ , మా. పొంగ్-. (4469)

త. తూంకు, మ. తూఙ్ఙు, కో. తూంగ్-, తొ. తూఖ్-, క. తూగు, కొడ. తూంగ్-, తు. తూంగు, తె. తూఁగు, కొం. దూజ్-, పెం. తూంగ్-, మం. త్రూంగ్-, కూయి. దూంగ్-, ద్రూంగ్-, కువి. తూంగ్-, కూ. తుంగల్ 'కల', మా. తుంగ్లె 'కల', బ్రా. తుంగాన్ 'నిద్ర', తుగ్ 'నిద్ర, కల.'(3376)

**2. 21. * చ.**

(i) మూలద్రావిడ పదాది *చకారం దక్షిణ ద్రావిడ భాషలలోనూ తెలుగులోనూ కొన్ని పదాలలో లోపించింది; కొన్ని పదాలలో మిగిలి ఉంది.[1] ఇది లోపించడానికీ లోపించకుండా ఉండడానికీ కారణం ఏమీ కనపడదు. ఈ భాషలలో కొన్ని పదాలలో పదాది చకారం ఉన్నరూపం లేనిరూపం కూడా ఉన్నాయి (త. చిప్పి, ఇప్పి, 'నత్తగుల్ల', తె. అందము, చందము; ఇగురు, చిగురు; క. అంద, చంద 'అందం'). తెలుగు తప్ప మిగిలిన మధ్య ద్రావిడ భాషలలోనూ ఉత్తర ద్రావిడ భాషలలోనూ పదాది చకారం లోపించదు కాబట్టి యీ భాషలు మూలభాషలో పదాది చకారం ఉండేదని నిర్ణయించడానికి ఉపయోగిస్తాయి.

---

1. దక్షిణ ద్రావిడ భాషలలోనూ తెలుగులోనూ తద్భవాలలో కూడా పదాది చ, స, శ, క్ష (> ప్రాకృతం ఛ) లు లోపించాయి (ఈ పదాలు ప్రాకృతం ద్వారా వచ్చినవి.)

త. అలై 'గది, పశువులకొట్టం,' మ. అల, తొద. అస్ల 'ఇల్లు' <సం. శాలా.

త. ఉల్కు 'పన్ను', తె. ఉంకువ <సం. శుల్క.

త. మ. క. ఆవణి <సం. శ్రావణ.

త. అవై 'సభ' <స. సభా.

త. మ. ఆయిరం 'వెయ్యి', క. సాసిర, సావిర <సం. సహస్ర.

త. ఊచి 'సూది' <సం. సూచి.

త. ఐయవి, తె. ఆవ <ప్రా. సాసవ <సం. సర్షప.

త. అవం 'వింటితాడు' <సం. చాప.

త. ఏమం 'రక్షణ' <ప్రా. చేమ <సం. క్షేమ.

త. మ. క. తు. ఏణి 'నిచ్చెన' <ప్రా. సేణి <సం. శ్రేణి.

తె. అంకె <సం. సంఖ్యా.

ఇది తొదలో తకారంగా మారుతుంది (ఇటువంటి మార్పు ఇతర భాషలలో కూడా క్వాచిత్కంగా ఉంది). ఇది మలయాళం, కోత,[1] కొడగు, తెలుగు, పర్జీ, కూడుఖ్, మాల్తో, బ్రాహుయిలలో స్పృష్టోష్మం (Affricate)గా ఉంటుంది. తెలుగులో ఇది తాలవ్యాచ్చుల ముందు తాలవ్యం, ఇతరాచ్చులముందు దంతమూలీయం. పెంగొ, మండ, కువిలలో ఇది హగా మారుతుంది. గోండీలో కూడా దీనికి మాండలిక పరిణామాలు ఉన్నాయి; పశ్చిమ మాండలికాలలో ఇది స గానూ, తూర్పు మాండలికాలలో హ గానూ మారుతుంది; కోయలో ఇది పూర్తిగా లోపిస్తుంది. మిగిలిన భాషలలో స గా మారుతుంది. తమిళం లిపిలో దీనిని చకారం గానే వ్రాసినా ఉచ్చారణలో పదాదినీ, అచ్చుల మధ్యా స గా ఉచ్చరిస్తారు (బ్రాహ్మణుల మాండలికంలో దీన్ని శ గా ఉచ్చరిస్తారు).

త. మ. చెల్ 'పోవు', కోత. చల్, తొద. సల్ - (< క.), క. తు. సల్, తె. చెల్లు, చను, సలుపు. కో. సెర్ -, నా. చ-, సెర్-, ప. చెన్-, గోం. సొన్, హూన్ -, అన్-, కొం. సొల్-, పెం. మం. హల్-, కూయి. సల్-, కువి. హల్-, కూ. చల్ర్-, (2781)

త. మ. చా, చావు, క. సాయ్, సావు, కొద - చాశ్-, చావు, తు సయ్-, సావు, తె. చచ్చు, చావు, ప. చయ్-, గ. సయ్-, గోం. సా-, కొం సా-, పెం. మం. హా-, కూయి. సా-, సావ, కువి. హా-, కూ. ఖే-, మా కెయ్-, బ్రా. క?-, (2426)

త. మ. క. చూల్, తె. చూలు, (2733)

తొద. త- <*చ-:

త. మ. చిక్కు-, కోత. చిక్-, తొ. తిక్. క. సిక్కు-, సిల్కు-, సిర్కు-, కొడ. చిక్-, తు. తిక్కు-, సిక్కు-, తె. చిక్కు-, (2498).

---

1. కోతలో చకారాన్ని అన్ని స్థానాలలోనూ (పదాది, పద మధ్యం, పదాంతం) సకారంగా కూడా ఉచ్చరించవచ్చు.

త. మ. చుటు 'కాలు (క్రియ)', కోత. తొద. తుడ్-, క. సుడు, కొడ. చుడ్-, తు. తుడు, సుడు, తె. చూఁడు, కో. నా, సుడ్-, గోం, సుర్-, పెం. హుజ్-, కొం. సుజ్-, కూయి సుగ్-, కూ. కుడ్-, (2654)

త. మ. చురుళ్ 'చుట్టుకొను', కోత. చుర్ణ్-, తొ. తూళ్-, క. సురు(ం)టు, కొడ. తురుడ్-, కూ. బ్రా. కూర్- (2684)

త. మ. చొటి, కోత, తొయ్ర్, తొ. త్వట్య్., క. తుటి, తె. దురద. (2865)

(పై ఉదాహరణలలో తొద కాక ఇతర భాషలలో కూడా *చ త గా మారడం గమనించదగినది.)

(ii) **దక్షిణ ద్రావిడ భాషలు, తెలుగులలో పదాది *చకారలోపం :**

క. తు. అళియ, తె. అల్లుఁడు, ప. చల్ ఞీద్, గ. సల్ ఞీడ్, కో. నా. సాంజిన్, గోం. సడ్దే, కొం, సణిన్, కువి. హానె, బ్రా. సాలుం. (2410)

త. మ. అఱు, కోత. అర్, తొ. ఒట్. క. అఱు, కొడ. అరు, తు. ఆజి, తె. అఱు, గోం. సారూంగ్, కూయి. సజ్గి, హాజ, నా (ఛాం.) సాది. (2485)

త. క. ఈ, తె. ఇచ్చు, కో. నా, సీ-, ప. చీ-, గ. కొం. సీ-, పెం. మం. హీ-, కూయి. హీ-, గోం. సీ-, హీ-, ఈ-, కువి. హీ-, కూ. చి-, మా. చియ్-, (2598)

త. మ. ఉప్పు, కోత. తొ. ఉప్, క. కొడ, తు. తె. ఉప్పు, కో. నా. సుప్, ప. చుప్, గ. సుప్, గోం. సొవోర్, హొవోర్, ఒవోర్, కొం. సోరు, పెం. హోర్, మం. జార్, కూయి. సారు, కువి. హారు. (2674)

త. ఏర్, (జాఫ్నా) చేర్, మ. కోత, తొ. ఏర్, క. ఏరు, అర్, తె. ఏరు (వాక), కో. ప. చేర్, గోం. సేర్, హేర్, ఏర్, పెం. హేర్, కూయి. సేరు, కువి. హేరు. (2815)

త. ఐంతు, మ. అంచు, కోత. అంజ్, తొ. ఉజ్, క. అయిదు, కొడ. అంజు, తు. అయ్‌ను, తె. ఏను, అయిదు, కో. సేగుర్ 'అయిదుగురు', ప. చేవిర్ 'అయిదుగురు', చే(దు(క్) 'అయిదు', గోం సైయూంగ్, నా (ఛాం.) సేంది, కూయి. సింగి, సేంగి. (2826)

ఉత్తర ద్రావిడభాషలలో *ఉ, *ఊ, *ఎ, *ఏలముందు మూ. ద్రా. *చ- 'క'గా మారుతుంది. (దీనికి పరిసర నిర్ణయం అసాధ్యం అయిన మరికొన్ని ఉదాహరణలు కూడా ఉన్నాయి).

త. మ. చుటు 'కాలు' : కూ. మా. కుడ్-, (2654)

త. మ. చుమ 'బరువెక్కు, మోయు' : కూ. మా. కుమ్-, బ్రా. కుబేన్ 'బరువైన'. (2677)

త. మ. చురి, చురుళ్ ' చుట్టు(కొను)' : కూ. కూర్-, మా. కుడ్గ్-, బ్రా. కూర్-, (2684)

త. చెరుకు 'దోపు' : కూ. ఖెర్ర్-, మా. ఖెర్-, (2778)

త. మ. చేర్, తె. చేరు : కూ. కెర్- 'పోవు', బ్రా. కేబ్ 'దగ్గర'. (2814)

(చూ. పైన త. మ. చా, చావు)

మొత్తంమీద పదాది * చకారానికి చ, స, హ, త, క, లోపం అనే ఆరు ప్రతిరూపాలు ఉన్నాయి. దీనికి ఇన్ని మార్పులు రావడానికి మూలభాషలో ఇది ఒక్కటే స్పృష్టోష్మం అవడంవల్ల వచ్చిన అస్థిరత్వమే కారణమని ఎమెనో (1988 వ్యాసం) అభిప్రాయం.

(iii) * -చ- : త. మ. కోత. -చ-, తొ. క.. స-, కొడ. తు. -జ-, తె. -చ/-, -స, కో. నా. -స-, ప. గ.. య- గోం. కొం. -స-, పెం. మం. -హ-, కూయి. -స-, -హ-, కువి -హ-, కూ. మా. బ్రా. -స-.

త. మ. మాచు 'మట్టి', 'మచ్చ', కోత. మాచ్, క. మాసు, కొడ. మాజ్ - 'మూయు', తె. మూయు, మాసీ, కూయి. మాసి, కువి. మాహ్- 'మూయు'. (4792)

త. మ. వీచు, కోత. వీచ్-, తొ. పీస్-, క. బీసు, కొడ. బీజ్-, తు. బీజు, తె. వీచు, విసురు. కొం. విసిర్-. (5450)

(* -చ- 'య' గా మారడం కూడా ఉంది: త. మ. వెయిల్ 'ఎండ' : క. బిసిల్ (5517); త. మ. పెయర్,తె. పేరు, క. పెసర్, కోయ. పెదేర్. (4410)

(iv) *-చ్చ- : త. మ. -చ్చ-, కోత. -చ-, క -చ్చ-, -స-, కొడ, తు. -చ్చ-, తె. కో. నా. -చ్చ-, -చ- ప. -చ్చ-, గ. గోం. -చ్చ-, -స-, కొం. -స-, పెం. మం. -చ-, కూయి -స-. కువి -చ్చ-, -చ-, కూ. మా -చ్చ-- -చ-, బ్రా. -స-, -ష-.

త. నచ్చు, క. నచ్చు, నర్చు, తె. నచ్చు. (3576)

త. ముచ్చు 'కప్పు', కోత. ముచ్-, తొ. ముచ్-, క. కొడ. తు. తె. ముచ్చు, నా. ముచ్-, గోం. ముచ్చ్-, ముస్-, కొం. ముస్-, పెం. మం. ముచ్-, కూయి. ముస్-, కువి. ముచ్చ్-, కూ. ముచ్చ్-, మా. ముచ్-, బ్రా. ముస్ 'మూసిన(ది)'. (4915)

(v) *-ంచ- : త. -ంచ-, మ. -ఞ్ఞ-, -ంచ-, కోత. -ంజ-, తొ. -జ-, క. -జ-, -స-, -ంజ-, కొడ. -ంజ-, -ఞ్ఞ-, తు. -ంజ-, తె. కో. నా. -ంజ-, ప. గ. ,ఞ-, -ంజ-, గోం. కొం. పెం. మం. కూయి. కువి. కూ. మా -ంజ-.

త. మ. అంచు 'భయపడు', కోత, అంజ్-, తొ, ఒజ్-, క. తు. తె. అంజు. (55)

త. మ. తుంచు 'నిద్రపోవు', ప. తుఙ్-, చుఙ్-, గ. తుఙ్-, గోం. సుంజ్-, హుంజ్-, ఉంజ్-, కొం. సుంఙ్-, పెం.మం. హూంజ్-, కూయి. సుంజ్-, కువి. హుంజ్-. (3291)

## 2. 22. *ట

(i) మూలద్రావిడంలో *ట కారం పదాదిని ఉండదు. దుహితృ భాషలలో కూడా తెలుగు- కువి ఉపకుటుంబంలోనే పద మధ్య *టకారం వర్ణవ్యత్యయం వల్ల పదాదికి వచ్చి 'డ'గా ఉంటుంది.

*-ట- : త. మ. -ట-, కోత-ధ- (ఏకతాడితం one-flap), -డ-, తొ. -ఢ- (శ్వాస కంపితం, Voiceless trill), -డ-, క. కొడ. తు. తె. కో. -డ-, నా. -ఢ-, ప. -డ-, గ. -ర-, -ర్ర-, గోం. -ర-, -ర్ర-, కొం. పెం. మం -ఢ-, కూయి -డ-, హ] -ఢ-, కువి. -ఢ-, కూ. మా. -ఢ-, బ్రా. -ఢ- -ర-, -ర్ర-.

(కొన్ని పదాలలో ఇది మూల- గోండి- కొండ- పెంగొ- మంద కూయి- కువిలో *-ఱ-గా మారింది.)

త. మ. ఉటుంపు, క. ఉడ, ఉడు, కొడ. ఉడుంబు, తు. ఉడు, ఒడు, తె. ఉడుము, కో. ఉడుగ్, నా. హుడుగ్, ప. ఉడు, గోం. ఉరూం, ఉర్రూం, కొం. ఉర్బు. (592)

త.మ. నాటు, కోత. నాడ్, తొ. నోఢ్, క. తు. తె. నాడు 'దేశం', గోం. నార్, కొం. నాఙ్, పెం.నాజ్/నాస్, మం. నాయ్, కూయి. నాజు, కువి. నాయు. (గోండి-కువిలో అర్థం "ఊరు".) (3638)

(చూ. 2.21 లో త.మ. చుటు 'కాలు'.)

(ii) *-ట్ట-: త.మ. -ట్ట--డ-, కోత.తొ. -ట-, క.కొడ.తు. తె. కో. నా. ప. గ. గోం. -ట్ట-, -ట-కొం. పెం. మం. కూయి. కువి-ట-, కూ. మా. -ట్ట-, -ట-, బ్రా. -ట-.

త. ఇరట్టై, మ. ఇరట్ట, తొ. ఈట్య్, తె. రెట్టి, రెట్టింపు, ప. ఇరొట్, బ్రా. ఇరట్. (474)

త. కట్టు, మ. కెట్టు, కోత. కట్-, తొ. కొట్-, క. కట్టు, కొడ. కెట్ట్-, తు. తె. కట్టు, కో. నా. ప. గ. గోం. కట్ట్-. (1147)

(iii) *-ంట- : త.మ. -ంట-, కోత. క. -డ-, -ండ-, తొ. -డ-, మిగిలిన అన్ని భాషలూ -ండ-.

త. మంటై 'తల, కపాలం', మ. మంట, కోత. మండ్, తొ. మడ్, క. కొడ. తు. మండె. (4682)

త. ఇరంటు, మ. రంటు, కోత. ఎయ్డ్, తొ. ఏడ్, క. ఎరడు, కొడ. దండు, తు. రడ్డు, తె. రెండు, నా (ఛాం) ఎర్ండి, ప. ఇర్దు, గోం. రండ్, కొం. రుండి, పెం. రిండజ్, కూ. రిండె, కూ. ఏండ్, ఏండ్, బ్రా. ఇరట్, (విశేషణం) ఇరా. (474)

## 2. 23 *త

(i) మూ.ద్రా. పదాది *తకారం అన్ని భాషలలోనూ త కారంగానే ఉంటుంది.

త. మ. క. తె. తప్పు. (3071)

త. తలై, మ.తల, కోత. తల్, తొ. తల్ 'తల', తస్త్మ్ 'శిఖరం', క.కొడ.తలె, తు,తరె. తె. తల, కో.నా. తల్, ప. తెల్, గ.తల్, గోం. తల్లా, కొం. తల, కూయి. త్లఉ, కువి. త్రాయు, మా. తలి (3103)

త. మ. తేన్, క. తేను, తె. కో. నా.కొం. తేనె., గ. తీన్, మా. తేని. (3268)

(ii) *-త-: త.మ. - త-, తో, - త- (ఈషత్ స్పృష్టం), మిగిలిన భాషలలో -ద-, తొదలో *-య్త్- > -స్- (: త. కొయ్ 'కోయు', భూత ప్రాతిపదిక కొయ్త్: తొ. క్వియ్-, భూప్రా.క్విస్-.)

త. ఉతవు 'సహాయం చేయు', మ. ఉతకు, కోత. ఒద్గ్.. ట్ తొ.,వి ఖ్-,, క. ఒదగు, ఒదవు, తు. ఒదగు, తె. ఒదవు. (609).

త. మితళ్, కోత. మెడ్ల్, క. మిదుళ్, మెదుళ్, తె. మెదడు, ప. మెదెక్, గ. మెదిక్, గోం. మెద్దూర్, కూ. మెద్దో, మా. మెదొ, (5062).

(iii) *-త్త-: త.మ..త్త-, కోత, తొ.. త-, క. కొడ. తు.తె..త్త-, -త-, కో..త., నా. ప. గోం. -త్త-త-, గ.కొం పెం. మం. -త-, కూయి. కువి. కూ. -త్త-, -త-, మా.బ్రా. -త-, తొదలో *-ఇత్త్-/*-యత్త్->-చ-.

త. అత్తై, క. అత్తె, అత్తి, తు.అత్తె, తె. అత్త, గ. అత, గోం. అతీ, కూయి, అత, కువి. అత్త. (142).

త. తాత్తా, మ, తాతన్, క. తాత, కొడ.తాతె, తు.తాతె, తె. తాత. ప. తాత 'తండ్రి'. (3160).

(iv) *-ంత-: త. -ంత-, మ..న్న- (దంత్యం), తొ..ద-, థ్-, మిగిలిన భాషలు -ంద-, తొదలో *-ఇంత్-, *-యన్త్>-స-.

త. మరుంతు, మ. మరున్ను, కోత. తొ.మద్. క. మద్దు, మద్దు, కొడ. మద్దు, తు. మర్దు, తె. మందు, కో.నా.మంద్, ప. మెరుద్, గ. మర్దిల్, మరిద్, గోం. మత్, కూ. మందర్, మా. మంద్రు. (4719).

త. విరుంతు, మ. విరున్ను, క. బిర్దు, బిద్దు, తు.బిన్నె 'చుట్టం', తె. విందు, గోం. వెర్తాల్ 'చుట్టం', కూయి. బ్రెఎంజు 'కొత్తవాడు,' (5415).

## 2.24. *ప.

(i) మూ.ద్రా. పదాది *పకారం నవీన కన్నడం తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ పకారంగానే ఉంటుంది. కన్నడంలో శాసనాలవల్ల తొమ్మిదోశతాబ్ది చివరవరకూ పకారం ఉండేది అనీ, పదోశతాబ్దిలో అది హగా మారిందనీ తెలుస్తుంది. ప్రాచీన కన్నడం పత్తు 'పది', పాలు 'పాలు', పులి 'పులి', పెసర్ 'పేరు', నవీన కన్నడం హత్తు, హాలు, హులి, హెసరు.

త.మ. పణి. తొ. పొణ్య్, క. పణ్ణు 'చేయు', కొడ. పణి, తు. పణి 'చేయు', తె. పని, (శా) పణి, కొం. పణి. (3887)

త.మ. పెయర్, పేర్, కోత. పేర్, తొ. పోర్, క. పెసర్, కొడ. పెద, తు. పుదరు, తె. పేరు, కో. నా. పేర్, ప. గ. పిదిర్, గోం. పొరోల్, కొం. దోర్, పెం. తోర్, మం. దర్, కూయి. పద, పారు, కువి. దోరు, దారు, కూ. మా. పింజ్-'పేరు పెట్టు', బ్రా. పిన్ 'పేరు'. (4410)

(ii) అచ్చుల మధ్య *-ప- కారం చాలా అరుదు. అది సాధారణంగా -వ- గా మారుతుంది: త. తప్పు, తవఱు 'తప్పు' (3071)

(iii) *-ప- : త.మ. -ప్ప-, కోత. తొ. -ప-, మిగిలిన భాషలలో -ప్ప-, -ప-.

త.మ.క.తె. తప్పు. (3071)

త. తిరుప్పు, మ. తిరిప్పు, తొ. తిర్ప్-, క. తిరుపు, తు. తిర్పు. తె. త్రిప్పు, కో.నా. తిప్-. (3246)

త. చెరుప్పు, మ. చెరిప్పు, కోత. కెవ్ర్, తొ. కెర్ఫ్, క. కెర, కెర్పు, తె. చెప్పు 'Shoe', కో.నా. కెవ్రి, ప. చెరుప్, గోం. సెర్పూం (<ముందు-తె). (1963)

(iv) * -ంప- : త.మ. -ంప-, కోత. -బ-, -ంబ-, తొ. -బ-, క.-వ-, -ంబ-, కొడ. తు. -ంబ-, తె. -మ్మ-, -మ-, కో.నా.-మ-, ప.గ. -ంబ-, -బ- గోం. కొం. పెం.మం. -మ-, కూయి. -ంబ-, కువి, -మ-, -ంబ- కూ.మా. బ్రా. -ంబ-.

త.మ. కొంపు 'కొమ్మ, కొమ్ము' కోత. కొబ్, తొ. కుబ్ 'కొమ్ము', క.కొంబు, కొంబె. కొడ.తు.కొంబు, తె. కొమ్ము, కొమ్మ, కో.నా.కోమ్, కొండ కువి. కొమ 'కొమ్మ', కొము 'కొమ్ము' (2115)

త.మ. పాంపు, కోత. పాబ్, తొ. పోబ్, క. పావు. కొడ. పాంబు, తె. పాము, కో.నా.పాం, ప.గ. బాం. (4085)

త.మ. నంపు, కోత. నంబ్-, తొ. నొబ్-, క. నంబు, కొడ. నంబ్-, తు. నంబు, తె. నమ్ము, కొం. నమి-, కూయి కువి. నమ్-. (3600)

## 2.25 *ṯ (*ఱ).

దంతమూలీయస్పర్శమైన మూ.ద్రా. *ṯ (*ఱ) పదాదిని ఉండదు. ఇది మూలభాషలో స్పర్శమని అనడానికి కారణాలు :

1. ప్రాచీన తమిళ - మళయాళ - కన్నడాలలో స్పర్శంతో అంతమయ్యే పదాల చివర ఉచ్చారణార్థకమైన ఉకారం ఉంటుంది. స్పర్శేతరహల్లు చివర ఈ ఉకారం ఉండదు. ఈ భాషలలో పదాంతంలో ఱ తరవాత ఉచ్చారణార్థక మైన ఉకారం ఉండడంవల్ల ఇది స్పర్శ మని చెప్పవచ్చు. (ఉదా : త. యాఱు 'నది' ఆఱు '6').

2. అనునాసికం తరవాత స్పర్శాలేగాని స్పర్శేతర హల్లులు రావు. ద్రావిడ భాషలలో *న్ఱ ప్రచురంకాబట్టి ఇదికూడా *ఱ మొదట్లో స్పర్శ మనడానికి ఒక కారణం.

3. మలయాళంలో ద్విరుక్తమైన ఱ్ఱని దంతమూలీయ స్పర్శంగానే ఉచ్చ రిస్తారు. కోత, తొదలలో కూడా ఇది అద్విరుక్త దంతమూలీయ స్పర్శంగా ఉంది.

4. తొల్కాప్పియంలో "క, చ, ట, త, ప, ఱ వల్లినం'' అని, ఱ మిగిలిన స్పర్శాలతో తుల్యంగా "వల్లినం,'' (స్పర్శం) అని చెప్పబడింది.

(i) *-ఱ- : త.మ.తొ.క.తె. -ఱ- (తొదలో ఇది శ్వాసమైన దంత మూలీయ కంపితం), కోత, కొడ. -ర-, తు. -ద-, -ర-, కో. నా. -ద-, -ర-, ప. -ద-, (ఈశాన్యమాండలికంలో) -డ-, గ. -య-, గోం. ర-, -ర్ర-, -డ-, కొండ. -ఱ-, పెం. -జ- (శ్వాస స్పర్శాలముందు స), కూయి. -జ-, (హల్లు తరవాత) -ర-, (హల్లు ముందు) హ, కువి, -ర-, -య-, కూ, మా. -స-, -ర-, బ్రా. -ర-, -ర్ర-,

(ఇప్పటి భాషల ఉచ్చారణలో ఱ, ర ల భేదం మలయాళం, కన్యా కుమారి ప్రాంతం తమిళం, తొద, కొండలలో మాత్రమే ఉంది. తమిళం, కన్నడం, తెలుగులలో ప్రాచీన భాషలలో ఉండే ఈ భేదం ఇప్పుడు నశించింది. ఱ, ర లు రెండూ కంపితాలే అయినా ఱ కి కంపనం ఎక్కువగానూ, ర కి కొంచెం తక్కువగానూ ఉంటుంది.)

త.మ. అఱి, కోత( అయ్ర్-, తొ. అఱ్య్-, క. అఱి, తె. ఎఱుఁగు. (314)

త. కుఱంకు, మ. కుఱకు, కుఱవు, కోత. కొర్గ్, తె. కుఱువు 'తొడ', కో. కుదుగ్, ప కుదు/కుడు. గ. కుయిగ్. గోం. కుర్క్, కొండ. కుఱ్గు, కూయి. కుఱు, కువి. కుద్గు, కూ. ఖొస్గా, మా. ఖొస్గె. (1840)

త.మ.క.తె. నూఱు '100', కోత. నూర్, తొ. నూఱ్, కొడ. నూరు, తు. నూదు, గోం. నూర్ (3729)

తు. సాది 'దోవ', గోం. సరీ, స్రరీ, హర్రి, కొం. సఱి, పెం. హఱి. (2417)

(ii) *-ఱ్ఱ- : త. -ఱ్ఱ- (చదివేటప్పుడు ఉచ్చారణలో ట్ర; వ్యావహారిక భాషలో -త్త-), మ. -ఱ్ఱ- (దంతమూలీయ ద్విరుక్త స్పర్శం), కోత. తొద. -త్త- (దంతమూలీయ స్పర్శం), క. కొడ. -త్త-, -త-, తు. ట-, తె. -ట్ట-, -ట-, కో. నా. -త్త-, -త-, ప. -త్త-, -త్, (ఈశాన్య మాండలికంలో) -ట-, గ. -ట్ట-, -ట-, గోం. -త్త-, -త-, కొండ. -ఱ్ఱ- (శ్వాసకంపితం), పెం. మం. -చ్చ-, -చ-, కూ. -సా- కువి. -చ్చ-, -చ- కూ. మా. -త్త-, -త-, బ్రా.? -త-.

త. పుఱ్ఱు, పుఱ్ఱం, మ. పుఱ్ఱు, క. పుత్తు, పుత్త, కొడ. పుత్తు, తు. పుంచ, తె. పుట్ట, ప. పుత్త/పుట్ట, గోం. పుత్తీ, కొండ. పుఱ్ఱి, పెం. పుచి, కూయి. పుసి, కువి. పుచ్చి, కూ. పుత్రా, మా. పుతె. (4335)

త. మ. పఱ్ఱు, కోత.తొ. పత్త్-, క. పత్తు, కొడ. పత్-, తు. పత్తు, తె. పట్టు 'క్రియ', ప.గ. పత్త్-. (4034)

త. మ. చుఋ్ఱం, తె. చుట్టము. (2715)

త. మ. మాఋ్ఱం 'మార్పు', క. మాతు, మాత 'మాట', తె. మాట. (4834)

త. మ. చాఋ్ఱు, క. సాఱు, తె. చాటు 'to announce.' (2486)

(iii) *-న్ఱ- : త. -న్ఱ-, మ. -న్న-(దంత్యం), కోత. -ద్-, -ంద్-, తొద.-ద్-(ద్=దంతమూలీయ నాదస్పర్శం),క.-ఱ-, -ంద-, కొడ. -ంద-, తు. — -ంజ-, -ంద-, తె. -ండ-, -ంద-, కో.నా. -ంద-, ప. -ంద-, (ఈశాన్య మాండలికం) -ండ-, గ. -ండ , గోం. -ంద-, కొం. -న్ఱ-, పెం. మం. కూయి. కువి ంజ-, కూ.మా. -ంద-, బ్రా. -స-.

త. పన్ఱి, మ. పన్ని, తొ. పొద్య్ (<క.), కోత. పజ్, క. కొడ. పంది, తు. పంజి, తె. పంది, ప. పెంద్/పెండ్, గ. పండ్, గోం. పద్దీ, కొం. పన్ఱి, పెం. మం. పంజి, కూయి. పజి, కువి. పజ్జి, (కోత జ < *న్ఱి). (4039)

త. ఒన్ఱు, మ. ఒన్ను, కోత. ఒద్, తొ. విద్, క. ఒందు, కొడ. ఒందు తె. ఒండు, గోం. ఉందీ, కొం. ఉన్ఱి, కూ. ఓంద్, మా. -ఒంద్, బ్రా. అసిట్. (990)

త. మూన్ఱు, మ. మూన్ను, కోత. మూంద్, తొ. మూద్, క. మూఱు, కొడ. మూందు, తె. మూఁడు, కో. నా. మూందిజ్, నా(ఛాం.) మూంది, ప. మూఁదు(క్), గ. మూండ్, గో. మూంద్/మూండ్, కొం. మూన్ఱి, కూయి. మూంజి, కూ. మూంద్, బ్రా. ముసిట్. (5052)

తెలుగులో ప్రాఙ్నన్నయ శాసనాలలో న్ఱ ఉంది : వాన్ఱు (క్రీ.శ. 600-1000) 'వాడు'.

**2. 26. *ఞ**

మూ. ద్రా పదాది *ఞకారం ప్రాచీన తమిళం, మలయాళాలలో చాలా పదాలలోనూ, కొడగు, తుళులలో కొన్ని పదాలలో మాత్రమే నిలిచి ఉంది. ఇతర భాషలలోనూ, అర్వాచీన తమిళంలోనూ ఇది నకారంతో కలిసిపోయింది. పదాదిలో ఇది చాలా విరళంగానే ఉంది. పదమధ్యంలో ఇది *చ ముందే ఉంటుంది; పదాంతంలో అసలు ఉండదు. పదాదిలో ఇది ముఖ్యంగా అ, ఆ ల ముందే ఉంటుంది. దీని తరవాత అ, ఆ లు కొన్ని భాషలలో ఎ ఏ లుగా మారతాయి.

త. నరంపు, మ. ఞరంపు, తొ, నర్బ్, క. నర(వు), తు. నరంబు, తె. నరము, కో. నరం, ప. నెరుబ్, గ. నరుబ్, కూయి. డ్రాంబు, కూ. నరీ 'నాడి', మా. నారు 'నరం'. (2903)

త. ఞాంచిల్, నాంచిల్, మ. ఞేఞ్జోల్, నేఞ్జల్, కోత. నేల్గ్. క. నేగల్, నేగిల్, కొడ. నేంగి, తు. నాయెరు, తె. నాఁగలి, కో. నాంగ్లి, నా. నాంగర్, ప. నాఁగిల్, గ. నాంగల్, గోం. నాయ్నాల్, కొం. పెం. మం. నాంగెల్, కూయి. కువి. నాంగెలి. (2907)

త. మ. ఞాలం, తె. నేల, కొ. నా. ఏల్, గోం. నేలీ, కూయి. కువి. నేల, కూ. నాల్ 'పల్లపు నేల.' (2913)

త. ఞాన్ఱు 'రోజు', మ. ఞాన్ను, తె. నేఁడు, 'ఈరోజు', గోం. నేండ్, కొం. నేన్టు, పెం. నేంజెజ్, మం. నేంజె, కూయి. కువి. నేంజు. (2920)

**2. 27 *ణ**

ఇది దక్షిణ భాషలలో ణ గానే ఉంటుంది. మధ్యోత్తర భాషలలో న గా మారుతుంది. కాని, గదబ (ఒల్లారీ), కొండ, పెంగో, కూయిలలో కొన్నింటిలో ణ గానే ఉంటుంది. తెలుగులో ప్రాఙ్నన్నయ యుగ శాసనాలలో 'అణతి', 'ఫణి', 'కొణి' వంటి పదాలలో ణకారమే ఉంది. ణ న గా మారడం 7 - 9 శతాబ్దుల మధ్య కాలంలో జరిగింది.

ఇది పదాదిని ఉండదు.

త. అణ్ణన్, అణ్ణా, మ. అణ్ణన్, కోత. అణ్, తొ. ఒణ్, క. అణ్ణి, కొడ. అణ్ణె, తు. అణ్ణె, తె. అన్న. (131)

చూ. త. మ. క. కణ్ (2. 3).

త. మ. పిణం, కోత. పెణ్మ్, క. పెణ, హెణ, తు. పుణ, తె. పీనుగు. (4157)

## 2. 28. *న (దంత్యం), *ఀన (దంతమూలీయం)

తమిళ లిపిలో రెండు నకారాల గుర్తులు ఉన్నాయి. మలయాళంలో ద్విరుక్త దంత్య నకారానికీ, దంతమూలీయ నకారానికీ భేదం ఉంది. ప్రాచీన తమిళంలో కొన్ని పదాలలో దంత్య నకారం పదాంతంలోనూ, పద మధ్యం లోనూ వస్తుంది. ఈ స్థానాలలో దంత్య నకారానికీ, దంతమూలీయ న్‌కారానికీ భేదకత్వం (Contrast) ఉంది: వెరిన్ 'వెన్ను': నాన్ 'నేను', వరిన్ 'వస్తే", కొళునర్ 'భర్తలు': పున్నల్ 'నీరు', పొరున్నై ఒక 'నది', కరున్నై 'వేపుడు కూర.' ఇది కాక దంత్య నకారం పదాదినీ తకారం ముందూ ఉంటుంది; పదా దిని దంతమూలీయ నకారం ఉండదు. మూలద్రావిడంలో ఈ రెండు నకారాలూ ప్రత్యేక వర్ణాలు కావని ఇంతవరకూ పండితులు నమ్మేరు. కాని వీరికి ఈ ప్రాచీన తమిళంలో ఆధారాలు తెలియకపోవడం వల్ల ఈ అభిప్రాయం ఏర్ప డింది. ప్రాచీన తమిళం ఆధారంవల్ల మూల ద్రావిడంలో కూడా ఈ రెండు నకారాలూ ప్రత్యేక వర్ణాలని చెప్పాలి. (ఈ గ్రంథంలో సౌలభ్యంకోసం అవసర మైతే తప్ప తమిళం మాటలలో రెండింటికీ భేదం చూపలేదు.

ప్రాచీన తమిళం, మలయాళం తప్ప మిగిలిన భాషలలో నకారం దంతమూలీయం; కాని దంత్యం ముందు దంత్యం. ఇప్పటి మలయాళంలో ద్విరుక్త దంత్య నకారానికీ, ద్విరుక్త దంతమూలీయ న్‌కారానికి భేదకత్వం ఉంది: నిన్నాల్ 'నిలబడితే' : నిన్నాల్ 'నీవల్ల'; ఈ ద్విరుక్తదంత్య నకారం *ంత, *న్తల నించి వచ్చినది.

త మ. క. తు. నరి, తొ. నర్‌య్, కోత. నయ్‌ర్, కొడ. నరి 'పులి', తె. నక్క. (3606)

త. మ. కోత. క తిన్, తొ. తిన్-, కొడ. తిన్న్-, తు. తిన్-, తె. తిను, కో. నా. ప. గ. గోం. కొం. పెం. మం. కూయి. కువి. తిన్, కూ.మా. తింత్ - 'తినిపించు.'

కొన్ని భాషలలో కొన్ని పదాలలో క్వాచిత్కంగా పదాది నకారం లోపిస్తుంది.

త. మ. నీంతు, క. ఈసు, ఈజు, తు. ఈచు, ఈజు, తె. ఈదు. (3687)

త మ. నీర్ 'నీళ్లు", ఈరం 'తడి' (< *నీరం). (3690)

త.మ. నీ, క. నీను, తు. ఈ, తె. ఈవు, నీవు. (3684)

త. మ నీర్, తె. ఈరు 'మీరు'. (3688)

త. నట, క. నడ, నడె, తె. నడచు, కో.నా. అడ్గ్-. (3582)

బ్రాహుయిలో మూ. ద్రా. పదాది *నకారం అగ్రాచ్చుల ముందు ద గా మారుతుంది; మిగిలిన అచ్చుల ముందు న గానే ఉంటుంది.

*న > బ్రా. ద.

త. నెయ్‌త్తోర్, క. నెత్తురు, తె. నెత్తురు, బ్రా. దితర్. (3748)

త. నెరునల్, నెరునై, నేఁటినిన్న', బ్రా. దరో (< *నెరో) (3758)

త. మ. నేర్ 'కోయు', బ్రా. దన్న్-. (3773)

త. మ. ఞాయిఱు 'సూర్యుడు', క. నేసఱు, బ్రా. దే. (2910)

త. మ. క. తు. తె. నీర్, బ్రా. దీర్, (3690)

*న > బ్రా. న.

మూ.ద్రా. *నాం 'మనం' : బ్రా. నన్ 'మనం, మేం'. (3647)

త. మ. నుంకు 'మింగు', బ్రా. నుఘుష్-. (3697)

త. మ. క. తె. నూలు 'క్రియ', బ్రా. నుస్-. (3728)

**2. 29. *మ.**

మూ.ద్రా. *మకారం అన్ని భాషలలోనూ మకారంగానే ఉంటుంది.

చూ. త. మ. కోత. మేయ్ (2.10), త. మ. మరం (2.16), త మూన్రు (2.25).

**2. 30. *య.**

(i) మూ.ద్రా. పదాది *యకారం చాలా కొద్ది మాటలలోనే ఉంది. ఇటువంటి మాటలు చాలావరకు ప్రాచీన తమిళంలో మిగిలి ఉన్నాయి. తొల్కాప్పియంలో పదాది యకారం తరవాత ఆ మాత్రమే ఉంటుంది. మిగిలిన అచ్చులు ఉండవు అని చెప్పబడింది. కాని మూలద్రావిడంలో పదాది *యకారం తరవాత అకారం కూడా ఉండేది అని అస్మదర్థక సర్వనామంవల్ల తెలుస్తుంది. మధ్యకాల తమిళంలోనూ మిగిలిన దక్షిణ భాషలలోనూ *యాలో యకారం లోపించి ఆ గా మారుతుంది. మధ్యోత్తర భాషలలో *యా ఏ గా మారుతుంది.

త. యాటు, ఆటు 'మేక', మ. ఆటు, కోత. ఆడ్, తొ. ఓడ్, క. ఆటు, కొడ. ఆడు, తు. ఏడు, తె. ఏడిక, గొం. ఏటీ, కూ. ఏడ్డా, మా. ఏడె, బ్రా. ఏట్. (5152)

త. యానై, మ. ఆన, కోత. ఆన్, తొ. ఆన్, క. తు. కొడ. ఆనె, తె. ఏనుఁగు, ఏనిక, కో. ఏనాగీ, ప. ఏను, గ. ఏనిగ్, గోం. ఏనీ, ఏనాల్, కొం. ఏని, ఏస్గు. (5161)

త. యాఱు, ఆఱు, 'నది'. మ. ఆఱు, కోత, ఏర్, తె. ఏఱు, ప పెరెద్ (పెర్-'పెద్ద'), గోం. ఏర్ 'నీరు', కొం. ఏఞ్, పెం. ఏజుజ్, మం. ఎయ్, కూయి. ఏజు, కువి. ఏయు (గోండి-కువిలలో అర్థం 'నీరు'). (5159)

త. యాంటు, ఆంటు, మ. ఆంటు, కోత. ఆఢ్, తొ. ఓఢ్, క. ఏడు, కొడ. ఆండు, తె. ఏఁడు 'సంవత్సరం', కో. ఏడ్, ప. ఇయడ్ 'ఈఏడు',

గోం. ఏండ్, కొం. ఇయోండ్ 'ఈఏడు', కూయి. డ్రాండు 'నిరుడు', వాడ్రాండి 'వచ్చేఏడు', పెం. ఇయొండిజ్ 'ఈఏడు', మం. ఈయుట్. (5153)

(ii) పదమధ్య, పదాంత *యకారం కూయిలో జ గా మారుతుంది; మిగిలిన అన్ని భాషలలోనూ య గానే ఉంటుంది. కొన్ని భాషలలో యకారం హల్లుముందు లోపిస్తుంది: తె. కోయు, కోఁత, చేయు, చేఁత మొ. (చూ. 2.14)

త. మ. కోత. నాయ్ 'కుక్క', తొ. నోయ్, క. నాయ్, నాయి, కొడ. నాయ్, తు. నాయి, కో. నా. ఆతె, ప. నెత్ర, గ. నేతె, నెత్రె, గోం. నయ్. (3650)

పదాంతంలో *అయ్ తమిళంలో ఐ గా వ్రాస్తారు; (వ్యావహారికంలో ఇది ఎ గా మారుతుంది). ఇది మలయాళం, తెలుగు గోండీలలో అ గానూ. కన్నడం కొడగులలో ఎ గానూ, తుళులో ఎ' (వివృతమైన ఎ కారం) గానూ మారుతుంది. కోత. తొదలలో ఇది లోపించినా దీని ప్రభావం దీని ముందు ఉన్న అచ్చుమీద ఉంటుంది.

చూ. త. తలై (2. 23), త. యానై (2. 30).

## 2. 31. *ర.

మూ. ద్రా. *ర పదాదిని ఉండదు. పద మధ్యంలోనూ, పదాంతంలోనూ ఇది ర గానే ఉంటుంది. కొన్ని గోండీ మాండలికాలలో ఇది డ గా మారుతుంది. బ్రాహుయిలో దీనికి ర, ర్ర అని రెండు ప్రతిరూపాలు ఉన్నాయి, తొదలో దీనికి ర,శ,ష, లోపం అనే నాలుగు ప్రతిరూపాలు ఉన్నాయి. మకారంకాని మూర్ధన్యాక్షరంకాని చివర ఉన్న పదాలలో ఇది దీని తరవాత అచ్చూ లోపించి దీనిముందు ఉన్న అచ్చు దీర్ఘాచ్చుగా మారుతుంది.[1] తెలుగు

1. తొదలో *ర పదాంతంలో లోపించదు. *ర తరవాత అగ్రాచ్చూ హల్లూ ఉంటే అది శగానూ, వేరు అచ్చూ హల్లూ ఉంటే షగానూ మారుతుంది. పదం చివర మకార మూర్ధన్యాలు కాక వేరు హల్లు ఉంటే *ర లోపిస్తుంది కాని, దాని ముందు అచ్చు దీర్ఘం అవదు.

కన్నడాలలో హల్లుముందు ఇది లోపిస్తుంది. తెలుగులో పదాది సంయుక్తాక్ష రాలలో కూడా అర్వాచీన భాషలో ఇది లోపిస్తుంది: క్రొవ్వు>కొవ్వు, త్రాగు>తాగు, మ్రోగు>మోగు (చూ. 2.16).

చూ. త. అఱై (2.3), త. మ. నీర్ (2.6) త. మ. పెరు, పెరియ (2.9).

తొదలో లోపానికి ఉదాహరణలు :

తొ. ఏడ్ 'రెండు' : త. ఇరంటు, క. ఎరడు, తె. రెండు. (474)

తొ. పేర్ 'వేలు' : త. మ. విరల్, క. బెరళ్, తె. వ్రేలు. (5409)

తొ. మేఞ్ 'చెట్టు' : త. మ. మరం, క. మర, తె. మ్రాను. (4711)

తొ సూట్ 'చుట్ట' : త. మ. చురుట్టు, తె. చుట్ట. (2684)

తొ. ఈఱ్ 'రాత్రి' : త.మ.క. ఇరుళ్, తె. ఇరులు 'చీకటి'. (2552)

కన్నడంలో లోపానికి ఉదాహరణలు :

క. కొర్వు, కొర్బు, కొబ్బు, 'క్రొవ్వు' : త.మ. కొళుు. (2146)

క ఎత్తు, ఎద్దు 'ఎద్దు' : త. మ. ఎరుతు, తె. ఎద్దు. (815)

క. కర్వు, కర్బు, కబ్బు 'చెరుకు' : త. కరుంపు, మ కరింపు. (1288)

తెలుగులో లోపానికి ఉదాహరణలు :

తె. ఎద్దు : త. మ. ఎరుతు. (815)

తె. ఉక్కు : త. మ. ఉరుక్కు, క. ఉర్కు, ఉక్కు. (661)

తె. చెప్పు 'shoe' : త. చెరుప్పు, మ. చెరిప్పు, క. కెర్పు. (1963)

తె. దిద్దు : త. మ. తిరుత్తు, క. తీర్దు. తిద్దు (3251)

తె. పెద్ద (9 శతాబ్ది శా. పెర్దళ్ 'పెద్దలు') : త. మ. పెరు. పెరియ. (4411)

## 2.32. *ల.

మూ.ద్రా. *ల పదాదిని ఉండదు. పదమధ్యంలోనూ, పదాంతంలోనూ ఇది తొద, కూయిలు తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ల గానే ఉంటుంది. ద్విరుక్తలకారంలోకూడా ఏ భాషలలోనూ మార్పులేదు. కాని కోత, కొండ, పెంగొ, మండ, మాల్తోలలో ఇది అద్విరుక్తంగా మారుతుంది.

తొదలో *ల లేక *ళ్ల సాధారణంగా స్ల (దంతమూలీయం)గా మారు తుంది. కాని భూత ప్రాతిపదికలో *ళ్ట ఉండే లకారాంత క్రియలలో ఇది ల̥ (శ్వాసం)గా మారుతుంది. తొదలో లకారం ఉన్న మాటలు ఎరువు తెచ్చు కొన్నవి.

కూయిలో ఇది డ గా మారుతుంది; కాని ఈ మార్పు వర్ణవ్యత్యయం జరిగినప్పుడు ఉండదు. బ్రాహూయీలో దీనికి ల, ల̱ (శ్వాసము) అనే రెండు ప్రతిరూపాలు ఉన్నాయి.

కోతలో *-ళి, *-ళ్లి జ గా మారతాయి.

చూ, త, తలై (2.23), త.పల్ (2.3) త, మ, ఎలి (2.9) త. మ. కాల్, పాల్ (2.4).

త. మ. క. కొడ. తు. పల్లి, తె, బల్లి, తొ పస్య్, కో. ఏపజ్. (3994)

త. మ. కల్ (కట్ట-), కోత. కల్-(కత్-) తొ. కల్- (కత్-), క. కల్ (-త్-), తు. కల్పు, తె. కఱచు 'నేర్చుకొను'. (1297).

తొదలో పల్ 'వల' (<త. వలై), క్వల్య్ 'హత్య" (<త. కొలై), కెల్చ్ 'పని' (క, కెలస) మొదలైన పదాలు ఎరువు తెచ్చుకొన్నవి.

## 2. 33. *వ

(i) మూ. ద్రా. పదాది *వకారం తొదలో ప గా మారుతుంది; కన్నడ, కొడగు, తుళు, ఉత్తర భాషలు మూడింటిలో బ గా మారుతుంది. ఈ మార్పు తెలుగులో కూడా కొన్ని పదాలలో ఉంది : బయలు (త. వయల్), మిగిలిన భాషలలో దీనికి మార్పులేదు.

చూ. త. మ. విల్ (2.5), వేర్ (2.10), వరై, విరల్ (2.16)

(ii) పద మధ్యంలో దీని ప్రతిరూపాలు : తొద. -ఫ-(f), తు.కూ. -బ-, -వ-, బ్రా. -ఫ-(f), -వ-, మిగిలిన భాషలు -వ-.

చూ. త. మ. చెవి (2.9)

**2. 34. *ళ.**

(i) మూ. ద్రా. *ళ పదాదిని ఉండదు; పదమధ్యంలోనూ పదాంతంలోనే ఉంటుంది. ఇది దక్షిణ భాషలలో ళ గానే ఉంటుంది. (తొదలో ఇది ళ్ (శ్వాసం)గా ఉంటుంది; ఈ భాషలో ళ ఉన్న రూపాలు ఎరువు తెచ్చుకొన్నవి. తుళులో కొన్ని మాండలికాలలో ఇది ల గా మారుతుంది.)

గోండీ, కొండ, పెంగొ, మండ, మండ, కువిలలోలో ఇది ఢ గా మారుతుంది. కూయిలో -ల-, -డ-, (హల్లు తరవాత) ల-, బ్రా. -ల-, -ళ్ల-; మిగిలిన భాషలలో -ల-, కోలామీ నాయక్డీ మాండలికంలో ళ మిగిలి ఉంది; కాని ఇందులో కూడా ఈకారం తరవాత ఇది లకారంగా మారింది.

చూ. త. మ. ఉళ్ (2.7), తేళ్ (2.10).

తెలుగులో ప్రాఙ్నన్నయ శాసనాలలో ళ కారం ఉంది. సంవత్సరంబుళ్ (క్రీ.శ. 506, 625-50). ళోన క్రీ.శ. 900-1000) 'లోన, లోపల.'

త, మ, కోత, ముళ్, తొ. ముళ్ 'ముల్లు,' ముళ్ 'తవ్వే సాధనం,' (<త.) క.ముళ్, ముళ్లు, కొడ, తు, ముళ్లు, తె, ముల్లు, (4995).

త. మ. కళం 'నూర్చేచోటు, యుద్ధభూమి,' కోత. కళ్మ్, తొ. కొళ్ఙ్, క. కొడ. కళ, తు. కల 'పువ్వులు రాలిన నేల,' తె. కలను, కో, కలవె, నా. కళవె, ప.కలి, గ.కలిన్, గోం.కఢా, కొం.కఢన్, మం.కాఢ, కూయి.క్లఇ, కువి, క్డాను, కూ. ఖల్, మా. ఖలు. (1376).

(ii) *-ళ్ల- దక్షిణభాషలు -ళ్ల-, తొద, -ళ్ళ- (శ్వాసం; -ళ- ఉన్న రూపాలు ఎరువుతెచ్చుకొన్నవి), కొండ, పెంగొ, మండ, మాల్తో -ల-, మిగిలిన భాషలు -ల్ల-,

చూ. త. పిళ్లై (2.5).

త. మ. ఉళ్లం, తె. ఉల్లము. (698).

త. మ. ఉళ్లి, కో. ఉళ్య్, తొ. ఊళ్య్, క. ఉళ్ళి; తు. ఉళ్ళి, ఉల్లి, తె. కో. ప. ఉల్లి, గోం. ఉల్లీ. (705)

## 2. 35. *ḻ.

మూ.ద్రా. *ḻ (మూర్ధన్య ఈషత్ స్పృష్టం Retroflex fricative) పదాదిని ఉండదు. ఎప్పుడూ అద్విరుక్తంగానే ఉంటుంది. ఇది ప్రాచీన తమిళం. మలయాళం (ప్రాచీనం, ఆధునికం), ప్రాచీన కన్నడం, ప్రాఙ్నన్నయ తెలుగు శాసనాలలో ప్రత్యేక వర్ణంగా ఉంది. ఇప్పటి తమిళంలో ఇది దక్షిణ ఆర్కాటు, తంజావూరు జిల్లా మాండలికాలలోనే ఉంది; మిగిలిన మాండలికాలలో ఇది ళ గా మారుతుంది.

త. మ. ḻ, కోత. ళ, ḍ, గ, య, తొ. డ, ḍ, ళ, ష, వ, క. (ప్రాచీనం) ḻ, (మధ్యకాలం) -ళ-, (హల్లుముందు) -ర, కొడ. -ళ-, (హల్లు ముందు లోపిస్తుంది), తు. -ర- (బ్రాహ్మణుల మాండలికంలో -ళ-), తె. (ప్రాఙ్నన్నయ శాసనాలలో -ḻ-), (అచ్చుల మధ్య) -డ-, (వర్ణవ్యత్యయంవల్ల పదాదికి వచ్చినప్పుడు దీనిముందు హల్లు వుంటే -ర-, హల్లు లేకపోతే డ-(> తరవాత కాలంలో -ద-), కో. నా. -ర-, నా. (ఛాం.) -య-, లోపం, ప.-ḍ-, గ.(ఒ.) -ḍ-, (సా.) -డ-, గోం. కొం. పెం. మం. కూయి, కువి. -ḍ- (గోండిలో కొన్ని మాండలికాలలో -ర-), కూ. మా. -ḍ-, లోపం, బ్రా. -ర-, -ర్ర-, -ḍ-, లోపం.

పర్జి-గదబలలో ḍ/డలు మూ.ద్రా. *ḻకే ప్రతిరూపాలు; మిగిలిన ఏ ధ్వనికీ ప్రతిరూపాలు కావు. కాబట్టి ఈ భాషలలో దీనికి ధ్వని పరిణామం (Phonetic change) ఉన్నా వర్ణ పరిణామం (Phonemic change) లేదు. ఇది మిగిలిన భాషలలో ఇతర మూలవర్ణాల నించి వచ్చిన వర్ణాలతో కలిసి పోయింది: క. ళ<*ḻ, *ళ, తె. డ<*ట *ḻ, ర<*ర, *ఱ, *ḻ. పర్జి గదబలలో ఇటువంటి మిశ్రపరిణామం (Merger) లేదు.

చూ. త. మ. క. పḻ, త. మ. పొḻుతు (2,16), త. మ. కొḻుంతు (2.20),

త. అఴు 'ఏడ్చు', అఴై 'పిలుచు', మ. అఴు, కోత. అగ్ -, తొ. ఒ -, క. అఴు తు. అర్పు-, తె. ఏడ్చు, కో. నా. అర్-, ప. అఢ్-, గ. (ఒ.) అఢ్- (సా.) అడ్-, గోం అఢ్-, కొం, పెం. అఢ్బ-, మం. కూయి. ఢీ, కువి. ఢి-, (282)

త. ఉఴై, మ. ఉఴ -మాన్, క. దుప్పి (<తె.). తు. ఉరె, తె. దుప్పి, కో. డుప్పి, ప. ఉఢుప్, గ. ఢుప్పి, గోం. డుప్పల్, కొం. ఢుపి. (694)

త.మ. ఉఴు, కోత. ఉగ్ (<*ఉఴ్-క్-), తొ. ఉష్ఫ్-, క. ఉఴ్, కొడ. ఊళ్-, తు. ఊడు-' దప్ప 'దున్నడం', తె. దున్ను, కో. నా. ఉర్-, ప. ఉఢ్-, గ. ఊడ్-, గోం. ఉడ్-, కొం. పెం. కూయి, కువి. ఢూ-, కూ. ఉయ్-, మా. ఉస్- '(పంది) మట్టితవ్వు'. (688)

త. మ. ఏఴు, తొ. ఒవ్, కోత. ఏయ్/ఏగ్, క. ఏఴు, ఏళు. కొడ. తు. ఏళు, తె. ఏడు '7', గోం. ఏఢూంగ్, కూయి. ఒడ్గి. (910)

త. మ. కోఴి, కోత. కోయ్, తొ. క్విడ్య్, క. కోఴి, కోళి, కొడ. కోళి, తు. కోరి, తె. కోడి. (2248)

త. మ. పుఴు, కోత. పూ, తొ. పుఫ్, క. పుఴు, పుళ, కొడ. పుళు, తు. పురి 'పురుగు', పుర, పురు 'నత్త', తె. పురుగు, ప్రుచ్చు, కో. నా. పుర్రె, నా. (చాం) పురె, పుర్రె, ప. పుఢుత్, గ. పుడుత్, గోం. పుడీ, కొం. పిఢ్వు, పిఢి 'నత్త', పెం. ప్ఢీ,కూయి. ప్ఢీ ఉ, ప్ఢిఉ, పిఢు, కువి. ప్ఢియులి,కూ.పొచ్గో, మా. ప్రొచు, ప్రా, పూ. (4312)

త.మ. చుఴి, కోత. చుళ్య్, తొ. తుళ్య్, క. సుఴి, తు. సుళి, తె. సుడి, కూయి, డుఢి 'దొల్లడం, చుట్టచుట్టు కోవడం' (<*తుఢి). (2698)

ప్రాఙ్నన్నయకాల శాసనాలలో ళ̣ కింద ఇచ్చిన మాటల వంటి వాటిలో ఉంది : పుళ̣ాలూర్ (క్రీ.శ. 668-9) ' ఊరి పేరు', పుళ̣ోల (క్రీ.శ. 625) 'పట్టణంలో', ప్ళ̣న్దోఅంబు (క్రీ.శ. 763) 'ఊరి పేరు', పొ̣ళ̣లనాండు (క్రీ.శ. 732) 'ఒక ప్రాంతనామం', ళ̣చ్చు (క్రీ.శ. 682, 700-25, 820-25, 1000) 'ధ్వంసం చేయు' (దీని నించి వచ్చినవి ళ̣చ్చి (క్రీ.శ. 739). ళ̣చ్చిన (క్రీ.శ. 600-25, 852); ళ̣ల్ల (క్రీ.శ. 1011) 'లొల్ల అనే ఊరు', ళ̣ెన్దుఊర 'దెందులూరు అనే ఊరు.'

## 2.36. మూలద్రావిడంలో అనునాసిక సహిత ద్విరుక్త స్పర్శం

తెలుగు, కన్నడాలలో అనునాసికం తరవాత నాద స్పర్శమే కాకుండా శ్వాసస్పర్శం కూడా ఉండవచ్చు. ఉదా. తె. వంక : వంగ; పంట: పండు కొంత : కొందఱు, అనునాసిక సహిత నాద స్పర్శం మూలద్రావిడంలో అను' నాసిక సహితాద్విరుక్త స్పర్శం నించి వచ్చినది. తమిళ మలయాళాలలో అను నాసికం తరవాత నాదస్పర్శమే ఉంటుంది. (దీనిని వ్రాసేటప్పుడు శ్వాస స్పర్శం గుర్తుతోనే వ్రాస్తారు). అనునాసిక సహిత శ్వాస స్పర్శం మూలద్రావి డంలో అనునాసిక సహిత ద్విరుక్త స్పర్శంనించి వచ్చిందని ఇటీవల ఎన్. కుమారస్వామిరాజా కనుగొన్నారు. మూ.ద్రా. అనునాసిక సహిత ద్విరుక్త స్పర్శంలో అనునాసికం తమిళం-మలయాళం-కొడగు-కోత-తొడలలో పోయి, అది ఈ భాషలలో ద్విరుక్త స్పర్శంగా మారుతుంది, ఇతర భాషలలో ఇది అనునాసిక సహిత శ్వాసస్పర్శంగా ఉంటుంది.

త. మ. ఎట్టు, 'ఎనిమిది', కోత. ఎట్, తొ. ఒట్, కొడ. ఎ̈ట్టు, క. ఎంటు (తు. ఎణ్మ, తె. ఎనిమిది) < *ఎణ్ట్. (784)

త. మ. కలక్కం, కలక్కు, కోత. కల్క్, తొ. కస్క్, క. కలంకు, కలకు, తు. కలంకు తె. కలఁక, కలఁత < మూ.ద్రా. *కలంక్కం (<సం. కలంక). (1303)

త. వేట్టై. మ. వేట్ట. కోత. వేట్, తొ. పేట్, కొడ. బోటె, క. బేంటె బేటె, తు. బేంటె, బోంటె, తె. వేఁట < మూ.ద్రా* వేంటయ్. (ఇది త. మ. వేంటు, తె. వేఁడు అనే క్రియనించి వచ్చిన నామం.) (5527)

త. మ. తోట్టం, కోత. తోట్మ్, తొ. ట్వీట్మ్, కొడ. తోట, క. తోంట, తోట, తె తోఁట, గ. తోంట < మూ.ద్రా. *తోంట్టం (ఇది త.మ. తోంటు. క. తోడు 'తవ్వు' అనే క్రియనించి వచ్చిన నామం). (3549)

## 2.37 తెలుగు వర్ణ నిర్మాణంలో వచ్చిన మార్పులు.

మూలద్రావిడ భాషా వర్ణాలు తెలుగు వర్ణాలుగా మారడానికి ఏయే మార్పులు పొందేయో ఈ కింద చూద్దాము. ఇంతవరకూ మనము మూలద్రావిడ భాషావర్ణాలు దుహితృ భాషలలో పొందిన మార్పులు చూశాము కాబట్టి ఇప్పుడు తెలుగు వర్ణాలు ఆధారంగా తీసుకొని అవి ఏయే మూలభాషా వర్ణాలనించి వచ్చాయో చూద్దాము.

అ < * అ
ఆ < * ఆ
ఇ < * ఇ
ఈ < * ఈ
ఉ < * ఉ
ఊ < * ఊ
ఎ < * ఎ, *ఇ (అకారం ముందు)
ఏ < * ఏ, * యా
ఒ < * ఒ, * ఉ (అకారం ముందు)
ఓ < * ఓ
క- < * క- (అతాలవ్యాచ్చులముందు)

-క-, -క్క- < * -క్క-, * -ర్క-

-ంక- < * -ంక్క-

గ- < * క- (బహుళంగా)

-గ- < * -క-

-గ్గ- < *-ఴ్ గ-, *-ఱ్ గ-. (తె. తగ్గు. క. తఴ్గు, తర్గు, తగ్గు; తె. నుగ్గు : క. నుఱుగు, నుర్గు, నుగ్గు)

-ంగ- < * -ంక-

చ- < *క- (తాలవ్యాచ్చులముందు), *చ-

-చ-, -చ్చ- < * -చ్చ-

-ంచ- < * -ంచ్చ-

జ- < * చ- (బహుళంగా) (తె. జొన్న : త. చోళం)

-ంజ- < * -ంచ-

-ట-, -ట్ట- < * -ట్ట-, *ఱ్ఱ

-ంట- < * ంట్ట-

డ- < * -ట-, * -ఴ-

-డ- < * -ట-, * -ఴ-

-డ్డ- < * -ట్ట- (తె. చెడ్డ : త. మ. క. కెట్ట)

-ండ- < * -ణ్ట-, * -ంట-

త- < *త-

-త-, త్త - < * - త్త-

-ంత- < * -ంత్త-

ద- < * త- (బహుళంగా), (వర్ణ వ్యత్యయంలో) * -ఴ-, * -ట-

-ద- < * -త-

-ద్ద- < * -ర్ద-, * -ఴ్ద- (తె. దిద్దు; త. మ. తిరుత్తు; క. తిర్దు, తిద్దు; తె. అద్దు : త. మ. అఴుత్తు, క. అఴ్దు, అద్దు)

-ంద- < * -ంత-, * -న్త-

న < *న, *న, *ఞ, *ణ

ప- < * ప-

-ప-, -ప్ప- < * -ప్ప-, * -ర్ప-

-ంప- < * -ంప్ప-

బ- < * ప- (బహుళంగా), *వ- (క్వాచిత్కంగా)

-బ్బ- < * -ప్ప-, * -ర్ప-[1]

-ంబ- < * -ంప- (తె. చెంబు : త. మ. చెంపు)

మ- < *మ-

-మ-, -మ్మ- < * -మ-, * -ంప-

-య- < * -య-

ర < * ర, * ఴ[2]

ఱ < * ఱ (* త̱)

ల < * ల, * ళ

వ < * వ

స < * చ (క్వాచిత్కంగా) (తె, సుడి : త. మ. చుఴి; తె. సొఱ, చొఱ : త. మ, చుఱా)

హ- < కన్నడ హ- < * ప-

(తెలుగులో హత్తు (త. మ. పఱ్ఱు, క. పత్తు, హత్తు), హెచ్చు (క. పెర్చు, పెచ్చు, హెచ్చు) మొదలైన హకారాది పదాలు కన్నడంనించి ఎరువు తెచ్చుకొన్నవి. ఇట్టి పదాల సంఖ్య చాలా స్వల్పం.)

---

1. తె. ఉబ్బు : త. ఉప్పు, క. ఉర్వు, ఉర్బు, ఉబ్బు.
   తె. మ్రబ్బు, మబ్బు, త. మప్పు, క. మర్వు, మర్బు, మబ్బు.
2. *ఴ, వర్ణవ్యత్యయం జరిగి అది పదాదిహల్లు తరవాతకి వచ్చినపుడే ర గా మారుతుంది.

పై మార్పులకి ఉదాహరణలు ఈ అధ్యాయంలో ఆయా మూల భాషా ధ్వనుల కింద చూడవచ్చు. తెలుగులో జరిగిన సాధారణ పరిణామాలు అయిదు ఉన్నాయి. అవి:

1. దీర్ఘాచ్చు నిష్పాదక ప్రత్యయం ముందు హ్రస్వమవడం,
2. యకారం ముందు హ్రస్వాచ్చు దీర్ఘమవడం;
3. వర్ణ వ్యత్యయం
4. మూ. ద్రా. పదాది *చ కార లోపం
5. మూ. ద్రా. పదాది శ్వాస స్పర్శాలు కొన్ని పదాలలో నాద స్పర్శాలుగా మారడం.

(పైన ఇచ్చిన పరిణామాలు కొన్ని మూడు, అయిదు సాధారణ పరిణామాలలో అంతర్గతమౌతాయి.)

167

# III. నామవాచకాలు

**3.0.** వాక్యంలో కర్తగాగాని కర్మగాగాని ప్రయోగించదగిన శబ్దాలు నామవాచకాలని స్థూలంగా చెప్పవచ్చు. సంఖ్యావాచకాలూ, సర్వనామాలూ కూడా నామవాచకాలు అనే పెద్ద సముదాయంలో అంతర్విభాగాలే. ఇవికాక క్రియలమీద కృత్ప్రత్యయాలు చేర్చడంవల్ల ఏర్పడిన కృదంతాలు కూడా నామవాచకాలలో ఒక విభాగం అవుతాయి. ద్రావిడ భాషలలో నామవాచకం పద నిర్మాణం (Morphological Structure) ఈ కింద ఇచ్చిన విధంగా ఉంటుంది:

ప్రాతిపదిక + (బహువచన ప్రత్యయం) + (ఔప విభక్తికం) + (విభక్తి ప్రత్యయం/విభక్త్యర్థక శబ్దం).

(ప్రాతిపదిక ప్రత్యయ రహితమైన ఏకపదం (Monomorphemic) గా గాని, కృత్ప్రత్యయ లింగప్రత్యయాలు కలదిగా గాని ఉండవచ్చు, పైన కుండలీకరణాలలో ఇచ్చిన ప్రత్యయాలు వైభాషికంగా అంటే వ్యవహర్త ఇచ్ఛానుసారంగా ప్రాతిపదికకి చేరతాయి.)

**3.1. ప్రాతిపదికలు**

(i) కృదంత ప్రాతిపదికలు.

నామ ప్రాతిపదికలలో చాలా 'నీరు', 'కాలు', 'ఎద్దు', 'అన్న' మొదలైన శబ్దాలలా ఏకపదాలుగానే ఉంటాయి. కాని క్రియకి ఒక ప్రత్యయం చేర్చడంద్వారా ఏర్పడిన నామవాచకాలు కూడా అన్ని ద్రావిడ భాషలలోనూ ఉంటాయి. వీటినే కృదంతాలు అంటారు. ద్రావిడ భాషలలో 'తమ్ముడు, మనుమడు, మనుమరాలు, వియ్యంకుడు, వియ్యపురాలు' మొదలైన శబ్దాల వంటి లింగ ప్రత్యయాలు ఉన్న నామప్రాతిపదికలు కూడా అరుదుగా ఉన్నాయి.

సాధారణంగా ద్రావిడ భాషలలో ఒక నామవాచకం లింగం దాని అర్థాన్నిబట్టే తెలుస్తుంది కాని అన్ని నామవాచకాలలోనూ లింగ సూచకమైన ప్రత్యయాలు ఉండవు. ఈ విభాగంలో కృదంతరూపాలూ, దీని తరవాత విభాగంలో లింగ ప్రత్యయ సహిత ప్రాతిపదికలూ చర్చించబడతాయి.

**తమిళం :**

భావార్థక ప్రత్యయం -అల్ : -తల్ః, కెటుతల్, కెటల్ 'చెడడం', పిరితల్ 'విడిపోవడం', పిఱత్తల్ 'పుట్టడం', కాత్తల్ 'రక్షించడం'.

కృత్ప్రత్యయాలు :-ఇ : వెకుళి 'కోపం'; -వల్ : పార్వల్ 'చూడడం'; -పు : ఒప్పు 'పోలిక', మాణ్బు 'గొప్పతనం'; -ఇల్ : మిచ్చిల్ 'మిగులు'; -ఉళ్ : మిక్కుళ్ 'ఎక్కిళ్లు', విళైయుళ్ 'పంట', -కాటు: సాక్కాటు 'చావు', -ఐ: విలై 'వెల', కొలై 'చంపడం', నకై 'నవ్వు'; -వు: అఱివు 'జ్ఞానం', వాళ్వు 'బతుకు', ముటివు 'అంతం', -అవు : చెలవు 'పోవడం, ఖర్చు', ఉణవు 'తిండి', కళవు 'దొంగతనం'; -తి: మికుతి 'ఎక్కువ', పకుతి 'విభాగం'; కై: వాళ్కై 'బతుకు', వరుకై 'రాక'; -వి: కేళ్వి 'ప్రశ్న', కల్వి 'చదువు', -చి: ముయఱ్చి 'ప్రయత్నం', ఆట్చి 'ప్రభుత్వం', మకిళ్చి 'సంతోషం'; -అం: అకలం 'వెడల్పు', చినం 'కోపం', అచ్చం 'భయం' (అంచు 'భయపడు').

ధాత్వచ్చు దీర్ఘమవడం : కేటు 'చేటు' (<కెటు 'చెడు'), పేఱు 'పొందడం (<పెఱు 'పొందు'), కోళ్ 'సిద్ధాంతం' (<కొళ్ 'తీసుకొను'), ఊణ్ 'తిండి' (<ఉణ్ 'తిను, తాగు), తీన్ 'తిండి' (<తిన్ 'తిను').

అంత్యస్పర్శం ద్విరుక్తమవడం: ఎళుత్తు 'అక్షరం' (<ఎళుతు 'రాయు'), విళక్కు 'దీపం' (<విళంకు 'ప్రకాశించు'), పాట్టు 'పాట' (పాటు 'పాడు').

-$\phi$ (లోపం) : చిరి 'నవు', ఇకల్ 'శత్రుత్వం', కుత్తు 'పోటు', చొల్ 'మాట' పుకళ్ 'పొగడ్త'.

**మలయాళం :**

భావార్థక ప్రత్యయం - అల్; చెయ్యల్ 'చెయ్యడం', నటక్కల్ 'నడవడం'.

కృత్ప్రత్యయాలు : -తల్; పాచ్చల్ 'పరిగెత్తడం', కెటుతల్ 'చెడడం', -పు : కిటప్పు 'పడుకోవడం'; పార్పు 'బ్రతకడం'; -వు : అఱివు 'జ్ఞానం', నినవు' జ్ఞాపకం'; -చ్చ : చేర్చ 'సంబంధం', వీళ్చ 'పడడం', -తి: అఱుతి 'అంతం', పొఱుతి 'ఓర్పు', -త్తు: నెయ్త్తు 'నేత', కొయ్త్తు 'కోత(లు)'- -త్తం : పిటిత్తం 'పట్టడం', నటత్తం 'నడక, నడత', -అ : నిల 'స్థానం', కొట 'దానం', -ఇ : కేళి 'వినడం', తోలి 'ఓడిపోవడం', -అం : నీళం 'పొడుగు', ఆళం 'లోతు', ఎణ్ణం 'అంటె', కళ్లం 'అబద్ధం'; -మ : ఓర్మ 'జ్ఞాపకం', కూర్మ 'వాడి (తనం)', తాళ్మ 'లోతు', -వి: మఱవి 'మరుపు', పిఱవి 'పుట్టుక', తోల్వి 'ఓడిపోవడం'; -పటి: నటపటి 'నడవడి, కార్యక్రమం'; -తల : మఱుతల 'ఇంకొక వైపు', నటుతల 'మధ్యభాగం', -మానం: తేమానం 'అరుగుదల', వరుమానం 'రాబడి', తీరుమానం 'తీర్మానం'; -టు: సుమటు 'నెత్తిమీద బరువు'.

ధాత్వచ్చు దీర్ఘమవడం : ఊణు 'భోజనం' (<ఉణ్ 'తిను'), కేటు 'చేటు' (<కెటు 'చెడు'), చూటు 'వేడి' (<చుటు 'కాలు').

అంత్యస్పర్శం ద్విరుక్తమవడం : పాట్టు 'పాట' (<పాటు 'పాడు'), ఓత్తు 'చదవడం' (<ఓతు 'చదువు'), ఊట్టు 'ఊట' (<ఊఱు), విళక్కు 'దీపం' (<విలఙ్ఙు 'వెలుగు')

-$\phi$ : చిరి 'నవ్వు', వళ 'గాజు', కళి 'ఆట', కుత్తు 'పోటు', వెట్టు 'కత్తివేటు'.

**కొడగు :**

భావార్థక ప్రత్యయం -పె̈, -వె̈ (-ఒ) : బప్పె̈ 'రావడం', పెరువె̈ 'కనడం', బాళొ 'బతకం', మాడొ 'చెయ్యడం', -పు : ఒప్పు 'ఒప్పందం' నిప్పు 'నిలబడడం'; -(ఇ)కె: బాకె 'జీవితం' (బాళ్ - 'బతుకు'), నంబికె 'నమ్మకం'; -(అ)వు: చావు 'చావు', అరివు 'జ్ఞానం', తరవు 'ఇవ్వడం', -పె̈;

కుడిపె 'తాగడం', -ఇ, తీని 'తిండి'; ϕ: మొరటు 'ఏడ్పు', చీపు 'చీకడం', ఊణు 'తిండి', అడి 'దెబ్బ'; -ఆట: తుమ్మాట 'తుమ్మడం', నడకాట 'నడవడం'; -ఆమె: ఉక్కామె 'వ్యవసాయం', -కు: పోకు 'నడవడి'.

ధాతువు చివర నాదస్పర్శం శ్వాసస్పర్శంగా మారడం; పాటు 'పాట' (పాడ్-), ఆటు 'నాట్యం' (ఆడ్-); ఈ మార్పు తరవాత - అకారం కొన్నిటిలో చేరుతుంది: కూట 'గుంపు' (కూడ్-).

తొద :

-క్య : నొబ్క్య్ 'నమ్మకం', కోణ్క్య్ 'కానుక'; -ష్: కేళ్ష్ 'వార్త, మాట'; -య్ : పోత్య్ 'పక్క (bed)', పఖ్య్ 'భాగం'; -మ్ : ఒణ్మ్ 'లెక్కపెట్టడం', పీడ్మ్ 'పరుగు'; ప్ : నడ్ప్ నడవడి', నెన్ప్ 'జ్ఞాపకం'; -ఇల్ : కోఫిల్ 'కాపలా', కూసిల్ 'కుప్ప'; -ఫ్య్: కల్ఫ్య్ 'చదువు'; -త్: పేస్త్ 'ఇల్లు నెయ్యడం'; -ఖూ : ముచ్ఖూ 'మూత'; ఖుష్య్: పూత్ఖుశ్య్ 'చొక్కా'.

కన్నడం :

అల్ : అళల్ 'దుఃఖం', ఏఱల్ 'సింహాసనం' (<ఏఱు 'ఎక్కు'); -ఇ: పుట్టి 'పుట్టినవాడు', ఆడి 'ఆడేవాడు'; -అర్: బెళర్ 'వెలుగు'; -కె/-క్కె: అగల్కె 'విడదీయడం', అఱికె 'ప్రసిద్ధి', ఇర్కె 'నివాసం', కాణ్కె 'చూపు' బెంకె 'వేడి'; -గె: అడుగె 'వంట', బేగె 'మంట'; -ఇగె: తొడిగె 'భూషణం'; -ఇల్: మిగిల్ 'గొప్పతనం', పుగిల్ 'ప్రవేశం'; -కుళి/గుళి : పోర్కుళి 'పోట్లాడేవాడు'; -అం : అగలం 'వెడల్పు', గెల్లం 'జయం' (కొన్ని క్రియలలో దీనిముందు గ,డ లు క,ట లుగా మారతాయి : ఎసకం 'పని' (<ఎసగు 'చేయు'), పొంకం 'పొంగు', ఆటం 'ఆట' (<ఆడు), పాటం 'పాట' (<పాడు); -అవు: తొడవు 'భూషణం', గెలవు 'జయం', బరవు 'రావడం';

-వు : అఱివు 'జ్ఞాన'ం, అళివు 'నాశం', నోవు 'నెప్పి', నావు 'చావు'; -పు: పొళెపు/పొళపు 'తెలుపు', కాయ్‌పు 'కోపం', కాపు 'రక్షణ'; -తె: పొగళ్తె 'పొగడ్త', నెగళ్తె 'కీర్తి'; -పె: కయ్‌పె 'చేదు'; -మె: కూర్మె 'ప్రేమ', -పి: నోంపి 'నోము', కల్పి 'చదువు'; -వి : నెరవి 'పోగుచేయడం', అళవి 'కొలత'; -ఇసు/సు: ఉణిసు 'భోజనం', ముని్సు 'కోపం'; -పం: తానెపం 'ఊగడం', బరెపం 'వ్రాత'; -తం: గెయ్‌తం 'పని', మేతం 'మేత'.

ధ్వాత్వచ్చు దీర్ఘమవడం : కోళ్ 'తీసుకోవడం' (<కొళ్ 'తీసుకొను'), సూడు 'వేడి' (<సుడు 'కాలు'), కేడు 'చేటు' (కిడు < *కెటు 'చెడు'); కోడు 'దానం' (<కుడు < *కొటు 'ఇచ్చు').

-ϕ : నడె 'నడచు, నడక,' కట్టు, కూగు, 'కేక (వేయు),' తడె 'అడ్డు(పెట్టు),' తప్పు.

**తు ళు :**

-ఇ : మెంచి 'మెరుపు,' గుత్తి 'మోడు' ఎ; కట్టె 'కట్టినది' పత్తె 'గుర్తు.' అరిపె 'జల్లెడ'; అణె : తిర్గణె 'స్క్రూ'; -ఎలు : ముచ్చెలు 'మూత,' కడపెలు 'తిరగలి,' కిర్ంబెలు 'దురద' బాపెలు 'వాపు,' కొద్దెలు 'పులుసు (ఒకరకం)' (<కొది 'కాచు'); -కె / -ఇకె : బెదరికె 'భయం'; బిరికె 'బీట'; -గె / -ఇగె ; మెత్తిగె 'అరుగు,' బిత్తిగె 'విత్తనాలు చల్లడం,' ఒప్పిగె 'ఒప్పందం,' బరవణిగె 'చదువు'; -అంద : ఒప్పంద 'ఒప్పందం'; -డి : తిండి 'తిండి'; -అలు : కావలు 'కావలి'; -ఎల్-ఎ (పురుషకర్తృ వాచకం): కండెలె 'దొంగ.' బొట్టెలె 'డప్పు వాయించేవాడు,' గిరియెలె 'తిరిగే వాడు,' మధపెలె 'మతిమరుపువాడు'; -వు: మేపు 'మేత,' కళవు 'దొంగ

తనం'; -అయ : ఒత్తయ 'చాలాసార్లు అడగడం' (<ఒత్తు 'బలవంతం చెయ్యడం')

**తెలుగు :**

భావార్థక ప్రత్యయం -ట (వ్యా -అడం / -అటం) చేయుట (చెయ్యడం). చెప్పుట (చెప్పడం).

-క : అలుక, ఎఱుక, కలఁక, నడక, మూఁక , మొలక, రాక; -ఇమి :కలిమి, ఓరిమి, కూరిమి, ప్రేలిమి; -ఁత : చేఁత, అలఁత, కూఁత, కోఁత, వ్రాఁత, మ్రోఁత; -కువ : అడఁకువ, మెలఁకువ, లోఁకువ; -ట : ఆట, ఊట, ఓట, పాట, మంట, వంట; -టు : పాటు, చేటు, కాటు, పోటు (వీటిలో ధాత్వచ్చు దీర్ఘమవడం గమనించ దగ్గది), -పము : కలపము, మురిపము; -త : ఆవులింత, ఓకిలింత, గిలిగింత; -పు : మాపు, మేపు, ఇంపు, కానుపు; కాపు, చూపు, తలఁపు; -ఇక : కోరిక, కూడిక, ఓపిక, అమరిక, అరయిక, -బడి : ఏలుబడి, కట్టుబడి, తీఱుబడి, పెట్టుబడి, రాబడి; -గడ : చేరుగడ, మనుగడ; -ఇకి : పూనికి, పోలికి, కోరికి, చూడికి; -వు : మనువు, కావు, కొలువు, చావు, నోవు, పూవు; -అ: గీఱ, ఎండ, కాయ, ప్రయ్య, వెల; -అకము : అమ్మకము, మాఱకము, నమ్మకము; -డు : అమ్మడు, అల్లుడు, త్రొక్కుడు, దంపుడు; -వడి : కొలువడి, నడవడి; -వి : తనివి, తెలివి; -అవు : తగవు నగవు; -ఇ : చేయి, వ్రాయి; -కలి : వినుకలి, కనుకలి : -$\phi$ : అంటు, నవ్వు, తప్పు, ఒప్పు, కట్టు.

**కొండ :**

-ఉజ్ : నేంజుజ్ 'ఊపిరి' (<నేంజ్ 'ఊపిరిపీల్చు')

-కు : మూల్కు 'మూత్రము' (మూల్ 'మూత్రము విడుచు')

**కూయి :**

ఈ భాషలో తుమున్నర్థకాలు నామవాచకాలుగా చాలా విరివిగా వాడబడతాయి : తిన్ బ 'తినడానికి, తిండి,' ఢూవ 'దున్నడానికి, దున్నడం,' పాణ్బ గటంజు 'డబ్బున్నవాడు' (పాణ్ 'పొందు'), ఉణ్బ నీ్రడు 'తాగే నీళ్లు,' డోప ఇడు 'నిద్రపోయే ఇల్లు (గది)'.

ఇవికాక మిగిలిన కృత్ప్రత్యయాలు :

-ఎడి : పంగెఢి 'క్రరపలక' కిసెఢి 'చెవిపోగు' (<కిస్, 'గిల్లు'; -ఎరి : కోఎరి 'కోతలు' (<కో-'కోయు'); -ఒడి : సీపొఢి 'గరిటె' (<సీ - 'ఇచ్చు'); -ఒరి : దేస్పొరి 'ఎత్తడం' (<దేస్ - 'ఎత్తు'); -ఒలి : ్రదుంగొలి 'ఉయ్యాల' (<్రదుంగ్ - 'ఊగు').

**పెంగొ :**

-కొండ్ : క్డేచ్‌కొండ్ 'కల', కేర్కాండ్ 'పాట'; -పొండ్ : కుత అస్పొండ్ 'దగ్గు'; -అ : ఢ్వ 'తవ్వినమట్టి', పక 'చీలిక'; -ఇ : క్డేంజి 'కల', పకి 'వెదురుబద్ద'. ముచి'మూత'.

**కోలామీ :**

-ఊడ్ : సీఊడ్ 'ఇవ్వడం, ఇచ్చినది', పండూడ్ 'పండు'; ఓలూడ్ 'చూడబడినవాడు', ఉంబులూడ్ 'మూ్రతం'.

**పర్జీ :**

-కుడ్ : ఉర్జుకుడ్ 'చెమట', తుమ్‌కుడ్ 'తుమ్మ', నొయ్‌కుడ్ 'నెప్పి'; -అల్: నేఞల్ 'ఊపిరి' ఊబల్ 'చెప్పడం', కాచల్ 'కావడిబద్ద' (<కాఞ్- 'కావడి మోయు'); -ఉట్: ఉయ్‌కుట్ 'పాముకూసం' (<ఉయ్క్- కూసం విడుచు).

**బ్రాహుయీ :**

-అ : చండ 'కదలిక' (<చండ్ - 'కదులు'), జక్క 'దగ్గు' -స్: తిస్స 'దానం' (<తిన్ - 'ఇచ్చు'), ఖులీస్ 'భయం' (<ఖుల్ - 'భయపడు'),

పిరేస్ 'వాపు' (< పిర్ - 'వాచు'); -ఆర (ఇది ధ్వనులను సూచించే క్రియలకే చేరుతుంది). గా్రార 'గొర్రె/మేక అరుపు', వక్కార 'కుక్క అరుపు', ఈఝూర 'ఈల వెయ్యడం'; -$\phi$ : ద్రిక్ 'గంతు', అక్కల్ 'అరుపు', పుల్ 'దొంగ తనం', తక్ 'కోరిక'.

## తులనాత్మక చర్చ

మధ్యోత్తరోపకుటుంబాల సాహిత్య రహిత భాషలలో ప్రాచీన కృత్ప్రత్యయాలు చాలావరకు నశించాయి. కొన్ని భాషలకి ఈ విషయంమీద ఇంకా సామగ్రి లభ్యం కాలేదు. ఈ కారణాలవల్ల ఈ అంశంపై తులనాత్మక చర్చ సమగ్రంగా చెయ్యడం సాధ్యం కాదు. సాహిత్యవంతమైన భాషలలో కూడా కృదంతాలని సమగ్రంగా సేకరించి పరిశీలన చెయ్యవలసిన అవసరం ఉంది. ఒక భాషలో ఒకే ధాతువుకి భిన్నార్థాలలోగాని ఏకార్థంలోనేగాని భిన్న ప్రత్యయాలు చేరడంకూడా ఉంది; ఉదా. నడక, నడత; చూపు, చూడ్కి; చేఁత, చేయి; వ్రాఁత, వ్రాయి.

టు, ఋ లతో అంతమయ్యే ద్వ్యచ్క ధాతువులలోనూ, ఏకాచ్క ధాతువులలోనూ అచ్చు దీర్ఘమవడంవల్ల కృదంతరూపం ఏర్పడడం సాహిత్యవంతమైన భాషలు నాలుగింటిలోనూ ఉంది, కాబట్టి ఇది మూలద్రావిడ ప్రక్రియే కావచ్చు. అలాగే చివరి స్పర్శం కృదంతరూపంలో ద్విరుక్తమవడం అనే ప్రక్రియ కూడా మూలద్రావిడానికి చెందినదే అనవచ్చు: తె. పాట. త. మ. పాట్టు. కొన్ని కృదంతాలలో ప్రత్యయమేమీ లేకపోవడం కూడా సాధారణ ద్రావిడ భాషా లక్షణమే. -అల్ దక్షిణ ద్రావిడ ప్రత్యయం; ఇది తెలుగులో లేదు. మిగిలిన ప్రత్యయాలు కూడా చాలవరకు మూలభాషకు చెందినవే. కాని అవి వచ్చే ధాతువుల విషయంలో మాత్రం భాషకి భాషకి మధ్య భేదాలు ఉన్నాయి.

(ii) లింగప్రత్యయ సహిత ప్రాతిపదికలు :

నామ ప్రాతిపదికలలో లింగ ప్రత్యయాలు అరుదుగానే ఉంటాయనీ, నామవాచకం లింగం అర్థంవల్లనే తెలుస్తుందనీ ఇంతకుముందే చెప్పబడింది.

**తమిళం :**

పురుషవాచక ప్రత్యయాలు : -అన్: మకన్ 'కొడుకు', కాతలన్ 'ప్రేమికుడు', ఇళైయన్ 'యువకుడు'; -ఆన్ : పార్ప్పాన్ 'బ్రాహ్మణుడు'; -వన్ : చిఱువన్ 'పిల్లవాడు', తలైవన్ 'నాయకుడు', కళ్వన్ 'దొంగ'; -నన్ (ఐ కి తరవాత నన్, ఞన్) : పొరునన్ 'యోద్ధ', విలైనన్, విలైఞన్ 'అమ్మేవాడు'; -ఓన్ : కిళ్వోన్ 'నాయకుడు', ఇళైయోన్ 'యువకుడు'.

స్త్రీ వాచక ప్రత్యయాలు : -అళ్, -ఆళ్, -ఓళ్ : మకళ్ 'కూతురు', మాతరాళ్, మటవాళ్ 'స్త్రీ', మనైయాళ్ 'భార్య', కిళ్వోళ్ 'నాయిక', ఇళైయోళ్ 'అమ్మాయి'; -ఇ : తోళి 'చెలికత్తె', కాతలి 'నాయిక', కిళ్వి 'నాయిక', మామి 'అత్త'; -వి : మనైవి 'భార్య', చెల్వి 'రాణి, దేవత', కళ్వి 'ఆడదొంగ'; -మి : చిఱుమి 'అమ్మాయి'; -ఐ : పరత్తై 'వెలయాలు'; -త్తి : పులైత్తి 'చాకలిది', ఆయ్త్తి/ఆయ్చ్చి 'గొల్లది', ఒరుత్తి 'ఒకర్తె', వణ్ణాత్తి 'చాకలిది', తట్టాత్తి 'కంసాలిది'.

**మలయాళం :**

పురుషవాచక ప్రత్యయాలు : -అన్, -ఆన్ : మకన్ 'కొడుకు', వణ్ణాన్ 'చాకలివాడు'; స్త్రీ వాచక ప్రత్యయాలు: -అళ్ : మకళ్ 'కూతురు'; ఇ : పొట్టి 'మూగది'; -త్తి : ఒరుత్తి 'ఒర్తె', తియ్యత్తి 'తియ్యకులపు స్త్రీ', వాణ్ణాత్తి 'చాకలిది'.

**కోత :**

పురుషవాచక ప్రత్యయం : -న్ : పరెన్ 'మాలవాడు', కళ్ణ్ 'దొంగ', స్త్రీవాచక ప్రత్యయాలు : -ఇ : కళి 'దొంగది' కుర్డి 'గుడ్డిది'; త్రి : దేర్త్రి 'దేవత', మయ్‌తి 'బడగజాతి స్త్రీ'; -చ్ : పర్చ్ 'మాలది', కవఢ్చ్ 'కురుంబ జాతి స్త్రీ.

తొద :

పురుషవాచక ప్రత్యయాలు : -న్ : కొనాడ్యన్ 'కన్నడంవాడు', కొశ్ణ్ 'దొంగ'; -ఓశ్ : కెలోశ్ 'ముసలివాడు', స్త్రీవాచక ప్రత్యయాలు -ఇ : మీమి 'అత్త'; -త్ య్ : పుర్కిత్ య్ 'తోడుకోడలు'; -చ్ : కుర్బ్ చ్ 'కురుంబజాతి స్త్రీ', పట్ చ్ 'మాలది'.

కొడగు :

పురుషవాచక ప్రత్యయం : -ఎ : కళ్లె 'దొంగ'; ఎరపె ముష్టివాడు' స్త్రీవాచక ప్రత్యయాలు : -అతి : కొడవతి 'కొడగు జాతి స్త్రీ', కురుబతి 'కురుబ జాతి స్త్రీ', -చి : తోటిచి 'పాకీది', ఎరపచి 'ముష్టిది', -ఇ : కళ్లి 'ఆడదొంగ', మూగి ''మూగది'; -అ(ళ్) : ఒబ్బ(ళ్) 'ఒకర్తి' మోవ(ళ్) 'కూతురు'; -కర్తి: ఆటకర్తి 'ఆటది'; అడిగెకర్తి 'వంటది'.

కన్నడం :

పురుషవాచక ప్రత్యయం : -అం : అణ్ణం అన్న', అమ్మం 'తండ్రి', తమ్మం 'తమ్ముడు', అళియం 'అల్లుడు' (వీటిలో మ *న నించి వచ్చింది; ప్రాచీన కన్నడంలో పదాంతంలో మూ. ద్రా. *నకారం మ గా మారుతుంది; ఇది ఆధునిక కన్నడంలో లోపిస్తుంది.) స్త్రీవాచక ప్రత్యయాలు: -అళ్ : ఒర్వల్/ఒబ్బళు 'ఒక స్త్రీ' మగళ్ 'కూతురు'; -ఇ : అరసి 'రాణి', కురుడి 'గుడ్డిది'; -తి : పొలతి/హొలతి 'ఒక తక్కువజాతి స్త్రీ', పార్వంతి 'బ్రాహ్మణ స్త్రీ'.

తుళు :

పురుషవాచక ప్రత్యయం : -ఎ : కురుడె 'గుడ్డివాడు', కుంటె 'కుంటివాడు', కెప్పె 'చెవిటివాడు'; స్త్రీవాచక ప్రత్యయాలు : -ఇ : కురిడి 'గుడ్డిది', కెప్పి 'చెవిటిది', మామి 'అత్తగారు', -తి, త్తి : మర్తి 'పిచ్చిది', ఆచార్తి 'కంసాలి స్త్రీ', సాల్యేత్తి 'సాలెది', మడ్డెళ్తి 'చాకలిది', పొసబెత్తి 'కొత్తది'.

**తెలుగు :**

పురుషవాచక ప్రత్యయం : ఁడు : తమ్ముఁడు, మనుమఁడు, అల్లుఁడు, వేఁటకాడు, ఱేఁడు, వగలాడు, అందగాఁడు, మన్నీఁడు (ప్రాఙ్నన్నయ శాసనాలలో దీనిరూపం -ణ్టు : తబుణ్టు 'తమ్ముఁడు') స్త్రీవాచక ప్రత్యయాలు : -ఆలు, -అలు : మనుమరాలు, బల్లిదురాలు, భాలెంతరాలు, చూలాలు, ఇల్లాలు, కోడలు, చెలియలు; -ఇ : ఓయారి, వగలాఁడి, కులుకులాఁడి; -త్తియ (త్తె), -త : ఆట కత్తియ. అందగత్తియ, చాకిత, బోయత, చెంచెత, మాలెత, గుబ్బెత. మిండత, ముట్టుత.

**గోండీ :**

-ఆల్ : ఆందాల్ 'గుడ్డివాడు', తాదాల్ 'అన్న', కూటాల్ 'కుంటివాడు', మూకాల్ 'మూగవాడు', కుమ్మాల్ 'కుమ్మరి' -ఓర్ : తొత్తోర్ 'పూర్వుడు', డియ్యోర్ 'పడుచువాడు'; స్త్రీవాచక ప్రత్యయాలు : -అథ్ : మియ్యాథ్ 'కూతురు', సేలాథ్ 'చెల్లెలు', కోర్యాథ్ 'కోడలు', పోరాథ్ 'అత్తగారు'; -ఈ : నొవ్రీ 'పెళ్ళికూతురు', పేడీ 'పిల్ల', మూకీ 'మూగది', ఆ : ఢియ్యా 'పడుచుది'; -ఏ ; కుమ్మే 'కుమ్మరిది', మొడ్డే 'నెలలోపిల్ల', వర్టే 'చాకలిది', చండ్కే 'మాలది'.

**కొండ :**

పురుషవాచక ప్రత్యయాలు : -అ : కణ 'గుడ్డివాడు', డొక్ర 'ముసలి వాడు'; -ఎన్ : గురుయెన్ 'గురువు', గాన్సియెన్ 'తక్కువజాతివాడు', కట్కయెన్ 'పిసినిగొట్టు', స్త్రీవాచక ప్రత్యయాలు : -ఇ : కణి 'గుడ్డిది', డొక్రి 'ముసలిది', కట్క(ని) 'పిసినిగొట్టు'; -ని : గాన్సిని 'తక్కువజాతి స్త్రీ' కర్సిని 'కర్సిజాతి స్త్రీ', గురుణి 'ఆడగురువు'.

పెంగొ :

పురుషవాచక ప్రత్యయాలు : -ఎన్ : పొత్తెన్ 'మామగారు', టొండెన్ 'అన్న', దూతెన్ 'ముసలివాడు'; -అన్ : (ఇది -అక్- తరవాతే వస్తుంది) కెయ్నకన్ "నౌకరు', నాటకన్ 'ఊరివాడు', ఇంజకన్ 'ఇంటివాడు'. స్త్రీవాచక ప్రత్యయం : -ఎల్ : తొథ్ండెల్ 'చెల్లెలు', హరుకదెల్ 'చిన్నది'.

మంద :

పురుషవాచక ప్రత్యయం : అన్ : దలికతన్ 'పెద్దవాడు'. కఢినన్ 'నల్లటివాడు'. స్త్రీవాచక ప్రత్యయం : -ఎల్ : హూల్ పందెల్ 'అందమైనది', కఢిందెల్ 'నల్లటిది'.

కూయి :

పురుషవాచక ప్రత్యయాలు : -ఎంజు : మ్రీగెంజు "బావమరది', తోడ్ఞెంజు 'స్నేహితుడు', కూఎంజు 'కోందుజాతి పురుషుడు', గహెంజు 'ఊడ్చేవాడు', చెగంజు 'మంచివాడు'; -ఎర, -ఒర : బ్రూకెర 'గ్రుడ్డివాడు', ప్రేకొర 'గొంగ', అహ్పొర 'తెచ్చేవాడు', స్త్రీవాచక ప్రత్యయాలు : మ్రీగలి 'మరదలు', తోఢ్లి 'స్నేహితురాలు', కూఅలి 'కొందుజాతిస్త్రీ', గహలి 'ఊడ్చేది'; -ఎడి : పాటరెఢి 'మహమ్మదీయస్త్రీ' సహెబొరెఢి 'ఇంగ్లీషుస్త్రీ', 'ఇ : బ్రూకెరి 'గుడ్డిది', ప్రేకొరి 'వెలయాలు', నెగరి 'మంచిది'.

కోలామి :

పురుషవాచక ప్రత్యయాలు : -న్ : మరాన్ 'మరది', మలాన్ 'మంగలి', తోరేన్ 'తమ్ముడు', సాంజీన్ 'చెల్లెలు భర్త' -క్ : బాసాక్ 'మేనల్లుడు', బేరాక్ 'చెపిటివాడు', మామాక్ 'మామ', పొప్సియక్ 'లావుమాటి వాడు', వెట్టియక్ 'చాకలివాడు', స్త్రీవాచక ప్రత్యయాలు : .అల్ : మాసాల్ 'భార్య', కొమ్మాల్ 'కూతురు', కొరాల్ 'తమ్ముడి భార్య', పొదాల్ 'అత్త గారు', వాడ్గిరాల్ 'కంసాలిజాతి స్త్రీ', పొప్సిరాల్ 'లావుపాటిది', మర్ందాల్

'మరదలు', తోర్ందాల్ 'చెల్లెలు', -ఇః బాసి 'మేనకోడలు', బేరి 'చెవిటిది', పుత్ని 'తమ్ముడి కూతురు' -తాద్ : కోలవ్ తాద్ 'కోలామ్ స్త్రీ', దీవర్తాద్ 'చేపలవాళ్ళ జాతి స్త్రీ', గొండొర్తాద్ 'గోండుజాతి స్త్రీ'.

**నాయకి (ఛాందా) :**

పురుషవాచక ప్రత్యయాలు : -నో : తోలెన్ 'తమ్ముడు', కీకెన్ 'కొడుకు', కయ్‌మన్ 'సురది', -అక్ : థివ్రక్ 'చేపలవాడు', ముక్కాక్ 'మూగవాడు'; స్త్రీవాచక ప్రత్యయాలు : -ఆ(ల్) : తెలిగ్గా(ల్) 'తెలుకులది', మాసా(ల్) 'స్త్రీ', -ఇః ముక్కి 'మూగది', న్రవి 'పెళ్ళి కూతురు', భయ్‌రి 'చెవిటిది'; -ఎః ద్రివె 'చేపలవాళ్ళ జాతి స్త్రీ'.

**పర్జీ :**

పురుషవాచక ప్రత్యయం :- : ద్ తాలెద్ 'సోదరుడు', పొదిద్ 'మామగారు', మయిద్ 'భర్త', గడిద్ 'పశువుల కాపరి'; స్త్రీవాచక ప్రత్యయం : -(అ)ల్ : పొదల్ 'అత్తగారు', చాలల్ 'చెల్లెలు', కొడొల్ 'పెళ్ళి కూతురు', అయల్ 'స్త్రీ', కేతల్ 'విగత భర్తృక', ముర్తల్ 'ముసలిది'.

**గదబ (ఒల్లారి) :**

పురుషవాచక ప్రత్యయాలు : -ండ్ : మగ్గింద్ 'మనుష్యుడు', ఇలెండ్ డొ'పెళ్ళికొడుకు';-ఒన్ : తొడొన్ 'సోదరుడు'; -అక్ : ముత్తక్ 'ముసలివాడు'; స్త్రీవాచక ప్రత్యయం : -అల్ : కొద్దల్ 'కోడలు', కేటల్ 'విగత భర్తృక', ముర్తల్ 'ముసలిది'.

**కూడుఖ్ :**

పురుష వాచక ప్రత్యయం : -అస్ : ఆలస్ 'మనుష్యుడు', బేలస్ 'రాజు', ఉర్బస్ 'యజమాని', మేతస్ 'భర్త', కుకోస్ 'పిల్లవాడు' : 'స్త్రీ, భార్య' ఉర్బనీ 'యజమానురాలు'; -ఓ : అయో 'తల్లి', ఖెద్దో 'కోడలు', పెల్లో 'పనిమనిషి'.

**మాల్తో :**

పురుషవాచక ప్రత్యయం : -ఎ: మఖె/ఖదె 'కొడుకు', ఖల్వె 'దొంగ'; స్త్రీవాచక ప్రత్యయాలు : -ఇ : మఖి 'పిల్ల', ఖలి 'పిన్ని'; -తి: ఒర్తి 'ఒకర్తి'.

బ్రాహుయీ భాషలో లింగభేదం నశించడంవల్ల ఇటువంటి ప్రత్యయాలు లేవు.

## తులనాత్మక చర్చ

పురుషవాచక ప్రత్యయం దక్షిణ భాషలలో *న్‌గానూ, మధ్య భాషలలో *న్‌ట్‌గానూ పునర్నిర్మించవచ్చు. ఈ రెండింటిలో మూలమధ్య ద్రావిడ భాషారూపమైన న్‌ట్ ఏ ప్రాచీనతరమనీ, అదే మూలద్రావిడ భాషారూపమనీ చెప్పవచ్చు. దీనిపై విస్తర చర్చకి పురుషవాచక సూచక సర్వనామరూపాల కింద చూడవచ్చు (3.4. (iii)). కూడుఖ్-మాల్తోలలోని *స్‌కీ *న్‌ట్‌కీ సంబంధం ఉందా లేదా అనే విషయం ఇప్పుడు తేల్చి చెప్పడం కష్టం. గోండీలో *-అల్ ప్రత్యయానికీ దీనికీ సంబంధం లేదు కాబట్టి అది ఒక నూతన ప్రత్యయమై ఉండాలి. కోలామీ-పర్జీ ఉప కుటుంబంలో *-క్ కూడా అదే విధంగా ఇంకొక నూతన ప్రత్యయం అనుకోవాలి.

స్త్రీ వాచక ప్రత్యయాలైన *-అళ్ (*-అళ్), *-త్తి, *-ఇ ఈ మూడూ ద్రావిడ భాషలలో ప్రచురంగా ఉన్నాయి. వీటిలో *-అళ్ (*-అళ్) *అళ్ 'స్త్రీ' అనే పదంతో తుల్యం, మధ్య ద్రావిడ భాషలలో ఇది సాధారణంగా సంబంధి స్త్రీవాచక పదాలలోనే ఉంటుంది; తెలుగులో బాలెంతరాలు మొదలైన ఇతర పదాలలో కూడా ఉంది. (*-త్తి దక్షిణ భాషలలోనే ప్రచురంగా ఉంది; తెలుగులో -త్తియ, -త ప్రత్యయాలు దీనికి సంబంధించినవే కావచ్చు. ఇతర మధ్య భాషలలో ఇది లేదు. మాల్తో ఒర్తి 'ఒకర్తి' అనే పదంలో ఇది ఉండడం వల్ల ఇది కూడా మూల ద్రావిడ భాషకి చెందినదే అయినా ఇది దక్షిణ భాషలలో ప్రచురమైందని చెప్పాలి).

* - ఇ ప్రత్యయం మూడు ఉప కుటుంబాలలోనూ ఉంది. కాబట్టి ఇది మూల భాషకు చెందినదే కావచ్చు. సంస్కృతంలో ఈకారం స్త్రీప్రత్యయంగా ప్రచు రంగా ఉంది. దానికీ ఈ ద్రావిడ ప్రత్యయానికీ సాజాత్యం ఉన్నట్లు కనపడు తుంది. ఈ సంస్కృత ప్రత్యయం సంస్కృత పదాల ద్వారా ద్రావిడ భాషల లోకి వచ్చిన తరవాత కొన్ని ద్రావిడ పదాలకి కూడా చేరినట్లు తోస్తుంది. (ద్రావిడ పదాలలో చివర దీర్ఘాచ్చు ఉండదు కాబట్టి ఈకారం ఇకారంగా మారి ఉండవచ్చు.) తమిళంలో కాతలళ్ /కాతలి 'నాయిక', కిళ్వోళ్ /కిళ్వి 'నాయిక' మొదలైన పదాలలో అళ్, ఇ ప్రత్యయాలు రెండూ పర్యాయంగా ఉండడం కూడా ఈ ఊహని బలపరుస్తుంది.

### 3. 2. లింగవచన ప్రత్యయాలు :

ద్రావిడ భాషలలో సాధారణంగా మహద్వాచకాలకి ఒక బహువచన ప్రత్యయమూ, అమహద్వాచకాలకి వేరొక బహువచన ప్రత్యయమూ ఉన్నాయి. బహువచన ప్రత్యయంలో బహువచనార్థమేకాక లింగభేదం కూడా అంతర్లీనమై ఉండడంవల్ల లింగవచన ప్రత్యయాలని కలిపి చర్చించడం అవసరం.

ద్రావిడ భాషలలో లింగభేదం సహజమైన లింగ భేదానికి చాలా వరకు సన్నిహితంగా ఉంటుంది. వ్యాకరణ లింగానికీ సహజ లింగానికీ అంతగా సంబంధం లేని ఇండో యూరపియన్ భాషలతో ద్రావిడ భాషలని పోల్చిచూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. కాని ద్రావిడ భాషలలో జంతువులలో ఉన్న లింగ భేదం వ్యాకరణంలో సూచితం కాదు. ఉదాహరణకి : అది ఎద్దు, అది ఆవు; ఎద్దు వచ్చింది, ఆవు వచ్చింది. కాబట్టి ఈ భాషలలో లింగభేదం సహజ లింగ భేదానికి పూర్తిగా సమానంగా ఉంటుందని చెప్పలేము.

ద్రావిడ భాషలలో నామవాచకం లింగాన్ని అనుసరించి దానితో సంబం ధించిన సర్వనామం గాని, సమాపకక్రియ గాని, ఆఖ్యాత సర్వనామం (Nominal Predicate) గాని మారుతూ ఉంటుంది. నామవాచకం లింగం దాని అర్థంవల్లే తెలుస్తుంది కాని నామవాచకంలో లింగ ప్రత్యయాలు సాధారణంగా ఉండవు.

ఉదాహరణకి తెలుగులో 'తమ్ముఁడు, అల్లుఁడు, మనుమఁడు' వంటి కొన్ని పదాలలో 'డు' ప్రత్యయం ఉంది కాని 'అన్న, తండ్రి, కొడుకు' మొదలైన అనేక పదాలలో లింగప్రత్యయం లేదు. అయినా ఈ పదాలన్నీ అర్థం ఆధారంగా మహత్తులుగానే పరిగణించబడతాయి. అన్ని ద్రావిడ భాషలలోనూ లింగ ప్రత్యయాలు ఉన్న నామవాచకాలు అల్పసంఖ్యాకంగానే ఉన్నాయి.

(i) లింగ భేదం : తొద, బ్రాహుయీ తప్ప మిగిలిన భాషలలో ఉన్న లింగ భేదాల్ని నాలుగు రకాలుగా విభజించవచ్చు. తొద, బ్రాహుయీ - ఈ రెండు భాషలలో అసలు లింగ భేదమే లేదు.

మొదటి రకం :

మహత్ ఏ. వ. (త. అవన్) మనుష్య బ. వ. (త. అవర్)
మహతీ. ఏ. వ. (త. అవళ్)
అమహత్ ఏ. వ. (త, అతు) అమహత్ బ. వ. (త. అవ్, అవై)

ఈ రకం లింగభేదం తమిళం, మలయాళం, కన్నడం, తుళులలో ఉంది. కోత, కొడగులలో కూడా ఇటువంటి లింగభేదమే ఉంది కాని ఈ భాషలలో అమహత్తులో ఏకవచన బహువచన భేదంలేదు. అంటే, కోత అద్, కొడగు అదు —వీటికి 'అది, అవి' అనే రెండు అర్థాలూ వస్తాయి. తొదలో లింగభేదం పూర్తిగా నశించి అథ్ అనే మాటకి 'వాడు, ఆమె, అది' అనే మూడు అర్థాలూ, దాని బహువచనమైన అథామ్ అనే మాటకి 'వాళ్లు, అవి' అనే రెండు అర్థాలూ వస్తాయి. తొద సర్వనామ, నామవాచకాలలో వచనభేదం ఉన్నా, క్రియలలో మాత్రం ప్రథమ పురుషలో లింగవచన భేదం లేదని గుర్తించాలి.

రెండోరకం :

మహత్ ఏ.వ. (తె. వాఁడు మనుష్య బ.వ. (తె. వారు)
అమహత్ ఏ.వ. (తె. అది) అమహత్ బ.వ. (తె. అవి)

ఈ రకం లింగభేదం తెలుగులో ఉంది. ఉత్తర ద్రావిడభాషలైన కూడుఖ్, మాల్తోలలో కూడా ఇదే రకం లింగభేదం ఉంది. కాని వాటిలో అమహత్తులో ఏకవచన బహువచన భేదం లేదు. ఈ భేదం తప్ప తెలుగులో ఉన్న లింగభేదానికీ వీటిలోగల లింగభేదానికీ తేడా ఏమీ లేదు. కూడుఖ్-మాల్తోలలో తదర్థక సర్వనామాలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తాయి.

| | **మహత్ ఏ.వ.** | **మనుష్య బ.వ.** | **అమహత్ ఏ.వ.** | **అమహత్ బ.వ.** |
|---|---|---|---|---|
| కూ. | ఆస్ | ఆర్/అబ్ ఢర్ | అద్ | అబ్ ఢా |
| మా. | ఆహ్ | ఆర్ | అత్ | — |

(కూడుఖ్‌లో అమహత్ సర్వనామంలో వచనభేదం ఉన్నా క్రియలలో అమహదేక వచన రూపాన్నే బహువచనానికి కూడా వాడతారు.) తెలుగులో అర్వాచీనకాలంలో 'ఆమె/ఆవిడ' అనే స్త్రీవాచక సర్వనామాలు వాడుకలోనికి వచ్చాయి. (ఇవి కవిత్రయం వారిభాషలో లేవు) కాని వీటికి ప్రత్యేక క్రియా రూపం లేదు.

**మూడోరకం :**

మహత్ ఏ.వ. (గోం, వోర్) మహత్ బ.వ. (గోం, వూర్)
అమహత్ ఏ.వ. (గోం, అద్) అమహత్ బ.వ. (గోం. అన్)

ఈ రకం లింగభేదం తెలుగు పెంగో, మండ తప్ప మిగిలిన అన్ని ద్రావిడభాషలలోనూ ఉంది. అవి గోండీ, కొండ, కూయి, కువి, కోలామీ, నాయకి, పర్జి, గదబ.

**నాలుగోరకం :**

మహత్ ఏ.వ. (పెం. అవన్) మహత్ బ.వ. (పెం. అవర్)
మహతీ ఏ.వ. (పెం. అదెల్) మహతీ బ.వ. (పెం. అవెక్)
అమహత్ ఏ.వ. (పెం. అది/అదణ్) అమహత్ బ.వ. (పెం. అవణ్)

ఈ రకం లింగభేదం పెంగో, మండలలో ఉంది. మండ భాషపై వివరాలు ఎక్కువ తెలియవు కాని ఇది పెంగోకి సన్నిహితం కాబట్టి ఇందులో కూడా లింగభేదం పెంగోలో ఉన్నట్లే ఉంటుందని చెప్పవచ్చు. ఈ రకం లింగభేదం మూడోరకం నించి ఉత్పన్నమైంది. ఇందులో స్త్రీ లింగం అమహత్తునించి వేరుపడడమే ముఖ్యమైనది. అద్- అనే అమహదేక వచనప్రాతిపదికకి -ఎల్ (<* -అళ్) అనే స్త్రీ ప్రత్యయం చేర్చడంవల్ల అదెల్ సృష్టించబడింది. అలాగే అవ్- అనే అమహద్బహు వచన ప్రాతిపదికకి -ఎక్ (*-క్) అనే బహువచన ప్రత్యయం చేర్చడంవల్ల అవెక్ 'ఆ స్త్రీలు' అనే రూపం సృష్టించబడింది. గోండీ కువిలో స్త్రీ వాచక పదాలలో -క్ బహువచన ప్రత్యయంగా ఉంది (గోం, అతీ 'అత్త', బ.వ. ఆతీ-క్). ఈ నామవాచకాలలో ఉన్న ప్రత్యయం పెంగోలో స్త్రీ లింగ బహువచనానికి ప్రత్యేక రూపాన్ని సృష్టించడానికి ఉపయోగించబడిందన్నమాట; సామ్యంవల్ల ఈ ప్రత్యయం సర్వనామాలకి వ్యాప్తి చెందింది. స్త్రీ లింగానికి ప్రత్యేక బహువచన రూపం మరి ఏ ద్రావిడ భాషలోనూ లేదని గమనించాలి.

పెంగోలో సర్వనామాలలో స్త్రీలింగానికీ అమనుష్య లింగానికీ ఏకవచన, బహువచనాలలో భేదం ఉంది.

| | | | |
|---|---|---|---|
| అదెల్/ఎదెల్ | 'ఆమె' | అవెగ్/ఎవెక్ | 'ఆ స్త్రీలు' |
| ఇదెల్ | 'ఈమె' | ఇవెక్ | 'ఈ స్త్రీలు' |
| అది/ఎది | 'ఆ జంతువు, వస్తువు' | అవజ్/ఎవజ్ | 'ఆ జంతువులు, వస్తువులు' |
| ఇది | 'ఈ జంతువు, వస్తువు' | ఇవజ్ | 'ఈ జంతువులు, వస్తువులు' |

కాని క్రియలలో స్త్రీలింగానికీ, అమనుష్య లింగానికీ ఏకవచనంలో భేదంలేదు. (అదెల్/అది హుడ్తత్ 'ఆమె, అది చూసింది'): బహువచనంలో భేదం ఉంది (అవెక్ హుడ్తిక్ 'ఆ స్త్రీలు చూశారు', అవజ్ హుడ్తిజ్ 'అవి చూశాయి'), స్త్రీవాచక బహువచన ప్రత్యయం -క్. అమనుష్య బహువచన

ప్రత్యయం - జ్. పెంగోలో అనుష్యలింగంనించి స్త్రీలింగం విడిపోవడం ఒక అర్వాచీన పరిణామం. ఇటువంటి మార్పు మరి ఏ మధ్య ద్రావిడభాషలోనూ లేదు.

మూల ద్రావిడంలో లింగభేదం : పైన ఇచ్చిన నాలుగు రకాల లింగ భేదాలలో ఏది మూల ద్రావిడభాషకి చెందినది అనే విషయంలో పండితులలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఈ విషయాన్ని చర్చించే ముందు తొాద, బ్రాహుయీలలో లింగభేగం లేకపోవడం అర్వాచీన పరిణామమే అని మనం గుర్తించాలి. బ్రాహుయీ భాషలో దాని పురాతనకాలంలో లింగభేదం ఉండేది అని నిరూపించడానికి ఆధారాలు ఉన్నాయి. ఆ భాషలో (ఓద్) 'వాడు, అది', ఓఫ్క్ 'వాళ్ళు, అవి'—ఈ సర్వనామాలలో ఓ ప్రాతిపదిక, ద్ అమహదేకవచన ప్రత్యయం, ఫ్ * వ్ (అమహద్బహు వచన ప్రత్యయం) నించి వచ్చినది; దీని చివర కకారం ఇంకొక బహువచన ప్రత్యయం (త. అవర్కళ్—ఈ రూపా లలో కూడా సర్వనామం మీద నామవాచక బహువచన ప్రత్యయం చేరింది). బ్రాహుయీలో ఈ సర్వనామాలతో ఆకాంక్ష కలిగిన ప్రథమ పురుష క్రియా రూపాల్లో బహువచన ప్రత్యయం -ర్ (ఉదా. ఓ(ద్) తిఖా 'వాడు / ఆమె / అది పెట్టేడు / పెట్టింది', ఓఫ్క్ తిఖార్ వాళ్ళు / అవి పెట్టేరు / పెట్టాయి). ఇది మూ. ద్రా. మహద్బహువచన ప్రత్యయమైన * -అర్ (త. అవర్, తె. వారులలో ఉన్నది.) నించి వచ్చినది. ఓఫ్క్ అనే సర్వనామం మొదట్లో అమ హత్తు కాగా దానితో ఆకాంక్ష గల పురుష ప్రత్యయం మొదట్లో మహత్తు అయి ఉండడంవల్ల పురాతన బ్రాహుయీకాలం (Pre - Brahui Period)లో లింగ భేదం ఉండేదనీ, ఈ లింగభేదం నశించేటప్పుడు సర్వనామాలలో అమహ ద్రూపాలు మిగలగా క్రియలలో మహద్రూపాలు నిలిచాయనీ మనం ఊహించ వచ్చు. పురాతన బ్రాహుయీ కాలంలో ఉన్న లింగభేదం సన్నిహిత భాషలైన కూడుఖ్ - మాల్తోలలో ఉన్న లింగభేదం వంటిదే కావచ్చు.

ఇక పైన ఇచ్చిన నాలుగు రకాల లింగభేదాలలో తెలుగు, కూడుఖ్ - మాల్తోలలో ఉన్న లింగభేదమే మూలద్రావిడ భాషలో ఉండేది అని చెప్పడానికి

చాలా ఆధారాలు ఉన్నాయి. 1. తులనాత్మక పద్ధతి ప్రకారం భౌగోళికంగా సన్నిహితంగా లేని రెండు ఉప కుటుంబాలలో తుల్యంగా ఉన్న అంశం వాటి మూలభాషకి చెందినదని నిర్ణయించవచ్చు. తెలుగు మధ్యద్రావిడోప కుటుంబానికి చెందినది; కూడుఖ్ - మాల్తోలు ఉత్తర ద్రావిడోప కుటుంబానికి చెందినవి (చూ. అయిదో అధ్యాయం). తెలుగు కూడుక్ - మాల్తోలు భౌగోళికంగా సన్నిహితంగా లేవు కాబట్టి వీటిలో తుల్యంగా ఉన్న లింగభేదం మూలద్రావిడ భాషకి చెందినది అయి ఉండాలి. 2. ఈ తెలుగు, కూడుఖ్ - మాల్తోలలో లింగభేదమే ప్రాచీనమైనదని అనుకొంటే మిగిలిన రెండు రకాల లింగభేదాలూ ఎలా దీని నించి పరిణమించాయో మనం సులభంగా ఊహించవచ్చు. దక్షిణ ద్రావిడ భాషలలో మహతీ ఏకవచనం కూడా ఉంది. దీనికి ప్రత్యయం *-అళ్ / *-అళ్ (త. అవళ్ వంతాళ్ 'ఆమె వచ్చింది') ఆళ్ అనే మాట 'స్త్రీ' అనే అర్థంలో ప్రత్యేక శబ్దంగా కూడా ఉంది; చూ. తె. ఇల్లాలు, త. ఇల్లాళ్. స్త్రీ లింగాన్ని ప్రత్యేకంగా సృష్టించుకొనేటప్పుడు మూల దక్షిణ ద్రావిడ భాషా వ్యవహర్తలు ఈ ప్రత్యేక శబ్దాన్ని స్త్రీ లింగ ప్రత్యయంగా ఉపయోగించడం మొదలుపెట్టి ఉంటారు. కాబట్టి ఈ భాషలలో స్త్రీ లింగం ఒక నూతన పరిణామమని ప్రొఫెసర్ జూల్ బ్లాక్ చెప్పేరు. ఇక తెలుగు, పెంగో, మండకాక మిగిలిన మధ్య ద్రావిడ భాషలలో ఏకవచన బహు వచనాలు రెండింటిలో కూడా మహదమహత్ భేదమే ఉంది. జూల్ బ్లాక్, ఆయనని అనుసరించి భద్రిరాజు కృష్ణమూర్తి, ఈ భేదమే మూలద్రావిడ భాషలో ఉండేదనీ, మిగిలిన భాషలలో తరవాత కాలంలో మగవారూ, ఆడవారూ కలిసి ఉన్న సముదాయాల్ని సూచించడం కోసం అమహత్తులో ఉన్న స్త్రీలింగం మహత్తులో చేర్చబడి మనుష్యవాచక బహువచనం ఏర్పడి ఉంటుందనీ అన్నారు. కాని మగవారూ, ఆడవారూ కలిసి ఉన్న సముదాయాన్ని సూచించడం ఏ భాషలోనయినా అవసరమే. మూడోరకం లింగ భేదం ఉన్న మధ్య ద్రావిడ భాషలలోనూ పెంగొలోనూ కూడా మగవారినీ ఆడవారినీ కలిపి సూచించవలసి వచ్చినప్పుడు మహద్బహువచనరూపాన్నే వాడతారు. కాబట్టి మూలద్రావిడ భాషలోనే మనుష్యవాచక బహువచనం ఉండేదని ఊహించడం యుక్తియుక్తమని తోస్తుంది. తెలుగుతప్ప

మిగిలిన మధ్యద్రావిడ భాషలలో ఈ మనుష్యవాచక బహువచనంలోనించి స్త్రీ లింగం తీసివేయబడి అమహద్బహువచనంతో కలిపివేయబడింది. (పెంగోలో మళ్ళీ స్త్రీ లింగం అమహత్తు నించి విడిపోయింది.) ఈ భాషలలో ఏకవచనంలో మహదమహత్ భేదం ఉండడంవల్ల అదే రకం భేదం బహువచనంలో కూడా ఉండాలి అనే దృక్పథమే దీనికి కారణమై ఉండవచ్చు. అంటే, ఏకవచనంలో ఉన్న లింగభేదం సామ్యంవల్ల బహువచనంలో ఉండే లింగభేదంలో మార్పు వచ్చిందన్నమాట. ఈ కారణాలవల్ల తెలుగు, కూడుఖ్ - మాల్తోలలోని లింగ భేదమే మూలద్రావిడ భాషలో లింగభేదమై ఉండాలి అని ప్రొఫెసర్ ఎం. బి. ఎమెనో *Kolami, a Dravidian Language,* 10.17 లో నిర్ణయించారు.

ఈ సందర్భంలో తెలుగుకీ, కూడుఖ్-మాల్తోలకీ గల చిన్న భేదం గుర్తించాలి. తెలుగులో అమహత్తులో వచనభేదం ఉండగా కూడుఖ్-మాల్తోలలో అమహత్తులో (ముఖ్యంగా క్రియలలో) వచనభేదం లేదు. ద్రావిడ భాషలన్నిటినీ పరిశీలిస్తే దక్షిణోత్తర భాషలన్నిటిలోనూ అమహత్ బహువచన ప్రత్యయం వైకల్పికమైనదేకాని నిత్యమైనది కాదు. తెలుగు మొదలైన మధ్యద్రావిడభాషల లోనే అది నిత్యమైనది (కింద చూడండి). కాబట్టి తెలుగులోనూ, మిగిలిన ద్రావిడ భాషలలోనూ అమహద్బహువచన క్రియారూపాలు కొత్తగా సృష్టించబడినవి అని మనం ఊహించవచ్చును.

పై చర్చవల్ల తదర్థక సర్వనామాలలో మూలద్రావిడ భాషలో లింగ భేదం తెలుగు కూడుఖ్-మాల్తోలలోనే మార్పు లేకుండా నిలిచి ఉందని తేలుతుంది.

ఇక ద్రావిడ భాషలలో, క్రియలలో ఎటువంటి లింగభేదమున్నదో చూద్దాం. ప్రాచీన తమిళంలోనూ, ప్రాచీనాంధ్రంలోనూ భవిష్యత్ కాలక్రియలలో మనుష్య బహువచనంలో తప్ప మిగిలినచోట్ల పురుషప్రత్యయమే లేదు. ఉదా :

ప్రా. త. అవన్ /అవళ్ /అతు /అవై చెయ్యుమ్

ప్రా. తె. వాఁడు /అది /అవి చేయును.

పై తమిళం, తెలుగు రూపాల్లో ధాతువు దాని తరవాత భవిష్యత్ కాలిక ప్రత్యయం (త. -ఉమ్, తె. -ఉను) మాత్రమే ఉన్నాయి. వాటి తరవాత ఉండ వలసిన పురుషప్రత్యయం లేదు. ప్రాచీనపు తెలుగులో భూతకాలరూపాలైన చేసెను, చెప్పెను మొదలైనచోట్ల కూడా ధాతువూ, భూతకాలిక ప్రత్యయమే (-ఎను)గాని పురుషప్రత్యయం లేదు. తెలుగు మధ్యద్రావిడభాష. తమిళం దక్షిణద్రావిడభాష. రెండు వేరు వేరు ఉప కుటుంబాలకి చెందిన ఈ భాషలలో ఉన్న ఈ సారూప్యం మూలద్రావిడభాషకు చెందినదే అనడంలో విప్రతిపత్తి ఏమీలేదు కాబట్టి మూలద్రావిడ భాషా క్రియలలో మనుష్యవాచక బహువచన పురుషప్రత్యయం తప్ప ప్రథమపురుషలో పురుషప్రత్యయాలు ఉండేవి కావు అని మనం నిస్సంశయంగా చెప్పవచ్చు.

మధ్యద్రావిడ భాష లన్నింటిలో (తెలుగుతోసహా) చుట్టాలైన ఆడవాళ్ళని సూచించే పదాలు కొన్నింటిలో *-ఆళ్ ప్రత్యయం ఉంది :

(i) తె. కోడలు, గోం. కోర్యాడ్; కొం. కొడ్య 'కోడలు, తమ్ముడి భార్య', పెం. కొడియ (గాడ్) 'తమ్ముడిభార్య', మం. కుడియ (గాఢ్) 'కోడలు, తమ్ముడి భార్య', కూయి. కుఢ, క్డుఅ 'భార్య', కువి. కుఢియ 'కోడలు', కుడ్వ 'తమ్ముడిభార్య', కో. కొరల్ 'తమ్ముడిభార్య', నా. కొరల్ 'కోడలు, పెళ్ళి కూతురు', ప. కొడ్డాల్ 'పెళ్ళికూతురు', గ(ఒ). కొడల్ 'కోడలు, తమ్ముడి భార్య' <మూ.మ.ద్రా. *కోళాళ్. (2149)

(ii) తె. చెల్లియలు, చెల్లెలు, గోం, సేలాఢ్ ప. చాలల్, గ (ఒ.) సేలల్, సా, (సా.) చెల్లాల్ <మూ.మ.ద్రా. *చేలాళ్. (2783).

(iii) గోం. పోరాఢ్ 'అత్తగారు', పెం. పోద 'అత్తగారు', మం, పూదఢ్ 'అత్తగారు' కూయి, పోర 'భార్య అక్క' కువి పోర 'అత్తగారు', కో. పొదల్ 'అత్తగారూ', నా. పొదళ్ 'అత్తగారు', నా (ఛాం.) పొద/పొద్ద 'అత్తగారు', ప. పొదల్ 'భార్యఅక్క', గ. (సా.) పోదల్. 'అత్తగారు' < మూ. మ. ద్రా *పోతాళ్. (4508).

(iv) తె. మఱఁదలు, గోం, మర్ండాఢ్, కూయి, ప్రిగలి, కో, మర్ందాల్ < మూ. మ. ద్రా. *మఱంతాళ్.

ఇటువంటి *-ఆళ్ ప్రత్యయం చేరిన పదాలు దక్షిణోత్తర ద్రావిడ భాషలలో లేవు. కాబట్టి ఇవి మూల మధ్య ద్రావిడభాషా కాలంలో సృష్టించబడ్డాయి అని చెప్పాలి. వీటిలో ధాతువులు మాత్రం మూలద్రావిడంలోవే; ఆ ధాతువులకి స్త్రీ ప్రత్యయం చేరడమే మధ్య ద్రావిడ భాషలలో నూతన పరిణామం. దక్షిణ ద్రావిడ భాషలలో సర్వనామాలలోనూ క్రియలలోనూ *-ఆళ్ ప్రత్యయం చేర్చడంవల్ల స్త్రీలింగం మిగిలిన లింగాల నించి ప్రత్యేకించబడినదని ఇంతక్రితమే చూశాము. కోలామీ - నాయకీ - పర్జీ గదబ ఉపకుటుంబంలో పైన చెప్పిన సంబంధి స్త్రీవాచక పదాలకి తోడు రెండు, మూడు, నాలుగు అనే సంఖ్యావాచకాలలో కూడా *-ఆళ్ ప్రత్యయం చేర్చడంవల్ల ప్రత్యేక స్త్రీవాచక శబ్దాలు సృష్టించబడ్డాయి (చూ. 3. 3. (ii).

పై చర్చవల్ల తేలిన సారాంశం : మూలద్రావిడ భాషలో స్త్రీలింగం ప్రత్యేకంగా లేకుండా అది ఏకవచనంలో అమహత్తులోనూ బహువచనంలో మహత్తులోనూ అంతర్హితమై ఉండేది. ఈ మూలద్రావిడ లింగభేదం ఇప్పుడు తెలుగు, కూడుఖ్ - మాల్తోలలో మాత్రమే నిలిచి ఉంది. కాని నాగరికత అభివృద్ధి చెందుతున్నకొద్దీ ప్రత్యేక స్త్రీలింగరూపాలు భాషలో ఉండాలి అనే అభిలాషవల్ల దక్షిణ భాషలలో సర్వనామ క్రియాపదాలలోనూ, మధ్యభాషలలో కొన్ని సంబంధి స్త్రీవాచక పదాలలోనూ, కోలామీ - పర్జీ ఉపకుటుంబంలో వీటికితోడు 2, 3, 4 సంఖ్యాపదాలలోనూ ప్రత్యేక స్త్రీలింగరూపాలు సృష్టించబడ్డాయి. ఈ భాష లన్నిటిలోనూ స్త్రీవాచక ప్రత్యయం *-ఆళ్ అవడం గమనించదగినది. పెంగొలో ఇతర మధ్య ద్రావిడ భాషలలోలా కాక స్త్రీలింగం అమహత్తునించి రెండు వచనాలలోనూ విడిపోవడం ఒక వినూత్న పరిణామం. పెంగొ సాక్ష్యం మొదట్లో స్త్రీలింగం ప్రత్యేకంగా ఉండేది కాదనే అంశాన్ని ధ్రువపరుస్తుంది. దక్షిణ ద్రావిడంలోని *అవళ్ కి పెంగొలో అదెల్‌కి వకార

దకారాలలో భేదం ఉండడవల్ల ఈ రూపాన్ని మూలద్రావిడ భాషకు పునర్నిర్మిం చడం సాధ్యం కాదని గమనించాలి.

(ii) బహువచన ప్రత్యయాలు :

తమిళం : మనుష్యవాచకాల (ఉయర్‌తిణై)లో బహువచన ప్రత్యయాలు -అర్ / -ఆర్ / -ఓర్, -ఇర్, -మార్ : పాణర్ 'పాటలు పాడేవారు', వలైయర్ 'చేపలవాళ్లు', తాయర్ 'తల్లులు' తంకైయర్ 'చెల్లెళ్ళు', పార్‌ప్పార్ 'బ్రాహ్మణులు', అటియోర్ సేవకులు', ఇళైయోర్ 'పడుచువాళ్ళు', కేళిర్ 'చుట్టాలు', పెంటిర్ 'స్త్రీలు' (ఏ, వ, పెణ్), మకళిర్ 'స్త్రీలు' ఐమార్ / ఐయన్‌మార్ 'అన్నలు', తోళిమార్ 'చెలికత్తెలు', తాయ్‌మార్ / తాయర్ 'తల్లులు', పావైమార్ 'స్త్రీలు' (ఈ ప్రత్యయాలకి పదాత్మక వ్యవస్థే (Morphological conditioning) కాని వర్ణాత్మక వ్యవస్థ (Phonological conditioning) లేదు. ఈ తరవాత కూడా వ్యవస్థ (conditioning) సూచించబడని ప్రత్యయాలకి పదాత్మక వ్యవస్థ మాత్రమే ఉందని గ్రహించాలి.)

తొల్కాప్పియం, చొల్లతికారం సూ. 169 లో అమనుష్య వాచకాలకి (అఃఱిణై) బహువచన ప్రత్యయం- కళ్ అనీ, అది వైభాషికమనీ చెప్పబడింది : కణ్ (కళ్), ఊర్ (కళ్) ఊళ్లు', నాయ్ (కళ్) 'కుక్కలు'. అదే గ్రంథంలో సూ. 171 లో కళ్ ప్రత్యయం చేర్చబడని అమానుష్య వాచకం ఏకవచనమో బహువచనమో దానికి సంబంధించిన క్రియవల్ల తెలుస్తుందని చెప్పబడింది :

ఆ వంతతు 'ఆవు వచ్చింది'

ఆ వంతన 'ఆవులు వచ్చాయి'

పైన రెండో వాక్యంలో బహువనం ఉద్దిష్టమని క్రియలో అమనుష్య బహువచన పురుష ప్రత్యయం ఉండడంవల్ల స్పష్టమవుతుంది. -కళ్ ప్రత్యయం సంఘ వాఙ్మయ గ్రంథాలలో చాలా అరుదుగా కనిపిస్తుంది. పుఱనానూఱు, అకనానూఱు, ఐంకుఱునూఱు అనే గ్రంథాలు ఒక్కొక్క దాంట్లో దీనికి రెండు

ప్రయోగాలే ఉన్నాయి. కుఱుంతొాకైలో ఇది అసలు ప్రయుక్త మవలేదు. యాంటుకళ్ 'సంవత్సరాలు' (పుఅనా. 357.4). అరణ్‌కళ్ 'కోటలు' (ప్రత్తు ప్పాట్టు 44.13). కాని సంఘవాఙ్మయ కాలానికి తరవాత సాహిత్యంలో ఇది ప్రచురంగా కనబడుతుంది. ఆ కాలపు సాహిత్యంలో ఇది మనుష్యవాచకాలకి కూడా వ్యాపించినట్లు ఈ కింద ఉదాహరణలవల్ల తెలుస్తుంది : నోన్‌పికళ్ 'ఋషులు', పెణ్‌కళ్ 'స్త్రీలు' (చిలప్పతికారంలో ప్రయోగాలు), అరసర్‌కళ్ 'రాజులు', ఐవర్‌కళ్ 'అయిదుగురు', కేళిర్‌కళ్ (కలిత్తొాకైలో ప్రయోగాలు), చివరి మూడు ఉదాహరణలలో కళ్ ప్రత్యయం మనుష్యవాచక బహువచన ప్రత్యయాల తరవాత చేర్చబడడం గమనించ దగినది. తిరుక్కుఱళ్ 919 లో పూరియర్‌కళ్ 'తక్కువ జాతి ప్రజలు', చిలప్పతికారంలో వానోర్‌కళ్ 'స్వర్గ లోక వాసులు' అనే ప్రయోగాలుకూడా ఇటువంటివే.

నేటి వ్యావహారిక భాషలోకూడా అమనుష్యవాచక బహువచన ప్రత్యయాన్ని వాడరు : పత్తు మాటు 'పది పశువులు'. కాని కొన్ని మాండలికాలలో -క(ళ్) / -వ(ళ్) విరళంగా ఉపయోగంలో ఉంది.

**మలయాళం :**

తమిళంలోలాగే మలయాళంలోకూడా మనుష్యవాచక బహువచక ప్రత్యయాలు -అర్, -మార్ : మాతర్ 'స్త్రీలు', తచ్చకమార్ / తచ్చర్ 'వడ్రంగులు', అణ్ణన్‌మార్ 'అన్నలు', అరసన్‌మార్ 'రాజులు'. అమనుష్య వాచకాలలోనూ, కొన్ని మనుష్యవాచకాలలోనూ -కళ్ ప్రత్యయం ఉంది : మరం / మరఙ్ఙళ్ 'చెట్లు', ఇల(కళ్) 'ఆకులు', కణ్ణు(కళ్) 'కళ్లు', స్త్రీకళ్ 'స్త్రీలు', కుట్టికళ్ 'పిల్లలు', తొాళిలాళి-కళ్ 'పనివాళ్లు'. అచేతన నామవాచకాలలో ఇది వైకల్పికం. బహుత్వాన్ని సూచించే సంఖ్య ఉన్నప్పుడు అచేతన నామవాచకానికి ఈ ప్రత్యయాన్ని చేర్చనక్కర లేదు : నాలు కల్లు (కళ్) 'నాలుగురాళ్లు' పత్తు వీటు (కళ్) పది 'ఇళ్లు'.

కోత :

కోతలో బహువచన ప్రత్యయం -గూళ్, ఇది అన్ని రకాల నామవాచకాలకీ వస్తుంది. అమనుష్య వాచకాలలో దీని ప్రయోగం చాలా అరుదు. ఆళ్ ణ్ గూళ్ 'భర్తలు', కోవ్‌గూళ్ 'కోతవారు', గండ్‌గూళ్ 'మగవారు', పెమొగూళ్ 'స్త్రీలు', తొన్‌గూళ్ 'తొదవారు', మెయ్‌ణ్‌గూళ్ 'కొడుకులు'.

తొద :

తొదలో అన్ని నామవాచకాలలోనూ ప్రథమ పురుష సర్వనామాలలోనూ బహువచన ప్రత్యయం - అమ్, అత్‌ామ్ 'వారు, అవి', ఇరామ్ 'గేదెలు', మొఖామ్ 'అబ్బాయిలు', కూఖామ్ 'అమ్మాయిలు' కొయామ్ 'చేతులు'.

కొడగు :

ఈ భాషలో బహువచన ప్రతయానికి -క(ళ్), -అ(ళ్) అనే రెండు రూపాలు ఉన్నాయి. ఈ భాషలో మనుష్యామనుష్య వాచకాలన్నిటికీ ఇదే ప్రత్యయం. (ళకారం పదాంతంలో లోపిస్తుంది, ప్రత్యయాల ముందు ఉంటుంది). -క(ళ్) అనునాసికాంత నామవాచకాలలోనూ, -అ(ళ్) మిగిలిన నామవాచకాలలోనూ వస్తుంది : పొంగ(ళ్) అమ్మాయి' (ఏ. వ. పొణ్ణు), అంగ(ళ్) 'పురుషులు', (ఏ. వ. అణు), కోదెంగ (ళ్) 'కోతులు', ఆళ(ళ్) 'పనిమనుషులు' (ఏ. వ. ఆళు), కళ్ల(ళ్) / కళ్లంగ 'దొంగలు' (ఏ.వ. కళ్లె), అజ్జియ(ళ్) 'నాయనమ్మలు', పూణెయ(ళ్) 'పిల్లలు' నాయియ(ళ్) 'కుక్కలు', పయ్యువ(ళ్)/పయ్య(ళ్) 'ఆవులు' (ఏ.వ. పయ్యు) (-అ(ళ్) చేర్చినప్పుడు తాలవ్యాచ్చు తరవాత యకారమూ, ఉకారం తరవాత వకారమూ (ఇది వైకల్పికం) ఆగమాలుగా వస్తాయి).

అచేతన నామవాచకాలలో బహువచన ప్రత్యయం ఉండదు: దండు మనె 'రెండు ఇళ్లు', మూందు మర 'మూడుచెట్లు.'

కన్నడం :

ఈ భాషలో మనుష్యవాచక బహువచన ప్రత్యయానికి -అర్, -ఇర్, -దిర్, -విర్ అనే రూపాలు ఉన్నాయి: కళ్లర్ 'దొంగలు', అరసర్ 'రాజులు', అణ్ణర్ / అణ్ణందిర్ 'అన్నలు', పెండిర్ 'భార్యలు' (ఏ. వ. పెండతి), అళియందిర్ 'అల్లుళ్లు', మగందిర్ 'కొడుకులు', మగళ్‌దిర్ 'కూతుళ్లు', తమ్మందిర్ 'తమ్ముళ్లు', తాళ్తిర్ 'చెలికత్తెలు', తాయ్విర్ 'తల్లులు', అత్తెయర్/అత్తెఁర్ 'అత్తలు', హుడుగియర్ 'అమ్మాయిలు', హుడుగర్ 'అబ్బాయిలు.' (అధునిక కన్నడంలో ఈ పదాల చివర ఉచ్చారణార్థకమైన ఉకారం ఉంటుంది.)

పంప భారతంలో -అర్ ప్రత్యయం తరవాత -కళ్ /గళ్ చేరిన రూపాలు కూడా ఉన్నాయి: నాయకర్‌కళ్ 'నాయకులు', ఇవర్‌గళ్ 'వీరు'.

అమనుష్యవాచకాలలో బహువచనప్రత్యయం -కళ్/-గళు: (ప్రా.) మరంగళ్ / (ఆ,) మరగళు 'చెట్లు', పూగళ్ / హూవుగళు 'పువ్వులు', కయ్‌గళ్/కయ్‌గళు 'చేతులు', కణ్‌గళ్/కణ్ణుగళు 'కన్నులు', పళ్ంగళ్/హాండగళు 'గోతులు'.

ఈ ప్రత్యయం అచేతన నామాలలో వైకల్పికమైనది; ఎరడు మనె(గళు) 'రెండు ఇళ్ళు'.

కొన్ని మనుష్య వాచక పదాలలో కూడా -గళ్ ప్రయోగం పంప భారత కాలంలోనే కనపడుతోంది; మునిగళ్ 'మునులు', కవిగళ్ 'కవులు', ఆళ్‌గళ్ 'మనుష్యులు'.

తుళు :

కొన్ని మనుష్య వాచకాలలోనూ, జాతి వాచకాలలోనూ బహువచన ప్రత్యయం -ఉ (దీనిలో ఉకారం అనోష్ఠ్యం (Unround i̤) ). అజ్జెరు

'తాతలు', మర్లెరు 'పిచ్చివాళ్లు', గట్టిగెరు 'తెలివైనవాళ్ళు' స్నెటు 'క్షత్రియులు', (ఏ.వ. సెట్టి), మడ్యెవెరు 'చాకలివాళ్ళు', మనుష్యెరు 'మనుష్యులు'.

కొన్ని సంబంధి వాచక పదాలలో బహువచన ప్రత్యయం -ఆకుళు (గౌడ మాండలికం - అగుళు); అణ్ణనాకుళు / అణ్ణనగుళు 'అన్నలు' (ఏ. వ. అణ్ణె), అక్కెనాకుళు / అక్కనగుళు 'అక్కలు' (ఏ.వ. అక్కె / అక్క,) -కుళు: బావడికుళు 'బావలు' (ఏ.వ. బావ), పళియడికుళు 'చెల్లెళ్ళు' (ఏ.వ. పళి), మెగ్గినాకుళు / మెగ్గినగుళు 'చెల్లెళ్లు'.

అమనుష్యవాచకాలలో బహువచన ప్రత్యయానికి -కుళు, -ళు అనే రెండు రూపాలు ఉన్నాయి. -కుళు ఏకాచ్కనామవాచకాలకీ, రెండో అక్షరంలో సంయుక్తహల్లులేని ద్వ్యచ్కనామవాచకాలకీ, బ్రాహ్మణమాండలికంలో మొదట్లో మకారం చివర ఉన్న నామవాచకాలకీ వస్తుంది. -ళు మిగిలిన నామవాచకాలలో వస్తుంది. గౌడ మాండలికంలో అచేతన నామవాచకాలకి బహువచన ప్రత్యయం చేరదు.

-కుళు : కయ్‌కుళు 'చేతులు', కెయ్‌కుళు 'వరిపంటలు', కెబికుళు 'చెవులు', పిలికుళు 'పులులు', ఇరెకెళు 'ఆకులు', మరికుళు 'పాములు, జంతువుల పిల్లలు', ఎలికుళు 'ఎలుకలు', దీపం కుళు/దీపొళు 'దీపాలు', పూకుళు 'పువ్వులు', మంగెకుళు 'కోతులు'.

-ళు : పెత్రాళు 'ఆవులు' (ఏ, వ. పెత్త), బోరిళు 'ఎద్దు', కారుళు 'కాళ్లు' (ఏ.వ. కారు), కణ్ణుళు 'కళ్లు' (ఏ.వ. కణ్ణు), పిరెలుళు 'వేళ్లు' (ఏ. వ. పిరెలు), నాయిళు 'కుక్కలు', ఆనెళు 'ఏనుగులు', కుదురెళు 'గుర్రాలు'.

తెలుగు :

తెలుగులో మనుష్యవాచకాలకీ, అమనుష్యవాచకాలకీ బహువచన ప్రత్యయం -లు : అన్నలు, కొడుకులు, రాజులు. ప్రాజ్నన్నయయుగ శాసనా

లలో దీనిలో మూర్ధన్యళకారం ఉండేదని సంవత్సరంబుళ్, చోళరాజుళ్, పెర్దళ్ మొదలైన రూపాల వల్ల తెలుస్తుంది.

ప్రాచీన సాహిత్యంలో కొన్ని మనుష్య వాచకాలలో రు/లు అనే బహు వచన ప్రత్యయం ఉంది : పగతురు/పగలు; నెయ్యురు, విలుకాలు, అల్లురు (ఆ. అల్లుళ్లు), చెల్లెండ్రు (ఆ. చెల్లెళ్లు), కోడండ్రు (ఆ. కోడళ్లు), పైన కొన్ని మాటలలో ప్రాచీన భాషలో రు స్థానాన్ని ఆధునిక భాషలో లు ఆక్రమించడం గమనించదగినది. (అల్లుళ్లు, ఇళ్లు, ఊళ్లు, గుళ్లు, పళ్లు మొదలైన రూపాలలో సంధివల్ల లు ళుగా మారింది.)

సర్వనామాలలోనూ సంఖ్యావాచకాలలోనూ మహద్వాచక బహువచన ప్రత్యయమైన రు కొన్నిచోట్ల ప్రాచీనభాషలో లు) ప్రాచీనభాషలోనూ ఆధునిక భాషలోనూ ఉంది : మీరు, వారు, వీరు, అందలు, పెక్కురు, పలువురు, ఇద్దరు, ముగ్గురు మొ.

**గోండి :**

పురుషవాచకాలలో బహువచన ప్రత్యయరూపాలు -ర్, -ఊర్, ఈర్ (బెటూల్ మాండలికంలో -ఓడ్, -డ్), -ర్ ఈకారాంతాలలోనూ, ఊర్ ఓకారాంతాలలోనూ, -ఈర్ ఏ లేక -అల్‌తో అంతమయ్యేవాటిలోనూ వస్తుంది : కాండీర్ 'అబ్బాయిలు', కల్లీర్ 'దొంగలు' (ఏ. వ. కల్లే), అక్కూర్ 'తల్లి యొక్క తండ్రులు' (ఏ. వ. అక్కో), మామాలీర్ 'మామయ్యలు', (బె.) మామురియాలోడ్ 'మామలు'.

పురుషేతర నామవాచకాలలో బహువచనానికి -క్, -ఙ్ (-ంగ్) అనే రెండు రూపాలు ఉన్నాయి. -క్ కొన్ని అజంతనామ వాచకాలలో వస్తుంది (వీటిలో టాలా పదాలు సంబంధి స్త్రీ వాచకాలు); ఇది హలంత నామాలలో నియతంగా వస్తుంది: మరాక్ 'చెట్లు', ఆజీక్ 'తండ్రి తల్లులు' ఆలీక్ 'అత్తలు' కోర్యాక్ / (బె.) కోరియాహ్‌క్ 'కోడళ్లు' (ఏ.వ. కోర్యాడ్), సేలాక్ /(బె)

సేలాహ్క్ 'చెల్లెళ్లు' (ఏ. వ. సేలాఢ్), కడ్క్/(బె.) కన్క్ 'కన్నులు' సాప్క్ 'ముళ్లు', నహ్క్ / (బె. నాహ్క్) 'ఊళ్లు' (ఏ. వ. నార్), -ఙ్-అజంతాలైన అమనుష్య నామాలలో వస్తుంది: కాయాఙ్ 'కాయలు' కోందాఙ్ 'ఎడ్లు', కుహీఙ్ 'నూతులు' ఆకీఙ్ 'ఆకులు', పద్దీఙ్ 'పందులు' పిట్టేఙ్ 'పిట్టలు' తమ్మూ్మక్ 'తమ్ముళ్లు' (ఏ. వ. తమ్మూ్మర్), మర్క్ 'కొడుకులు' (ఏ.వ.మరీ) లలో ఈ ప్రత్యయం పురుషవాచకాలకి చేరుతుంది.

**కొండ :**

పురుషవాచకాలలో బహువచన ప్రత్యయం -ర్ : అనసిర్ 'అన్నలు', బాటొర్ 'బావలు', టోండర్ 'స్నేహితులు', కొన్ని పురుషవాచకాలలో -కు, -జ్ ప్రత్యయాలు కూడా ఉన్నాయి: రాస్కు/రాజుజ్ 'రాజులు', దొంజర్జు 'దొంగలు', దేవుణ్కు 'దేవుళ్లు'.

పురుషేతర నామవాచకాలలో బహువచన ప్రత్యయం రూపాలు -కు (~క్), -స్కు, -జు (~జ్);-కు, -జులు సాధారణంగా హలంతాల తరవాతా, -క్, -జ్‌లు అజంతాల తరవాతా వస్తాయి, ఈ కింద సూత్రాలకి కొన్ని అపవాదాలున్నా చాలా పదాలకి అవి వర్తిస్తాయి. (1) ఇ, ఎ లతో అంతమయ్యే నామాలలోనూ, అనునాసిక సహితనాదస్పర్శం కాని సంయుక్తాక్షరం తరవాత వచ్చే హ్రస్వాచ్చుతో అంతమయ్యే నామాలలోనూ -జ్ వస్తుంది: (2) ఇ, అలతో అంతమవుతూ స్త్రీలని పిల్లలనీ సూచించే పదాలలో -క్ వస్తుంది: (3) మకారాంత నామాలలోనూ, పు, తు, టు, రు, లు, డు, సులు చివరగల ద్వ్యచ్క నామాలలోనూ, క తప్ప మిగిలిన నాదస్పర్శాలు చివరగల ద్వ్యచ్క నామాలలోనూ -కు వస్తుంది.

-జ్, -జు : (ఇది అ, ఇ, ఎ, ఒ, ఉ అనే అచ్చులతో అంతమయ్యే వాటిలో వస్తుంది) కమిజ్ 'చెవుల పోగులు', ఉత్రిజ్ 'ఉట్లు', గుడెజ్ 'పొలాలు' కూలిజ్ 'బియ్యం', జేతొజ్, 'పీతలు', అత్కుజ్ 'అతుకులు', కుపెజ్ 'కుప్పలు' (ఏ. వ. కుప), తంబెఙిజ్ / తంబెఙ్జు 'తమ్ముళ్లు', మఙ్కెజ్

'మామిడిపళ్లు' (ఏ. వ. మఙ్క), సుకెజ్ 'చుక్కలు' (ఏ. వ. సుక), -క్ ; అమెక్ 'మ్మలు' (ఏ. వ. అమ), తలెక్ 'తలలు' (ఏ. వ. తల), అయ్‌లిక్ 'అమ్మాయిలు'. గాలుక్ 'కూతుళ్లు' సాసుక్ 'అక్కలు', కొడ్వాక్ 'ఆడపిల్లలు', బోదెక్ 'పెళ్ళికూతుళ్లు' (ఏ, వ, బోదెల్), -స్కు ఇది కొడ్వానలి 'పురుడు పోసుకున్న స్త్రీ' అనే పదంలో ఉంది - దీని బ. వ. కొడ్వానల్‌స్కు, -కు: నాఔస్కు 'పులులు', వెయ్‌కు 'నోళ్లు' (ఏ. వ. వెయు), ఇలుకు 'ఇళ్లు' (ఏ.వ. ఇలు), అప్కు 'బాణాలు' (ఏ. వ. అంబు), పట్కు 'పళ్లు' (ఏ. వ. పండు), ఒల్‌స్కు 'ఎలుగుబంట్లు' (ఏ. వ. ఒల్లు), కొఙ్కు 'కోళ్లు' (ఏ. వ. కోఖు 'కోడి'), కికు 'చేతులు' (ఏ. వ. కియు), పిఢ్‌కు 'పురుగులు' (ఏ.వ. పిఢ్‌యు), ఢాకు 'ఎడ్లు' (ఏ. వ. ఢాను). మరక్ 'చెట్లు' (ఏ. వ. మరన్), మొరొలుకు 'వేళ్లు', పూంకు 'పువ్వులు'.

పెంగో :

పురుషవాచక బహువచన ప్రత్యయం -ర్: టొండర్ 'సోదరులు' (ఏ. వ. టొండెన్), ఆఢియర్ 'దున్నేవాళ్లు' బుఢ్‌హిర్ 'ముసలివాళ్లు' మజిర్ 'కొడుకులు', మామర్ 'మామలు', కదెర్ 'అబ్బాయిలు', తద్ధిత రూపాలలో ఇది నియతంగా ప్రయుక్తమవుతుంది: ఇంజకర్ 'ఇంటిలో మగవారు' నాటకర్ 'ఊళ్ళో మగవాళ్లు', చాలా పురుషవాచక నామాలలో -ర్ బదులు ఇతర బహువచన ప్రత్యయాలు వస్తాయి. -ఎన్ ప్రత్యయంతో అంతమయ్యే పురుష నామాలలో బహువచన ప్రత్యయం -అజ్ (దీని ముందు -ఎన్ లోపిస్తుంది): కుమ్రజ్ 'కుమ్మరివాళ్లు' (ఏ.వ. కుమ్రెన్), కెయ్‌నజ్ 'పనివాళ్లు' (ఏ. వ. కెయ్‌నెన్), మ్డాఖజ్ / మ్డాఖర్ 'దొంగలు' (ఏ, వ, మ్డాఖెన్). కొన్ని పురుష నామాలలో బహువచన ప్రత్యయం -కు: కొంద్కు 'కోందుజాతివారు' (ఏ. వ. కొందెన్), పొత్కు 'మామలు' (ఏ.వ. పొత్లెన్), పురుష నామాలలో అరుదుగా -జ్ కూడా బహువచన ప్రత్యయంగా ఉంటుంది: గురుజ్ 'గురువులు', కుమరిజ్ 'అబ్బాయిలు'.

స్త్రీ వాచకాలలో బహువచన ప్రత్యయం -క్; హలంతాల తరవాతా తద్ధిత రూపాల తరవాతా దీని రూపాంతరమైన -ఇక్ వస్తుంది: అయక్ 'అమ్మలు', కొాయిక్ 'అమ్మాయిలు', కొాగ్లక్ 'ఆడవాళ్లు', తడిక్ 'తల్లులు', డొాక్రిక్/వాణిక్ 'భార్యలు', జీపొాక్ యువతులు' (ఏ.వ. జీపొాలి), తాడ్ంరెక్ 'చెల్లెళ్లు' (ఏ.వ. తాడ్ంరెల్), రెల్), హొతనిక్ 'వృద్ధ స్త్రీలు' (ఏ. వ. హతన్), నాటికిక్ 'ఊళ్ళో స్త్రీలు'.

అమనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయం రూపాలు - కు, - జ్ (గ ఇజ్). - కు హలంతాలైన ఏకాచ్క నామాలలో వస్తుంది: ఇల్కు 'ఇళ్ళు', కాల్కు 'కాళ్ళు', కెయ్కు 'చేతులు', తోర్కు 'పేర్లు', పఢ్కు 'పళ్ళు', పుయ్కు 'పువ్వులు', కణ్కు 'కళ్ళు' (ఏ. వ. కణ్గ).

-జ్ అజంత నామాలలో వస్తుంది : హిమ్మజ్ 'పిల్లలు', ఓడజ్ 'మేకలు', కోడిజ్ 'ఆవులు', ఆకిజ్ 'అకులు', బడ్గెజ్ 'కర్రలు', - ఇజ్ హలంతాలైన ద్వ్యచ్కనామాలలో వస్తుంది : తెములిజ్ 'వెంట్రుకలు', నెకుడిజ్ 'కుక్కలు', కిటులిజ్ 'చెవులు', వతుహిజ్ 'ఉంగరాలు' . వ. వతుస్).

మంద :

పురుషవాచక బహువచన ప్రత్యయం - ర్ : కథ్‌దెర్ 'అబ్బాయిలు', రికర్ 'ఇద్దరు పురుషులు', హేజునర్ 'భార్య 'తమ్ముళ్ళు', నామ్‌జిర్కె 'నా కొడుకులు'లో రెండు బహువచన ప్రత్యయాలు ఉన్నాయి.

కొన్ని స్త్రీవాచకాలలో బహువచన ప్రత్యయం -చ్కె/ -ప్కె : అచ్కె స్త్రీలు, భార్యలు' (ఏ.వ.అథ్), నామ్‌గప్కె 'నా కూతుళ్లు' (ఏ.వ.నామ్‌గాథ్).

అమనుష్యవాచకాలలో బహువచన ప్రత్యయానికి - కె, - జ్ అనే రెండు రూపాలు ఉన్నాయి. - కె సాధారణంగా ఏకాచ్క నామాలతో వస్తుంది; కన్కె 'కళ్ళు', పల్కె 'పళ్ళు (teeth), గూర్కె 'గోళ్ళు' ప్దేకె 'ఎముకలు' (ఏ. వ. ప్దేన్), అప్కె 'బాణాలు' (ఏ. వ. అంబ్).

జ్ సాధారణంగా అనేకాచ్క నామాలతో వస్తుంది : వెహ్పెజ్ వేళ్ళు (fingers) రింగజ్ 'బొగ్గులు', హూకెరిజ్ 'చుక్కలు', హేపుకిజ్ 'చీపుళ్ళు'.

**కూయి :**

పురుషవాచక బహువచన ప్రత్యయం -రు : ఆబరు 'తండ్రులు' దాదరు 'అన్నలు', ఆపోరు 'కొడుకులు', అకెరు 'తాతలు', తంజెరు 'తండ్రులు' (ఏ. వ తంజి). కొన్ని పురుషవాచకాలలో -క / ంగ బహువచన ప్రత్యయంగా ఉంది : అంబెసక/తంబెసక 'తమ్ముళ్ళు', అకెంజంగ 'తాతలు', తొరెంజక/తొరెంజంగ 'స్నేహితులు'.

స్త్రీవాచకాలలో బహువచన ప్రత్యయం -స్క (తరచుగా ఇది -సకగా ఉచ్చరిత మవుతుంది) : అజస్క 'తల్లులు', ఆసస్క 'ఆడవాళ్ళు', అంగిస్క 'చెల్లెళ్లు', బాయిస్క 'అక్కలు', మ్రవుస్క 'కూతుళ్ళు'.

అమనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయం రూపాలు -క ~(-గ), -ంగ, -కఉకారం, ఎకారం చివరనున్న నామాలలో వస్తుంది (దీనిముందు ఉకారం లోపిస్తుంది). దీని రూపాంతరమైన గ ను లేక ఋ చివరనున్న నామాలలో వస్తుంది; కోర్క 'గెదెలు' (ఏ. వ. కోరు), సీర్క 'వేళ్ళు (roots) (ఏ. వ. సీరు), స్రాస్క 'పాములు' (ఏ. వ. స్రాసు), త్లాక 'తలలు' (ఏ. వ. త్లవు), కక /(కుట్టియా) కస్క 'చేతులు' (ఏ. వ. కజు), మ్రహ్క 'చెట్లు' (ఏ. వ. మ్రహ్ను), క్రీక 'చెవులు' (ఏ. వ. కిరు), నాస్క 'ఊళ్ళు' (ఏ. వ. నాజు), కాట్క 'కాళ్ళు' (ఏ వ. కాడు), వస్కక /(కుట్టియా) వచక 'వేళ్ళు' (fingers) (ఏ. వ. వంజు), కన్గ/పుల్బానీ కన్క / (కుట్టియా) కడ్క 'కళ్ళు' (ఏ. వ. కను). కేలెక 'కొడవళ్ళు', టూణ్గ 'కొయ్య (దూలం), (. ఏవ. టూణ్). -ంగ మిగిలిన అచ్చులతో అంతమయ్యే నామాల తరవాత వస్తుంది : మొడొంగ 'మొగ్గలు', కాంగ "కాయలు' (ఏ. వ. కాఉ), పూంగ 'పువ్వులు' (ఏ. వ. పూజు), ఓడంగ 'మేకలు' కోడింగ 'ఆవులు', ఒలింగ 'ఎలుగుబంట్లు'.

అపవాదాలు : ఉదా : మీడక 'పిల్లలు', టద్రక 'కోడిపుంజులు', ఒద్రిక 'ఎలకలు', తాడిక 'తాడిచెట్లు', ముంగెలక 'ముక్కులు' (ఏ. వ. ముంగెలి), కతాక 'పారలు' సొద్రాక 'చీమలు'.

తువి :

పురుషవాచక బహువచన ప్రత్యయం -రి : కొకరి 'అబ్బాయి' (ఏ. వ. కొకని). మైహజ 'పురుషులు' లో -జ ఉంది.

స్త్రీవాచకాలలో బహువచన ప్రత్యయం స్కు / -నిక : ఆయస్కు / ఐయనిక 'ఆడవాళ్లు'.

అమనుష్య వాచకాలలో బహువచన ప్రత్యయరూపాలు -క్, -జ (-ంగ), -క సాధారణంగా హలంతాల తరవాత వస్తుంది: పల్కు 'పళ్లు' (teeth), కణ్కు 'కళ్లు', హీర్కు 'వేళ్లు' (roots), కెల్కు 'ఈకలు', గట్కు 'గట్లు', మయ్కు 'నువ్వు గింజలు', క్రిక 'చెవులు' (ఏ. వ. కిరు). -జ (ంగ) అజంతాల తరవాత వస్తుంది: బుగ్గజ 'బుగ్గలు' సెప్పుజ 'చెప్పులు', పూంగ 'పువ్వులు', కఢ్వెజ 'కడియాలు' మొకొజ 'మొక్కలు'.

కోలామీ :

పురుషవాచకాలలో బహువచనప్రత్యయం రూపాలు ర్, ఊర్, -ఏర్; -ర్ కోలవర్ 'కోలాములు' లోనూ, -ఊర్ మాసూర్ 'మనుష్యులు' లోనూ -ఏర్ క తో అంతమయ్యే 4 3 నామాలలోనూ వస్తుంది: మామకేర్ 'మామలు', దాదాకేర్ 'అన్నలు'.

పురుషేతర వాచకాలలో బహువచన ప్రత్యయాలు -ఏవ్, ల్ (ఉల్, -సిల్- -కుల్).

కొన్ని స్త్రీవాచక జంతువాచకామనుష్యవాచకాలలో బహువచనప్రత్యయం -ఏవ్ : అలియకేవ్ 'దున్నపోతులు' ఏనకేవ్ 'నల్లదుప్పులు', అత్పకేవ్

'అత్తలు' (ఏ. వ. అప్ప), అమ్మనేవ్ 'అమ్మలు' (ఏ. వ. అమ్మ), వన్ననేవ్ 'వదినలు' (ఏ. వ. వన్న).

-వ్ చాలా అజంతాలైన నామాలలోనూ దీని ముందు ట్, డ్ ండ్, న్ లతో అంతమయ్యేరూపాలుగల కొన్ని నామాలోనూ వస్తుంది: కయేల్ 'చేపలు', కలాల్ 'కలాలు', పాటాల్ 'పాటలు', కీల్ 'చేతులు', ఎడ్ల్ 'ఎడ్లు', కండ్ల్ 'కళ్లు', (ఏ. వ. కన్), పేడ్ల్ 'పేర్లు' (ఏ. వ. పేర్). ఇది -అల్ ప్రత్యయంతో అంతమయ్యే 11 నామాలలో కూడా వస్తుంది (-అల్ దీనిముందు -అసి- గా మాతురుంది; వీటిలో కొన్ని సంబంధిస్త్రీవాచకాలు) : కొమ్మసీల్ 'కూతుళ్లు' (ఏ. వ. కొమ్మాల్), కొరసీల్ 'తమ్ముళ్ల భార్యలు' (ఏ. వ. కొరాల్), మర్ందసీల్ 'మరదళ్లు' (ఏ. వ. మర్ందాల్), తెర్వసీల్ 'కత్తులు' (ఏ. వ. తెర్వాల్).

దీని రూపాంతరమైన -ఊల్ పైన ఇచ్చిన హల్లులూ, సంయుక్త హల్లులూ కాక మిగిలినవాటితో అంతమయ్యే నామాల తరవాత వస్తుంది: కేతూల్ 'చేటలు', కెవూల్ 'చెవులు', మాకూల్ 'చెట్లు', పామూల్ 'పాములు', పొయూల్ 'పొయ్యిలు', కుడ్గూల్ 'తొడలు' (ఏ. వ. కుదుగ్).

-సీల్ ట్, డ్, న్, మ్, య్, ర్, ల్, లతో అంతమయ్యే కొన్నిటి తరవాత వస్తుంది: అయ్‌సీల్/అయ్‌కసీల్ 'అమ్మలు' (ఏ. వ. అయ్), దోర్‌సీల్ 'గొడ్లు', నాట్‌సీల్ 'కొయ్యముక్కలు', కెండిల్‌సీల్ 'దీపాలు'; మరన్‌సీల్ 'మరదులు'.

ఆ, ఊ. ఈ లతో అంతమయ్యే కొన్ని నామాలతోనూ, ల్‌తో అంతమయ్యే మూడు ఏకాచ్కనామాలతోనూ న్ ర్ లలో అంతమయ్యే ఒక్కొక్క నామదితోనూ -కూల్ వస్తుంది. -అల్ ప్రత్యయంతోగాని -తాద్ ప్రత్యయంతో గాని అంతమయ్యే చాలా స్త్రీవాచక పదాలతో కూడా ఇది వస్తుంది (దీనిముందు -అల్ -అసి-గానూ -తాద్ -తసి-గానూ మారతాయి) : బాలకూల్ 'పిల్లలు',

ఎల్లకూల్ 'ఇళ్లు', పల్కూల్ 'పళ్లు' (teeth), తల్కూల్ 'తలలు', వల్కూల్ 'బియ్యం గింజలు', పేన్కూల్ 'పేలు', సీర్కూల్ 'ఈళ్లు', బుడ్డిరసికూల్ 'బుట్టలు అల్లే జాతి స్త్రీలు' (ఏ. వ. బుడ్డిరాల్), దీవర్తసికూల్ 'చేపలవాళ్ళ స్త్రీలు' (ఏ.వ. దీవర్తాద్).

**నాయకి (ఛాందా) :**

పురుషవాచకాలలో బహువచన ప్రత్యయం రూపాలు -ర్, -ఎర్ ; కయ్మర్ "భర్తలు' (ఏ.వ. కయ్మన్), తోలెర్ 'సోదరులు' (ఏ.వ. తోలెన్), పోరకేర్ 'కొడుకులు', పోద్ల్ 'మామలు' (ఏ.వ. పోద్న్)లో -ల్ ప్రత్యయం ఉంది.

పురుషేతర వాచకాలలో బహువచన ప్రత్యయాలు -ల్, -కు (-గు), -ల్ సాధారణంగా ఎ, న్, డ్, ర్ లతో అంతమయ్యేవాటితో వస్తుంది: కట్టెల్ 'కట్టెలు', కొర్సెల్ 'బొగ్గులు', మద్దెల్ 'మామిడిపళ్లు', కన్ల్ 'కళ్లు', గుడ్ల్ 'గుడ్లు', పేర్ల్ 'పేర్లు'.

సాధారణంగా -కు హలంత నామాలతోనూ -గు అజంత నామాలతోనూ వస్తుంది : కేత్కు 'చేటలు', ఉవ్విగు 'నూతులు', తల్కు 'తలలు', గుడ్డగు 'కంటిగుడ్లు', పల్కు 'పళ్లు' (teeth), కెరిగు 'చెప్పులు', పామ్కు 'పాములు', వల్కు 'బియ్యం గింజలు', ఎల్లిగు 'ఎలుకలు'.

**పర్జి :**

కొన్ని పురుషవాచకాలలో బహువచన ప్రత్యయం - ఎర్ : చేపలెర్ 'అబ్బాయిలు', ముత్తకెర్ 'ముసలివాళ్లు (పురుషులు)', తెండెర్ 'తండ్రులు', అయిలెర్ 'మేనమామ కొడుకులు', మరి కొన్ని పురుషవాచకాలలో -కుల్ కూడా ఉంది: కోచ్కుల్ 'రాజులు', చల్ఘోద్కుల్ 'అల్లుళ్లు'.

సంబంధి స్త్రీ వాచకాలలో -ఒల్ ప్రత్యయం వస్తుంది: ఇయొవ్ 'తల్లులు' (ఏ. వ. ఇయ), తల్లొవ్ 'తల్లులు' (ఏ. వ. తల్), తందిలొవ్/అండిలోవ్ 'వదినలు'. బయ్యొవ్/(దక్షిణమాం), బయెవ్ 'అక్కలు'.

పురుషేతరవాచకాలలో బహువచన ప్రత్యయాలు -ర్ (-ఉల్), -కుల్, -చిల్, -తిల్.

-ర్ అజంత నామాలతో వస్తుంది (దీనిముందు అకారం ఎకారంగా మారుతుంది). దీని రూపాంతరమైన -ఉల్ సాధారణంగా దీర్ఘాచ్చుగల ఏకాచ్కనామాలతోనూ, ద్వ్యచ్కనామాలతోనూ, సంయుక్త హల్లుతో అంతమయ్యే నామాలతోనూ వస్తుంది: ఇలిల్ 'ఎలుగుబంట్లు', వెర్చిల్ 'బియ్యం గింజలు', మడిల్ గొడ్డళ్లు', కుదుల్ 'తొడలు', కొవ్వెల్ 'పండు కోతులు' (ఏ. వ. కొవ్వ), చాకెల్ 'ముళ్లు' (ఏ,వ. చాక), జువెల్ 'నూతులు' (ఏ.వ. జువ), కనుల్'కళ్లు', కెయుల్ 'చేతులు', బాముల్ 'పాములు', మీనుల్ 'చేపలు', కేలుల్ 'కాళ్లు', చెర్పుల్ 'చెప్పులు' (ఏ.వ. చెరుప్), మెర్దుల్ 'మందులు' (ఏ. వ. మెరుద్) దీని ఇంకొక రూపాంతరమైన -ఇల్ కొన్ని పదాలలో మాత్రమే ఉంటుంది. ఇది ముఖ్యంగా తాలవ్య హల్లుతో అంతమయ్యే నామాలలో వస్తుంది: పడ్చిల్ 'అబ్బాయిలు' (ఏ. వ. పడిచ్), నెల్ఞిల్ 'నెలలు' (ఏ.వ. నెలిఞ్), పుడ్తిల్ 'పరుగులు' (ఏ. వ. పుడుత్).

-కుల్ ప్రత్యయం హలంతాలైన ఏకాచ్కనామాలతో వస్తుంది: కెల్కుల్ 'రాళ్లు', పెల్కుల్ 'పళ్లు', (teeth), తెల్కుల్ 'తలలు', మెర్కుల్ 'చెట్లు' (ఏ. వ. మెరి), ఎల్కుల్ 'ఎలుకలు', విల్కుల్ 'విల్లులు', కిల్కుల్ 'చిలకలు', వార్కుల్ 'వేళ్లు' (roots) కేత్కుల్ 'చేటలు' (ఏ.వ. కేతి), తీన్కుల్ 'తేనెటీగలు', పెంద్కుల్ పందులు'.

-చిల్ : ల్, ట్, డ్ లతో అంతమయ్యే నామాలతో వస్తుంది (ఈ హల్లులు ఈ ప్రత్యయం ముందు లోపిస్తాయి) : కెకొచిల్ 'చెవులు' (ఏ. వ. కెకొల్), ఊచచిల్ 'ఉయ్యాలలు' (ఏ.వ. ఊచల్), తెర్వచిల్ 'కత్తులు' (ఏ. వ. తెర్వల్), కేతచిల్ 'మృతభర్తృకలైన స్త్రీలు' (ఏ. వ. కేతల్), కాడ్గాచిల్ 'పెళ్లి కూతుళ్ళు', చాలచిల్ 'చెల్లెళ్ళు' (ఏ. వ. చాలల్). ముర్తచిల్ ముసలిస్త్రీలు'.

చర్తిల్ 'మెడలు', వార్తిల్ 'వేళ్ళు' (roots) వంటి చాలా కొన్ని నామాలలో -తిల్ ప్రత్యయం కనపడుతోంది.

గదబ (ఒల్లారీ) :

కొన్ని పురుషవాచకాలలో బహువచన ప్రత్యయం -ర్, -ఒర్: అమబర్ 'మాతండ్రులు', ముత్తకొర్ 'ముసలివాళ్ళు', ఇలెర్ 'అల్లుళ్లు' (ఏ.వ. ఇలెండ్).

కొన్ని స్త్రీవాచకాలలో బహువచన ప్రత్యయం -వ్, -ఎవ్ : తమయవ్ 'వాళ్ళతల్లులు' ఇలెవ్ 'పెళ్ళికూతుళ్లు'.

-ల్. -ఇల్, -ఉల్ : కిల్ 'చేతులు', గూడెల్ 'గూళ్లు'. పేనిల్ 'పేలు', కుయుగుల్ 'తాడలు'.

-తిల్ : కనీర్తిల్ 'కన్నీళ్లు' సుపర్తిల్ 'చింతచెట్లు'.

-సిల్ : గర్సిల్ 'వడగళ్లు', వర్సిల్ 'ధాన్యంగింజలు', అయసిల్ 'భార్యలు' (ఏ. వ. అయల్), కొడ్సిల్ 'కోడళ్లు' (ఏ. వ. కొడ్ల్), కేటసిల్ 'మృతభర్తృకలైన స్త్రీలు' (ఏ. వ. కేటల్),

-కిల్, -కుల్, -గిల్, -గుల్ : సెట్కిల్ 'కొడవళ్లు', కణ్కిల్ 'కళ్లు', పల్కిల్ 'పళ్లు', కాల్గిల్ 'కాళ్లు', సిర్గుల్ 'నరాలు'.

(కొండేకోర్ లేక సాలూరు మాండలికం) :

-ర్, -ఒర్ : దాదీర్ 'సోదరులు' (ఏ.వ. దాది), పాటోర్ 'తోడల్లుళ్లు' (ఏ. వ. పాటొ), ఆబార్ 'తండ్రులు' (ఏ. వ. అబ) సూపేకోర్ 'సూపెక్ జాతివారు'.

-ల్ : నాజూల్ 'నాలుకలు', కొడుకూల్ 'కొవ్వులు' (ఏ. వ. కొడుకూడ్),

-ఊల్ / -ఊల్ : ఏగీల్ 'ఆకులు' (ఏ.వ.ఏగు), కుర్టుంబూల్ జలగలు' (ఏ.వ. కుర్టుమ్).

-తీల్ / -తూల్ (ఇది ఒక కులాన్ని గాని జాతినిగాని సూచించే నామాలలో వస్తుంది : మఙాత్తీల్ 'మంగలివాళ్లు', ఘురియతీల్ 'మురియవారు', అంఙోర్తూల్ 'అంజోర్ జాతివారు', ఒన్సోల్తూల్ 'ఒంసోల్ జాతివారు'.

-సీల్ / సూల్ : మాసీల్ 'కూతుళ్లు' (ఏ. వ. మాలు), సొయ్గ్గీల్ 'పొయ్యిలు' (ఏ.వ.సొయ్గ్గి), వేందిసీల్ 'దెయ్యాలు' (ఏ. వ. వేందీట్), కెకొసూల్ 'చెవులు' (ఏ.వ, కెకొల్), ముడుకుసూల్ 'మోకాళ్లు'.

-కీల్ / కూల్ : కేంద్కీల్ 'జుట్టు' (ఏ. వ. కేందీట్), బంత్కూల్ 'చెరువులు' (ఏ.వ. బందు), పొంత్కూల్ 'ముఖాలు' (ఏ.వ. పొందు).

-గీల్ / -గూల్ : సుపార్గీల్ 'చింతకాయలు' (ఏ. వ. సుపారిన్), కెయ్యాడ్గీల్ 'వెలగపళ్లు' (ఏ. వ. కెయ్యాట్), కోఞ్గూల్ 'జీడిగింజలు' (ఏ. వ. కోఞూన్).

(పై ఉదాహరణలలో ఊకార యుక్త ప్రత్యయాలు ఉ, ఊ, ఒ, ఓ ల తరవాతా ఈ కారయుక్త ప్రత్యయాలు మిగిలిన అచ్చుల తరవాతా ఉండటం గమనించదగ్గది.)

**కూడుఖ్ :**

మనుష్యవాచక బహువచన ప్రత్యయం -అర్, -ర్ : ఆలర్ 'పురుషులు', ముక్కర్ 'స్త్రీలు' పెల్లర్ 'అమ్మాయిలు' (ఏ. వ. పెల్లో), పచ్చొర్ 'ముసలి స్త్రీలు' (ఏ. పచ్చో), ఢుక్కర్ 'ఉంచుకున్న స్త్రీలు' (ఏ. వ. ఢుక్క), మేతర్ 'భర్తలు' (ఏ. వ. మేతస్), పచ్గీర్ 'ముసలివాళ్లు (పురుషులు)' (ఏ. వ. పచ్గీస్), మనుష్య సముదాయాన్ని సూచించడానికి గుథియార్ అనే పదం వాడతారు; ఆలీ గుథియార్ 'భార్యలు', ఆలర్ గుథియార్ 'పురుషుల సముదాయం'. బంధువాచక పదాలకి బగ్గర్ చేరుస్తారు : దాదాబగ్గర్ 'అన్నలు'.

అమనుష్యవాచకాలకి బహువచన ప్రత్యయం లేదు. కాని బహుత్వాన్ని సూచించవలసినప్పుడు గుట్టీ 'అన్నీ' అనే పదాన్ని నామవాచకానికి తరచు చేరుస్తారు : మన్‌గుట్టీ 'చెట్లు (అన్నీ)' నెర్ గుట్టీ 'పాములు (అన్నీ)' అడ్డో గుట్టీ 'ఎడ్లు (అన్నీ)'

**మాల్తో :**

మనుష్యవాచక బహువచన ప్రత్యయం -ర్ : మలెర్ 'మనుష్యులు', మళ్నిర్ 'స్త్రీలు', పెలెర్ 'స్త్రీలు' (ఏ. వ. పెలి), మగెర్ 'అమ్మాయిలు' (ఏ. వ. మఖి).

అమనుష్యవాచకాలకి బహువచన ప్రత్యయం లేదు. కాని బహుత్వాన్ని సూచించవలసి వచ్చినప్పుడు గహ్ండి అనే పదాన్ని నామవాచకానికి తరచు చేరుస్తారు : బేడి గహ్ండిత్ 'గొర్రెలు', గొట్ అనే పదం చేర్చడం కూడా ఉంది : గొట్ సియదెద్ 'నక్కలన్నీ'

**బ్రాహుయీ :**

ఈ భాషలో బహువచన ప్రత్యయం -క్ (ఌ -అక్). -క్ దీర్ఘాచ్చుగాని ఎయ్ గాని చివరనున్న నామాలలోనూ, ట్, డ్ (దీర్ఘాచ్చు తరవాత) ఢ్, న్, మ్, ల్, ళ్, ర్, స్, ష్, జ్, ఘ్— ఈ హల్లులలో ఒకదానితో అంతమయ్యే నామాలలోనూ వస్తుంది (-క్ ముందు ర్ లోపిస్తుంది : బాక్ 'నోళ్లు', దేక్ 'రోజులు', ఉరాక్ 'ఇళ్లు', పూక్ 'పురుగులు' టీల్క్ 'విల్లులు', ఖన్క్ 'కళ్లు', పిన్క్ 'పేర్లు', ఈఢ్/(అరుదుగా) ఈన్క్ 'చెల్లెళ్లు' (ఏ.వ. ఈఢ్), మసిన్క్/(అరుదుగా) మసిఢ్క్ 'కూతుళ్లు' (ఏ.వ, మసిఢ్), పాల్క్ 'పాలు', తేల్క్ 'తేళ్లు', మాక్ 'కొడుకులు' (ఏ.వ.మార్), దీక్ 'నీళ్లు' (ఏ.వ.దీర్), ఖఫ్క్ 'చెవులు' (అపవాదం).

-అక్ మిగిలిన హల్లులతో అంతమయ్యే నామాల తరవాతా అకారాంతమైన నామాలతరవాతా వస్తుంది (అ ఆ ల మధ్య ఘ (gh) ఆగమంగా వస్తుంది) :

లుమ్మఘాక్ 'అమ్మలు' (ఏ.వ. లుమ్మ), బావఘాక్ 'తండ్రులు' (ఏ.వ. బావ), పుటాక్ 'జుట్టు', పిడ్డాక్ 'కడుపులు' (ఏ. వ. పిడ్), నుతాక్ 'పిండిలు', తుఘాక్ 'నిద్రలు'. ఇరఘాక్ 'రొట్టెలు'.

-అస్ అనే బహువచన ప్రత్యయం పేర్లకీ, సంబంధివాచక పదాలకీ చేర్చబడుతుంది. ఇది ఆ వ్యక్తినీ, ఆ వ్యక్తికి సంబంధించిన కుటుంబాన్నీ లేక సముదాయాన్నీ సూచిస్తుంది: బాజ్ ఖానాస్క్ 'బాజ్ ఖానూ ఆయన కుటుంబమూ', లుమ్మఘాస్క్ 'తల్లి ఆమెకి సంబంధించినవాళ్ళు'; చూ. అరిస్క్ 'వ్యక్తులు' (ఏ. వ. అరే).

కాని ఈ భాషలో బహువచనప్రత్యయ ప్రయోగం నిత్యమైనది కాదు. బహువచనార్థం సందర్భంవల్ల, అంటే సంఖ్యావాచకంవల్లగాని 'కొన్ని', 'చాలా' మొదలైన పదాలవల్లగాని సూచితమయేటప్పుడు దీన్ని ఉపయోగించ నక్కరలేదు. కాని సందేహానికి ఆస్కారం ఉన్నప్పుడు మాత్రం ఇది ప్రయుక్త మవుతుంది. అందువల్ల ఈ భాషలో ఈ కింద ఉదాహరణలలో లా బహువచన ప్రత్యయం చేర్చీచేర్చకుండా కూడా వ్యవహరించవచ్చు :

దహ్ బందఘ్
దహ్ బందఘాక్ } 'పదిమంది మనుషులు'

ఇరా మార్
ఇరా మాక్ } 'ఇద్దరు కొడుకులు/అబ్బాయిలు.'

## తులనాత్మకచర్చ

పై పరిశీలనవలన ద్రావిడభాషలలో మనుష్య వాచకాలకి ఒక బహువచన ప్రత్యయం, అమనుష్య వాచకాలకి ఒక బహుపచన ప్రత్యయం ఉన్నాయని తెలుస్తుంది. మనుష్యవాచకాలలో బహువచన ప్రత్యయం మూలద్రావిడంలో *-(అ)ర్ అని సులభంగా చెప్పవచ్చు (అ=అచ్చు; ఇది పదాద్యచ్చు కాదు కాబట్టి దాని స్వరూపం ఇదమిత్థంగా చెప్పలేము). దీని నించి పుట్టిన రూపాలు

కోత, తొద, కొడగు, బ్రాహుయీలలో తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ నిలిచి ఉన్నాయి. తెలుగు తప్ప మిగిలిన మధ్యద్రావిడ భాషలలో దీనినించి వచ్చిన ప్రత్యయాలు పురుషవాచకాలలో మాత్రమే ఉండడం (స్త్రీవాచకాలలో లేకపోవడం) ఆ భాషలలో స్త్రీలింగం బహువచనం కూడా తిర్యగ్జడాలతో చేరి పోవడంవల్లనే అని చెప్పాలి (పైన చూడండి). ఈ ప్రత్యయం ప్రచురంగా ఉన్న భాషలలో కూడా కొన్ని మహద్వాచకాలలో దీనికి బదులు అమహద్బహువచన ప్రత్యయం మనకి కనిపిస్తుంది. ఉదా: త. కుళంతైకళ్ 'పిల్లలు', తె. అన్నలు, గోం. మర్క్ 'కొడుకులు' (ఏ. వ. మరీ) మొ॥. ఈ అమహద్బహువచన ప్రత్యయం మహత్తులలోకి కూడా వ్యాపించడమనే పరిణామం చాలా భాషలలో కనపడుతోంది. కాబట్టి ఇది మూలద్రావిడ భాషాకాలంలోనే మొదలయి ఉండాలి. కోత, తొద, కొడగు, బ్రాహుయీలలో ఈ పరిణామం సంపూర్ణ దశకి వచ్చి అసలు మహద్బహువచన ప్రత్యయమే వీటిలో నశించిపోయింది. ఇదే విధంగా ప్రాచీన తెలుగులో కొద్ది నామవాచకాలలో -రు/-ఋ ఉన్నా వ్యావహారిక భాషలో దాని స్థానాన్ని -లు పూర్తిగా ఆక్రమించుకొంది: ప్రా. అల్లురు; వ్యా. అల్లుళ్లు; ప్రా. కోడండ్రు; వ్యా. కోడళ్లు.

మూల ద్రావిడభాషలో అమహద్బహువచన ప్రత్యయ మేమిటి? దాని సార్థకాలు (Allomorphs) ఏమిటి? అనేది కొంచెం జటిలమైన సమస్య. ఈ విషయంలో అన్ని ద్రావిడ భాషలలోనూ ఐక్యం లేకపోయినా ఉపకుటుంబాను సారంగా వాటిలో కొంత సాదృశ్యం ఉంది అని ఈ కింది పట్టిక నిరూపిస్తుంది.

| | |
|---|---|
| త. మ. క. కోత. కొడ. క. | *కళ్ |
| తుళు | *కళ్, *ళ్ |
| తెలుగు | (*కళ్), *ళ్ |
| గోండీ - కువి | *క్, *ంక్ |
| కోలామీ - పర్జి | *కళ్, *ళ్, *ఌ్, *చిల్ |
| బ్రాహుయీ | *క్ |

పై పట్టికవల్ల *కళ్, *ళ్, *క్ అనే మూడు సార్థకాలు (Allomorphs) ఒకటికన్న ఎక్కువ ఉప కుటుంబాలలో ఉన్నట్లు తెలుస్తుంది. *కళ్ ప్రతి రూపాలు (Reflexes) దక్షిణ ద్రావిడోపకుటుంబంలో తొద తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ మధ్య ద్రావిడోపకుటుంబంలో అంతర్భాగమైన కోలామీ-పర్జీ ఉప కుటుంబంలోనూ ఉన్నాయి. *ళ్ ప్రతిరూపాలు తుళు, కోలామీ-పర్జీ, తెలుగులలో ఉన్నాయి. *క్ ప్రతిరూపాలు మధ్యద్రావిడోపకుటుంబంలో అంత ర్భాగమైన గోండీ-కువి ఉప కుటుంబంలోనూ, ఉత్తర ద్రావిడభాష అయిన బ్రాహుయీలోనూ ఉన్నాయి. *ంక్ అనే సార్థకం గోండీ - భాషలలోనే ఉంది. అలాగే *చిల్, *వ్ అనే సపదాలు కోలామీ - పర్జీ భాషలలో మాత్రమే ఉన్నాయి.

అమహద్బహువచన ప్రత్యయం దక్షిణోత్తర ద్రావిడ భాషలలో వైభాషిక మనే విషయం కూడా ఇక్కడ మనం గమనించాలి. ఇంచుమించు అన్ని దక్షిణ ద్రావిడ భాషలలోనూ ఇది వైభాషికమని మనం పైన చూశాము. ఉత్తర ద్రావిడ భాషలలో కూడుఖ్ - మాల్తోలలో అమహత్తులో అసలు బహువచన ప్రత్యయమే లేదు; బ్రాహుయీలో బహువచన ప్రత్యయం వైభాషికం, కాని మధ్య ద్రావిడ భాష లన్నిటిలోనూ అమహద్బహువచన ప్రత్యయం నిత్యంగా ఉపయోగించ బడుతుంది. ఈ ప్రత్యయం వైభాషికత్వం దక్షిణోత్తరోపకుటుంబాలు రెండిటి లోనూ ఉంది కాబట్టి ఇది మూల ద్రావిడభాషకే చెందినది అయి ఉండాలి. అలా కాకుండా అది మూల ద్రావిడ భాషలలో నిత్యమై దక్షిణోత్తరోపకుటుంబాలలో విడివిడిగా వైభాషికంగా మారిందని చెప్పడం అసమంజసమని తోస్తుంది. కాబట్టి ఇది మూల ద్రావిడ భాషలో వైభాషికమై ఉండి మూల మధ్య ద్రావిడ భాషలో నిత్యంగా మారి ఉంటుందని చెప్పడం హేతుయుక్తం. (తెలుగులో 'వంద విస్తరాకు', 'వంద గడప', 'వంద ఎకరం' మొదలైన చాలా కొన్ని పదాలలో బహువచన ప్రత్యయ రాహిత్యం అరుదుగా కనపడుతోంది. మూల ద్రావిడభాషా

లక్షణం ఇటువంటి వాటిలో క్వాచిత్కంగా మిగిలి ఉంది అన్న మాట. ఇలాగే కూయిలో కూడా అరుదుగా అమనుష్య బహువచన ప్రత్యయ లోపం జరుగుతుంది.) ఈ మార్పు మధ్య ద్రావిడ భాషలన్నీ ఒక ఉప కుటుంబమని నిర్ణయించడానికి ఒక ప్రబలాధారం.

తుళు, కోలామీ - పర్జీ భాషలలో అమహద్బహువచన ప్రత్యయానికి ఇంతవరకూ పండితు లెవ్వరూ తులనాత్మక చర్చలో ప్రాధాన్యం ఇవ్వలేదు. కాని ఇది మూల ద్రావిడ భాషలో యీ ప్రత్యయాన్ని పునర్నిర్మించడానికి అత్యంతావశ్యకం. ఈ భాష లన్నిటిలో *కళ్, *ళ్ అనే రెండు సార్థకాలూ భిన్న స్థానాలలో ఉన్నాయి. తుళు దక్షిణ ద్రావిడభాష, కోలామీ - పర్జీ భాషలు మధ్య ద్రావిడ భాషలు, కాబట్టి వీటిలో ఉన్న ఈ రెండు సార్థకాలూ మూల ద్రావిడ భాషకు చెందినవే అయి ఉండాలి. ఈ రెండు సార్థకాలూ ఈ భాషలలో ఒక దానినించి ఇంకొకటి తరవాత పరిణామంవల్ల వచ్చినవని చెప్పడానికి తగిన ఆధారాలేమీ లేకపోవడంవల్ల ఇవి రెండూ మూలద్రావిడభాషలోనే ఉండేవని మనం నిర్ణయించాలి. అయితే *కళ్ అనే సార్థకం ఎటువంటి నామవాచకాల తరవాత వచ్చేది? *ళ్ ఎటువంటి నామవాచకాల తరవాత వచ్చేది? అనే విషయం ఇప్పుడు నిర్ణయించడం కొంచెం కష్టం, కాని ఈ భాష లన్నిటిలోనూ *కళ్ హ్రస్వాచ్చుగల ఏకాచ్క పదాలలోనూ ద్వ్యచ్క పదాలలోనూ ఉండడం వల్ల మూల ద్రావిడంలో కూడా *కళ్ ఇటువంటి పదాలలోనూ, *ళ్ మిగిలిన పదాలలోనూ వచ్చేదని మనం స్థూలంగా నిర్ణయించవచ్చు.

*క్ అనే సార్థకం గోండి - కువి భాషలలోనూ బ్రాహుయీలోనూ ఉంది. ఈ భాషలలో *కళ్ లేదు కాబట్టి మూ. ద్రా. *కళ్‌లో చివరి ళకారం లోపించి *క్ ఏర్పడిందని చెప్పవచ్చు, ఈ వివరణవల్ల *క్ ని కూడా మూల ద్రావిడభాషలో పునర్నిర్మించవలసిన అవసరం తొలగుతుంది. మూ. ద్రా. *కళ్‌లో ళకార లోపం గోండి - కువి భాషలలోనూ, బ్రాహుయీలోను వేర్వేరు కాలాలలో జరిగిన సదృశపరిణామం (**Parallel Development**).

తుళు, కోలామీ - పర్జీ తప్ప మిగిలిన భాషలు *కళ్, *ళ్ అనే రెండు మూలద్రావిడ సార్థకాలలో ఒకదాన్ని అన్ని నామవాచకాలకీ వ్యాపించేటట్టు చేశాయని పై చర్చవల్ల తెలుతుంది. తొద, తుళు తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలన్నీ *ళ్‌ని తొలగించి, *కళ్‌ని అన్ని నామవాచకాలకీ వ్యాపించేటట్టు చేశాయి. గోండీ - కువి, బ్రాహుయీలలో *క్ మూ. ద్రా. *కళ్ నించి వచ్చినది; వీటిలో *ళ్ లేదు.

తెలుగు -లు ప్రత్యయం మూ.ద్రా. *ళ్ నించి వచ్చినది. ప్రాఙ్నన్నయ శాసనాలలో 'సంవత్సరంబుళ్' మొదలైన పదాలలో మూర్ధన్య ళ కారమే కనిపిస్తుంది. తరవాత కాలంలో అది భాషా పరిణామాన్ని అనుసరించి దంత్య లకారంగా మారింది. ఇప్పటికీ కాళ్లు, మొసళ్లు మొదలైన పదాలలో ఉన్న ళ్ల ఇది ప్రాచీన కాలంలో సర్వత్రా మూర్ధన్యమే అనే అంశాన్ని నిరూపిస్తుంది. తెలుగు మ్రాఁకులు (త. మరం - కళ్), కొలఁకులు (త. కుళం-కళ్) ఏనుఁగులు (త. యానై-కళ్), చిలుకలు (త. కిళి-కళ్), ఎలుకలు (త. ఎలి-కళ్), అడుగులు (త. అటి-కళ్) మొదలైన పదాలలో బహువచన ప్రత్యయం వర్ణనాత్మకంగా 'లు' ఏ అయినప్పటికీ తమిళం మొదలైన భాషలలో వాటి సజాతి రూపాలు చూస్తే వీటిలో క, గలు ఒక కాలంలో బహువచన ప్రత్యయానికి చెందినవనీ, ఆ ప్రత్యయం *కళ్ అనీ తెలుస్తుందని బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ "**A Comparative Grammar of the Dravidian or South Indian Languages**" (పేజీ 245)లో చెప్పేరు. తెలుగులో లు బహువచన ప్రత్యయం చాలా నామాలలో ఉండటంవల్ల బహుళప్రచారం కలది కాబట్టి పైపదాల వంటి పదాలలోకూడా లు యే బహువచన ప్రత్యయమనే భ్రమవల్ల అనుచిత విభాగం (**Wrong Segmentation**) జరిగి క, గలు నామవాచకంతో కలిపివేయబడ్డాయి.

గోండీ-కువి భాషలలో *కళ్ నించి వచ్చిన *క్‌కి తోడు *ంక్ అనే సార్థకం కూడా ఉంది. సాధారణంగా *క్ హలంతపదాలలోనూ, *ంక్

అజంతపదాలలోనూ వస్తాయి. కాబట్టి అజంత పదాలలో *క్‌కి ముందు అను నాసికం ఉచ్చారణ సౌలభ్యం కోసం చేరిందని మనం అనుకోవచ్చు. ఈ భాషలలో *ంక్ అనే కొత్త సార్థకం ఏర్పడడం భాషలు సన్నిహిత సంబంధం గలవి అని నిర్ణయించడానికి ఒక ముఖ్యాధారం. మూల గోండీ-కువి కాలంలో *ంక్ ప్రత్యయం ఏర్పడిందన్నమాట. ఈ భాషలలో స్త్రీవాచకాలైన పదాలు అజంతాలైనా వాటికి *-క్ ప్రత్యయమే వస్తుంది కాని *ంక్ రాదు. కాబట్టి ఇటువంటి పదాలు పైన చెప్పిన పరిపూరక ప్రవృత్తి సూత్రానికి అపవాదాలు.

కొన్ని మధ్యద్రావిడభాషలలో *-అళ్ ప్రత్యయం గల సంబంధి స్త్రీ వాచక పదాలలో బహువచన ప్రత్యయంలో ఒక ప్రత్యేకత ఉంది. కొన్ని గోండీ మాండలికాలలోనూ, కూయిలోనూ వీటిలో బహువచనప్రత్యయం -స్క్. కోలామీ-పర్జీ భాషలలో యీ పదాలలో బహువచనప్రత్యయం -చిల్. ఉదా:

గోం. సేలాస్క్ : ప. చాలచిల్ 'చెల్లెళ్లు'

గోం. కోర్యాస్క్ : ప. కొఢాచిల్ 'కోడళ్లు'

గోం. మర్ండాస్క్ : కో. మర్ందసీల్ 'మరదళ్లు'.

వీటిలో సామాన్య బహువచనప్రత్యయాలైన క్, ల్‌ల ముందు స/చ అధికంగా ఉంది. దీని చరిత్ర ఇంతవరకూ తెలియదు.

కోలామీ-పర్జీ భాషలలో కొన్ని నామవాచకపదాలలో (వీటిలో చాలా సంబంధి స్త్రీవాచక పదాలు) *వ్ అనే బహువచనప్రత్యయం ఉంది. ఇది అమహద్బహువచన సర్వనామాలైన *అవ్ (తె. అవి), *ఇవ్ (ఇవి) అనే వాటిలో వకారాన్నుంచి వచ్చినది. అంటే ఈ భాషలలో పై సర్వనామాలలోని వకారం కొన్ని నామవాచకాలలోకి కూడా వ్యాపించిందన్నమాట. తొదలోకూడా ఇదే రకమైన మార్పు కనపడుతుంది. మూల భాషలో యుష్మదస్మదాత్మార్థక

సర్వనామాలలో బహువచన ప్రత్యయంగా ఉన్న *-మ్ తొలదలో అన్ని నామ వాచకాలలోనూ బహువచనప్రత్యయంగా వ్యాపించింది.

సారాంశం :

1. మూల ద్రావిడభాష కాలంలోనే మహద్బహువచనం స్థానాన్ని అమ హద్బహువచనం ఆక్రమించుకోవడం మొదలు పెట్టింది.

2. మూల ద్రావిడభాషలో అమహద్బహువచన ప్రత్యయం వైభాషికం; మధ్యద్రావిడభాషలలో అది నిత్యమైంది.

3. మూ.ద్రా. అమహద్బహువచన ప్రత్యయానికి *కళ్, *ళ్ అనే రెండు సార్థకాలు ఉండేవి. ఈ రెండూ ఇప్పుడు తుళు, కోలామీ - పర్జీ భాషల లోనే నిలిచి ఉన్నాయి.

4. తొద, తుళు తప్ప మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలలో *ళ్ నశించి *కళ్ అన్ని నామవాచకాలకీ వ్యాపించింది.

5. తెలుగులో *ళ్ నించి వచ్చిన లు యే బహువచన ప్రత్యయమైనా ముందు - తెలుగు (Pre-Telugu) కాలంలో *క్ కూడా ఉండేదని తుల నాత్మక పరిశీలన వలన తెలుస్తుంది.

6. గోండీ - కువి భాషలలో *కళ్ *క్ గా మారడమే కాకుండా అజంత పదాల తరవాత దీనికి *ంక్ అనే సపదంకూడా ఏర్పడింది.

7. బ్రాహుయిలో *ళ్ నశించి *క్ నించి పుట్టిన రూపాలే అన్ని నామ వాచకాలకీ వ్యాపించాయి.

| భాష | *-(అ)ర్ | *-మార్ | *-కళ్ | *ళ్ | *-క్( ~ *ంక్) | *చిల్ | *వ్ | *మ్ |
|---|---|---|---|---|---|---|---|---|
| తమిళం | అర్, ఇర్ | మార్ | కళ్ | — | — | — | — | — |
| మలయాళం | అర్ | మార్ | కళ్ | — | — | — | — | — |
| కొడగు | — | — | క(ళ్), అ(ళ్) | — | — | — | — | — |
| కోత | — | — | గూళ్ | — | — | — | — | — |
| తొద | — | — | — | — | — | — | — | — |
| కన్నడం | అర్, ఇర్ | — | గళు | — | — | — | — | ఆమ్ |
| తుళు | రు | — | కుళు | ళు | — | — | — | — |
| తెలుగు | రు, లు | — | — | లు | — | — | — | — |
| గోండి | ర్, ఈర్, ఊర్ | — | — | — | క్, జ్, (స్క్) | — | — | — |
| కొండ | ర్ | — | — | — | కు(క్), స్క్ | — | — | — |
| | | | | | జు (జ్) | — | — | — |
| పెంగో | ర్ | — | — | — | (ఇ) క్, కు (~) క్ | — | — | — |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మండ | ర్ | — | — | — | కె,జ్ | — | — | — |
| కూయి | రు | — | — | — | స్క,క,గ,ంగ | — | — | — |
| కువి | రి | — | — | — | స్క,క,జ | — | — | — |
| కోలామీ | ర్,ఊర్,ఏర్ | — | కూల్ | ల్,ఊల్ | — | సిల్ | ఏవ్ | — |
| నాయకీ | ర్ | — | కు,గు | ల్ | — | — | — | — |
| పర్జి | ఎర్ | — | కుర్ | ల్,ఉల్,ఇల్ | — | చిల్ | ఒవ్ | — |
| గదల | ర్,ఒర్ | — | కిల్,కుల్, గిల్,గుల్ | ఇల్,ఉల్ | — | సిల్ | వ్,ఎవ్ | — |
| కూడుఖ్ | అర్ | — | — | — | — | — | — | — |
| మాల్తో | అర్ | — | — | — | — | — | — | — |
| బ్రాహుయీ | | — | క్,ఆక్ | — | — | — | — | — |

పట్టిక 1 : ద్రావిడభాషలలో బహువచన ప్రత్యయాలు

**3.3. సంఖ్యాపదాలు :**

(i) అమనుష్యవాచక సంఖ్యాపదాలు : ద్రావిడ భాషలలో ఒకటి నించి పదివరకూ, 100 కీ (తెలుగులో మాత్రం) ప్రత్యేక సంఖ్యలు ఉన్నాయి. 20, 30 మొదలైన సంఖ్యలకి పదాలు 10 రూపానికి 2,3,4 మొదలైన వాటి విశేషణ రూపాలు ముందు చేర్చడంవల్ల ఏర్పడతాయి. పదిపైన ఉండే అంకెలు (సున్న ఉన్నవి కాక మిగిలినవి) సున్న ఉన్న అంకె తరవాత 1,2,3 మొదలైన వాటి పదాలు చేర్చడంవల్ల ఏర్పడతాయి. త.మ. ఆయిరం, క. సావిర, తొ. సోఫెర్ సం. సహస్ర '100' నించి వచ్చినవి. కాని తెలుగు 'వేయి, వెయ్యి' మాత్రం ద్రావిడ పదమే. లక్ష, కోటి అనే సంస్కృ పదాలే నాలుగు సాహిత్య వంతమైన భాషలలోనూ ఆ సంఖ్యలని సూచించడానికి ఉపయోగిస్తారు. మధ్యోత్తర కుటుంబాలకి చెందిన సాహిత్య రహిత భాషలలో ద్రావిడ సంఖ్యా వాచకాలు ఏడు దాటి ఉండవు; అపై అంకెలు ఆ భాషాప్రదేశంలో ముఖ్య భాషనించి వచ్చినవి అయి ఉంటాయి. ఉదాహరణకి గోండిలో 7 దాకా ద్రావిడపదాలూ 8 నించి మరాఠీ పదాలు ఉన్నాయి; కాని యిర్ (బ.వ. నుహ్క) '100' అనే పదం కూడా గోండిలో మిగిలింది. కూయిలో 1,2 కి మాత్రమే ద్రావిడ పదాలు ఉన్నాయి; మూడునించి ఒరియా పదాలు. కూడుఖ్‌లో నాలుగు దాకా ద్రావిడ పదాలు. బ్రాహుయిలో మూడుదాకా ద్రావిడ పదాలు, ఆపైన బలూచీ పదాలు, దక్షిణోప కుటుంబంలోని ఆటవిక భాషలు ఉన్నత సంఖ్యాపదాలని వాటికి దగ్గరలో ఉన్న సాహిత్యవంతమైన భాషనించి ఎరువు తెచ్చుకుంటాయి.

ద్రావిడ భాషలలో ప్రాతిపదిక సంఖ్యావాచకాలు అమనుష్య వాచకాలు. వీటి విశేషణ రూపాలకి *-వర్ అనే ప్రత్యయం (కొన్నింటిలో ఇతర ప్రత్యయాలు ఉంటాయి. ఉదా. ఇద్దఱు చేర్చడంవల్ల మనుష్యవాచక రూపాలు ఏర్పడతాయి. తెలుగు కాక మిగిలిన మధ్య భాషలలో అమనుష్యవాచక రూపాలే స్త్రీలకి కూడా వాడతారు; ఇతర భాషలలో మనుష్యవాచక రూపాలకి తుల్యమైన రూపాలు ఈ భాషలలో పురుష వాచకాలు, కొలామీ- పర్జీ భాషలలో 2, 3, 4, సంఖ్యలకి స్త్రీవాచకరూపాలు కూడా ప్రత్యేకంగా ఉన్నాయి.

1. త. ఒన్రు, మ. (శా.) ఒన్ను, ఒన్ను, కోత. ఒడ్, తొ. విడ్, కొడ. ఒందు, క. ఒందు, తు, ఒంజి, తె. ఒందు, గోం. ఉందీ, కొండ, ఉన్ని, కూ ఓన్, ఓంద్, మా. -ఒంద్, బ్రా. అసిట్ <మూ. ద్రా. *ఒన్టు. (990)

తె. ఒకండు, ఒకటికి సంబంధించిన పదాలు కో. ఒక్కోద్ 'ఒకటి'. ప. ఒకుత్ / ఒక్తి, గ, ఒకుట్; ఇవి *ఒరుక్కన్ట్ నించి వచ్చినవి కావచ్చు; తెలుగులో విశేషణమైన ఒక్క / ఒక కూడా *ఒరుక్క నించి వచ్చిఉండవచ్చు.

మూలద్రావిడంలో దీని విశేషణరూపం *ఒర్ - (అచ్చుల ముందు) / *ఒరు (హల్లుల ముందు) : త. ఓర్ ఎయిల్ ఒక కోట', ఒరునాళ్ 'ఒకనాడు' (కాని తమిళ సాహిత్యంలో అరుదుగా ఓర్ - హల్లులముందూ, ఒరు అచ్చుల ముందూ వస్తాయి : ఓర్ తేర్ 'ఒక రథం', ఒరాబు 'ఒక తోవ)' క. ఓర్ అడి 'ఒక అడుగు', ఒర్ వెసర్ ఒక పేరు', పెం. రొకెయ్ 'ఒక చేయి', కూయి రొ్రమహ్ను 'ఒక చెట్టు', బ్రా. అసి 'ఒక'.

2. త. ఇరంటు, మ. (శా) ఇరంటు, రంటు, కోత. ఎయిడ్, తొ. ఏడ్, కొండ. దండ, క. ఎరడు, తు. రడ్డు, తె. రెండు, గోం. రండ్, కొండ. రుండి, పెం. మం. రి, కూయి. రీండె, కువి. రీ/రింది, కో. ఇండిజ్, నా. (ఛాం.) ఎెర్ండి, ప. ఇర్డు, గ. (ఒ.) ఇండి, (సా.) ఇడ్డిగ్, కూ. ఏండ్, మా. ఇబ్, -ఇస్, బ్రా. ఇరట్ <మూ. ద్రా. *ఇరంట్. (474).

మూలద్రావిడంలో దీని విశేషణరూపం *ఈర్ - (అచ్చులముందు) / ఇరు (హల్లులముందు) : త. ఈర్ అఱివు 'రెండు రకాల జ్ఞానం', ఇరు కోటు 'రెండు కొమ్మలు', క. ఈర్ ఒడల్ 'రెండు శరీరాలు', ఈర్ అయ్దు '10', ఇర్మడి రెండు రెట్లు' తె. ఈ రేడు '14' ఇరువాగు 'రెండు వైపులు', కూయి, రినెసె 'రెండు రోజులు,, పెం. రి కణ్క 'రెండు కళ్ళు', కో, ఇన్నల్ 'రెండు రోజులు', పం. ఇర్ వోకల్ 'రెండు ఏళ్లు', చాలా భాషలలో ఈ విశేషణ రూపంకన్న రెండు అనే విశేష్యమే విశేషణంగా ప్రచురంగా వాడబడుతోంది.

'20' త. మ. ఇరుపతు, కో. ఇర్వాద్, తొ. ఇఫొ౯్, కొడ. ఇరువదు, క. ఇర్వత్తు, ఇప్పత్తు, తు. ఇర్వొ / తె. ఇరువది, ఇరవై మూ. ద్రా. *ఇరుపత్.

3. త. మూన్ఱు, మ, మూన్ను, కోత, మూండ్ర్, తొ. మూద్, కొడ) మూందు, క. మూఱు, తు. మూజి, తె. (శా.) మూన్ఱు, మూఁడు, గోం, మూంద్, కొం. ముండ్రి, కూయి. మూంజి, కో. మూందిజ్, నా (ఛాం) మూంది, ప, మూఁదు(క్), గ. మూండ్, మూంద్, బ్రా. ముసిట్ <మూ. ద్రా. మూన్ఱ్. (5052).

దీని విశేషణ రూపం *మూ- / *ము- : త. మూ (వ్) ఎయిల్ 'మూడు కోటలు', మూవేంతర్ 'ముగ్గురు రాజులు', ముక్కణ్ 'మూడు కన్నులు', కోత, మూనాళ్ 'మూడు రోజులు,' తె. ముయ్యేడు '21', ముక్కంటి, కూయి.మూ దిన 'మూడు రోజులు,' ప. ముక్పోకల్ 'మూడు ఏళ్ళు', మూ చిచ్ 'మూడు రోజులు' బ్రా. ముసి-, (ము - తరవాత హల్లు ద్విరుక్తమవుతుంది.

30' త. మ. ముప్పతు, కోత, ముఅత్ (<*మూవత్, తొ. ముపొత్, కొడ, నుప్పదు, క. మూవత్తు, తు. ముప్ప, తె. ముప్పది, ముప్పయ్, ము. ద్రా. *ముప్పత్ / *మూపత్.

కొడ. నుప్పదు, తమిళ మాండలికాలలో నుప్పదు, తమిళ మాండలికాలలో నుప్పదు '30' అనే వాటిలో నకారాది అయిన 'నాలుగు, నలభై' అనే దీని తర వాత సంఖ్య ప్రభావంవల్ల మకారం నకారంగా మారిందని ప్రొఫెసర్ ఎమెనో వివరించారు ఆయన ఇదే వివరణ కూడుఖ్ నుబ్ 'ముగ్గురు' అనే దానిలో నకారానికి కూడా ఇచ్చారు.

4. త. నాల్కు, నాన్కు, నాల్, నాలు, మ. నాల్, నాంకు. కో. నాన్గ్, తొ. నోన్గ్, కొడ. నాలు, క. నాల్, నాలు, నాల్కు, నాలుకు, నాకు, తు. నాలు, తె. నాలుగు, గోం. నాలూజ్, కొం. నాల్గి, కూయి, నాల్గి, కో. నాలిజ్, నా. (ఛాం.) నాలి, ప. నాలు (క్), గ. నాలిగ్, నందల్, కూ. నాఖ్. <మూ.ద్రా. *నాల్, *నాల్కు, (3655)

దీని విశేషణ రూపం *నాల్- : త. నాల్వేతం 'నాలుగు వేదాలు', నాల్ విరల్ 'నాలుగు వ్రేళ్లు', క. నాల్ నూఱు '400' నాల్ వెరల్ 'నాలుగు వేళ్లు', దీని రూపాంతరమైన *నలు కన్నడం, తెలుగు, పర్జిలలో ఉంది : క, నల్వత్తు (< *నలువత్తు) '40', తె. నలుదిక్కులు, ప. నెల్చిచ్ 'నాలుగు రోజులు'.

'40' : త. నాల్పతు, మ. నాల్పతు, కోత. నాల్వత్, తొ. నల్పొథ్, కొడ. నాపదు, క. నాల్వత్తు, నల్వత్తు, తు. నాల్ప. తె. నలుబది, నలువది నలభై < మూ. ద్రా. *నాల్పత్తు.

5. త. ఐంతు, మ. అంచు, కోత. అంజ్, తొ. ఉజ్, ఉజ్, కొడ. అంజు, క. అయ్దు, అయిదు, తు. అయ్ను, తె. ఏను, అయిదు (< క. 13 శతాబ్దినించి శాసనాలలోనూ కావ్యాలలోనూ), కో. అయ్దు, నా. (ఛాం.) సేంది, ప. చేదు(క్) గోం. సైయూంగ్, సియ్యాజ్, కూయి, సింగి సేంగి, < మూ. ద్రా. *చయ్ - (మ్) (2826)

దీని విశేషణరూపం కూడా *చయ్ - (మ్) ఏ. విశేష్య రూపంలో తుళు తప్ప మిగిలిన దక్షిణభాషలలో చివర చేరిన *-త్ అమనుష్యవాచక ప్రత్యయం. నాయకి (ఛాందా), పర్జిలలో కూడా విశేష్యరూపంలో *-త్ చేరింది. పర్జి, గోండి, కూయి మొదలైన భాషలలో కొన్ని సంఖ్యావాచకాల చివర *ంగ్, *క్‌లు ఉన్నాయి. ఇవి బహువచన ప్రత్యయాలు. ఇవి వీటికి చేరడానికి కారణం ఈ భాషలలో విశేష్యానికి ఉండే లింగవచనాలు విశేషణానికి కూడా ఉండడమే.

త. ఐంతత్తై 'అయిదుతలలు', ఐవర్ 'అయిదుగురు', క. అయ్‌నూఱు '500', తె. ఏవురు, ప. వెంజిచ్ 'అయిదు రోజులు' వెంబోకల్ 'అయిదు ఏళ్లు', వెంబోట్ 'అయిదు సార్లు', విశేషణ రూపంలో అనునాసికం స్పర్శాల ముందే ఉంటుంది; స్పర్శేతరాల ముందు లోపిస్తుంది.

'50' : త. ఐంపతు, మ. అంపతు, కోత. అయ్‌వత్, తొ. ఎబొత్, కొడ. అయ్‌వత్తు, క. అయ్‌వత్తు, తు. అయ్‌వ, తె. ఏఁబది, ఏభయ్. మూ. ద్రా. *చయ్మ్‌బత్తు.

6. త. మ. ఆఱు, కోత. ఆర్, తొ. ఓఱ్, కొడ. ఆరు, క. ఆఱు, తు. ఆజి, తె. ఆఱు, గోం, సారూంగ్, కూయి, సజ్‌గి, హాజ, కో. కొం. ఆర్, నా(ఛాం), సాది. < మూ. ద్రా. *చాఱ్. (2485.)

దీని విశేషణరూపం *చఱు : త. అఱుకాల్ 'ఆరు కాళ్లు', క. అఱు దింగళ్ 'ఆరునెలలు', తె. అఱువది. ఇదికాక విశేష్యమే విశేషణంగా అన్ని భాషలలోనూ వాడవచ్చు.

'60' : త.మ. అఱుపతు, కోత అర్వత్, తొ. అఱొత్, కొడ అఱువదు, క. అఱవత్తు. అఱువత్తు, అర్వత్తు, తు. అజిప, ఆజిప, అజ్వ. తె. అఱువది, అరవై. మూ. ద్రా. *చఱుపత్తు.

7. త. ఏళ్, ఏఴు, మ. ఏఴు, కోత. ఏయ్, ఏగ్, తొ. ఒ̈వ్, క, ఏళు, తు. ఎఴు, తె (శా), ఏళు, ఏడు, గోం, ఏడూంగ్, కూయి. ఒడ్, ఒడ్గి (గూంసర్ మాండలికం), కొండ. ఏడు, కో. ఏడ్ < మూ. ద్రా. *ఏళ్. (910).

దీని విశేషణరూపం *ఏళ్ / * ఎళు : త, ఏళ్ చోల్ 'ఏడు మాటలు,' ఏళ్‌ఊర్ 'ఏడుపోళ్ళు', ఎళుముటి, 'ఏడు కిరీటాలు', క. ఎళ్‌నూఱు (>*ఎళు నూఱు), తె. డెబ్బది.

'70' : త.మ. ఎళుపతు, కోత. ఎళ్ వత్, కొడ. ఎళువదు, క. ఏళ్ పత్తు, ఎప్పత్తు, తు. ఎళ్ప, ఏళ్ప, ఎర్ప, తె. డెబ్బది, డబ్బయ్, మూ.ద్రా * ఎళుపత్.

'8' త.మ. ఎట్టు, కోత. ఎట్, తొ. ఒట్, కొడ. ఎట్టు, క. ఎంటు, తు. ఎణ్మ, తె. (శా.) ఎఱుంబొంది, ఎణ్‌బొది, ఎనిమిది, గోం. అఢ్ ముర్, అఢ్‌ముల్. < మూ.ద్రా. *ఎణ్, మూల త-క. *ఎట్‌ట్, (మూ.ద్రా. *ఎణ్-
(784)

మూ. ద్రా. *ఎణ్ త. ఎణ్ 'అంకె' (793) అనే పదంతో సమానం కాబట్టి అతిప్రాచీన కాలంలో ఎనిమిదే ఆ కాలం వారికి తెలిసిన అత్యధిక సంఖ్య అని చెప్పవచ్చు.

తుళులో - ను, తెలుగు -బొది, మిది *పత్ '10' నించి వచ్చినవి. ఇవి 8ని సూచించే సంఖ్యకి చేరడానికి కారణం 10ని సూచించే సంఖ్యకి చేరడానికి కారణం 10ని సూచించే సంఖ్యతో సామ్యం అయి ఉండాలి.

దీని విశేషణరూపం *ఎణ్: త. ఎణ్ణాళ్ 'ఎనిమిది రోజులు', ఎంటేర్ (<*ఎణ్-తేర్) ఎనిమిది రథాలు', క. ఎణ్‌గావుదు '8 కోసుల దూరం', ఎణ్ బెరల్ 'ఎనిమిది వేళ్ళు', తె. ఎనుబది.

'80': త.మ. ఎణ్‌పతు, కొత. ఎంబత్, కొడ. ఎంబదు, క. (శా.) ఎణ్ భత్తు, ఎంబత్తు. తు. ఎణ్ప. తె. ఎనుబది. ఎనభై. మూ.ద్రా. *ఎణ్‌పత్.

9. ఈ సంఖ్యని సూచించే పదాలని రెండు సముదాయాలుగా విభజించ వచ్చు.

(i) త. ఒన్‌వత్తు, ఒన్‌పాన్, మ. ఒంపతు, కోత. ఒర్భాద్ ఒన్భాదీ తొ. విన్‌బొత్. కొడ. ఒయ్‌ంబదు; క. ఒంబత్తు, ఒంభత్తు, తు. ఒర్ంబ గోండి (బెతూల్) ఉన్మా. (1025)

(ii) త. తొంటు, తె. తొమ్మిది (<కో.గోం.). (3532)

'90' : త.మ. తొణ్ణూఱు, కొడ. తొంబదు, క. తొంబత్తు, తు. సొణ్ప, తె. తొంబది, తొంభయ్. మూ.ద్రా. *తొళ్ పత్. (3532).

'900': త.మ. తొళ్ళాయిరం, తె. తొమ్మన్నూఱు (3532).

తమిళం తొంటు<*తొళ్-ంతు. తొణ్ణూరు (<*తొళ్ - నూఱు) '90', తొళ్ - ఆయిరం '900' అనే మాటలలో *తొళ్ - అనే ధాతువు ఉంది. ఇదే తొమ్మిదికి మూలరూపం కావచ్చు. (కాల్డ్‌వెల్ దీనికి *తొల్ - పూర్వం' ముందు అనే ధాతువుతో సంబంధం కల్పించి, తొమ్మిదికి తొళ్ - మిది అంటే పదికి ముందు ఉన్న సంఖ్య అని అర్థం చెప్పేరు. ఇటువంటి అర్థమే అయన 90, 900 లని సూచించే తమిళ పదాలకి కూడా ఇచ్చారు. కాని మూల ద్రావిడంలో ల, ళ ల మార్పులేదు కాబట్టి *తొళ్ (9) *తొల్ 'ముందు పూర్వం' అనే ధాతువులకి పరస్పర సంబంధం ఉందని నిశ్చయంగా చెప్పలేం. కాల్డ్‌వెల్ వాదాన్ని సమర్థించడానికి వీటిలో *తొ- ప్రాచీన ధాతువుగానూ పరిగణించాలి).

తమిళ మలయాళాలలో 90కి తొణూఱు అనీ (తె. తొంబది), 900 కి తొళ్ళాయిరం అనీ (తె. తొమ్మన్నూఱు) అనీ అంటారు. వీటిని తెలుగు కన్నడ రూపాలతో పోల్చిచూస్తే పది స్థానంలో నూఱు వచ్చిందనీ నూఱు స్థానంలో ఆయిరం (<సం. సహస్ర) '1000' వచ్చిందనీ తెలుస్తుంది. ఈ మార్పుకి కారణం వాటి తరవాత వచ్చే పెద్ద సంఖ్యతో సామ్యం (analogy) అని చెప్పాలి.

దక్షిణ భాషలలో '9'కి మూలరూపం *ఒన్‌పత్ (పైన ఇచ్చిన మొదటి సముదాయం), దీనిలో పత్ 'పది' దీని తరవాత అంకె అయిన 'పది' సామ్యం వల్ల చేరింది అనవచ్చు. అయితే దీనిలో ధాతువయిన *ఒన్-కీ *తొళ్-కీ సంబంధం ఉందా లేదా అనేటి జటిల సమస్య. తుళు సొణ్ప '90' లో సకారం ఉండడంవల్ల *తొళ్-కి ఇంకా ప్రాచీన రూపం *చొళ్- అని అనుకొని దీనిలో చకారం లోపించి *ఒళ్- అయి అది *ఒన్-గా మారి ఉంచవచ్చు అనేది

కేవలం ఊహ (మూ. ద్రా. *చకారం త గా మారడం క్వాచిత్కంగా ఉంది). *ఒక్ - *ఒన్-గా ఎలా మారింది? అంటే *ఒక్పత్ - అనే రూపానికి 'ఒకటి తక్కువ పది' అనే అర్థం జానపద వ్యుత్పత్తి (Folk - etymology) మూలంగా వచ్చి దీనిలో కకారం బదులు ఒన్ఱు '1' అనేదానిలో నకారం వచ్చి ఉంటుంది. ఈ మార్పు *ఒక్‌ని ఒన్ఱు అనే సంఖ్యకి సన్నిహితం చెయ్యడానికి జరిగి ఉంటుంది. ఒక కోత మాండలికంలోనూ (ఒర్బాద్), తుళు (ఒర్ంబ)లోనూ ధాతువు ఒర్-లో రేఫ 'ఒన్ఱు'కి విశేషణమైన ఒర్-/ఒరు-తో సామ్యం ఫలితంగా చేరిందని చెప్పాలి. గోండీ (బెతూల్ మాండలికంలో) ఉన్మా '9' అనే ఈ దక్షిణ రూపాలకి సంబంధించిన పదం ఉండడం ఆశ్చర్యజనకమే. ఈ సంఖ్యావాచకం చరిత్ర విషయంలో ఇంకా పరిశోధన జరగాలి.

10, త. మ. పత్తు, కోత. పత్, తొ. పొత్, కొడ. పత్తు, క. పత్తు, హత్తు, తు. పత్తు, తె. పది (<గోం.కో.)>మూ.ద్రా. *పత్-. (3918)

తమిళం మొదలైన దక్షిణ భాషలలో దీనిలో ద్విరుక్త తకారం '20', '30' మొదలైన సంఖ్యలని సూచించే పదాలలోనూ, పతినొన్ఱు '11', పతిన్ మూన్ఱు '13', పతిన్ఐంతు '15' మొదలైన పదాలలోనూ అద్విరుక్తంగా మారుతుంది. ఈ అద్విరుక్తంతో ఉన్న రూపమే తెలుగులో వ్యస్తరూపంగా మారింది. దీని చివర ఇకారం ఉండడంవల్ల ఇది *పతిన్- (దీనిలో -ఇన్-ఔప విభక్తికం) నించి వచ్చిందనీ దీనిలో చివరి న్ లోపించిందనీ చెప్పవచ్చు. 12ని సూచించే సంఖ్య తమిళంలో పన్న్ఇరంటు, క. పన్నెరడు, తె. పంద్రెండు, పన్నిండు. దీనిలో పన్న్ - పతిన్-అనే దాని హ్రస్వరూపమే. ప్రాచీన తమిళం లోనూ ఇతర భాషలలోనూ పతిన్ - సంఖ్యేతర పదాలముందు కూడా విశేషణంగా ప్రయుక్తమవడం ఉంది : త. పతిన్ కలం 'పది కలాలు' (కలం అనేది కుంచం వంటి ఒక పరిమాణార్థక శబ్దం).

100 : త. మ. నూఱు (ఔపవి. నూఱ్ఱు), కోత. నూర్, తొ. నూఝ్, కొడ. నూరు, క. నూఱు, తు. నూదు (ఔపవి. నూత-), తె. నూఱు (ఔపవి. నూట-), గోం. నూర్. <మూ. ద్రా. నూఱ్. (3729)

త. మ. నూఱ్ఱువర్ '100 మంది'- క. నూఱ్‌వర్, తె. నూర్వురు, నూరుగురు.

1000. అన్ని దక్షిణ భాషలలోనూ ఈ సంఖ్యని సూచించే పదాలు సం. సహస్ర - నించి వచ్చినవి: త. మ. ఆయిరం, తొ. సోఫెర్, కోత. ఛావ్‌ర్‌మ్, క. సావిర. సాసిర, కొడ. ఆఇరె, తు. సావిర, సార. కాని తెలుగు వేయి (బ. వ. వేలు), వేవురు 'వెయ్యిమంది' ద్రావిడపదమే. ఇది తమిళం-మలయాళం వియం, వియన్ 'గొప్పతనం, సమృద్ధి, ఎత్తు', వియల్ 'సమృద్ధి, గొప్పతనం, వైశాల్యం' అనే పదాలకి సంబంధించినది. (5405)

(ii) పూరణార్థక ప్రత్యయం: ఇది అమనుష్యవాచక సంఖ్యాపదానికే చేరుతుంది. దీని విశేషణం మనుష్యవాచకమైనా కూడా అంతే. ఉదా: రెండో అబ్బాయి.

త. -ఆం, ఆవతు, మ. -ఆం, క. -ఆనెయ, కొడ.తు. -అనె, తె. -అగున్, -అవు, -అవ, (వ్యా.) -ఓ, కూయి. -తరి, కూ. -తా, బ్రా. -ఇమీకొ, తమిళం. మలయాళం. కన్నడం. తెలుగులలో ప్రత్యయాలు *అ(కు) 'అగు' అనే క్రియనించి వచ్చిన రూపాలు, కొడగు, తుళులలో ప్రత్యయాలు కన్నడం నించి వచ్చినవి అయి ఉండాలి. త. మ. -ఆం, తె. -అగున్, -అవు, -అవ అనేవి *ఆ(కు)ం 'అయ్యే' అనే అ(కు) ధాతువునించి వచ్చిన తద్ధర్మధాతుజ విశేషణరూపాలు. తమిళం -ఆవతు అనేది *ఆ(కు) ధాతువు నించి వచ్చిన భావార్థకరూపం (దీని అసలు అర్థం 'అయినది'). ప్రాచీనాంధ్రంలో -అవు, -అవ ఏ వ్యావహారికంలో ఓగా మారింది. కన్నడం కొడగు, తుళులలో ప్రత్యయం కూడా ఈ ధాతువునించి వచ్చినదే, కూయి, -తరి అమహదేకవచన ప్రత్యయం.

(iii) మనుష్యవాచక సంఖ్యాపదాలు: ఇవి సాధారణంగా అమనుష్య సంఖ్యావాచకాల విశేషణరూపాలకి *-వర్ చేర్చడంవల్ల ఏర్పడతాయి. దీని ఏకవచనరూపం *-వన్ 'ఒకటి'ని సూచించే పదాలలో ఉంది.

1. త. మ. ఒరువన్, ఒరుత్తన్, ఒరువర్, (స్త్రీ) ఒరుత్తి, ఒరువళ్, క. ఒర్బ, ఒబ్బ, ఒబ్బను, (స్త్రీ) ఒబ్బళు, కొడ. ఒబ్బె, (స్త్రీ) ఒబ్బ, తు. ఒరియె, ఒర్యె, (స్త్రీ) ఒర్తి, తె. ఒక్కఁడు, ఒక్కరుఁడు, (స్త్రీ) ఒకతె, ఒకరితె ఓర్తుక, ప. ఒకుర్, ఒకురి.

2. త. మ. ఇరువర్, క. ఇర్వర్, ఇబ్బరు, ఇర్వెరు, తె. ఇరువురు, ఇద్దఱు, గోం. ఇవ్వీర్, కొం. రి'ఎర్, కూయి. రీఅరు, ప. ఇరుల్, కూ. ఇర్బ, మా. ఇవ్.

3. త. మ. క. మూవర్, తు. మూవెరు, తె. మూవురు, ముగ్గురు, గోం. ముప్వీర్, కొం. మూయెర్, ప. మూవిర్, కూ. నుబ్బ.

4. త.మ.క. నాల్వర్, తు. నాల్వెరు, తె. నలువురు, నలుగురు, గోం. నాల్వీర్, కొం. నాలెర్, ప. నెల్విర్, కూ. నఇబ్.

5. త. మ. ఐవర్, క. ఐవర్, ఐవరు, తు. అయ్వెరు, తె. ఏవురు, ఐదుగురు, గోం. సియ్వీర్, కో. సెగుర్, ప. చేవిర్.

6. త మ. అఱువర్, క. అఱువర్. ఆర్వరు, తె. అఱువురు. ఆరుగురు, గోం. సార్వీర్.

7. త.మ. ఎళువర్, క. ఏళ్వర్ ఏళుమంది తు. ఏళ్వెరు, తె. ఏడ్వురు ఏడుగురు, గోం. ఏఢ్వీర్.

8. త. మ. ఎణ్మర్, క. ఎణ్బర్, తె. ఎనమండ్రు, ఎనిమిదిమంది.

9. త. ఒన్పతిన్మర్, తె. తొమ్మండ్రు, తొమ్మండుగురు.

10. త. పతిన్మర్, క. పదింబర్, హత్తుమంది/జనరు, తె. పదుండ్రు, పదుగురు, పదిమంది.

తెలుగులో 'మంది' అనే పదం మనుష్యుల్ని సూచించడానికి ఎనిమిదికీ దానిపై అంకెలకీ వాడతారు కన్నడంలోకూడా దీని వాడుక ఉంది. అయితే ఆ భాషలో మూడునించి దీనిని వాడవచ్చు: మూరు మందీ మక్కళు/మూరు జన మక్కళు. కన్నడంలో 'మంది'కి బదులు 'జన' కూడా వాడవచ్చు. 'జన' రెండుకి కూడా వాడవచ్చు: 'ఇబ్బరు' లేక 'ఎరడు జనరు'; కాని రెండుకి మంది వాడరు. కన్నడంలో మంది తరవాత విశేష్యం ఉండి తీరాలి కాని తెలుగులో 'పదిమంది' అనే విశేష్యం లేకుండా ప్రయోగించవచ్చు. విశేష్యం లేనప్పుడు 'జన'కి రు ప్రత్యయం చేరి 'జనరు' అవుతుంది. ఆధునిక వ్యావహారిక తమిళ మలయాళాలలో ఇరువర్, మూవర్ మొదలైన పదాలు వాడుకలో లేవు. వీటి బదులు త. రెండుపేర్, మ. రండుపేర్, 'ఇద్దరు' త. మూణుపేర్, మ. మూన్నుపేర్ అని ఈ విధంగా అమనుష్యవాచకానికి 'పేర్' అనే శబ్దం చేర్చి వాడతారు. 'పేర్' తరవాత విశేష్యం ఉండవచ్చు, లేకపోవచ్చు. (పేర్ అసలు అర్థం 'పేరు' అయినా ఇక్కడ అది మనుష్య వాచకం).

కొలామీ - పర్జీ ఉప కుటుంబంలో 1.5 సంఖ్యలలో స్త్రీలని సూచించే ప్రత్యేక పదాలు ఉన్నాయి. వీటిలో స్త్రీవాచక ప్రత్యయం *-అళ్ (ఒక స్త్రీని సూచించడానికి ప్రత్యేక పదాలు చాలా ఇతర భాషలలో కూడా ఉన్నాయి, పైన చూడండి). 2.5 సంఖ్యలలో ప్రత్యేక స్త్రీవాచక రూపాలు ఏర్పడడం ఈ ఉప కుటుంబంలో ఒక కొత్త పరిణామం అని ఇంతకుముందే చూశాం.

1. ప. గ. ఒకల్.

2. కో. ఈరాల్, నా. ఇరళ్, నా. (ఛాం.) ఇర, ఇ్ర ప. ఇరల్, గ. ఇరల్ < మూ. కో. ప. *ఈరాళ్.

3. కో. ముయ్యాల్, నా. ముయళ్, నా. (ఛాం) ముయ. ముయ్య, ప. ముయల్ < మూ. కో-ప. *ముయాళ్

4. (కో. నల్లావ్), నా. నల్లళ్, ప. నెలల్ < మూ. కో-ప. *నల్లాళ్.

5. (కో. సెయ్యావ్), ప. చెయల్ < మూ. కో-ప. *చయ్యాళ్.

గోండీ - కువి ఉప కుటుంబంలో *-వర్ ప్రత్యయ ప్రతిరూపాలతో ఉన్న రూపాలు పురుషవాచకాలు మాత్రమే అనే విషయం గమనించాలి కాని ఇవి స్త్రీ పురుష సముదాయాన్ని సూచించగలవు కాని స్త్రీలని మాత్రం సూచించడానికి అమహద్రూపాలే వాడబడతాయి. ఉదా. గోం. రండ్‌వెయ్‌లోక్ 'ఇద్దరు స్త్రీలు'.

## 3. 4. సర్వనామాలు :

ద్రావిడభాషలలో సర్వనామాలని నాలుగు రకాలుగా విభజించవచ్చు. అవి 1. యుష్మదస్మదర్థక సర్వనామాలు (Personal Pronouns) 2. సూచక సర్వనామాలు లేక ఏత త్తదర్థక సర్వనామాలు (Demonstrative Pronouns) 3. ఆత్మార్థక సర్వనామాలు (Reflexive Pronouns). 4. యత్కిమర్థక సర్వనామాలు (Interrogative (cum-Relative) Pronouns). యుష్మ దస్మర్థక సర్వనామాలలోనూ, ఆత్మార్థక సర్వనామాలలోనూ ఏకవచన బహు వచన భేదంమాత్రం ఉంటుంది కాని లింగభేదం ఉండదు. మిగిలిన రెండు రకాల సర్వనామాలలోనూ లింగభేదమూ వచనభేదమూ కూడా ఉంటాయి. యుష్మదస్మదర్థకాత్మార్థక సర్వనామాలలో *-న్ ఏకవచన ప్రత్యయం, *-మ్ బహువచన ప్రత్యయం. వీటిలో ధాతువులు *యా-(ఇది ఉత్తమపురుష సూచకం), *నీ- (ఇది మధ్యమపురుష సూచకం), *తా- (ఇది ఆత్మార్థకం). సూచక యత్కిమర్థక సర్వనామాలలో ధాతువుకి లింగవచన ప్రత్యయాలు చేరతాయి. సూచక సర్వనామాలలో ధాతువులు ఆ- / అ- దూరసూచకం (Distant Demonstrative), ఊ-/ఉ- అనతిదూర సూచకం లేక శ్రోతృసామీప్య సూచకం, (Intermediary Demonstrative), ఈ-/ఇ- సామీప్యసూచకం (Proximate Demonstrative). యత్కిమర్థక సర్వనామంలో ధాతువు *యా-/*ఏ-/*ఎ-. కోతలో ఈ-/ఇ-, ఊ-/ఉ- ల నించి వచ్చిన రూపాలు ఉన్నా వీటికి అర్థభేదం లేదు: రెండూ సామీప్యసూచకాలే. అదేవిధంగా తుళులో స్త్రీ వాచకైకవచనాలకి మోళు<*ఉవళ్ కీ ఇంబళ్ < *ఇవళ్‌కీ అర్థభేదంలేదు. పర్జీ ఊద్ 'వీడు', ఊర్ 'వీరు' *ఉ-నించి వచ్చినవి. ఈ భాషలో వీటికి *ఇ-

నించి వచ్చిన రూపాలు లేవు. తమిళ, కన్నడాలలో *ఉ- ధాతురూపాలు ప్రాచీన సాహిత్యాలలోనే ఉన్నాయి; అప్పటి భాషలలో లేవు.

కూయి, బ్రాహుయిాలలో *ఊ ఓగా మారుతుంది. కూయి ఓ-, కువి హూ- లు అనతిదూర సూచకాలు కాక ఆ-కన్న ఇంకా దూరంలో ఉన్న వాటిని సూచిస్తాయి: కాబట్టి ఈ రెండు భాషలలో దీనికి అర్థవిపరిణామం జరిగింది అని అనుకోవాలి.

## (i) యుష్మదస్మదర్థక సర్వనామాలు

తెలుగులో యుష్మదస్మదర్థక సర్వనామాల్ని మిగిలిన ద్రావిడభాషల్లో సజాతి పదాలతో పోల్చి పరిశీలిస్తే వాటి పరిణామక్రమం మనకు స్పష్టమవుతుంది. ఇంతేకాకుండా, తెలుగు ప్రత్యేక భాషగా రూపొందే ముందు అది యే ఇతర ద్రావిడ భాషలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండేదో కూడా యీ పరిశోధన స్పష్టం చేస్తుంది [కుండలీకరణాలలో ఉన్నవి ఔపవిభక్తిక రూపాలు. ఏటవాలు గీత మాండలిక భేదాలని సూచిస్తుంది.]

### అస్మదర్థకైకవచనం (5160)

| | | | |
|---|---|---|---|
| త. | యాన్, నాన్ | | (ఎన్-) |
| మ. | ఞాన్ | (ప్రాచీన శా. నాన్) | (ఎన్-) |
| కోత. | ఆన్ | | (ఎన్-) |
| తొ. | ఓన్ | | (ఎన్-) |
| కొడ. | నా(ను) | | (ఎన్-, నా-, నన్-) |
| క. (ప్రా.) | ఆన్, (ఆ.) నాను | | (ప్రా.) ఎన్-, (ఆ.) నన్-) |
| తు. (బ్రా.) | ఏను/(సా.) యాను | | (ఎన్-, ఎన-/ యస-) |
| తె. | ఏను, నేను | | (నన్-, నా-) |
| గోం. | అనా/నన్నా | | (నా-) |

| | | |
|---|---|---|
| కొం. | నాన్ | (నా-) |
| పెం. | అన్. అనెజ్ | (నా-) |
| మం. | అన్ | (నా-) |
| కూయి. | అను/నాను | (నా-) |
| కువి. | నాను | (నా-) |
| కో. నా. ప. గ. | అన్ | (అన్-) |
| కు. మా. | ఏన్ | (ఎంగ్-) |
| బ్రా. | ఈ | (కన్-) |
| మూ. ద్రా. | *యాన్ | (*యన్-) |

అన్ని ద్రావిడ భాషలలోని అస్మదర్థకైక వచనరూపాలు మూలద్రావిడం *యాన్ నించి పుట్టినవిగా చెప్పవచ్చు. ప్రాచీన తమిళంలో య కారాదులైన పదాలు సుమారు పది ఉన్నాయి. వీటి అన్నిటిలోనూ ఈ 'య' కారం మధ్య కాల తమిళంలోను, మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలలోను నశించి, ఇవి అకారా దులుగా మారిపోతాయి. ఈ పదాలన్నిటిలోనూ 'య' కారం తరునాత నున్న అచ్చు దీర్ఘ 'ఆ' కారమే అనే విషయం గమనించ దగ్గది. తొల్ కాప్పియంలో కూడ పదాది 'య' కారం తరువాత 'ఆ' కారమేగాని వేరు ఏ అచ్చు రాదనే విషయం చెప్పబడింది. ఈ 'యా' తెలుగులోనూ, (తుళు), కురుఖ్, మాల్తోలలోను 'ఏ' గా మారుతుంది. ఈ మార్పుకి ఇతర ఉదాహరణలు కూడా ఉన్నాయి. (చూ. 2.30).

ఈ మార్పు ననుసరించి *యాన్ యీ మూడు భాషల్లోనూ 'ఏను' (ఏన్)గా మారింది. బ్రాహుయీ 'ఈ' ఏన్ నుంచి వచ్చిందిగా చెప్పవచ్చు. మిగిలిన మధ్య ద్రావిడ భాషలన్నిటిలోనూ 'యా' 'ఆ' గా మారుతుంది. తొద భాషలో మూల 'ఆ' కారం 'ఓ' గా మారడంకూడా సర్వసాధారణమే. (చూ. 2.4). పెంగొ రూపాలలో అధికంగా ఉన్న - ఎజ్ బహువచన ప్రత్యయం అయిన - (ఇ) జ్ రూపాంతరం. ఇది సామ్యంవల్ల మొదట్లో బహువచన సర్వ నామాలకీ, వాటినుంచి తరవాత ఏకవచన సర్వనామాలకి వ్యాపించింది.

తమిళ కన్నడ కొడగు భాషల్లో నకారాదులైన రూపాలకు మలయాళ రూపానికి చారిత్రక వివరణ అస్మదర్థక బహువచనం, ఉభయార్థకాల కింద ఇవ్వబడుతుంది.

ఇక దీని ఔపవిభక్తిక రూపాన్ని గురించి చర్చిద్దాం. సర్వ సాధారణంగా యీ యుష్మదస్మదర్థక సర్వనామాల్లోనూ, ఆత్మార్థక సర్వనామాల్లోనూ ఉన్న దీర్ఘాచ్చు వాటి ఔపవిభక్తిక రూపాల్లో హ్రస్వ మవుతుంది. ఉదా : త. తాన్, తె. తాను; చతుర్థి త. తనక్కు, తె. తనకు. ఇటువంటి మార్పుకు కారణం వీటి తరువాత వచ్చే విభక్తి ప్రత్యయాలు పరమైనప్పుడు ధాతువులో దీర్ఘాచ్చు హ్రస్వంగా మారడం ద్రావిడ భాషల్లో సుప్రసిద్ధం (చూ. 2.13). ఈ మార్పు ననుసరించి మూ. ద్రా. *యాన్. ఔప విభక్తిక రూపం *యన్ - అయి ఉండాలి. ఈ *యన్ - యథా తథంగా ఏ భాషలోనూ నిలవకపోయినా అన్ని ద్రావిడ భాషల్లో ఔప విభక్తిక రూపాలూ దీన్నించి పుట్టినవే అని సులభంగా నిరూపించవచ్చు. దీనిలో యకారం ద్రావిడ భాషల్లో వర్ణ నిర్మాణానికి (Phonological Structure) విరుద్ధం, ఎందువల్లనంటే, ద్రావిడ భాషలో పదాది 'య' కారం తరవాత దీర్ఘ ఆకారమే తప్ప మరి ఏ అచ్చూ ఉండడానికి వీలులేదు, కాబట్టి 'య' దక్షిణోత్తర ద్రావిడ భాషల్లో 'ఏ' గానూ, మధ్య ద్రావిడ భాషల్లో 'అ' గానూ మారి, మూ ద్రా. *యన్ - మొదటి వాటిలో ఎన్ - గానూ, రెండో నాటిలో అన్ - గానూ మారిపోయింది. కూరుఖ్ మాల్తోల ఔప విభక్తిక రూపంలో గకారం మొదట్లో చతుర్థీ విభక్తి ప్రత్యయమని తోస్తుంది. తమిళం ఎనక్కు 'నాకు'లో అపదాద్యచ్చులు లోపించి కకారం 'గ' కారంగా మారడం వల్ల కురుఖ్, మాల్తో, 'ఎంక్' వచ్చిందని చెప్పవచ్చు. బ్రాహుయీ 'కన్' కూడా 'ఎన్'లో ఎకారం అకారంగా మారడంవల్ల (ఇది నియమ బద్ధమైన మార్పే. ఉదా : త. ఎలి, తె. ఎలుక, బ్రా. అల్) వచ్చిందని చెప్పవచ్చు; ఇందులో కకారం వాక్యంలో దీనిముందు వచ్చే కకారాంత పదాలనించి అనుచిత విభాగం వల్ల ఇందులోకి వచ్చి చేరిందని ఇటీవల ఎమెనో నిరూపించారు.

మూ. ద్రా. *యన్ - మధ్యద్రావిడ భాషల్లో 'అన్'గా మారిందని పైన చూశాం. ఇది కోలామీ - పర్జి (నాయకీ, గదబ) భాషల్లో అంటే తెలుగు, గోండి, కొండ, పెంగో, మండ, కూయి, కువి (వీటిని సంగ్రహంగా తెలుగు - కువి భాషలని వ్యవహరిద్దాం) లలో ఇది వర్ణ వ్యత్యయం (Metathesis) పొంది నకారం పదాదికి వచ్చి 'నా'గా మారిపోయింది. తెలుగు 'నాకు'ని తమిళం 'ఎనక్కు'తో పోలిస్తే యీ మార్పు సులభంగా అవగాహన అవుతుంది. ఈ రెండింటికి మూల రూపం *యనక్కు. ఇది తెలుగుకి ముందు కాలంలో *అనక్కుగా మారి తరవాత వర్ణవ్యత్యయం వల్ల 'నాకు'గా మారింది. ఈ వర్ణ వ్యత్యయం పైన చెప్పిన అన్ని భాషలలోనూ ఉండడం వల్ల యీ మార్పు యీ భాషలన్నీ ఏక భాషగా ఉన్న ప్రాచీన కాలంలో జరిగిందని మనం ఊహించ వచ్చు. చతుర్థీ విభక్తి రూపమే అన్ని ద్రావిడ భాషల్లోనూ సమానంగా ఉండడం వల్ల అదే విభక్తులన్నింటిలోకి ప్రాచీనమైంది. దీనిలో 'నా' రూపమే ద్వితీయ తప్ప మిగిలిన అన్ని ఔపవిభక్తులకీ ప్రాతిపదిక అయింది. ద్వితీయా విభక్తి 'నన్నున్', 'ననున్'లో పదాది నకారం వర్ణవ్యత్యయంవల్ల సిద్ధించిన 'నాకు' అనే దాని సామ్యం వల్ల చేర్చబడిందని చెప్పవచ్చు.

ఇక యీ తెలుగు - కువి భాషల్లో మరొక ప్రత్యేకత ఏమిటంటే వాటిలో కొన్నింటిలో నామవాచక రూపాలు నకారాదులుగా ఉన్నాయి తెలుగు, గోండి కూయీ భాషల్లో అజాదిరూపం, నకారాది రూపం రెండూ ఉంటే కొండ, కువి లలో నకారాది రూపాలు. పెంగో, మండలతో అజాది రూపాలు మాత్రమే ఉన్నాయి. వీటిలో అజాది రూపాలే ప్రాచీనమైనవని పై చర్చ స్పష్టం చేస్తుంది. ఇంతేకాకుండా, నన్నయ భారతంలో ఏను రూపమే బహుళంగా ఉంది నేను రూపం చాలా కొద్దిచోట్ల మాత్రమే కనబడుతుంది. కాబట్టి యీ నకారాది రూపాలు వర్ణవ్యత్యయం వల్ల నకారంతో మొదలయ్యే ఔపవిభక్తిక రూపం ప్రభావంవల్ల ఏర్పడ్డవని మనం సులభంగా ఊహించవచ్చు. అంటే తెలుగులో ప్రాచీనమైన 'ఏను' ఔప విభక్తిక రూపమైన 'నా' ప్రభావం వల్ల నకారాన్ని మొదట చేర్చుకొని నేనుగా మారిపోయిందన్నమాట. గోండి, కూయిలలో

కూడా ఇటువంటి మార్పువల్లే నకారాది రూపాలు కొన్ని మాండలికాలలో మాత్రమే ఏర్పడ్డాయి. కొండ, కువిలలో ఈ మార్పు సర్వత్ర జరిగి, అజాది రూపాలు నశించి నకారాది రూపాలు మాత్రమే మిగిలాయి. పెంగో, మండలలో ఇటువంటి మార్పు జరగక అజాది రూపాలే నేటికి నిలిచి ఉన్నాయి. గోండీలో పదాద్యచ్చు హ్రస్వ మవడానికి కారణం తరువాత చేరిన అకారం అని చెప్పవచ్చు.

**అస్మదర్థక బహువచనం (5154)**

| | | |
|---|---|---|
| త. | యామ్, యాంకళ్, నాంకళ్ | (ఎమ్, ఎంకళ్-) |
| మ. | ఞాఙ్ఙళ్, ఞఙ్ఙళ్ | (ఎఙ్ఙళ్, ఞఙళ్-) |
| కోత. | ఆమ్ | (ఎమ్-) |
| తో. | ఎమ్ | (ఎమ్-) |
| కొడ. | ఎంగ / నంగ[1] | (ఎంగ- / నంగ-) |
| ప్రా.క | ఆమ్ | (ఎమ్-) |
| తు. | ఎంకుళు | (ఎంక్ళె-) |
| తె. | ఏము, మేము | (మమ్-, మా-) |
| గోం. | అమ్మట్ /మామాట్ / మమొ/మరాట్ | (మా-) |
| కొం. | మాన్, మాప్ | (మా-) |
| పెం. | ఆప్, అపెజ్, 'మేం' ఆస్, అహెజ్, అసెజ్ 'మనం' | (మా-) |
| మం. | ఆం | (మా.-) |
| కూయి. | ఆము, మాము, 'మేం' ఆజు, 'మనం' | (మా-) |
| కువి. | మాంబు, 'మేం' మారొ, 'మనం' | (మా-) |

1. కొడగులో ఈ రెండు రూపాలూ మాండలిక భేదాలు; రెండూ కూడా 'మేం', 'మనం' అనే రెండు అర్థాలలోనూ వాడబడుతాయి.

| | | |
|---|---|---|
| కో.నా.ప.గ | ఆమ్ | (అమ్-) |
| ప. | అమొర్ 'మనం' | |
| కూ. మా. | ఏమ్. | (ఎమ్-) |
| మూ. ద్రా. | *యామ్ | (*యమ్-) |

అన్ని ద్రావిడ భాషలలోని అస్మదర్థక బహువచన రూపాలూ మూ. ద్రా. *యామ్ నించి జన్మించినవిగా నిరూపించవచ్చును. దీనిలో 'యా' తెలుగు, కూడుఖ్ మాల్తోలలో ఏ గానూ, మిగిలిన అన్ని భాషలలోనూ (ప్రాచీన తమిళం తప్ప) 'ఆ' గానూ మారింది. (ఈ మార్పు *యాన్‌లో జరిగిన మార్పువంటిదే). తమిళంలో నాంకళ్, యాంకళ్, నామ్, యామ్ రూపాలకి బహువచన ప్రత్యయమైన 'కళ్' చేర్చటంవల్ల ఏర్పడినవి. తమిళ సాహిత్యంలో యాంకళ్ మొట్ట మొదట చిలప్పతికారం (11:161) అనే గ్రంథంలో కన్పడుతుంది. ఇది చేరరాజ్యం (ఇప్పటి కేరళలో) వ్రాయబడిన గ్రంథం. కాబట్టి యీ గ్రంథం కాలంలో (3-4 శతాబ్దులు) ఉన్న యాంకళ్ రూపమే ప్రాచీన మలయాళంలో ఞాఙ్ఙళ్‌గా మారిందని ఊహించవచ్చు. 'ంక' ఙ్ఙ గా మారడం మలయాళంలో సర్వసాధారణం. ఈ కంఠ్యానునాసికం ప్రభావం వల్ల పదాది యకారం కూడా అనునాసికమై, ఞ కారంగా మారిందన్నమాట. ఈ ఞాఙ్ఙళ్ రూపానికి అనుగుణంగా మలయాళంలో అస్మదర్థకైక వచనరూపం ఞాన్ సృష్టింపబడింది. ఈ సందర్భంలో మళయాళ శాసనాల్లో ఎక్కడా ఞాన్ రూపమే లేదనీ, మలయాళ గ్రంథాల్లో మాత్రమే పన్నెండో శతాబ్ది నించి ఞాన్ రూపం కనబడుతోందనే విషయం మనం గుర్తించాలి. అంతకుముందు శాసనాల్లో నాన్ రూపమే ఉండేది. ఇది మధ్యకాల తమిళ రూపంతో సమానం. గోండీలో ఆమ్ అనే పురాతన గోండీరూపం ఆట్/అట్ అనే ఒక కొత్త బహువచన ప్రత్యయం చేరడం వల్ల ధాత్వచ్చు హ్రస్వమై అమ్మట్ అనే రూపం సిద్ధించింది. బస్తర్, అదిలాబాద్ జిల్లాలలో కొన్ని ప్రాంతాలలో దీనికి నమొట్/నమట్ అనే రూపం ఉంది; అది అమట్‌కి ఏకవచన రూపమైన 'నన్నా' సామ్యం వల్ల నకారం చేరగా

ఏర్పడిన రూపం. ఇది *నామ్ (ఉభయార్థకం) నించి వచ్చినదిగా డి.ఇ.డి.అర్ (3647)లో ఇవ్వడం సమర్థనీయం కాదు.

దీని ఔపవిభక్తికరూపం మూలద్రావిడంలో *యమ్-, ఇది దక్షిణోత్తర ద్రావిడభాషలలో ఎమ్-గానూ, మధ్య ద్రావిడ భాషల్లో అమ్-గానూ మారింది. మధ్యకాల తమిళం, మలయాళం, కొడగుల్లో ఎమ్- కి నామవాచకాల్లో బహు వచన ప్రత్యయమైన కళ్ చేరి ఎంకళ్-రూపం ఏర్పడింది. అధునిక తమిళంలో అనేకాచ్కౌ పదాల్లో చివర 'ళ' కారం లోపిస్తూ ఉంటుంది. కాబట్టి ఎంకళ్ వ్యవహారంలో ఎంగ అని ఉచ్చరిస్తారు. కొడగులో ఎంగ కూడ ఇటువంటి అంత్య ళకారం లోపం వల్లే ఏర్పడిందని చెప్పవచ్చు. కొడగులో రెండో రూపం 'నంగ' అనేది *నాంగల్ యొక్క ఔపవిభక్తిక రూపం. అయితే కొడగులో నామ వాచకరూపాలు ఔపవిభక్తిక రూపాలతో సమానంగానే ఉన్నాయి. కాని చారి త్రకంగా చూస్తే ఎంగ కి సంబంధించిన నామవాచక రూపం *అంగళ్ (<యాం కళ్), నంగకి సంబంధించిన నామవాచక రూపం *నాంగల్ (<*నాంకళ్) అయి ఉండాలి. చారిత్రకంగా ఉండవలసిన యీ రూపాలకు బదులు ఔప విభక్తిక రూపాలే వాటి స్థానాన్ని ఆక్రమించాయని చెప్పాలి. తొదభాషలోకూడా ఇటువంటి మార్పే జరిగింది. దీంట్లో నామవాచకరూపం ఒక కాలంలో కోతలోకి మల్లే ఆమ్ అయిఉండాలి. కాని యిది నశించి దాని స్థానం ఔపవిభక్తిక రూపం ఆక్రమించుకుంది. తమిళ, మలయాళ, కొడగు భాషల్లో అస్మదర్థక బహువచన రూపానికి తరువాత ఇంకొక బహువచన ప్రత్యయం కళ్ చేరడం వల్ల యీ మూడుభాషలు చాల సన్నిహిత సంబంధం గలవని స్పష్టపడుతుంది. మలయాళం ఇజ్ఞళ్ ఞాజ్ఞళ్ నించి సామ్యమూలంగా సృష్టించబడిన రూపం; ఇప్పటి మలయా ళంలో ఇది నామవాచక రూపం స్థానాన్ని ఆక్రమించుకొంది.

ఇంక మధ్య ద్రావిడంలో ఔప విభక్తికరూపం అమ్-, కోలామీ, పర్జీ భాషల్లో అది వర్ణవ్యత్యయం పొంది 'మా'గా మారింది. తమిళంలో దీని చతుర్థీ విభక్తి రూపం ఎమక్కు, తెలుగు మాకు, గోండీ మాక్ (<*అమక్కు),

వీటన్నిటికి మూలరూపం యమక్కు, తెలుగులో ద్వితీయ విభక్తి రూపం మమున్, మమ్మున్‌లో పదాది మకారం 'మాకు' ప్రభావంవల్ల చేర్చబడిందని చెప్పవచ్చు. వర్ణవ్యత్యయం వల్ల సిద్ధించిన యీ 'మా' అనే ఔపవిభక్తిక రూపం, ఈ భాషలు కొన్నింటిలో నామవాచక రూపాన్ని 'మ' కారాదులుగా మార్చింది. వీటిలో అజాది రూపాలే ప్రాచీనమైనవని, మిగిలిన భాషల్లో అజాదిరూపాలు ధ్రువ పరుస్తాయి. అంతేకాకుండా, తెలుగు సాహిత్యంలో ఏము మేము కన్న ప్రాచీనం మైనవని, మిగిలిన భాషల్లో అజాదిరూపాలు ధ్రువపరుస్తాయి. అంతేకాకుండా తెలుగు సాహిత్యంలో ఏము మేము కన్న ప్రాచీనం కాబట్టి ఏము ఔపవిభక్తిక రూపమైన 'మా' ప్రభావంవల్ల ఒక మకారం చేర్చుకొని మేముగా మారిందన్న మాట. ఇటువంటి మార్పు గోండి, కూయిలలో కొన్ని మాండలికాలలో మాత్రమే జరిగితే కొండ, కువిలలో సర్వత్రా జరిగింది. మూలరూపమైన అమ్ చివర ఒక ఓష్ఠ్యస్పర్శమూ ఉకారమూ చేరి 'అంబు' అయి, అది ఔపవిభక్తిక సామ్యంవల్ల 'మాంబు' అయింది. ఇందులో 'ంబు' ప్ గా మారడం వల్ల కొండ, కువి లలో మాప్ సిద్ధించింది. కొండ 'మాన్'లో నకారం ఆ భాషలో ఏకవచన రూపమైన 'నాన్' ప్రభావం వల్ల వచ్చింది. గోండి 'మరాట్' 'మనం' మిరాట్ నించి సామ్యం వల్ల ఏర్పడింది. (మిరాట్ చరిత్రకి కింద చూడండి) కూయి, కువిలలో ఆజు, మారో అనే కొత్త ఉభయార్థకాలు సృష్టించబడ్డాయి. వీటికీ పెంగో అస్‌కీ మూలరూపం *అట్ అని చెప్పవచ్చు. కువిలో పదాది మకారం 'మాంబు' ప్రభావంవల్ల చేరింది అనవచ్చు. కూయి, కువి భాషలు అతి సన్నిహిత సంబంధం గల భాషలు అని చెప్పడానికి ఈ ఉభయార్థక సృష్టి చాలా మంచి ఉదాహరణ.

**ఉభయార్థకం (3647) :**

| | | |
|---|---|---|
| త. | నామ్ | (నమ్-) |
| మ. | నామ్, నోమ్, నిమ్మళ్ | (నమ్-) |
| కోత. | అమ్ | (అమ్-) |
| తొ. | ఒమ్ | (ఒమ్-) |
| క. | నావు | (నమ్-) |

| | | |
|---|---|---|
| తు. | నము/నమె/నావు (<క.) | (నమ-) |
| తె. | మనము | (మన-) |
| కో. | నేండ్, నేం | (నేం-) |
| నా. (ఛాం.) | నేండ్, నేమ్ | (నేం-) |
| కూ.మా. | నామ్ | (నమ్-) |
| బ్రా. | నన్ 'మేం, మనం' | (నన్-) |
| మూ.ద్రా. | *నామ్ | (*నమ్-) |

పైన యిచ్చిన ఉభయార్థక రూపాలన్నీ మూ. ద్రా. *నామ్ నించి వచ్చినవే, అయితే కన్నడం, బ్రాహుయీలలో ఇది 'మనం' అనే అర్థాన్నే కాక 'మేం' అనే అర్థాన్ని కూడ సూచిస్తుంది. కాని అతి ప్రాచీన కన్నడంలో ఇది ఉభయార్థకం మాత్రమే అని చెప్పడానికి ఆధారాలున్నాయి. మధ్యకాల తమిళంలో 'యామ్' రూపం నశించడంవల్ల దానికి బదులు ఉభయార్థకానికి 'కళ్' బహువచన ప్రత్యయం చేర్చగా కలిగిన నాంకళ్ రూపం అస్మదర్థక బహువచనంగా వ్యాప్తిలోనికి వచ్చింది. కన్నడంలో నామ్‌కి ఉచ్చారణార్థకమైన ఉకారం చేరి 'నాము' అనగా అచ్చుల మధ్య అద్విరుక్తమైన మకారం ఆ భాషలో వకార మవుతుంది కాబట్టి 'నావు' రూపం సిద్ధించింది. కోలామీ, నాయకీలలో నేండ్‌కి ప్రాచీన రూపం 'నేమ్' అయి ఉండాలి. దీని చివరి డకారం ఒక కొత్త బహువచన ప్రత్యయం (దీని రూపాంతరం అట్/ఒట్ గోండీ బహువచన సర్వనామాలు అన్నిటిలో కనిపిస్తుంది). గోండీ 'నమొట్', 'నామ్'కి యీ కొత్త బహువచన ప్రత్యయం ఒట్ చేరగా ఆద్యచ్చు హ్రస్వమై సిద్ధించిన రూపం. (ఇది గోండీలో ఒక మాండలికంలోనే ఉంది).

దీని ఔపవిభక్తిక రూపం దీర్ఘాచ్చు హ్రస్వం కావడంవల్ల సిద్ధించిన నమ్-, బ్రాహుయీ 'నన్' మొదట్లో యీ ఔపవిభక్తిక రూపం నించి సిద్ధించినదే అయి ఉండాలి. బ్రాహుయీలో ఉండవలసిన మకారం స్థానంలో నకారం ఉండడం ఇందులో అస్మదర్థకైక వచనం ఔపవిభక్తిక రూపం కన్ - ప్రభావం

వల్ల కావచ్చు. తెలుగులో మిగిలిన సర్వనామాల ఔపవిభక్తిక రూపాలకి మల్లేనే నమ్ - కూడా వర్ణ వ్యత్యయం పొంది 'మన'గా మారింది. తెలుగు 'మనకు'ని తమిళం 'నమక్కు'తో పోలిస్తే యీ విషయం స్పష్టమవుతుంది. 'నమ్' మన'గా మారిన తరువాత దీనికి బహువచనార్థకమైన 'మ్' ప్రత్యయం చివర చేర్చి 'మనము' అనే నామవాచక రూపం సృష్టించబడింది. (దీనిలో చివరి 'ఉ'కారం ఉచ్చారణార్థం). తుళు 'నమ' కూడ ఇలాగే మొదట్లో ఔపవిభక్తిక రూపమే అయి ఉండాలి. తొదలో సాధారణంగా అకారం ఒకారంగా మారుతుంది కాబట్టి ఒమ్ - అమ్ - నించి వచ్చిందని చెప్పవచ్చు. ఈ తొద కోతల రూపాల్లో పదాది నకారం లోపించిందని అనుకోవాలి. ఈ పదాది నకారలోపానికి వీటిలో అజాదులైన అస్మదర్థక సర్వనామాలు కూడా తోడ్పడ్డాయని ఊహించవచ్చు. కోత నామవాచకరూపం ఆమ్ నామ్ నుంచి యీ విధంగా పరిణమించింది. కాని తొదలో యీ ఔపవిభక్తిక రూపమే నామవాచకం స్థానాన్ని ఆక్రమించుకుంది.

ఈ ఉభయార్థక రూపంలో ఆకారానికి బదులుగా కోలామీ - నాయకీలలో ఏకారం ఉండడానికి కారణం ఇప్పటివరకూ తెలియలేదు. భద్రిరాజు కృష్ణమూర్తి (Dravidian Personal Pronouns, *Studies in Indian Linguistics*, Annamalainagar and Poona 1968, pp. 189-205) దీనిని సమర్థించడానికి మూలద్రావిడంలో ఉభయార్థకరూపం *నామ్ కాక *ఞామ్ అయివుండాలని అన్నారు. (పేజీ 194). కాని మూలద్రావిడ రూపం *ఞామ్ అయితే దీనిలో ఞకారం ప్రాచీన తమిళంలోనూ, మళయాళంలోనూ నిలిచి ఉండాలి. కాని యీ రెండు భాషల్లోనూ యీ రూపంలో నకారమే ఉండడంవల్ల యీ వివరణ సమర్థనీయం కాదని చెప్పాలి. ప్రాచీనాంధ్రంలో 'నేము' అనేది 'మనం' అనే అర్థంలో కాక 'మేం' అనే అర్థంతో 16 శతాబ్ది నించి ఉన్న కొన్ని శాసనాలలో చాలా అరుదుగా ఉంది. ఇది 'ఏము'కి 'నేను'తో సామ్యం వల్ల నకారం చేరగా ఏర్పడిన రూపం. అందువల్ల ఇది ఉభయార్థక మూలరూపం *ఞామ్ అనడానికి తోడ్పడుతుంది అనే కృష్ణమూర్తి అభిప్రాయం సమంజసం కాదు.

ఇక తమిళ, కన్నడ, కొడగు భాషల్లో నకారాదులైన అస్మదర్థకైక వచన రూపాలకి చారిత్రక వివరణ ఇపుడు సులభంగా చెప్పవచ్చు. తమిళంలో 'నాన్' యాన్ కంటె, కన్నడంలో నాను ఆన్ కంటె అర్వాచీనాలని ఆ భాషల్లో గ్రంథాలవల్ల మనకు తెలుస్తుంది. ఇవి ఆ భాషల్లో నకారాదులైన బహువచన రూపాల సామ్యంవల్ల పుట్టినవి. తమిళంలో మధ్యకాలంలో యామ్ నశించి దానికి బదులు 'నాంకళ్' వ్యాప్తిలోనికి వచ్చింది. అలాగే కన్నడంలో మొదట ఉభయార్థక రూపమైన నావు తరవాత కాలంలో 'మేము, మనం' అనే రెండు అర్థాల్లోనూకూడా వ్యాప్తిలోనికి వచ్చి, 'అమ్' రూపం నశించేటట్టు చేసింది. కాబట్టి కొత్తగా వ్యాప్తిలోకి వచ్చిన నకారాదులైన బహువచన రూపాల సామ్యం వల్ల యీ భాషల్లో ఏకవచన రూపాలుకూడా నకారాదులుగా మారిపోయాయి. మలయాళం ఞాన్ ఞాఙ్ఙళ్ (< *యాంకళ్) సామ్యంవల్ల పుట్టినట్లు యింతకు ముందే చూశాము. ఈ నకారాది రూపాలకు యీ వివరణ కాలిన్స్ అనే ఆయన మొదట చెప్పినట్లు ప్రొఫెసర్ బరో వ్రాశారు. తెలుగు - కువి భాషలలో నకారాది రూపాల వివరణ వేరువిధంగా యింతకు ముందే యిచ్చాము.

**యుష్మదర్థకైక వచనం** (3684)

| | | |
|---|---|---|
| త. | నీ | (ప్రా. నిన్-/ఆ. ఉన్-) |
| మ. | నీ | (నిన్ -) |
| కోత. | నీ | (నిన్ -) |
| | | ॥ |
| తొ. | నీ | (నిన్ -) |
| కొడ. | నీ (ను) | (నిన్-, ని-) |
| క. | నీన్, /నీను | (నిన్-) |
| తు. | ఈ | (నిన్-/ఇన్-) |
| తె. | నీవు, ఈవు | (నిన్-, నీ-) |
| గోం. | ఇమ్మా/నిమ్మె | (నీ-) |
| కొం. | నీన్ | (నీ-) |

| | | |
|---|---|---|
| పెం. | ఏన్, ఏనెజ్ | (నీ-) |
| మం. | ఈన్ | (నీ-) |
| కూయి. | ఈను/నీను | (నీ-) |
| కువి. | నీను | (నీ-) |
| కో. | నీవ్ | (ఇన్-) |
| నా(ఛాం.) | ఈవ్, నీవ్ | (ఇన్-) |
| ప. గ. | ఈన్ | (ఇన్-) |
| కూ. మా. | నీన్ | (నింగ్-) |
| బ్రా. | నీ | (నే-,షష్ఠీవిభక్తినా-) |
| మూ. ద్రా. | *నీ (న్) | (*నిన్-) |

అన్ని ద్రావిడ భాషల్లో యుష్మదర్థకైక వచన రూపాలూ మూ.ద్రా. *నీన్ నుంచి పుట్టినవి. ఇందులో చివరి నకారం తమిళం, మలయాళం, కోత, తొద, (కొడగు), తుళు, తెలుగు, బ్రాహుయీలలో లోపించింది. ఈ భాషలు మూడు ఉప కుటుంబాలకి చెందినవి కాబట్టి యీ మార్పు మూలద్రావిడంలోనే ప్రారంభమై ఉండాలి. కాని యీ చివరి నకారం ఏకవచనాన్ని సూచించే ప్రత్యయం కాబట్టి ఇది మొట్టమొదట దీనిలో ఉండి ఉండాలి అనడానికి సందేహం లేదు. తుళులోనూ, అన్ని మధ్యద్రావిడ భాషల మూలరూపంలోనూ, యుష్మదర్థక సర్వనామాలు రెంటిలోనూ పదాది నకారంకూడా లోపించింది. తుళు 'ఈ' నీన్‌నుంచి ఆద్యంత నకారాలు రెండూ లోపించడంవల్ల ఏర్పడింది. తెలుగు 'ఈవు' కూడా తుళులోలాగే "నీన్'లో ఆద్యంత నకారాలు లోపించగా మిగిలిన 'ఈ' నించి వచ్చినదే. కాని దీనిలో చివర 'వు'కారం చేరడానికి కారణం తెలుగులో వర్ణ సముదాయ నిర్మాణాన్ని పరిశీలిస్తే మనకు తెలుస్తుంది. తెలుగులో ఏకాచ్క పదాలు సాధారణంగా ఉండవు. మూలభాషలో ఉన్న ఏకాచ్క పదాలన్నీ తెలుగులో చివర ఉకారాన్ని చేర్చుకుంటాయి. ఉదా : త. ఆ: తె. ఆవు, త.పూ:తె.పూవు. [శ్రీనాథుని కాశీఖండంలో పూ అనే ప్రాచీన రూపమే ఈ వుకారం

లేకుండా మనకు కనపడుతుంది]. ఇదేవిధంగా పురాతనాంధ్రంలో 'ఈ' 'ఈవు'గా ప్రాచీనాంధ్రలో మారింది. కోలామీ - నాయకి 'నీవ్' నాయకీ (ఛాందా) 'ఈవ్' లలో చివర వకారం ఉండడంవల్ల యివి తెలుగునుంచి ఎరువు తెచ్చుకున్నవని స్పష్టమవుతుంది. ఈ భాషలలో తెలుగునించి వచ్చిన పదాలు అనేకం ఉన్నాయి. ఇవి పర్జీ - గదబలకి సన్నిహితమైనవి కావడంవల్ల యీ పదాలు ఎరువు తెచ్చుకోకముందు వీటిలోకూడా 'ఈన్' అనే రూపమే ఉండేదని ఊహించవచ్చు. పెంగోలో 'ఈ' 'ఏ' గా మారి ప్రాచీనమైన 'ఈన్' 'ఏన్'గా మారింది. గోండీ రూపాలకు వివరణ కింద ఇవ్వబడుతుంది.

దీని ఔపవిభక్తిక రూపం మూలద్రావిడంలో *నిన్-, ఇది అదే రూపంలో దక్షిణ ద్రావిడ భాషలన్నిటిలోనూ నిలిచి ఉంది. (ఆధునిక తమిళంలో ఉన్ - వివరణకి కింద చూడండి). కూరుఖ్ - మాల్తోలలో నింగ్ - *నినక్కు అనే చతుర్థీ విభక్తి రూపంనించి వచ్చింది కాబట్టి వీటిలో కూడ నిన్ - నిలిచిందనే చెప్పాలి. ఇక మధ్యద్రావిడ భాషలన్నిటిలోనూ *నిన్ - లో అది నకారం లోపించి అది ఇన్ - గా మారింది. ఇది కోలామీ - పర్జీలలో అలాగే ఉంది. ఇక్కడ కోలామీ - నాయకీలు నామవాచక రూపాల్ని తెలుగునుంచి ఎరువుగా తెచ్చుకున్నా పాత ఔపవిభక్తిక రూపాల్నే నిలుపుకున్నాయనే విశేషం మనం గుర్తించాలి. తెలుగు - కువి భాషల్లో ఇన్ - వర్ణవ్యత్యయం పొంది 'నీ' గా మారింది, తెలుగు ద్వితీయా విభక్తిలో మాత్రం ఇన్ - తరువాత అకారం లేక పోవడంవల్ల వర్ణవ్యత్యయం పొందక 'నీ' ప్రభావంవల్ల మొదట నకారం చేర్చు కొని, నినున్, నిన్నున్ అనే రూపాలు పొందింది. తెలుగు నీకు (<ఇనక్కు- <నినక్కు-) నించి 'నీ' మిగిలిన విభక్తులకు (ద్వితీయ తప్ప) వ్యాప్తిచెందింది. ఈ వర్ణ వ్యత్యయం తెలుగు, గోండీ, కొండ, పెంగో (మండ) కూయి, కువి లలో కనపడటంవల్ల ఇవన్నీ ఒక భాషగా ఉన్నపుడే యీ మార్పు సంభవించిం దన్నమాట. ఈ వర్ణవ్యత్యయంవల్ల సిద్ధించిన 'నీ' ప్రభావంవల్ల తెలుగులో 'ఈవు' మొదట 'న'కారం చేరి 'నీవు' అయింది. అలాగే కొండలోనూ, కూయిలో ఒక మాండలికంలోనూ కువిలోనూ ప్రాచీనమైన ఈన్ 'నీన్'గా మారింది.

**యుష్మదర్థకం బహువచనం : (3688)**

| | |
|---|---|
| త. | నీమ్, నీర్, నీయిర్, నీవిర్, నీంకళ్ |
| | (ప్రా. నుమ్-, అ, ఉమ్- ఉంకళ్-) |
| మ. | నిజ్జళ్ (నిజ్జళ్-) |
| కోత. | నీమ్ (నిమ్-) |
| | " " |
| తొ. | నిమ్- (నిమ్-) |
| కొడ. | నింగ (నింగ-) |
| క. | నీమ్, నీవు (నిమ్-) |
| తు. | ఈరు/నికుళు/నింక్ళు (నింక్ళె-) |
| తె. | ఈరు, మీరు, (మిమ్-, మీ-) |
| గోం. | ఇమ్మట్/నిమెట్/మిరాట్ (మీ-) |
| కొం. | మీరు (మీ-) |
| పెం. | ఏప్, ఏపెజ్ (మీ-) |
| మం. | ఈమ్ (మీ-) |
| కూయి. | ఈరు/మీరు (మీ-) |
| కువి. | మీంబు, మీరు (మీ-) |
| కో. నా. | నీర్ (ఇమ్-) |
| నా. (ఛాం) | ఈమ్ (ఇమ్-) |
| ప. గ. | ఈమ్ (ఇమ్-) |
| కూ. మా. | నీమ్ (నిమ్-) |
| బ్రా. | నుమ్ (నుమ్-) |
| మూ. ద్రా. | *నీమ్ (*నిమ్-), *నీర్ |

చాలా ద్రావిడ భాషల్లో యుష్మదర్థక బహువచన రూపాలు మూ. ద్రా. *నీమ్ నించి వచ్చినవి. కాని, తమిళం. నీర్, తుళు ఈర్, తెలుగు. ఈరు,

(గోండి. మిరాట్; కొండ. మీరు, కూయి. ఈరు, మీరు కోలామీ - నాయకీ. నీర్) — వీటికి మూలరూపం *నీర్ అయివుండాలి.[1] పైన పేర్కొన్న భాషలు దక్షిణ, మధ్య అనే రెండు ఉప కుటుంబాలకు చెందినవి కాబట్టి యీ *నీర్ రూపం మూలద్రావిడంలోనే తరువాత కాలంలో సృష్టించబడింది అని ఊహించ వచ్చు. క్రియలలో మధ్యమపురుష బహువచన ప్రత్యయమైన *-ఈర్ ప్రతి రూపాలు ఇంచుమించు అన్ని భాషలలోనూ ఉన్నాయి; ఇది *నీర్‌కి సంబంధించినది కాబట్టి *నీర్ మూలద్రావిడ భాషకి చెందినది అనడానికి ఇది మరొక ప్రబలాధారం. *నీమ్, నీర్ రూపాలు రెండూ మూలభాషకి చెందినవే అయినా వీటిలో 'నీమ్' రూపమే 'నీర్' కన్నా ప్రాచీనమని చెప్పడానికి రెండు కారణాలు చూపించవచ్చు.

1. అస్మదర్థక సర్వనామాల్లోనూ (ఉభయార్థకంలో సహా), ఆత్మార్థక సర్వనామాల్లోనూ నకారం ఏకవచన ప్రత్యయంగానూ, మకారం బహువచన ప్రత్యయంగానూ ఇంచుమించు అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉన్నాయి. కాబట్టి ప్రాచీన కాలంలో యుష్మదర్థక బహువచన సర్వనామంలో కూడా మకారమే బహువచన ప్రత్యయంగా ఉండి ఉండాలి.

2. యుష్మదర్థక బహువచనం ఔపవిభక్తిక రూపంలో అన్ని ద్రావిడ భాషల్లోనూ మకారమేకాని, రేఫ ఏ భాషలోనూ లేదు. కాబట్టి *నీమ్ ప్రాచీన రూపమై యుండి *నీర్ అనే రేఫ బహువచన ప్రత్యయంగా గల రూపం *అవర్ (తె. వారు). *ఇవర్ (తె. వీరు) మొదలైన రేఫ బహువచన ప్రత్యయంగా గల సర్వనామాల సామ్యంవల్ల సృష్టించబడినది అని ఊహించవచ్చు. మహన్మహతీ వాచకాలైన నామవాచకాల్లో కూడా -అర్/-ఇర్ బహువచన

---

1 తమిళం సంఘ వాఙ్మయంలో నీమ్, నీర్, నీయిర్ అనే మూడు రూపాలూ ఉన్నాయి. నీవిర్ అనేది నన్నూల్ అనే 14 వ శతాబ్ది వ్యాకరణంలో ఇవ్వబడింది.

ప్రత్యయంగా ద్రావిడభాషల్లో ఉంది. (ఉదా: త. అరసర్ 'రాజులు', మకళిర్ 'కూతుళ్లు', తె. అల్లురు, పగఱు). మకారం కన్న రేఫమే బహువచనప్రత్యయంగా విశేష వ్యాప్తిలో ఉన్నది కాబట్టి యీ రూపంలో మకార స్థానాన్ని రేఫ ఆక్ర మించడంలో ఆశ్చర్యం లేదు. తెలుగు. తాము, తారు రూపాల్లో కూడా యిదే మార్పు జరిగిందనే విషయం యీ సందర్భంలో స్మరించదగ్గది.

ఇందులో కూడా తుళు, ఈరు లోనూ మధ్యద్రావిడ మూలరూపంలోనూ పదాది నకారం లోపించింది. తమిళం, మలయాళం, కొడగు, తుళులలో యీ రూపానికి అమహద్బహువచన ప్రత్యయమైన *కళ్ రూపాంతరాలు చేరడం ఒక ప్రత్యేకత. ఇదే విధంగా తెలుగులో కూడా నామవాచక బహువచన ప్రత్యయం వారలు, మీరలు, మనలను (వ్యావహారికం), మిమ్మల్ని అనే సర్వ నామాల్లో కూడ చేరింది, తమిళం 'నీయిర్' యుష్మదర్థకైకవచనం 'నీ' మీద '-ఇర్' అనే బహువచనప్రత్యయం చేరగా సిద్ధించింది.

దీని ఔపవిభక్తికరూపం మూ.ద్రా. *నిమ్-, ఈ రూపం అన్ని దక్షిణ ద్రావిడ భాషల్లోనూకూడా నిలిచి ఉంది. ప్రాచీన తమిళంలోనూ, బ్రాహుయి లోనూ ఇందులో ఇకారం ఉకారంగా ఓష్ఠ్యమైన మకారం ప్రభావంవల్ల మారి పోయింది. ఈ మార్పు యీ రెండు భాషల్లోనూ వేర్వేరుగా జరిగినది కాని ఒకే కాలంలో జరిగింది కాదు. తమిళంలో తరువాత కాలంలో దీనిలో నకారం లోపించి 'ఉమ్'-, దీనికి 'కళ్' ప్రత్యయం చేరి 'ఉంకళ్' సిద్ధించాయి. తమిళంలో యుష్మదర్థకైకవచనం ఔపవిభక్తిక రూపంలో ఉన్-లో ఉకారం బహువచన రూపమైన ఉమ్ - సామ్యంవల్ల వచ్చింది. బ్రాహుయిలో ఔప విభక్తిక రూపమే నామవాచకంగా కూడ స్థిరపడింది.

మూల మధ్య ద్రావిడ భాషలో మూ. ద్రా. *నిమ్ - లో నకారం లోపించి *ఇమ్ - గా మారింది. కోలామీ - పర్జీ భాషల్లో ఇది అలాగే ఉండగా, తెలుగు - కూయి భాషల్లో వర్ణ వ్యత్యయం పొంది 'మీ'గా మారింది. ఈ భాషల్లో మకారాదులైన నామవాచక రూపాలు ఔపవిభక్తిక సామ్యంవల్ల

ఏర్పడినవే. కోలామీ, నాయకి నీర్ తెలుగునుంచి ఈర్ ఎరువు తెచ్చుకొని, దానికి నీవ్ సామ్యంవల్ల నకారం చేర్చగా ఏర్పడింది అనడం కన్న ఇది మూ.ద్రా. *నీర్ ప్రతిరూపమే అనడం ఎక్కువ సమంజసం. గోండీ మిరాట్, తెలుగునుంచి మీరు ఎరువు తెచ్చుకొని దానికి - అట్ బహువచన ప్రత్యయం చేర్చగా ఏర్పడింది. గోండీ ఇమ్మట్ 'ఈమ్'కి అట్ చేర్చడంవల్ల ఏర్పడింది. గోండీ ఏకవచన రూపాలు ఇమ్మా, నిమ్మె అనేవి ఇమ్మట్, నిమ్మట్‌లో బహు వచన ప్రత్యయం తీసివేయగా ఏర్పడిన రూపాలు. అంతేగాని, బహువచన రూపాన్ని గౌరవార్థకంగా ఏకవచనంలో వాడటంవలన వచ్చిన రూపాలు కావు. గోండీలో బహువచనరూపాన్ని ఏకవచనంలో వాడే అలవాటే లేదు. పెంగో, కువిలలో రూపాలు అస్మదర్థక బహువచనం మల్లెనే ఏర్పడ్డాయి. తొద, కొడగులలో నామవాచక రూపాలు మొదట్లో ఔపవిభక్తిక రూపాలు.

సారాంశం :

1. మూల ద్రావిడ భాషలో ఆత్మార్థక యుష్మదస్మదర్థక సర్వనామాల ఔపవిభక్తిక రూపాలు వీటిలో దీర్ఘాచ్చు హ్రస్వమవడంవల్ల ఏర్పడ్డాయి. దీనికి కారణం వీటి తరవాత వచ్చే విభక్తి ప్రత్యయం అజాది కావడం, కాని విభక్తి ప్రత్యయాల ముందు ఇటువంటి మార్పు సర్వనామాలలోనే ఉంది; ఇతర నామ వాచకాలలో ఎక్కడా లేదు.

2. మూల భాషలో యుష్మదస్మదర్థకాల ఔపవిభక్తిక రూపం తెలుగు - కువి భాషల్లో వర్ణ వ్యత్యయం పొందుతుంది. దీని ప్రభావంవల్ల యీ భాషలు కొన్నింటిలో నామవాచక రూపాలు కూడా నకార మకారాదులుగా మారి పోయాయి.

3. తెలుగు - కువి భాషలలో యుష్మదస్మదర్థకాల ఔపవిభక్తికాల పరిణామం ఒకే విధంగా జరిగింది కాబట్టి యీ పరిణామం ఇవి అన్నీ ఒకే భాషగా ఉన్న కాలంలో జరిగిందని ఊహించవచ్చు.

4. ఈ పరిశోధనవల్ల తెలుగుకి గోండీ - కువి భాషలతో అతి సన్నిహిత మైన జన్మ సంబంధం ఉందని స్పష్టమవుతుంది (చూ. 5.3, (ii))

5. మలయాళం, తొద, కొడగు, తుళువంటి కొన్ని భాషలలో ఔప విభక్తిక రూపమే ప్రాచీనమైన ప్రథమా విభక్తి రూపం స్థానాన్ని ఆక్రమించు కొంది. ప్రథమేతర విభక్తులన్నిటి ముందూ ఉండడంవల్ల దీనికి ఉన్న ప్రాచుర్యమే ఈ మార్పుకి కారణం.

(ii) ఆత్మార్థక సర్వనామాలు :

త. మ. తాన్ (తన్-), కో. తాన్ (తన్-/త-), తొ. తోన్ (తన్-), కొడ. తాను (తన్-), తు. తాను, (గౌరవార్థక బహు వ. తనుకుళు), తె. తాను (తన-), గోం. తన్నా, పెం. తాన్, కూయి. కువి. తాను, కో. ప. గ. తాన్ (తన్-), కు. మా. తాన్ (తంగ్-), బ్రా. తేన్. మూ. ద్రా. *తాన్ (*తన్-) (3196).

త. తాం (తమ్-), (గౌ. బ.) తాంకళ్ (తాంకళ్-), మ. తాం (తమ్-), తాంకళ్ (తంకళ్-), కో. తాం (తమ్-), తొ. తమ్- (తమ్-), కొడ. తంగ (తంగ-), క. తాం (తమ్-), తె. తాం (తమ-), తమరు, తారు, గోం. తమ్మా, తమ్మట్, కూయి. తారు (తాడన్-), కువి. తాంబు, కో. నా. ప. గ. తాం (తమ్-), కు. మా. తాం (తమ్), మూ. ద్రా, *తామ్ (*తమ్-). (3162) తెలుగు కూయి 'తారు'లో *మ్ బహువచన ప్రత్యయం స్థానాన్ని దానికన్న ప్రచురమైన *ర్ బహువచన ప్రత్యయం ఆక్రమించింది. తె. తమరులో *ర్ ప్రత్యయం ప్రాచీన ప్రత్యయం పక్కన చేరింది. ఇదేవిధంగా తమిళ మలయాళ కొడగులలో *మ్ కన్న ప్రచురమైన *కళ్ ప్రత్యయం దాని పక్కన చేరింది. తమిళ, మలయాళ, కన్నడ, తెలుగులలో ఈ శబ్దం 'మీరు' అనే అర్థంలో దాని కన్న ఎక్కువ గౌరవసూచకంగా వాడబడుతోంది.

(iii) సూచక సర్వనామాలు :

పురుషవాచకైక వచనం :

| | | | |
|---|---|---|---|
| త. | అవన్ | ఇవన్ | ఉవన్ |
| మ. | అవన్ | ఇవన్ | |
| కో. | అవ్న్ | ఇవ్న్ | ఊన్ |
| కొడ. | అవె(న్) | ఇవె(న్) | |
| క. | అవం, అవను | ఇవం, ఇవను | ఉవం |
| తు. | ఆయె | ఇంబె | ఉంబె |
| తె. | వాఁడు | వీఁడు | |
| గోం. | ఓల్/వోర్ | ఏల్/వేర్ | |
| కొం. | వాన్లు/అకన్ | వేన్లు/ఇకన్ | |
| పెం. | అవన్, ఎవన్ | ఇవన్ | |
| కూయి. | అఅంజు | ఇఅంజు | ఒఅంజు |
| కువి. | అ అసి | ఈ వసి | ఊ అసి |
| కో. | అమ్/అమ్ద్/ అవ్ంద్ | ఇమ్/ఇమ్ద్, ఇవ్ంద్ | |
| నా. (ఛాం.) | ఓన్ | ఈన్ | |
| ప. | ఓద్ | | ఊద్ |
| గ. | ఓండ్ | | |
| కు. | ఆస్ | ఈస్ | హూస్ |
| మా. | అహ్ | ఈహ్ | |
| మూ.ద్రా. | *అవన్ట్ | ఇవన్ట్ | *ఉవన్ట్ |

ఈ సర్వనామాలలోనూ వీటిలో వచ్చే సమాపక క్రియలలోనూ పురుష వాచక ప్రత్యయం దక్షిణభాషలలో *-న్, మధ్య భాషలలో *న్ట్, ఉత్తర భాషలలో *-స్. వీటన్నిటికీ మూలరూపం దక్షిణభాషలలో ఉన్న *న్ అనీ మధ్యభాషలలో దీని చివర *ట్ చేరి న్ + ట్ → న్ట్ గా మారిందనీ కొందరు

పండితుల అభిప్రాయం. వీరి మతంలో *ళ్ చేరడానికి కారణం చివర తకారం ఉన్న అమనుష్య వాచకంతో దీనికి ఏర్పడిన సామ్యం. మరికొందరి అభిప్రాయంలో మధ్యభాషలలో *న్ ళ్ మూల రూపం. ఇది ఉత్తర భాషలలో స్‌గా మారింది; దక్షిణ భాషలలో దీని ఔపవిభక్తిక రూపమే ప్రథమావిభక్తి రూపం అయింది. దక్షిణ, మధ్య భాషలు రెండిటిలో వీటి ఔపవిభక్తిక రూపాలు *అవన్-, *ఇవన్- మాత్రమే; వీటిలో ళ్ లేదు. ఈ రెండో వివరణ సహేతుకంగా ఉన్నట్లు తోస్తుంది. మొదటి వివరణ ఇచ్చినవారు ఎం. బి. ఎమెనో రెండో వివరణని ప్రతిపాదించినవారు టి. బరో. ఔపవిభక్తిక రూపం ప్రథమా విభక్తి రూపం అవడం యుష్మదస్మదర్థకాలలో చాలా భాషలలో ఉన్నట్లు పైన చూశాం.

స్త్రీవాచకైకవచనం :

| | | | |
|---|---|---|---|
| త. | అవళ్ | ఇవళ్ | ఉవళ్ |
| మ. | అవళ్ | ఇవళ్ | |
| కో. | అవ్ళ్ | ఇవ్ళ్ | ఊళ్ |
| కొడ | అవ(ళ్) | ఇవ(ళ్) | — |
| క. | అవళ్ | ఇవళ్ | ఉవళ్ |
| తు. | ఆళు | ఇంబళ్ ఇంబాళ్, ఇంబొళు | మోళు, ఉంబళు |
| (పెం. అదెల్ /అందెల్ /ఇదెల్) ఎదెల్ | | | — |
| మూ ద.ద్రా. | *అవళ్ | *ఇవళ్ | *ఉవళ్ |

స్త్రీలింగం అమనుష్యలింగం నించి దక్షిణ ద్రావిడ భాషలలో మాత్రమే విడివడింది. పై రూపాలలో ప్రత్యయం *అళ్ (సమాపక క్రియలలో *-అళ్, *-అళ్ కూడా ఉన్నాయి). ఈ ప్రత్యయం మొదట్లో *అళ్ 'స్త్రీ' అనే శబ్దమే అని భద్రిరాజు కృష్ణమూర్తిగారు చెప్పేరు. మధ్యభాషలలో పెంగోలో మాత్రం దక్షిణ భాషలలో జరిగిన పరిణామం లాంటిదే జరిగింది. స్త్రీవాచకాలని ప్రత్యే

కంగా సృష్టించడానికి పెంగోలో *అళ్ శబ్దాన్ని అద్-, ఇద్- అనే శబ్దాలకి చేర్చడం వల్ల ఈ పెంగో రూపాలు ఏర్పడ్డాయి. దీనివల్ల ఒకానొక కాలంలో పెంగోలో ఇతర మధ్యభాషలలోలాగే అద్, ఇద్‌లు స్త్రీలని కూడా సూచించేవని తెలుస్తుంది. పెంగోలో పరిణామానికి సాదృశ్యం ఉన్నా ఈ రెండూ ఏకకాలంలో జరిగినవి మాత్రం కాదు. తె. ఆవిడ (<*ఆ బిడ్డ), ఆమె అర్వాచీన కాలంలో ఏర్పడినవి; క్రియలో ప్రత్యేక స్త్రీలింగ రూపాలు లేవు.

మనుష్యవాచక బహువచనం :

| | | | |
|---|---|---|---|
| త. | అవర్, అవర్‌కళ్ | ఇవర్, ఇవర్‌కళ్ | ఉవర్ |
| మ. | అవర్ | ఇవర్ | — |
| కోత. | అవ్‌ర్ | ఇవ్‌ర్ | ఊర్ |
| కొడ. | అవు, అఎంగ | ఇవు, ఇఎంగ | — |
| క. | అవర్ | ఇవర్ | ఉవర్ |
| తు. | ఆరు, ఆకుళు | మేరు, ఇంబెరు | మోకుళ |
| తె. | వారు, వారలు, వీరు, వీరలు, వాళ్ళు | వీళ్ళు | — |
| గోం. | ఓర్ద్/వూర్ | ఏర్ద్/వీర్ | — |
| కొం. | వార్ | వేర్ | — |
| పెం. | అవర్/ఎవర్ | ఇవర్ | — |
| కూయి. | అఅరు | ఇఅరు | ఒఅరు |
| కువి. | ఆఅరి | ఈవరి | ఊఅరి |
| కో. | అవ్‌ర్ | ఇవ్‌ర్ | — |
| నా(ధా)ం. | ఓర్ | ఈర్ | — |
| ప. | ఓర్ | — | ఊర్ |
| గ. | ఓర్ | — | — |
| కూ. | అర్/అబ్‌ఢర్ | ఈర్/ఇబ్‌ఢర్ | హూర్/హుబ్‌ఢర్ |
| మా. | అర్ | ఈర్ | — |
| మూ.ద్రా. | *అవర్ | *ఇవర్ | *ఉవర్ |

సాహిత్యవంతమైన భాషలలో ఇవి ఒక వ్యక్తికే గౌరవార్థకాలుగా వాడబడుతున్నాయి; ఇటువంటి ప్రయోగం సాహిత్యరహిత భాషలలో లేదు.

పురుషేతర/మనుష్యేతరవాచకైకవచన బహువచనాలు :

| | | | |
|---|---|---|---|
| త. | అతు, అవ్/అవై | ఇతు, ఇవ్/ఇవై | ఉతు, ఉవ్/ఉవై |
| మ. | అతు, అవ | ఇతు, ఇవ | — |
| కో. | అద్ | ఇద్ | — |
| తొ. | అథ్, అథాం | ఇథ్, ఇథాం | — |
| కొడ. | అదు | ఇదు | — |
| క. | అదు/అతు, అత్తు<br>అవు | ఇదు/ఇతు/ఇత్తు,<br>ఇవు | ఉదు, ఉవు |
| తు. | అవు, అయ్‌కులు | ఇందు | ఉందు? ఉందెకులు |
| తె. | అది, అవి | ఇది, ఇవి | — |
| గోం. | అద్, అవ్ | ఇద్, ఇవ్ | — |
| కొం. | వాద్/అక(ల్),<br>వాక్/అకెఙ్ | వేద్/ఇక(ల్),<br>వేక్/ఇకెఙ్ | — |
| పెం. | అది/అదఙ్ }<br>ఎది/ఎదఙ్ },<br>అవఙ్/ఎవఙ్ | ఇది/ఇదఙ్, ఇవఙ్ | — |
| కూయి. | ఆరి, ఆవి | ఈరి, ఈవి | ఓరి, ఓవి |
| కువి. | ఆది, ఆఆతి | ఈది, ఈవతి/ఈవి/ఊది, ఊఅతి,<br>ఈవస్క | హూది, హూఅస్క |
| కో. | అద్, అదావ్ | ఇద్, ఇదావ్ | — |
| నా(ఛాం). | అద్, అంద | ఇద్ | — |
| ప. | అద్, అవ్ | ఇద్, ఇవ్ | — |
| గ. | అద్, అవ్ | ఇద్, ఇవ్ | — |
| కూ. | ఆడ్, అఱ్‌డా | ఈడ్, ఇఱ్‌ఢా | హూడ్, హుఱ్‌డా |

మా. అత్, (అవ్ అవె) ఈత్, (ఈవ్ ఈవె) —
బ్రా. — — ఓ/ఓద్, ఓఫ్క్
మూ.ద్రా. *అత్, *అవ్/ *ఇత్, *ఇవ్/ *ఉత్, *ఉవ్/
*అవయ్ *ఇవయ్ *ఉవయ్

వ్యావహారిక తమిళం, కోత, కొడగు, మాల్తోలలో వీటిలో బహువచన రూపాలు నశించాయి. వాటి బదులు ఏకవచనరూపాలే వాడతారు. మాల్తోలో అవ్ అవె, ఈవ్ ఈవె అనే రూపాలు సంభాషణలో అంతక్రితం సూచింపబడిన వస్తువునిగాని విషయాన్నిగాని మళ్ళీ సూచించడానికి వాడతారు; ఇతరత్రా ఏకవచన రూపమే బహువచనార్థంలో ఉంటుంది. వీటిలో ఏకవచన రూపాలు దక్షిణభాషలలో అమనుష్యవాచకాలు, మధ్యోత్తర భాషలలో (పెంగొ తప్ప) స్త్రీవాచకాలూ అమనుష్యవాచకాలూ కూడా. బహువచన రూపాలు తెలుగు, పెంగొలుతప్ప మిగిలిన మధ్యభాషలలో స్త్రీవాచకాలూ, అమనుష్యవాచకాలూ; మిగిలిన భాషలలో అమనుష్యవాచకాలు.

కూయి, కువి, పెంగొలలో ఎ-ధాతువు నించి వచ్చిన రూపాలుకూడా ఉన్నాయి. కూయిలో ఎ-రూపాలు అ-రూపాల కన్న సామీప్యాన్ని సూచిస్తాయి. పెంగొలో అ-, ఎ-లకి భేదంలేదు. బ్రాహుయిలో ఏ-రూపాలు దూరసూచకాలు (ఏద్ 'వాడు, అది', బ.వ. ఏఫ్క్). ఈ నాలుగు భాషలూ మూల ద్రావిడంలో ఏ-అనే సూచకధాతువుకూడా ఉండేదని సూచిస్తాయి.

మాల్తోలో ఇవికాక నా-అనే ధాతువుకూడా ఉంది; ఇది దూరసూచకమే కాని దీన్ని ఆ వస్తువు/వ్యక్తి ప్రత్యక్షంగా ఉన్నప్పుడే ఆ-బదులు ఉపయోగిస్తారు.

(కూయిలో *ఎ-ధాతురూపాలు ఎఅంజు 'వాడు', ఎఅరు 'వాళ్లు', ఏరి 'అది', ఏవి 'అవి', కువిలో ఏవసి 'వాడు', ఏవరి 'వాళ్లు', ఏది 'అది', ఏవి/ఏవస్క 'అవి' ఈ రెండు భాషలలో వక్తకి ఉద్దిష్టవస్తువు/వ్యక్తికి ఉన్న

దూరం దృష్ట్యా నాలుగు ధాతువులనీ క్రమంగా ఈ విధంగా ఇవ్వవచ్చు : ఇ., ఎ., అ., ఒ.).

బ్రాహూయీలో దా, అద్ వీడు, ఇది', బ.వ. దాఫ్క్, ఏ, ఏద్ 'వాడు, అది' బ.వ. ఏఫ్క్, ఓ, ఓద్ 'వాడు, అది (అనతి దూరంలో) బ.వ. ఓఫ్క్.

**iv) యత్కిమర్థక సర్వనామాలు :**

వీటిలో ధాతువు *యా-, *ఏ-, *ఎ. అని మూడు రూపాలతో ఉంటుంది. ఈ మూడింటిలో *యా- ప్రాచీన తమం, త. యావన్ / ఎవన్ 'ఎవడు', యావళ్, యారళ్, ఎవళ్ 'ఎవ ర్తి', యార్, ఆర్, యావర్, ఆవర్, ఎవర్ (కళ్) 'ఎవరు', యావతు, యాతు, ఎతు 'ఏది' యా, యావై, 'ఏవి'; మ. యావన్, ఏవన్ 'ఎవడు' యావళ్ / ఏవళ్ 'ఎవ ర్తి' యావర్, ఏవర్ యార్, ఆర్ 'ఎవరు', యా, యాతు, ఏతు, ఏన్ 'ఏది', ఏవ 'ఏవి'; కోత. ఎవ్న్, ఎవ్ళ్, ఎవ్ర్, ఎద్ / ఎద్న్ / ఏద్ / ఎన్; తొ. ఏథ్ 'ఎవరు (లింగ భేదం లేదు)'; బ. వ. ఏథాం; కొడ. ఆరు, దారు 'ఎవరు' (వచనభేదం లేదు); ఏవె(న్), ఏవ, ఏవు, ఏదు; క. యావను/అవం/ఆవె, యావళు/అవళ్, యార్ ఆర్/దారు; ఆవుదు, ఆవువు; తు. ఏరు. ఏరణె 'ఎవరు'; తె. ఎవఁడు, ఎవ్వతె/ ఎవ ర్తె, ఎవరు/ఏరు, ఏది/ఎది, ఏవి/ఎవ్వి; గోం. బోర్/బోల్ 'ఎవరు (ఏ.వ.), బూర్/బోఢ్ (బ.వ.), బద్ 'ఎవ ర్తె, ఏది', (బ.వ.) బవ్; కొం. ఏన్/అయెన్, ఏర్/అయెర్, ఏం/అయెద్, ఏవ్/అయెక్; పెం. ఇన-'ఏ', ఇనెన్, ఇందెల్ 'ఎవ ర్తి', ఇనెర్, మం. అం-'ఏ', అమ్నన్ 'ఎవరు', అమ్ది 'ఏమిటి', కూయి. అన్/ఇన్-'ఏ', అనంజు, అనరు, అనరి, అనఇ, కువి. అంబసి/ఇంబ' అసి, అంబరి/ఇంబ' అరి, ఏనరి, అంబయి/ఇబయి, అంబ' ఇ/ఇంబ'ఇ, కో. ఎం/ ఎయ్‌ద్ / ఏ / న్ / ఏండ్, ఏర్, ఎద్, ఎదావ్. నా(చాం.) ఏన్ 'ఎవరు (పు.') ఏద్ 'ఏది', ప. ఏద్ 'ఎవరు', గ. ఏయ్ండ్ 'ఎవడు', ఏయ్‌ర్ 'ఎవరు', కూ నే 'ఎవరు' (ఏ.వ.), నేనే 'ఎవరు (బ.వ.)', ఎక్‌దస్ 'ఎవడు', ఎక్‌దా 'ఎవ ర్తి 'ఏది', ఎంద్రదద్ 'ఏమిటి', మా. నేరే (హ్)/ఇకె(హ్), నేరెర్/ఇకెర్, నేరి(త్)/

నే(ర్) / ఇకి(ర్), బ్రా. ఆరా 'ఏ', దేర్, దే 'ఏవరు (వచన భేదం లేదు)', అంత్ 'ఏమిటి'.

గోండీ రూపాలలో బకారం మొదట ఉండడం విశేషం. కూయి ఇంబఇ, ఎంబఇ 'ఏవరు', కువిలో అంబసి 'ఏవడు' మొదలైన రూపాలవల్ల గోండీ రూపాలు వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడ్డాయని చెప్పవచ్చు. మనుష్యబహువచన రూపం ఏకవచన రూపాలకి బదులు తెలుగులాగే చాలా భాషలలో వాడబడు తోంది.

సూచక, యత్క్రిమర్థక సర్వనామాల ధాతువులనించి విశేషణాలూ, క్రియా విశేషణాలూ అనేకం ఇంచుమించు అన్ని భాషలలోనూ ఉన్నాయి.

### 3. 5. ఔపవిభక్తికాలు :

ద్రావిడ భాషలలో కొన్ని నామవాచకాలకి (సంఖ్యావాచక, సర్వ నామాలతో సహా) ద్వితీయాది విభక్తులు చేరేముందు కొన్ని ప్రత్యయాలు చేరతాయి. వీటిని ఔపవిభక్తికాలు అంటారు. (వీటిని ఇంగ్లీషులో **Inflectional Increments** అని కాల్డ్‌వెల్ వ్యవహరించారు; మరికొందరు **Augments** అని అన్నారు; తమిళ వైయాకరణులు వీటిని "చారియై" అంటారు). వీటికి ప్రత్యేక మైన అర్థం లేదు కాని వీటి ఉపయోగం వీటి తరవాత ద్వితీయాది విభక్తులు వస్తాయని సూచించడమే.

**తమిళం :**

ఈ భాషలో ఔపవిభక్తికాలు- అన్-, -ఇన్-,-అఱ్ఱ్-,-త్తు.

-అన్- : ఇది ఏళ్ '7', ఉకారాంతములైన ఇతర సంఖ్యావాచకాలూ, అతు 'అది', ఇతు 'ఇది', యాతు 'ఏది' - ఈ సర్వనామాలూ - వీటి తరవాత వస్తుంది : ఏళ్నై 'ఏడుని', ఇరంట న్నిన్ 'రెండు కంటె', అఱుక్కు (< * అఱున్‌కు) 'ఆరుకి'.

సహార్థక ప్రత్యయమైన -ఒటు ముందు ఔప విభక్తిక ప్రత్యయం వైభాషికమని తొల్కాప్పియంలో చెప్పబడింది: ఇరంటొటు 'రెండింటితో' సాహిత్యంలో ఐంతాన్ "ఐదుతో', ఇరంటుక్కు 'రెండింటికి' వంటి ఔపవిభక్తిక రహిత లోపాలుకూడా ఉన్నాయి.

అతనై 'దానిని', అతనాల్ 'దానివల్ల', అనితల్ / అతిల్ 'అందులో' ఇతనిల్ / ఇతిల్ 'ఇందులో'.

ఇన్- : ఇది ఏకాచ్క నామాలమీదా, ద్వ్యచ్క నామాలమీదా ఉకార, ఐకారాంత నామాలమీదా వైభాషికంగా వస్తుంది. సాహిత్యంలో ఇది ఉన్న రూపాలూ లేనిరూపాలూ కూడా ఉన్నాయి: ఎళుత్తిఱ్కు/ఎళుత్తుకు 'అక్షరానికి' కరుం పిఱ్కు / కరుంపుక్కు 'చెరకు (గడ)కి', కిళంకినొటు / కిళంకొటు 'దుంపతో', నానా/నావినాల్ 'నాలుకతో', చొల్లిఱ్కు / చొఱ్కు 'మాటకి', కణ్ణాల్ / కణ్ణినాల్ 'కంటితో' అవావినాల్ 'ఆశవల్ల', ఇన్మైయినా 'దారిద్ర్యం వల్ల' ఇది - అఱ్ఱు-, త్ - తరవాత ఇది వైకల్పికం : అవఱ్ఱిఱ్కు 'వాటికి', తవత్తిఱ్కు / తవత్తుక్కు 'తపస్సుకి', ఉళ్ళత్తిఱ్కు / ఉళ్ళత్తుక్కు 'మనస్సుకి'.

తొల్కాప్పియంలో ఇది - ఇన్ కంటె,లో' అనే విభక్తి ప్రత్యయం ముందు రాదని చెప్పబడింది. కాని ఆ గ్రంథంలోనూ, సంఘ వాఙ్మయ గ్రంథాలతోనూ దీనికి విరుద్ధోదాహరణలు కన్పిస్తున్నాయి: కళవినిన్ 'పెళ్ళికిముందు ప్రేమించుకొనే కాలంలో' (తొల్. 1445), కఱ్పినిన్ 'పాతివ్రత్యంకంటె', కళత్తినిన్ 'పొలంలో'.

-అఱ్ఱు -; ఇది పల 'చాలా వస్తువులు)', చిల 'కొన్ని వస్తువులు', యా, యావై 'ఏవి': అవ్ 'అవి', ఇవ్ 'ఇవి', ఉవ్ 'ఇవి (అనతిదూరం)', ఎల్లాం 'అన్నీ' అనేనాటితో వస్తుంది : పలవఱ్ఱిల్ చాలావాటిలో', అవఱ్ఱొటు 'వాటితో', చిలవఱ్ఱుళ్ 'కొన్నింటిలో', ఎల్లావఱ్ఱై 'అన్నింటినీ'

-త్తు- : ఇది మకారాంత నామాలతో సహార్థకమైన -ఒటు, చతుర్థీవిభక్తి ప్రత్యయం -క్కు-లు తప్ప మిగిలిన ద్వితీయాది విభక్తులముందు నిత్యంగా వస్తుంది (-త్తు- చేరినప్పుడు మకారం లోపిస్తుంది). -ఒటు, -క్కు-ల ముందు ఇది ప్రాచీన సాహిత్యంలో వైభాషికం.

వేళ్ళత్తై 'మగ ఏనుగుని', (వేళ్ళం)' కలత్తిల్ 'పడవలో', (కలం) ఉలకత్తుళ్ 'లోకంలో' (ఉలకం).

వేళ్ళక్కు 'మగఏనుగుకి', వైయక్కు 'లోకానికి', నేలకు 'నేలకి', మనక్కు 'మనస్సుకి' (వీటికి వేళ్ళత్తుకు వంటి రూపాంతరాలు కూడా ఉంటాయి).

కాలమొటు 'కాలప్రత్యయంతో', నెంచమొటు 'మనస్సుతో' చుట్టుమొటు 'చుట్టాలతో'. అఱత్తొటు 'ధర్మంతో', కటాత్తొటు 'మదజలంతో'.

దీర్ఘాచ్చుగలిగి టు ఱులతో అంతమయ్యే ద్వ్యచ్క నామాలకీ, టు ఱులతో అంతమయ్యే ద్వ్యచ్క నామాలకీ ద్వితీయాది విభక్తులు చేరేటప్పుడు ట, ఱలు ద్విరుక్తమవుతాయి. ఈ ద్విరుక్త ట ఱ కారాలు టు, ఱులకిత్తు అనే ఔపవిభక్తికం చేరడం వల్ల జరిగిన సంధి ఫలితమని చెప్పవచ్చు.

కోట్టాల్ 'ఏనుగు) దంతంతో' (కోటు), పకట్టాల్ 'బలంతో' (పకటు); ఏఱొటు/ఏఱొటు 'ఎద్దుతో' ఏఱ్ఱై 'ఎద్దుని' (ఏఱు), కళిఱ్ఱుటు/ కళిఱొటు 'మగ ఏనుగుతో (కఱు), (ఱుకి-ఒటు ముందు ద్విరుక్తి వైభాషికం).

మలయాళం :

-త్- : ఇది మకారాంత నామాలతోనూ, టు, ఱు లతో అంతమయ్యే నామాలతోనూ వస్తుంది, టు / ఱు + త్ → ట్ట్ / ఱ్ఱ్ టు తో అంతమయ్యే నామాలలో ఇది వైభాషికం.

కలత్తై 'పడవని' (కలం), తోట్టత్తిల్ 'తోటలో', కాటిల్ / కాట్టిల్ 'అడవిలో', చరటిల్ /చరట్టిల్ 'తాడులో' (చరటు), ఆఱ్ఱిల్ 'నదిలో' (ఆఱు)

ప్రాచీన మలయాళంలో సహార్థకమైన -ఓటు ముందు మకారాంత నామాలలో ఔపవిభక్తిం లేని రూపాలుకూడా ఉన్నాయి: తిఱమోటు 'ధైర్యంతో'

-అన్- : ప్రాచీన మలయాళ శాసనాలలో ఇది అతు 'అది', ఇతు 'ఇది' అనే వాటిలో ఉంది : ఇతనై 'దీన్ని'.

-అట్ట్- : ప్రాచీన మలయాళ శాసనాలలో ఇది అవ్ 'అవి', ఇవ్ 'ఇవి' అనేవాటి తరవాత వస్తుంది అవట్టై 'వాటిని', అవట్టాల్ 'వీటివల్ల'. దీనికి -ఇట్ట్- అనే రూపాంతరం కూడా ఉంది : ఇవై యిట్టిల్ 'వీటిలో' (ఆధునిక మలయాళంలో ఈ ప్రత్యయాలు లేకుండా అవయిల్ 'వాటిలో', ఇవయిల్ 'వీటిలో' - ఇలాగే ఉంటాయి). ప్రాచీన భాషలో ఇది పల 'చాలా', చిల 'కొన్ని', ఎల్లాం 'అన్నీ' అనే మాటలలో కూడా ఉంది.

-ఇన్- : ఇది హలంతాలతోనూ, దీర్ఘాచ్చు చివర ఉన్న వాటితోనూ, ఉకారాంతాలతోనూ వస్తుంది. (హలంతాల చివర ఆధునిక మలయాళంలో సంవృతాకారం (ə) ఉంటుంది). ఆధునిక మలయాళంలో ఇది చతుర్థీ షష్ఠీ విభక్తుల ముందు నిత్యం; ఇతర విభక్తుల ముందు వైభాషికం. కాని చతుర్థీ ప్రత్యయం ఉ (ə) ముందే ఇది వస్తుంది; - ఉక్కు ముందు రాదు, రాజావినాల్ / రాజావాల్ 'రాజువల్ల', కాంటిడె / కాంట్టిడె 'అడవియొక్క', కాట్టిను / కాటిను/ కాట్టుక్కు కాటుక్కు / 'అడవికి', వాళాల్ / వాళినాల్ 'కత్తితో', అతిను 'దానికి', ఇతిను 'దీనికి'.

ఇది సాధారణంగా బహువచన ప్రత్యయం తరవాత రాదు కాని సాహిత్యంలో దీనికి కొన్ని విరుద్ధోదాహరణలు ఉన్నాయి. ఇది -త్త్-; -ట్ట్- ల తరవాత కూడా ప్రాచీన సాహిత్యంలో వస్తుంది : చంతనత్తినుక్కు 'చందనానికి', కరత్తినాల్ 'చేతిలో', కులత్తిన్ను 'కులానికి'.

కోత :

-న్- : ఇది అమనుష్యైక వచన సర్వనామాలతో వస్తుంది : అద్‌న్‌క్ 'దానికి', ఇద్‌న్‌ల్ 'ఇందులో' ఎద్‌నోడ్ 'దేనితో', -త్- : ఇది మ, ర, డ లతో అంతమయ్యే కొన్ని నామాలతో వస్తుంది. మకారాంతాలలో ఇది ద్వితీయ ముందూ, సహార్థకం ముందూ వైభాషికం (మకారం దీని ముందు లోపిస్తుంది; ర్ + త్ → ఱ్, డ్ + త్ → ట్), మొల్‌త్‌క్ 'కుందేలుకు' (మొల్‌మ్), మొల్‌మోడ్ / మొల్‌తోడ్ 'కుందేలుతో', మొల్‌త్‌న్ / మొల్‌మ్‌న్ 'కుందేలును', కాట్‌ల్ 'పొలంలో' (కాడ్), వేఱ్‌ల్ 'వేరులో' (వేర్).

కొడగు :

-త్- : ఇది అ (<* అం) తో అంతమయ్యే నామాలకి వస్తుంది: బయతోడె 'భయంతో', మర్‌త 'చెట్టుయొక్క', మరత్కు / మరకు 'చెట్టుకి' (కు ముందు ఇది వైభాషికం); -త్ న్- ద్వితీయా తృతీయల ముందు ఉంటుంది; కూటత్న 'గుంపుని', మరత్నొండు 'చెట్టుతో', -న్- : ఇది అకారంకాక మిగిలిన అచ్చుతో అంతమయ్యే నామాలకి ద్వితీయా తృతీయలముందు చేరుతుంది; అదున 'దాన్ని', అదునోడె 'దానితో', మనెన 'ఇంటిని', కత్తినొండు 'కత్తితో'; -అన్- సంఖ్యావాచకాలకి ద్వితీయా చతుర్థీ పంచముల ముందు చేరుతుంది: ఒందాన 'ఒకటిని', మూందాంగు 'మూడింటికి', నాలాండ 'నాలుగుయొక్క', నూరాంగు 'నూటికి', -డ్- సర్వనామాలకి, ప్రాణివాచకాలకి సప్తమీ పంచముల ముందు చేరుతుంది: నాడల్లి 'నాలో/దగ్గిర', నీడల్లింజి 'నీదగ్గరనించి' అవడల్లి 'ఆమెదగ్గర' అక్కెండల్లి 'అక్కదగ్గిర', పయ్యుడల్లింజి 'ఆవుదగ్గరనించి'.

కన్నడం: -ఇన్-, -ద్-, -అణ్-, -అఙ్-.

'ఇన్' : ఇది ఉకారాంతాల తరవాతా, ఏకాచ్కాల తరవాతా, కొన్ని హలంతాల తరవాతా వస్తుంది: కూసిన 'పిల్లయొక్క' (కూసు), పూవిన 'పువ్వుయొక్క' (పూ), పగలిన 'పగలుయొక్క' (పగల్), పావింగె/హావిగె పా'ముకి' (పావుహావు), ఇది ద్వితీయావిభక్తి ముందురాదు: పాపం/హావన్ను 'పాముని', ఆధునిక కన్నడంలో దీనిలో నకారం హల్లుముందు లోపిస్తుంది.

-ద్- : ఇది మకారాంతాల తరవాత వస్తుంది (దీనిముందు మకారం లోపిస్తుంది). ఇది ద్వితీయా చతుర్థీ విభక్తులముందు ఉండదు. వీటిముందు మకారం లేని రూపం ఉంటుంది. (ఆధునిక కన్నడంలో పదాంత మకారం లోపిస్తుంది).

మరదొళ్/మరదల్లి 'చెట్టులో' (మరం/మర), మరద 'చెట్టుయొక్క', మరవం/మరవన్ను 'చెట్టుని', మరక్కె 'చెట్టుకి', కొళదిం/కొళదింద 'చెరువు నించి' (కొళం/కొళ).

అణ్ -: ఇది ఉకారాంతాలైన దిగ్వాచి శబ్దాలకీ, వ్యవస్థా వాచి శబ్దాలకీ వస్తుంది: మూడణ 'తూర్పుయొక్క' (మూడు) పడువణ 'పడమటి' (పడు), ఒళగణిం/ఒళగినింద 'లోపలనించి' (ఒళగు), ముందణ/ముంతణ 'ముందటి' (ముందు) కెళగణ/కెళగిన 'కిందటి' (కెళగు), ఇది ద్వితీయా సప్తమీ విభక్తుల ముందు రాదు.

-అఱ్- : ఇది సంఖ్యావాచకాలతోనూ అమనుష్య సర్వనామాలతోనూ (ఏకవచన, బహువచనాలు) వస్తుంది : ఎరడఱొళ్/ఎరడరల్లి 'రెండింటిలో' (ఎరడు), ఐదఱొళ్/ఐదరల్లి 'ఐదులో', ఏళఱొళ్/ఏళరల్లి 'ఏడులో', అదఱ/అదర 'దాని', అదఱ్కె/అదక్కె 'దానికి', (హల్లు ముందు ఱ రగా మారుతుంది), ఇదఱ/ఇదర 'దీని', అవఱ/అవుగళ 'వాటి' (అవు), ఇవఱిం/ఇవుగళింద 'వీటినించి' (ఇవు).

ఇది సాధారణంగా ద్వితీయావిభక్తిముందు రాదు: ఇవం/ఇవుగళన్ను 'వీటిని', ఒందం/ఒందన్ను 'ఒకటిని'.

తుళు :

-త్-, -ద్-, -న్-/-ఎన్-, ఈ భాషలో ఔపవిభక్తిక ప్రత్యయాలు షష్ఠీ విభక్తిప్రత్యయమైన -అ ముందే చేరతాయి.

-త్- : ఇది ఏకాచ్కాలూ, (హ)(హ) అ హ అ - ఈ నిర్మాణం ఉన్న ద్వ్యచ్కాలూ, అకారాంతాలూ (ఇవి మొదట్లో అంతో అంతమయ్యేవి) అయిన ప్రాతిపదికలమీద షష్ఠీవిభక్తి ముందు చేరుతుంది: పూత 'పువ్వుయొక్క', కయ్‌త్ 'చేతియొక్క (కయ్), కురిత 'గొర్రెయొక్క', సిమ్మంత 'సింహం యొక్క' (సిమ్మ).

-ద్- : పైన చెప్పిన ప్రాతిపదికలు కాక మిగిలిన ప్రాతిపదికలమీద ఇది షష్ఠీవిభక్తిముందు చేరుతుంది: కంజిద 'దూడయొక్క', ఇల్లుద 'ఇంటియొక్క', బొళ్ళుద 'కాంతియొక్క'.

-న్-/ఎన్-: -న్- ప్రత్యయం మనుష్యవాచకశబ్దాల తరవాత షష్ఠీవిభక్తి ముందు చేరుతుంది: ఓడారిన 'కుమ్మరి యొక్క', గురున 'గురువుయొక్క', కురుడిన 'గుడ్డిదానియొక్క.'

ఎకారమూ, నిరోష్ఠీకృత ఉకారమూ చివర ఉన్న పదాలు తరవాత ఇది వైకల్పికంగా వస్తుంది; ఇది చేరినప్పుడు మాత్రం ఎకారం అకారంగా మారుతుంది : పురుషన/పురుష 'పురుషుని యొక్క' (పురుషె), కుద్కన/కుద్క 'నక్కయొక్క' (కుద్కె), మగళ్ణ/మగళ 'కూతురు యొక్క' (మగళు), బహువచన ప్రత్యయం తరవాత కూడా -న్- ప్రత్యయం షష్ఠీవిభక్తి ముందు వస్తుంది; కాని బహువచన ప్రత్యయం ముందు హల్లు ఉంటే -న్-కి బదులు -ఎన్- వస్తుంది : మర్లెర్న 'పిచ్చివాళ్ళ' (మర్లెరు), కరడిళ్ణ 'ఎలుగుబంట్ల' (కరడిళు), పిలిక్‌ళెన 'పులుల' (పిలిక్‌ళు), ఆక్‌ళెన 'వాళ్ళ' (అక్‌ళు).

(బహువచన ప్రత్యయ, స్త్రీప్రత్యయాల చివర అచ్చు షష్ఠీ విభక్తి కాక మిగిలిన విభక్తులముందు ఎకారంగా మారుతుంది : అళెగు 'ఆమెకి' (అళు), కంజిళెడ 'దూడలతో' (కంజిళు). (ఈ ఎకారం ఎన్ రూపాంతరం అని చెప్పవచ్చు).

**తెలుగు :**

మన వ్యాకరణాలలో ఇ, టి, తి అనే మూడింటిని ఔపవిభక్తికాలుగా పరిగణించారు (ఇ, టి, తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు, బాలవ్యా, ఆచ్ఛిక పరిచ్ఛేదం, సూ. 28).

-ఇ- : ఊరిని. కాలిని, మ్రానిని, నోరిని/నోటిని.

-టి- : త్రాటిని, ఏటిని, అన్నిటిని/అన్నింటిని, ఎనిమిదిటిని ఎనిమిదింటిని, రెంటిని, రెండిటిని, నూటిని/నూఱిటిని, కంటిని, ఇంటిని, (హ్రస్వము మీది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు; సూ. 32; పదాద్యంబగు హ్రస్వంబుమీది టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు. సూ. 33).

-తి- : అఱితిని(అఱ్ఱు), వఱుతన్(వఱ్ఱు), గోతిలో, నూతిలో, చేతిలో, నేతిలో, వాతిలో. (గోయి ప్రభృతులలో తివర్ణం బహువచనం ముందుకూడా వస్తుంది, సూ. 35.)

(ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు —గోరన్/గోరితోన్, ఊరన్ ఊరిలోన్, ఇంటన్/ఇంటిలోన్; సూ. 38).

ఇవికాక కొన్ని ప్రాతిపదికలకి, ద్వితీయాది విభక్తులకి ముందు వచ్చే మరికొన్ని వర్ణాలనికూడా మనం ఔపవిభక్తికాలుగా పరిగణించవచ్చు. అవి రామునకును, విధాతృనకును వంటి వాటిలో నకారమూ (కువర్ణకంబు పరంబగు నపుడుకార ఋకారంబులకు నగానమంబగు, తత్సమపరిచ్ఛేదం, సూ. 28), రామునందును. విధాతృనందును వంటి వాటిలో పొల్లు నకారమూ (ఉకార ఋకారంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు, సూ. 29), డుమంతాలకి వచ్చే నిగాగమంలో ఇకారమూ (రాము(ని)చేతను, మగనిచేతను, తమ్ము(ని)చేతను, సూ. 23, 24), బహువచన ప్రత్యయం తరవాత వచ్చే

అకారమూ - రాములను, రాములచేతను మొ॥ (వీటిలో లకారం ప్రాచీన వ్యాకరణాలలో లడాగమం అని వ్యవహరించబడింది; బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు, సూ. 31).

**గోండి: -ద్-, -త్-, -న్-, -ట్-, -φ-**

-ద్- : ఇది హ్రస్వాచ్చు ఉండి ఢ, య, ర, వలతో అంతమయ్యే ఏకాచ్క నామాల తరవాతా, న, ల లతో అంతమయ్యే ఏకాచ్కాల తరవాతా, ర, ల లలో అంతమయ్యే అమనుష్య వాచక ద్వ్యచ్కాల తరవాతా వస్తుంది: కఢ్దగ్గా 'కంట్లో', కయ్‌దే 'చేతిలో, చేతితో', కొర్దూన్ 'కోడిని', కెవ్‌దగ్గా 'చెవిలో', పేన్‌దగ్గా 'దేవుడిదగ్గర', కాదే 'కాలిలో, కాలితో' (కాల్), ముల్లో ఢూన్ 'కుందేలుని' (ముల్లోల్), ఖాసూఢ్గ్గా 'బండిలో' (ఖాసూర్).

-త్- : ఇది అజంతాలైన అమనుష్యవాచకాల తరవాతా వ, ర, ల లతో అంతమయ్యే మూడు నామాల తరవాతా వస్తుంది. కొందాతూన్ 'ఎద్దుని', తఢాయితే 'చెరువులో', రోతాల్ 'ఇంటి దగ్గరనించి', (రోన్), ఏతే 'నీటిలో (ఏర్), వెఢీల్‌దూన్ 'ముసలివాణ్ణి'.

-న్- : ఇది అజంత మనుష్యవాచకాల తరవాతా, -అల్ ప్రత్యయంతో అంతమయ్యే పురుషవాచకాల తరవాతా, -క్ బహువచన ప్రత్యయం తరవాతా (ద్వితీయేతర విభక్తులముందు), -ద్-, -త్-లు వచ్చేది కాక మిగిలిన అమనుష్య వాచకాల తరవాతా (ద్వితీయేతర విభక్తుల ముందు), నిర్దేశకైక వచన సర్వ నామాల తరవాతా వస్తుంది : మరీన్ 'కొడుకును', కాకాన్ 'బాబయ్యని', (కాకాల్) కఢ్క్నగ్గా కళ్ళలో, కొరోప్నగ్గా 'మజ్జిగలో', వోన్ 'వాణ్ణి (వోర్), తాన్ 'దాన్ని' (అద్).

-ట్- : ఇది రతో అంతమయ్యే కొన్ని నామాల తరవాతా (దీనిముందు ర లోపిస్తుంది), ఆగ్గా 'అక్కడ' మొదలైన కొన్ని పదాల తరవాతా (పంచమీ విభక్తి ముందు వస్తుంది.) నాటే 'ఊళ్లో' (నార్), కోటే 'కొమ్ముతో' (కోర్),

అగ్గాటాల్ 'అక్కడనించి', పైన చెప్పినచోట్ల తప్ప మిగిలినచోట్ల ఔపవిభక్తికం లేదు : తరాసూన్ 'పాముని', కల్లీరూన్ 'దొంగలని', సేలాడ్గూన్ 'చెల్లెళ్ళని'.

కొండ : -ది-, -తి-, -జ్రీ-, -ఇ-, -అ-, ,φ-

-ది- : ఇది పురుషేతరవాచకైక వచనరూపాలలో చాలావాటికి తరవాత వస్తుంది : అయ్‌లిది 'అమ్మాయి', ఔకది 'రెక్క', బోదెల్‌ది 'పెళ్ళికూతురి', అగసమ్‌ది 'ఆకాశం', -తి-, -జ్రీ-లు దీని రూపాంతరాలే. -తి- కొన్ని మకారాంత ప్రాతిపదికలకి చేరుతుంది : దూరమ్‌తి 'దూరం', దేశమ్‌తి 'దేశం', -జ్రీ- న, ల, అ లతో అంతమయ్యేవాటి తరవాత వస్తుంది (ఈ హల్లులు దీని ముందు లోపిస్తాయి) : ఒ'ఎజ్రీ' 'ఎల్లుండి' (ఒ'ఎన్'), మొదొజ్రి 'మొదటి' (మొదొల్), దగుజ్రి 'దగ్గర' (దగ్‌అ).

-ఇ- ; ఇది పురుష బహువచన ప్రత్యయమైన -ర్ తరవాతా, పురుష వాచక సర్వనామాలూ అది, ఇది అనే శబ్దాల తరవాతా వస్తుంది : అనసిరి 'అన్నల' (అనసిర్), బుబరి 'తల్లిదండ్రుల', వని 'వాణి' (వాన్డు), వరి 'వారి, వాళ్ల' (వారు), దని 'దాని' (అది), దెని 'దీని' (ఇది).

-అ- : క్, జ్ బహువచన ప్రత్యయాల తరవాత ఇది చేరుతుంది : కిక 'చేతుల' (కి-కు),, కాల్క 'కాళ్ల' (కాల్-కు), కోడిజ 'ఆవుల' (కోడి-జ్), వన్క 'వాటి' (అవి), వెన్క 'వీటి' (ఇవి).

పురుషవాచక నామాలకీ, సి ప్రత్యయ్యం ఉన్న బంధువాచకనామాలకీ (ఏకవచనంలో) ఔపవిభక్తికాలు లేవు.

పెంగొ : -త్-, -ద్-, -ఎన్-, -అల్-, -క్-

-త్- : శ్వాసహల్లు చివరగల ఏకాచ్కనామాలకీ, అనేకాచ్కనామాలకీ ఇది చేరుతుంది : రాచ్‌తిజ్ 'పాముని, పాముకి', నెకుడ్‌తిజ్ 'కుక్కని, కుక్కకి', మాస్తిజ్ 'నెలకి', బుర్కతిజ్ 'పులిని, పులికి', (అనేకాచ్కాలలో ఇది షష్ఠీవిభక్తి ముందు ఉండదు.)

-డ్- : శ్వాసహల్లుగాని, అనునాసికసహితస్పర్శంగాని చివరలేని ఏకాచ్క నామాలకి ఇది చేరుతుంది : కాల్ దిజ్ 'కాలికి, కాలిని', వెయ్‌దొ 'నోట్లో', హాల్ దొ 'పొయ్యిలో'.

-న్-ఇది అనేకాచ్కనామాలకి తరవాత షష్ఠీప్రత్యయం ముందు చేరుతుంది. ఓడని 'మేకయొక్క', వచ్కని 'వేలియొక్క', కెయ్‌కుని 'చేతులయొక్క'.

-అల్- : ఇది మనుష్యేతర నిర్దేశక సర్వనామాలకి ద్వితీయా - చతుర్థీ ప్రత్యయం ముందు చేరుతుంది: ఎదలిజ్ 'దాన్ని, దానికి' (ఎది).

-క్- : ఇది బహువచన ప్రత్యయాలైన -కు-, -జ్-/ఇజ్‌ల తరవాత ఇది నచ్చినపుడు కు వైకల్పికంగా లోపిస్తుంది. దీని తరవాత -అజ్/-ఉజ్/-ఇజ్ అనే ఒక ప్రత్యయం మాత్రమే ద్వితీయా, చతుర్థీ సప్తమ్యర్థాలలో వస్తుంది : ఇల్కుకజ్/ఇల్కజ్/ఇల్కుజ్ 'ఇంటిని, ఇంటికి, ఇంట్లో', కెల్కుకజ్/కెల్కజ్/కెల్కుజ్ 'ఈకల్ని, ఈకలకి, ఈకలలో', ఓడకజ్ 'మేకల్ని, మేకలకి, మేకలలో' (ఓడజ్). ఇది స్త్రీవాచకనామాలలో రాదు.

మనుష్యవాచకనామాలకి ఔపవిభక్తికాలు సాధారణంగా చేరవు.

**కూయి : -ఇ-, -ని-, -అ- -అఢిని-, -అఢి-.**

-ఇ- : ఇది పురుష బహువచనప్రత్యయమైన -ర్ తరవాతా, పురుషైక వచన ప్రత్యయమైన -న్ తరవాతా (ప్రథమా విభక్తిలో దీని రూపాంతరం ంజు) వస్తుంది : ఆబరిఇ 'తండ్రులని', నెగరికి 'మంచివాళ్ళకి', మ్రైహెనికి 'మగవాడికి' (మ్రైహెంజు), నెగనికె 'మంచివాడితో' (నెగంజు).

-ని- : ఇది స్త్రీవాచక నామాలకీ రెండు వచనాలలోనూ చేరుతుంది (దీనిలో ఇకారం చతుర్థీ, సహాయార్థక ప్రత్యయాలముందు లోపిస్తుంది; ని + కి / కె → ంగి / ంగె) : అజనిఇ 'అమ్మని', అజస్కనిఇ 'తల్లులని', నెఘాంగి 'మంచిదానికి', నెగస్కంగి 'మంచివాళ్ళకి (స్త్రీలు)', ఇది బహువచన

ప్రత్యయమైన -ంగ కి కూడా చేరుతుంది కాని మనుష్యేతర వాచకాల బహు వచన రూపాలకి బదులు ఏకవచనరూపాలే సాధారణంగా వాడుకలో ఉన్నాయి.

-అ- : మనుష్యేతర సర్వనామాలకీ, విశేషణాల నించి వచ్చిన అమ నుష్య నామాలకీ (Appellative and Participial nouns) ఇది చేరుతుంది: నెగర 'మంచిదాన్ని' (నెగిరి), నెగఅ 'మంచివాటిని' (నెగఇ), వానర 'వచ్చే దాన్ని' (వానరి), వానఅ 'వచ్చేవాటిని' (వానఇ). ఈర 'దీని' (ఈరి 'ఇది'), ఈవ 'వీటి' (ఈవి).

అమనుష్యనామాలకి విభక్తులు చేరడం అరుదు; కాని వీటికి ద్వితీయా విభక్తిలో తిని, చతుర్థిలో తింగి చేరతాయి : కోరుతిని 'గేదెని', కోర్కుతిని 'గేదెలని', కోరుతింగి 'గేదెకి', కోర్కుతింగి 'గేదెలకి'.

-అఢిని-: ఇది స్త్రీ వాచకైక వచన నిర్దేశక సర్వనామాలకి చేరుతుంది : ఈరఢినిఇ 'దీనిని'.

.అడి-: ఇది మనుష్యేతర నిర్దేశక సర్వనామాలకి ఏకవచన బహువచ నాలలో చతుర్థి విభక్తి ముందు చేరుతుంది : ఈరడికి 'దీనికి', ఈవడికి 'వీటికి'.

**కువి : -త్-, -న-, -ఇ-, -?-.**

-త్- : ఇది మనుష్య వాచకైకవచన నామాలకి షష్ఠీ విభక్తి ముందు నిత్యంగానూ, చతుర్థీ విభక్తి ముందు వైకల్పికంగానూ చేరుతుంది. (చతుర్థీ భక్తి ముందు దీనిరూపం -త-) : మ్హైహతి 'మరుషునియొక్క', మ్హైహ(త)కి 'పురుష డికి'. అమనుష్య వాచకాలకి ఏక వచనంలో పంచమితప్ప మిగిలిన విభక్తుల ముందూ, బహువచనంలో షష్ఠీ చతుర్థులముందూ (చతుర్థిముందు వైకల్పికం) చేరుతుంది: కడ్డతి 'నదియొక్క', కడ్డజతి 'నదులయొక్క', కడ్డతకి 'నదికి', కడ్డజ్(త)కి 'నదులకి'.

.న- : ఇది స్త్రీవాచకాలకి ఏకవచనంలో చేరుతుంది. (దీనిలో అకారం అచ్చుముందు లోపిస్తుంది): ఆయనకి 'స్త్రీకి', ఆయని 'స్త్రీని, స్త్రీయొక్క'.

-ణ- : ఇది పురుషవాచక ప్రత్యయమున్న నామాలకి ఏకవచనంలో చేరుతుంది: కొకణకి 'అబ్బాయికి' (కొకసి), స్త్రీవాచకాలలో కొన్నిటిలో కూడా ఇది ఉంటుంది: హనణి 'వెళ్ళేదాని', హనణకి 'వెళ్లేదానికి', -జ బహువచన ప్రత్యయం తరవాత ద్వితీయా సప్తముల ముందు ఇది వస్తుంది: కడ్డజణి 'నదులని' కడ్డజణ 'నదులలో'.

-?- : ఇది ద్వితీయా విభక్తి ముందు మనుష్యవాచక నామాలకి చేరుతుంది: మైహ?ఇ 'పురుషుణ్ణి', కొకర?ఇ 'అబ్బాయిలని'.

**కొలామీ :**

ఈ భాషలో నాలుగు నామాలకే ఔపవిభక్తిక రూపాలు ఉన్నాయి. అవి వేగాడ్ (వేగాట్-) 'పొలం', నల్ (నట్-) 'రోజు', సిడ్ (సిట్-) 'రోజు', ఉల్ (ఉట్-) 'రోజు', కుండలీకరణాలలో ఇచ్చినవి ఔపవిభక్తిక రూపాలు. వీటిలో టకారం తకారానికి సంధివల్ల ఏర్పడిన రూపాంతరం.

**నాయకీ (ఛాందా) :**

న్- : తోలెల్నున్ 'తమ్ముళ్ళని', బాయ్‌నున్ 'స్త్రీని'.

-త్- : ఇది కొన్ని నామాల తరవాత షష్ఠీ సప్తమీ విభక్తుల ముందు వస్తుంది: అపఢ్‌త 'ఇంటి', రాన్‌త 'అడవియొక్క', మద్గెత 'మామిడియొక్క', సదుమ్‌త 'నదియొక్క', కీతున్ 'చేతిలో', ఊసెతున్ 'ఉయ్యాలలో', సవ్లితున్ 'నీడలో'.

**పర్జీ :**

ఈ భాషలో షష్ఠీవిభక్తి ప్రత్యయం -త్, -తా (దక్షిణ మాం. త.), సప్తమీ విభక్తి ప్రత్యయం -తి. ఈ రెండిటిలో ఉన్న తకారం మిగిలిన సోదర భాషలలో ఔపవిభక్తికమైన *-త్త్-తో సంబంధించినదని ఊహించవచ్చు.

షష్ఠీ విభక్తికి ఉదాహరణలు : జువెత్ (నీర్) 'నూతి (నీళ్లు)', మెర్తా (ఎవుల్) 'చెట్టు (ఆకులు)', పొలుబ్‌త (పావ్) 'ఊరి (దోవ).

సప్తమీ విభక్తికి ఉదాహరణలు : పొలుబ్‌తి 'పొలంలో', కెయ్‌తి 'చేతిలో', నేదిర్తి 'నేలమీద', మిగిలిన విభక్తులలో ఔపవిభక్తికాలు లేవు.

గదబ (ఒల్లారి) :

ఈ భాషలో షష్ఠీ విభక్తి ప్రత్యయం -ట్, -టె : ఉలెట్ (లోక్) 'ఇంటి (లోవాళ్లు)', మర్‌టె (వేర్) 'చెట్టు (వేరు)', పొలుబ్‌టె (పావ్) 'ఊరి (దోవ)', సప్తమీ విభక్తి ప్రత్యయం -తిన్, -తున్: మర్తిన్ 'చెట్టుమీద', నికిడ్‌తిన్ 'నీడలో', అగ్లెతిన్ 'కుండలో', పొలుబ్‌తున్ 'ఊళ్లో'. వీటిలో టకార తకారాలు ప్రాచీన కాలంలో ఔపవిభక్తికాలు అయి ఉండవచ్చు. టకారం తృతీయా విభక్తి ముందు కూడ కొన్ని పదాలలో ఉంది: తొరుట్నాల్ 'తాడుతో' (తొరు), కడ్‌మెట్నాల్ 'కర్రతో' (కడ్‌మె), మిగిలిన విభక్తులలో ఔపవిభక్తికాలు లేవు.

బ్రాహుయీ :

ఏకాచ్కా నామాలకి సహార్థక, షష్ఠీ విభక్తుల ముందు అకారం చేరుతుంది: మారనా 'కొడుకుయొక్క' (మార్), మారతా 'కొడుకుతో', బా అనా 'నోటి', బా అతా 'నోటితో'.

బహువచన ప్రత్యయమైన -క్ ద్వితీయాది విభక్తుల ముందు -త్ -గా మారుతుంది: ఖరాస్తా 'ఎడ్లయొక్క' (ఖరాస్క్ 'ఎడ్లు'), ఖరాస్తెతా 'ఎడ్లతో'' ఖరాస్తేటీ 'ఎడ్లలో', మాతా 'కొడుకులయొక్క' (మాక్ 'కొడుకులు') ఈ తకారం తరవాత ద్వితీయా - చతుర్థీ, షష్ఠీ విభక్తులు తప్ప మిగిలినవాటి ముందు ఒక ఎకారం కూడా ఉంటుంది: ఖరాస్తెఅట్ 'ఎడ్లవల్ల', ఇటువంటి చోట్ల త ముందు బహువచన క కార లోపించిందని చెప్పవచ్చు. అంటే *ఖరాస్క్‌తా అని ఉన్నది కకారం లోపంవల్ల ఖరాస్తా అని మారిందని చెప్ప

వచ్చు. ఇటువంటి విభజనవల్ల -ల్-ని ఔపవిభక్తికంగా పరిగణించి, అది మిగిలిన భాషలలో ఉన్న *-త్త్-కి సంబంధించినదని చెప్పవచ్చు. సలవాన్ మాండలికంలో ద్వితీయా - చతుర్థీ విభక్తి ముందు -త్- ఉండక, కకారమే ఉండడం గమనించదగినది: ఖరాస్తె 'ఎద్దని, ఎద్దకి' బదులు ఇందులో ఖరాస్కె అని ఉంటుంది.

## తులనాత్మక చర్చ

తులనాత్మక పరిశోధనవల్ల ఈ కింద ఇచ్చిన ఔపవిభక్తికాలని మూల ద్రావిడ భాషకి పునర్నిర్మించవచ్చు:

*త్త్, *అన్, *ఇన్, *అ, *అట్ట్.

కాని ఈ ప్రత్యయాలు చేరే ప్రాతిపదికలు భిన్నోప కుటుంబాలలో భిన్నాలుగా ఉంటాయి. ప్రాతిపదికా, ప్రత్యయమూ సమానంగా చాలా భాషలలో ఉన్న సందర్భాలు చాలా తక్కువ. దీనివల్ల ఈ ఔపవిభక్తికాల విషయంలో ఒక్కొక్క భాషలో చాలా మార్పులు జరిగాయని మనం చెప్పవచ్చు. ఒకే ఉప కుటుంబానికి చెందిన భాషలలో వీటి స్థితి విషయంలో చాలావరకూ సాదృశ్యం ఉంటుంది అని గుర్తించవచ్చు. వీటి అన్నిటిలోకీ మొదట ఇచ్చిన *త్త్ ప్రత్యయమే విశేషప్రాచుర్యం కలిగి ఉండి ఇంచుమించు అన్ని భాషలలోనూ కనపడుతోంది.

*-త్త్-; ఇది తమిళం- మలయాళం- కొడగు - కోత - తొద - కన్నడం అనే దక్షిణ ద్రావిడోప కుటుంబంలో మకారాంత నామాల తరవాత మాత్రమే వస్తుంది. కన్నడంలో మకారాంత నామాలలో కూడా ద్వితీయా చతుర్థుల ముందు ఇది రాదు (కన్నడంలో ఇది దకారంగా మారుతుంది). తుళులో దీని నుంచి వచ్చిన -త్-, -ద్- లు షష్ఠీవిభక్తికి ముందే ఉన్నాయి. ఈ భాషలో ఇది ఇంచుమించు అన్ని అమనుష్య వాచకాలకి వస్తుంది. కాబట్టి తమిళ - కన్నడోప కుటుంబంలో ఇది మకారాంత నామాలకే పరిమిత మవడమూ షష్ఠీతర విభక్తుల

ముందుకూడా రావడమూ ఈ ఉప కుటుంబంలో జరిగిన పరిణామాలని చెప్ప వచ్చు.

తెలుగులో ఇది చాలా కొద్ది నామాలకే వస్తుంది. గోండి, కొండ పెంగో లలో కూడా ఇది ప్రచురంగా ఉంది. నాయకీ - పర్జీ - గదబలలో అన్ని నామా లలోనూ షష్ఠీ సప్తముల ముందు వస్తుంది. బ్రాహుయిలో బహువచనంలోనే ఇది ఉంటుంది. దీని ముందు పురాతన బ్రాహుయిలో ఉండేదనీ అది తరవాత కాలంలో లోపించిందనీ చెప్పవచ్చు.

దక్షిణ ద్రావిడ భాషలలోనూ, తెలుగు, గోండి - కువిలలోనూ దీర్ఘాచ్చు కలిగి టు, ఱు లతో అంతమయ్యే ద్వ్యచ్క నామాలలో ద్వితీయాది విభక్తుల ముందు టు, ఱులు ద్విరుక్త మవుతాయి. ఇలా వచ్చిన *ట్టు, *ఱ్ఱులు ఒక్కొక్క భాషలో జరిగిన ధ్వని పరిణామాలకి అనుగుణంగా మారతాయి. వీటిలో కూడా *త్ ప్రత్యయం ఉందనీ అది టు, ఱు లతో కలియడం వల్ల ట్టు, ఱ్ఱు ఏర్పడ్డాయని చెప్పవచ్చు. ఉదా :

త. మ. నాటు (నాట్ట్-) 'దేశం', కోత. నాఢ్ (నాట్-) తో: నోఢ్ (నోట్-) 'పవిత్రస్థలం', తె. నాడు (నాట్-) 'దేశం' గోం. నార్ (నాట్-) 'ఊరు', కొం. నాఙ్ (నాట్-), పెం, నాజ్'/ నాస్ (నాట్-) మం. నాయ్ (నాట్-), కూయి. కువి, నాజు (నాట్-).

త. యాఱు (యాఱ్ఱ్-) 'నది', మ. ఆఱు (ఆఱ్ఱ్-), కో. ఏర్ (ఏత్ర్-), తె. ఏఱు (ఏట్-, ఏటి), గోం. ఏర్ (ఏత్-) 'నీళ్లు', కొం. ఏఙ్ (ఏఱ్ఱ్), పెం. ఏజూజ్ (ఏస్-), కూయి. ఏజు (ఏస్-), కువి. ఏయు (ఏస్-).

తెలుగులో టి, తి అనే ఔపవిభక్తికాలు దీనికి సంబంధించినవే. తె. ఏటికి (త. యాఱ్ఱిఱ్క), నూటికి (త. నూఱ్ఱిఱ్క) మొదలైన వాటిలో టి < *ఱ్ఱి < *ఱ్ + *త్తి వీటిలో ఇకారం *ఇన్‌కు సంబంధించినది. అన్నిటికి, రెండిటికి, నోటికి, నీటికి మొదలైన వాటిలో సామ్యంవల్ల టి వచ్చింది.

ప్రాచీనాంధ్రంలో నోటికి, నీటికి అనే వాటిబదులు నోరికి నీరికి అని ఉండడం గమనించదగినది.

*-అన్- : తమిళంలో -అన్- సంఖ్యావాచకాలకి అమనుష్యైకవచన సర్వనామాలకీ వస్తుంది. తెలుగు, గోండీ, కొండలలో దీని ప్రతిరూపాలు అమనుష్యైకవచన సర్వనామాలలో మాత్రమే ఉన్నాయి. ఉదా : త. అతు (అతన్-), తె, అది దాని - < *అతని-), గోం. అద్ (దాన్-) కొం. అది (దని-). మిగిలిన మధ్యోత్తర భాషలలో ఇది లేదు. కన్నడంలో సంఖ్యావాచకాలకి అమనుష్య సర్వనామాలకి - అఱ్ - వస్తుంది. తమిళం-అన్-, కన్నడం - అఱ్ - పరస్పర సంబంధం కలిగినవి అయి ఉండవచ్చు. కన్నడం - అఱ్ - *- నిన్ట్ - < *-అన్-త్- నించి వచ్చి ఉండవచ్చు. అంటే ఇందులో త్ అనే ఇంకొక ఔపవిభక్తికం అధికంగా చేరిందన్నమాట. తమిళం -అఱ్ఱ్-కి కూడా ఈ విధమైన చారిత్రక వివరణ ఇవ్వవచ్చు. తెలుగు సంఖ్యావాచకాలలో వచ్చే -ఇంటి-కూడా ఈ *-అన్ఱ్- నించే వచ్చి ఉండవచ్చు. ఇందులో అకారం ఇకారంగా మారడానికి కారణం దాని తరవాత వచ్చే ఇకారం ప్రభావం.

* -ఇన్- ఇది తమిళంలో చాలా నామాల తరవాత వస్తుంది కాని ఇది వైభాషికం. కన్నడంలో దీనిలో నకారం హల్లు ముందు ఆధునిక భాషలో లోపిస్తుంది : పావింగె/హావిగె 'పాముకి', తెలుగులో ఇ అనే ఔపవిభక్తికం *-ఇన్-నించి వచ్చినదే; కన్నడంలోలా ఇందులో కూడా నకారం లోపించింది: త. ఊరిఱ్కు ( <*ఊరిన్కు) : తె. ఊరికి, త. కాలిఱ్కు (< *కాలిన్కు), తె. కాలికి.

కొండ. ఇ, గోండీ, పెంగొ, కూయి. ఇ, ని, కువి న దీని నించి వచ్చినవే. తెలుగు తి, కొండ ది, తి, కూయి ని లలో ఇకారం దీనికి సంబంధించినదే. తమిళంలో కూడా త్ తరవాత ఇది రావడం గమనించదగినది.

కొండ, కూయిలలో ఇకారం పురుష బహువచన ప్రత్యయం తరవాత రావడం ఒక ప్రత్యేకత, తెలుగులో కూడా సర్వనామ సంఖ్యావాచకాలలో రు తరవాత ఇ వస్తుంది (వారికి, ముప్పురికి) కాబట్టి దీనివల్ల తెలుగు, కొండ, కూయిలు సన్నిహిత భాషలని తెలుస్తుంది.

* -అ- : ఇది యుష్మదస్మ దాత్మార్థక సర్వనామాలకి చతుర్థీ షష్ఠీ విభక్తులముందు చాలా భాషలతో చేరుతుంది (పైన చూడండి).

తెలుగులో బహువచన ప్రత్యయమైన లు తరవాతా, కొండ అమనుష్య బహువచన ప్రత్యయాలైన క్, జ్ ల తరవాతా అకారం వస్తుంది. ఈ అంశం తెలుగు, కొండల సాన్నిహిత్యాన్ని నిరూపిస్తుంది. (తుళులో -ఎన్- / -ఎ- కూడా బహువచన ప్రత్యయాల తరవాత వస్తుంది; దీనికి అకారానికి సంబంధం ఉందా అనే విషయంమీద ఇంకా పరిశోధన జరగాలి.)

* -అట్ట్- : దీని మూలరూపం < * -అన్ -ట్ట్- <* అన్ -త్- అని చెప్పవచ్చని ఇంతకు ముందే చూశాం. అంటే ఇది అన్, త్ అనే రెండు ఔపవిభక్తికాల సంయుక్తరూపం అన్నమాట. ఇది తమిళంలో అమనుష్య బహు వచన సర్వనామాలలోనే వస్తుంది. కన్నడంలో దీనినించి వచ్చిన -అఱ్- సంఖ్యా వాచకాలతోనూ, అమనుష్య సర్వనామాలలోనూ ఉంది. (కన్నడంలో ద్వితీయా క్షరంలో ప్రాచీన ద్విరుక్తహల్లు అద్విరుక్త మవడం సాధారణంగా ఉంది. *ఎనక్కు>క. ఎనగె 'నాకు'. అద్విరుక్తమైన తరువాత నాదం శ్వాస మవు తుంది). తమిళంలో అమనుష్యైకవచనరూపాలలో ఇదికాక -అన్- వస్తుంది; అదఱ్కు 'దాంట్లో'.

తెలుగులో అవి, ఇవి లకి ఔపవిభక్తికాలు గ్రాంథిక భాషలో వాని-, వీని-, వ్యావహారిక భాషలో వాటి-, వీటి-, వీటిని తమిళ రూపాలైన అవట్ట్-, ఇవట్ట్-, కన్నడ రూపాలైన అవఱ్-, ఇవఱ్- లతో పోల్చిచూస్తే తెలుగు వ్యావహారిక రూపాలే ప్రాచీనమైనవని తెలుస్తుంది (*ట్ట> తె.ట). గ్రాంథిక

రూపాలు అది (దాని), ఇది (దీని) అనే వాటి సామ్యంవల్ల ఏర్పడినవి అనేది స్పష్టం. అదేవిధంగా కన్నడంలో అదు (అదఱ్-), ఇదు (ఇదఱ్-) అనే వాటి ఔప విభక్తిక రూపాలు అవు (అవఱ్-), ఇవు (ఇవఱ్-) అనే వాటి సామ్యం వల్ల ఏర్పడినవి.

**3. 6. విభక్తి ప్రత్యయాలు :**

ద్రావిడ భాషలో ప్రాతిపదికమే ప్రథమావిభక్తిలో ఉపయోగించబడు తుంది. తెలుగు వైయాకరణులు ''డు, ము, వు లు ప్రథమ'' అని అన్నా అవి నిజానికి లింగవచన బోధకాలే గాని ప్రథమావిభక్తి ప్రత్యయాలు కావు.

**(i) ద్వితీయా విభక్తి :**

త. -ఐ : వేంతనై 'రాజుని', ఎన్నై 'నన్ను.'

మ. -ఎ : అవనె 'వాణ్ణి' (ప్రాచీన శాసనాలలో -ఐ ఉంది).

కోత. -న్ : కళ్న్ 'దొంగని.'

తొ. -న్ : కూఖ్ -న్ 'పిల్లని.'

కొడ. -న : (ళకారాంతాల తరవాత -అ : అవళ 'ఆమెని'), నన్న 'నన్ను', మరత్న 'చెట్టుని.'

క. (ప్రా), -అం/(అ), -అన్ను : మరవం, మరవన్ను 'చెట్టుని.'

తు. -ను : కంజిను 'దూడని', ఎనను 'నన్ను.'

తె. -నున్ (ఇకారాంతాల తరవాత -నిన్) : రాజునున్, తల్లినిన్.

గోం -ఊన్ (ఇది ఔపవిభక్తిక నకారం తరవాత లోపిస్తుంది) : బయ్యేన్ - ∅ 'అమ్మని', కోందాతూన్ 'ఎద్దుని.'

కొం. (ద్వితీయా - చతుర్థి), -జ్ (యుష్మదస్మదర్థకాలలో -జి) నుక్డి దిజ్ 'కుక్కని, కుక్కకి', నజి 'నాకు', మిజి 'మీకు.'

పెం. ద్వితీయా - చతుర్థి) -ఇజ్ (బహువచనం తరవాత -అజ్ : టొండెనిజ్ 'సోదరుడిని, సోదరుడికి' కెయ్కుకజ్ 'చేతుల్ని, చేతులకి.'

కూయి. -ఇ : ప్రీఎని ఇ 'కొడుకుని', ప్రమహ్నుతిని 'చెట్టుని.'

కువి, .ఇ మైహా?ఇ 'మనుష్యుణ్ణి', కడ్డతి 'నదిని'.

కో. -న్/ఊన్ : ఎల్లాన్ 'ఇంటిని', కోలవనూన్ 'కోలాంవాణ్ణి.'

నా. (ఛాం); -న్/-ఊన్/-ఓన్ : కోందాన్ 'ఎద్దుని', పులూన్ 'పులిని.'

ప. -న్/ఇన్ : ఏనున్ 'ఏనుగుని', పాపిన్ 'పిల్లని' (ఇన్‌లో నకారం వైభాషికం : పల్లిన్/పల్లి 'పండుని.')

గ. (ఓ.) :-న్/-ఇన్ : డుర్కన్ 'పులిని', మాలిన్ 'కూతుర్ని', (కొణేకోర్ మాండలికం) -న్ (అచ్చుతరవాత), -ఇన్, -ఉన్ పదం చివర పశ్చిమాచ్చు + హల్లు ఉంటే - ఉన్, ఇతరత్రా - ఇన్: మారెన్ 'చెట్టుని/కి/యొక్క', కాఙుర్-ఉన్ 'మంచాన్ని/నికి/మంచం యొక్క'; ఇందులో ద్వితీయ చతుర్థీ షష్ఠులకి ఒకటే ప్రత్యయం.

కూ, -అన్/-అన్/-ఇన్ : ఖెస్సన్ 'వడ్లు', ఎంగన్ 'నన్ను', అడ్డాన్ 'ఎద్దుని', ముక్కరిన్ 'స్త్రీలని'.

(ఈ భాషలో ద్వితీయా - చతుర్థులు తారుమారు అవుతాయి)

మా, -ఎన్/-ఇన్/-న్/-అ(న్): ఎంగెన్ 'నన్ను', మలెరిన్ 'మనుష్యుల్ని, కుచొాన్ 'కుక్కని', టూడ (న్) 'పులిని' (టూడ్-).

బ్రా. (ద్వితీయా—చతుర్థి) -ఎ దుజ్జె 'దొంగని, దొంగకి' మారె 'కొడుకుని, కొడుకుకి'.

ఇందుమించు అన్ని భాషలలోనూ అప్రాణివాచకాలలో ద్వితీయావిభక్తి వైభాషికం.

తమిళ-మలయాళాలు తప్ప మిగిలిన అన్ని భాషలలో ప్రత్యయాలకి మూలరూపం *-(అ)న్ (అ=అచ్చు). తమిళ - మలయాళాలలో దీనికి బదులు *-అయ్ నించి వచ్చిన రూపాలు ఉన్నాయి. ఈ మూలద్రావిడంలో మాండలిక భేదాన్ని సూచిస్తూ ఉండవచ్చు. కొండ, పెంగొ, కూడుఖ్, కొన్ని గోండీ

మాండలికాలలో ద్వితీయకీ చతుర్థికీ భేదం లేకపోవడం ఆర్యభాషల ప్రభావ ఫలితం. కొండ పెంగో ప్రత్యయాలు మొదట్లో చతుర్థీ ప్రత్యయాలు. కూయి-కువి-ఇ. ద్రా. -ఎ *-అయ్‌కి సంబంధించినవి అనడం కన్న వీటిలో నకారం లోపించిందని చెప్పడం సమంజసమని తోస్తుంది.

(ii) తృతీయ విభక్తి (కరణార్థకం (Instrumental), సహార్థకం (Sociative)

త. కరణార్థక ప్రత్యయాలు : -అన్, -ఆల్ : మరుప్పినాన్ 'తొండంతో,' కైయాల్ 'చేత్తో'. సహార్థక ప్రత్యయాలు: -ఒటు, ఓటు : పులియొటు/పులియోటు 'పులితో', సహార్థక విభక్త్యర్థకాలు: -ఉటన్ : కిళైయుటన్ 'చుట్టాలతో,' ముతల్ : కళైముతల్ 'చుట్టాలతో,' కాని కరణార్థకాలు సహార్థంలోనూ, సహార్థకాలు కరణార్థంలోనూ వాడడం కూడా తమిళ సాహిత్యంలో ఉంది.

మ. కరణార్థకం -ఆల్ : కైయల్ 'చేత్తో,' సహార్థకం -ఒటు/-ఓటు : అవనోటు అవనోటు 'వాడితో', -ఉటన్.

కోత. కరణార్థకం : మనుష్యవాచకాల తరవాత -ఆల్, అమనుష్య వాచకాల తరవాత -ఆర్ : ఎమాల్ 'మాచేత', పెడాల్ 'భార్యచేత', కణార్ 'కంటితో', పాబార్ 'పాముచేత', సహార్థకం : ఓడ్ : ఆమోడ్ 'మనతో', నాయోడ్ 'కుక్కతో'.

తొ. కరణార్థకం: శరీరావయవాల తరవాత -అణ్, అప్రాణివాచకాల తరవాత -ఇట్ (*ఇట్టు 'పెట్టి'), మిగిలిన పదాల తరవాత -ఆల్/ఇద్ : కొణార్ 'కంటితో', మొశ్‌తిట్ 'గొడ్డలితో', ఏమాల్/ఏమిద్ 'మాచేత'; సహార్థకం : -ఎిడ్/పొద్త్‌య్ : ఎన్-పొడ్ద్‌య్/ఎన్‌విడ్ 'నాతో'.

కొ. కరణార్థకం విభక్త్యర్థకాలు : -ఒండు (<*కొంటు 'తీసుకొని'), కయ్ంజ 'చేత' (ఇది షష్ఠీ విభక్తి తరవాత వస్తుంది): కత్తినొండు 'కత్తితో', నాడకయ్ంజ 'నా చేత వల్ల'; సహార్థక విభక్త్యర్థకాలు : జొతెలి, పక్క-, కూద (ఇవి షష్టీ విభక్తికి చేరతాయి): నాడజొతెలి/పక్క-/కూడ 'నాతో'.

క. ఈ భాషలో తృతీయా-పంచమీ విభక్తులకి ఒకటే ప్రత్యయం ఉంది. కరణ-అపాదానార్థకం : (ప్రా) -ఇం, -ఇందం, -ఇందె/(ఆ) ఇంద: పూగళిం హూవుగళింద 'పువ్వులతో, -పువ్వులనించి', ఇదఱిందం/ఇదరింద 'దీనితో, దీనినించి'. సహార్థకం: -ఒడనె : రామనొడనె 'రాముడితో', నన్నొడనె 'నాతో' యారొడనె 'ఎవరితో'

తు. ఏకాచ్కాలకీ, (హ) అహఅ - అనే నిర్మాణంగల ద్వ్యచ్కాలకి తరవాత -ట, మిగిలిన నామాల తరవాత -డ : క్రిమిట 'పురుగుతో' కంజిడ 'దూడతో', సిమ్మడ 'సింహంతో', ఈ ప్రత్యయం కరణసహార్థాలకి తుల్యం.

తె. -తోన్, -తోడన్ (శా. తోళన్), చేన్, చేతన్ : కత్తితోన్, కత్తిచే(త)న్ (కరణార్థం), ఔపవిభక్తికాలలో -అన్ : గోరన్, గోడ్డటన్, జడవాచకాలతో : కోలన్, బాణంబులన్, సహార్థంలో -తోన్, తోడన్ వస్తాయి: జనులతో(డ)న్, వ్యావహారికంలో తో, తోపాటు, తోకలసి తోకూడా లేక కూడా సహార్థకంలో వస్తాయి. వలనన్/(వ్యా.) వల్ల కారణాన్ని సూచిస్తాయి : ధనమువలనన్/ధనంవల్ల.

గోం. తృతీయా-సప్తమి : -ఏ : కయ్‌దే 'చేతితో/లో', నాటే 'ఊళ్లో', రూసీనే 'కత్తులలో/తో', రోన్ 'ఇంట్లో' (ఇందులో -ఏ లోపిస్తుంది). సహార్థక విభక్త్యర్థకం - థోడ్లో : వోన్‌థోడ్లో 'వాడితో'.

కొం. తృతీయా - పంచమి : -అండ్: -దుడుదండ్ 'దుడ్డుతో', పనెదండ్ 'దువ్వెనతో', దూరంతండ్ 'దూరాన్నుంచి' నేఅండ్ 'నేటినుంచి'. .ణి అనే షష్ఠీ ప్రత్యయం చేరే స్థల కాలవాచి శబ్దాలలో పంచమీ విభక్తి ప్రత్యయం -జ్: అబెణిజ్ 'అప్పటినించి', ఇన్‌ఞాణిజ్ 'ఇంట్లోనించి'.

సహార్థక ప్రత్యయం -వలె : మావలె 'మాతో'.

పెం. తృతీయా - పంచమి : -అజ్ : విల్లజ్ 'విల్లుతో', ఇంజజ్ 'ఇంటిదగ్గిరనుంచి', తృతీయా విభక్త్యర్థకాలు : లహజ్, హుదజ్, హాకె, సజ్- వీటిలో హాకె, హుదజ్‌లు కరణ సహార్థాలు రెంటింటిలోనూ వస్తాయి, మిగిలినవి కరణార్థకాలు : ముట్టలహజ్ 'సుత్తితో', బెంగియహాకె 'గొడ్డలితో', కొగ్లెక్‌హాకె 'ఆడవాళ్ళలో', హట్వహుదజ్ 'గరిటెతో', కోడిహుదజ్ 'ఆవుతో', కొపుసజ్ 'కోపంతో'.

నాటజ్ /నాటిజ్ అనే పంచమీవిభక్త్యర్థకం కాలవాచి శబ్దాలతో వస్తుంది : హొంబార్ నాటజ్ 'సోమవారం నించి' దీనికి కరణార్థంకూడా ఉంది : హూణజ్ నాటజ్ 'ముళ్ళతో'.

కూయి. తృతీయా - పంచమి : -డఇ (ఢహి) హెనిఢహి 'కత్తితో', బొగఢఇ 'బుట్టలోనించి'.

సహార్థకం -కె (నకారాంతరవాత -గె) : మరుస్కాంగె 'కూతుళ్ళతో', అజంగె 'తల్లితో'.

కువి. కరణార్థక విభక్త్యర్థకం - తొలె : హెపొర్‌తొలె 'చీపురుతో'.

కో. అచ్చు తరవాత -నాడ్, హల్లు తరవాత -ఆడ్ : కీనాడ్ చేతితో', 'చేతితో', తుపుకాడ్ 'తుపాకీతో'.

నా (ఛాం.) తృతీయా - పంచమి : -ల: సురిల 'కత్తితో' కీల 'చేతిలో' అంగడ్ల 'సంతనించి'. ఇదికాక -అఢ్, - తల్ కూడ పంచమ్యర్థంలో ఉన్నాయి. అదఢ్ 'అక్కడనించి', పొత్రల్ 'పైనించి'. సహార్థకం : నాకొన్ : తోలెనాకొన్ 'తండ్రితో'.

ప. కరణసహార్థకం : హల్లు తరవాత -ఒడ్, అచ్చు తరవాత -నాడ్: చేపిదొడ్ 'చీపురుతో' ఓనాడ్ 'వాడితో', ఇన్నోడ్ 'నీతో'.

గ. (ఒల్లారీ) కరణసహార్థకం : -నాల్ : కొటల్నాల్ 'పారతో', కుసెనాల్ 'కూరతో', నీర్నాల్ 'నీళ్ళతో', (కొణేకోర్) -నాట్ : కియుప్‌నాట్ 'కత్తితో'.

కూ. - తూలె/ - త్రీ/ - త్రూ : గొల్లస్‌తూలె 'యజమానివల్ల', ఆల్ త్రీ/ త్రూ 'మనిషివల్ల', సహార్థకం : - గుసన్/ - గనే : నమ్‌గుసన్ 'మనతో'.

మా. కరణార్థకం - ఎత్ / - ఇత్ / - త్ : కీడెత్ 'ఆకలివల్ల' టెటుత్ 'చేత్తో', అమెత్ 'నీళ్ళతో', మలెరిత్ 'మనుషులతో', సహార్థకం : - గుసన్/గనే :

బ్రా. కరణార్థకం - అట్ : ఖరాసట్ 'ఎద్దుతో', లట్టట్ 'కర్రతో', సహార్థకం-తా : మారతా 'కొడుకుతో' (దీనికి కరణార్థం కూడా ఉంది: లట్టతో కర్రతో').

కరణార్థానికి సహార్థానికి చాలా భాషలలో ప్రత్యేకమైన ప్రత్యయాలు ఉన్నాయి. వీటికే ప్రత్యయం ఉన్న తెలుగువంటి భాషలలో కూడా వీటి భేదాన్ని ఏదో ఒకవిధంగా సూచించవచ్చు. ఉదాహరణకి తెలుగులో తోపాటు, తోకలిసి, కూడా అనేవి సహార్థంలోనే వస్తాయి కాని కరణార్థంలో రావు.

కరణార్థాన్ని సూచించే మూల ద్రావిడ ప్రత్యయం * - ఆన్ / * - అల్ అనీ, సహార్థాన్ని సూచించేది * - ఓటు/ఒటు అనీ దక్షిణ భాషలు ఆధారంగా నిర్ణయించవచ్చు, తెలుగు - తోడన్, - తోన్ అనేది తోడు (< * తోళ్) అనే శబ్దం నుంచి వచ్చింది.

తె. ఊరన్, గోరన్, కోలన్ మొదలైనవాటిలో-అన్ మూ. ద్రా. * - అన్ నించి వచ్చినదే. కోలామీ - పర్జీ ఉపకుటుంబంలో ప్రత్యయం * అట్ / * ఒట్ (అచ్చుతో అంతమయ్యే ప్రాతిపదికకి దీనిముందు న కారం చేరుతుంది); ఇది దక్షిణ భాషలలో - ఒటు కి సంబంధించినది. కావచ్చు. బ్రా - అట్ కూడా దీనికి సంబంధించినదే. కొండ - పెంగొ - కూయిలలో తృతీయకీ పంచమికీ ఒకే ప్రత్యయం ఉండడం వీటి సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది.

**(iii) చతుర్థీవిభక్తి :**

త. - క్కు :ఎనక్కు 'నాకు', వీట్టిఱ్కు/వీట్టుక్కు 'ఇంటికి', అవఱ్కు/అవనుక్కు 'వాడికి'.

మ. - క్కు (అస్మదర్థ కాత్మార్థకైక వచనాలలో - ఇక్కు; నకారం తరవాత - ఉ) : కొటిక్కు 'జండాకి,', ఎనిక్కు 'నాకు', తనిక్కు 'తనకి, నముక్కు 'మనకి', తాతను 'తండ్రికి, అవను 'వాడికి', మోక్షత్తిను 'మోక్షానికి'.'

కోత. - క్ : ఎన్క్ 'నాకు', నిమ్క్ 'మీకు', పాబ్క్ 'పాముకి'.

తొ. - క్ : నిన్క్ 'నీకు', కోత్ ఫొయ్‌కి 'భార్యకి'.

కొడ. -కు (నకారం తరవాత-గు) : అదంగు 'దానికి', అవకు 'ఆమెకి'.

క. (అం నించి వచ్చిన) అకారం తరవాతా - ర్ తరవాతా - క్కె మిగిలినచోట్ల - గె) : మరక్కె 'చెట్టుకి', ఓలగక్కె 'సభకి', అదర్కె/అదక్కె 'దానికి', కణ్గె / కణ్ణిగె 'కంటికి', కవిగె 'కవికి', అర్గె/యారిగె 'ఎవరికి', ననగె 'నాకు', నమగె 'మాకు, మనకి', ఒందర్కె / ఒందక్కె 'ఒకదానికి'. (ఆధునిక కన్నడంలో ఉకారాంతాల తరవాత - ఇగె వస్తుంది).

తు. ఏకాచ్కాలూ, కొన్ని ద్వ్యచ్కాల తరవాత -కు, మిగిలినచోట్ల -గు: కయ్‌కు 'చేతికి', కంజిగు 'దూడకి', ఎంకు 'నాకు'.

తె. -కున్ (ఇకారం తరవాత -కిన్) : నాకున్, అమ్మకున్, పిల్లికిన్, ఇంటికిన్. కొఱకున్.

గోం. -క్/-కూన్ : నాక్/నాకూన్ 'నాకు', మూరాత్క్/మూరాత్కూన్ 'ఆవుకి'.

కొం. పెం. (ద్వితీయావిభక్తి కింద చూ.)

కూయి. -కి (నకారం తరవాత -గి) : ఆబకి 'తండ్రికి', అజంగి 'తల్లికి'.

కువి. -కి : మ్డైహకి 'పురుషుడికి'.

కో. అచ్చు తరవాత -జ్-, హల్లు తరవాత ఉజ్ : ఎల్లాజ్ 'ఇంటికి', మాకూజ్ 'చెట్టుకి'.

నా(ఛాం.) : -న్/-ఉన్ : పోరకున్ 'అబ్బాయికి', ఈరున్ 'నీళ్ళకి', (ఇది ద్వితీయతో తుల్యం).

ప. (ఉత్తరమాండలికం) -గ్ (హల్లు తరువాత -ఉగ్), దక్షిణమాండలికం -జ్ (హల్లు తరవాత -ఉజ్) : మడిగ్ 'గొడ్డలికి', ఏనుగ్ 'ఏనుగుకి', పాపుగ్ 'పిల్లకి', తొలెనుగ్ 'సోదరుడికి' (తొలెద్).

గ. -జ్/-ఇజ్/-ఉజ్ (పయిట్) : అయలిజ్ 'భార్యకి', అనుజ్ 'నాకు'.

కూ. -గే : ఆన్‌గే 'వాడికి', ఎంగాగే 'నాకు'.

మా. -క్, -ఇక్ : ఎంగె 'నాకు', మలెక్ 'మనిషికి', ఖెపిక్ 'ఊరికి', డడెక్ 'అడవికి', పొక్రి-క్ 'చెరువుకి'.

బ్రా. (ద్వితీయావిభక్తి కింద చూ.)

మూలద్రావిడంలో చతుర్థీప్రత్యయం * -క్క్ అని చెప్పవచ్చు. ఇది అన్ని భాషలలోనూ ఉంది. కోలామీ - పర్జీ ఉప కుటుంబంలో చతుర్థి మూల రూపం * -ంక్. మూలద్రావిడ రూపానికి అనునాసికం చేరడంవల్ల ఇది ఏర్పడింది. బ్రాహుయీలో తాదర్థ్యాన్ని సూచించడానికి -కి (-అకి) ప్రత్యయాలు ఉపయోగించబడతాయి : 'తండ్రికోసం', పినకి 'పేరుకోసం'. ఇది మూ. ద్రా. చతుర్థినించి వచ్చినదే.

(IV) పంచమీ విభక్తి :

త. ప్రాచీనభాషలో -ఇన్ : మలైయిన్ 'కొండమీదనించి', వీట్టిన్ 'ఇంటినించి'. ఆధునిక భాషలో సప్తమీవిభక్తి ప్రత్యయమైన -ఇల్‌కి ఇరుంతు 'ఉండి' అనే పదం చేర్చడంవల్ల అపాదానార్థం సూచించబడుతుంది : మలైయిలిరుంతు, వీట్టిలిరుంతు. ప్రాచీనభాషలో నిన్ఱు 'నిలిచి' ఇరుంతు 'ఉండి' అనే పదాలే అపాదానార్థంలో ప్రయుక్తమయ్యేవి : నీర్‌నిన్ఱు 'నీళ్ళలోనించి', కాలై యిరుంతు 'పొద్దున్ననించి'. ప్రాచీనభాషలో ఇవికాక ఇటై, వయిన్, ఉళి, తలై అనే పదాలుకూడా అపాదానార్థ సూచకాలు.

మ. సప్తమి -ఇల్ + నిన్ను 'నిలిచి' : దిక్కిల్‌నిన్ను 'దిక్కునించి', అవిటెనిన్ను 'అక్కడనించి'; ముతల్ : ఇన్నేము ముతల్ నేటినించి', తొట్టు (తొటు 'ప్రారంభించు' అనే క్రియక్త్వార్థకం) అన్నుతొట్టు 'ఆరోజునించి', అవిడంతొట్టు 'అక్కడనించి'.

కోత. -ల్‌ర్త్ (-ర్త్) : పయ్‌ల్‌ర్త్ 'ఇంటినించి', అయ్‌క్‌ర్త్ 'అక్కడ నించి'.

తొ. -స్‌న్ / -నిద్ : అస్ నిద్ 'ఇంటినించి', అత్ స్‌న్ 'అక్కడ నించి'.

కొడ. -ఇంజి : నన్నింజి 'నాదగ్గరనించి', మనెయింజి 'ఇంటిదగ్గిరనించి'; షష్ఠి + కయ్‌ంజ : నాడకయ్‌ంజ 'నాదగ్గరనించి'.

క. (తృతీయకింద చూ.)

తు. (బ్రాహ్మణమాండలికం) -త్తు, -ంతు, (సాధారణ మాండలికం) -డ్‌దు : మరత్తు/మరడ్‌దు 'చెట్టునించి', కండొంతు/కండొడ్‌దు 'పొలంనించి'.

తె. (ప్రా.) -నుండి / (వ్యా.) -నించి : ఇంటినుండి, ఇంటి (దగ్గిర) నించి.

గోం. -ఆల్ : కుహీతాల్ 'నూతినుంచి', నాట్నాల్ 'ఊరినుంచి',

కొం. పెం. కూయి, (తృతీయ కింద చూ.)

కువి. ఏకవచనంలో -టి, బహువచనంలో -కి : కడ్డటి 'నదినించి', కడ్డజకి 'నదులనుంచి'.

కో. -తసట్ : ఊర్‌తనట్ 'ఊరినుంచి'.

నా. (ఛాం.) (తృతీయ కింద చూ.)

ప. సప్తమీ ప్రత్యయాలు అపాదానార్థ సూచకాలు : మెర్రి 'చెట్టు (మీద) నించి', చోరెతి 'కుండ (లో) నించి', ఇవి కాక (ఉత్తర మాం.) తుగ్ / (దక్షిణమాం.) తుజ్ : కొంద్‌తుగ్ 'కొండ (మీద) నించి', అర్, అ్రె, అరె : నీర్ అరె/అ్రె/అర్ 'నీటి (లో) నించి.

గ. (ఒ.) -పెల్‌టుజ్, -టుజ్ : మరిన్‌పెల్‌టుజ్ / 'చెట్టునించి', ఉలెటుజ్ 'ఇంటినించి', (కొణేకోర్) -కుట్ : మారెకుట్ 'చెట్టునించి'.

కూ. -తీ : పర్రతీ 'కొండ (మీద) నించి' (ఇది కరణార్థంలో కూడా వస్తుంది : ఖజ్‌తీ 'మట్టితో'.

మా. -ఇంతె, -ంతె : మలెంతె 'మనిషినించి', మలెరింతె 'మనుష్యుల నించి', ఖెపింతె 'ఊరినించి' పత్లి-ంతె 'కుండలోనించి'.

బ్రా. -అన్ : ఉరఘాన్ 'ఇంటిలోనించి', తుఘాన్ 'నిద్రలో నించి'.

ప్రాచీన తమిళ -ఇన్, ప్రాచీన కన్నడం -ఇం- ఈ రెంటి మూలరూపమైన *-ఇన్ మూల ద్రావిడంలో పంచమీ ప్రత్యయంగా గ్రహించవచ్చు. ఇది భిన్న భాషలలో భిన్న పరిణామాలు పొందింది. తమిళ మలయాళాలలోనూ తెలుగులోనూ సప్తమి తరవాత 'ఉండి', 'నిలిచి' అనే అర్థాల నిచ్చే క్త్వార్థక క్రియలు చేర్చడంవల్ల అపాదానార్థాన్ని సూచించడం గమనించదగినది. కొండ, పెంగో, కూయిలలో తృతీయకి పంచమికి ఒకే విభక్తి ప్రత్యయం ఉంది.

(v) షష్ఠీ విభక్తి :

త. ప్రాచీన తమిళంలో -అతు. -అతు, -అ, -ఉడై, -ఉడైయ అనే ప్రత్యయాలు ఉన్నాయి. ఆధునిక తమిళంలో -ఉడైయ మాత్రమే ఉంది. ఇన్మైయతు 'లేమియొక్క', తన్నాతు 'తనయొక్క' వెరినతోల్ వీపుచర్మం',

మరత్త కోటు 'చెట్టుకొమ్మ' నిన్ - / నిన్నుదై / నిన్నుదైయ / నినతు 'నీ'. ఈ ప్రత్యయాలన్నీ వైభాషికాలే కాబట్టి ప్రత్యయం లేకుండా కూడా షష్ఠీ విభక్తి సూచించవచ్చు. ఎన్/ఎన్నుదైయ / ఎనతు మకన్ 'నా పుత్రుడు'

మ. పదోశతాబ్ది శాసనాలలో -ఉదై ఉంది; తరవాత కాలంలో -ఉదైయ ఉంది. సాహిత్యంలోనూ ఆధునిక భాషలలోనూ -టె నకారాంతాల తరవాతా మిగిలినచోట్ల -ఉటె వస్తుంది. సాహిత్యంలో నకారాంతాల తరవాత -టె, -ఉటెలు రెండూ ఉన్నాయి : అవరుటె 'వాళ్ళ', ఎన్టె/ఎన్నుటె 'నా', నిన్టె/ నిన్నుటె 'నీ'.

కోత. -ద్ : ఎంద్ 'నా', నింద్ 'నీ', మర్త్ద్ 'చెట్టుయొక్క'.

తొ. బంధువాచి పదాల తరవాత -న్, మిగిలినచోట్ల -ద్: కూఖ్న్ఓఞ్ 'కూతురు భర్త', ఎంద్/ఎన్ 'నా', కొట్ద్ కోల్ 'దూడకాలు'.

కొడ. యుష్మదస్మదర్థకాలూ, అనునాసికాంతాల తరవాత -డ, మిగిలిన చోట్ల -ర: నాడ మనె 'నా ఇల్లు', పూఞెరబాలు 'పిల్లితోక'.

క. -అ (యుష్మదష్మదాత్మార్థకాలలో ప్రాచీన భాషలో -అయ). సాహిత్యంలో ఇది గణానుసారంగా దీర్ఘమవుతుంది : అవర 'వాళ్ళ', నాడ 'దేశంయొక్క', మనెయ 'ఇంటియొక్క', పావిన 'పాముయొక్క' మరద 'చెట్టు యొక్క', ఎన్నయ/నన్న 'నా', ఎమ్మయ/నమ్మ 'మా', నమ్మయ/నమ్మ 'మన, మా', నిన్నయ/నిన్న 'నీ', తన్నయ/తన్న 'తన'. కేశిరాజ శబ్దమణి దర్పణంలో - అతు అనే ప్రత్యయం (నినతు 'నీ', ఎనతు 'నా') ఇవ్వబడింది; ఇది షష్ఠ్యర్థక ప్రత్యయం.

తు. -అ : ఓడారిన 'కుమ్మరియొక్క', ఎన్న 'నా', కంజిద కారు 'దూడకాలు', కయ్త 'చేతియొక్క'.

తె. షష్ఠికి ప్రత్యయం లేదు. వ్యాకరణంలో మాత్రం 'యొక్క' ఇవ్వబడింది కాని దీనికి సాహిత్యంలోగాని వ్యవహారంలోగాని ప్రయోగం లేదు. వాడి, తమ్ముడి, అక్క (కొడుకు), వాళ్ళ (ఇల్లు), ప్రాచీన భాషలో నాదు/నా, మాదు/మా, నీదు/నీ, మీదు/మీ లలో వైభాషికం గాదు ప్రత్యయం ఉంది.

గోం. -ఆ (యుష్మదస్మదార్థకాలలో - వా) : కుహీతా ఏర్ 'నూతి నీళ్ళు', కల్లేనా మాల్ 'దొంగడబ్బు', నావా రోన్ 'నా ఇల్లు', మావా నాన్ 'మా ఊరు'.

కొం. షష్ఠికి ప్రత్యయం లేదు. ఔపవిభక్తికం ఉన్న నామాలలో అదీ, లేని నామాలలో నామమే షష్ఠీ విభక్తిలో ప్రయుక్తమవుతుంది: అపొసిబన్ 'తండ్రిచోటు', తెకది కెలు 'తెక్క ఈక', కాల్క మువెజ్ 'కాళ్ళ మువ్వలు', అనరి నాఋ 'అన్న ఊరు'.

ఇన్‌ఋణి 'ఇంటి', దాటాణి 'ఊరి', వీటిలో -ణి అనే షష్ఠీ ప్రత్యయం సప్తమికి చేరింది; అలాగే అబెణి/బాణి 'అక్కడి', ఇబెణి/బేణి 'ఇక్కడి', ఎమెణి 'ఎక్కడి' అనే వాటిలోనూ కొన్ని బహువచన పదాలలోనూ (రాస్కాణి 'రాజుల) -ణి ఉంది.

పెం. -ఇ, ని : ఈదేస్తిరజ 'ఈ దేశపురాజు', కాల్‌దిడ్డేన్ 'కాలి ఎముక', నాటి పెన్కు 'ఊరి దేవతలు', ముంగెల్ని నెతెర్ 'ముక్కు నెత్తురు', పుర్తిని రజ 'లోకపురాజు'.

కూయి. ప్రత్యయం లేదు. ఆ్రైహని 'పురుషుడి', ఆ్రైహలిని 'స్త్రీయొక్క', కోరు 'దున్నపోతుయొక్క'.

కువి. -ఇ : ఆ్రైహతి 'పురుషుడి', అయని 'స్త్రీయొక్క', కడ్డజతి 'నదులయొక్క'.

కో. -త, ఎ, -నె : వాడిత 'తోటయొక్క', కిస్త/కిస్నె 'నిప్పుయొక్క', అవ్రె 'వాళ్ల', ఇవ్రె 'వీళ్ల', ఇమ్మె 'నీ', తెడెప్నె 'గుడ్డయొక్క'.

నా (ఛాం,) -నె : పుల్నెతల 'పులితల', పోరక్నె బాన్ 'పిల్లవాడి తండ్రి.'

ప. -న్, -ఇన్ : కోచిన్ పొరలెర్ 'రాజు సేవకులు', తాలెన్ పిదిర్ 'తండ్రి పేరు'.

-త్ (అచ్చుతరవాత), -తా (దక్షిణమాం. త) (హల్లుతరవాత) : జువెత్ నీర్ 'నూతినీళ్లు', మెర్తాఎవుల్ 'చెట్టు ఆకులు', పెరెద్‌తా నీర్ 'నదినీళ్లు', పొలుబ్త పాస్ 'ఊరితోవ'.

ఈ ప్రత్యయాలు వైభాషికం : తెల్‌తాకుల్ 'తలవెంట్రుకలు' గాయ్ మంద 'ఆవులమంద', మెర్‌నీఢ 'చెట్టునీడ.'

గ. (ఓల్లారీ) -న్, ఇన్ : సేపలిన్‌తమబ 'అబ్బాయి తండ్రి', -నె : కొర్నె చెండి 'కోడిపుంజుశిఖ', సెపెట్నె వెవెల్ 'చీపురుపుల్ల', -టె: మర్టెవేర్ 'చెట్టువేరు', పొలుబ్ టెపావ్ 'ఊరితోవ'.

ఈ ప్రత్యయాలు వైభాషికం : కణుల్ మట్ట 'కనుబొమ్మలు', కిస్ పోగ్ 'నిప్పుపొగ', కొర్‌వాప్ 'కోడిపిల్ల',

కూ. -గహి/-హి: ఆల్‌గహి/ఆలస్‌హి 'మనిషి యొక్క', (ఇది మనుష్య వాచకాలకే వస్తుంది). అమనుష్య వాచకాలకి -త వస్తుంది: పూఁప్త రజ్ 'పువ్వురంగు' పద్దంతా పాస్త్రు 'ఊరితోవ'.

మా. -కి : టూడ్కి 'పులియొక్క', తమ్‌కి 'తమ, వాళ్ళ'.

బ్రా. -నా, ఆ: ఖరాస్నా 'ఎద్దుయొక్క', ఖరాస్తా 'ఎడ్లయొక్క' (ఇందులో తకారం ఔపవిభక్తికం), కనా ఉల్లీ 'నా గుర్రం'.

షష్ఠీవిభక్తి ప్రత్యయం చాలా భాషలలో వైభాషికం. తెలుగు, కూయి, కొండ మొదలైన భాషలలో అసలు షష్ఠీ ప్రత్యయమే లేదు. కాబట్టి అతి ప్రాచీన కాలంలో షష్ఠీవిభక్తికి ప్రత్యయం లేదనీ రెండు నామవాచకాలు ఒక దాని పక్క ఒకటి చేరినపుడు మొదటి నామవాచకానికి షష్ఠ్యర్థం దానంతట అదే వచ్చేదనీ చెప్పవచ్చు. చాలా భాషలలో అకారం (కొన్ని భాషలలో దీర్ఘం) షష్ఠీ విభక్తి ద్యోతకంగా ఉంది; ఉదా: కన్నడం, గోండీ, బ్రాహుయా, తెలుగు

మన, తన, నా (<* అన), మా (< *అమ) మొదలైనచోట్ల అకారం ఔప విభక్తికమే అయినా అది మొదట్లో షష్ఠ్యర్థకం అయి ఉండవచ్చు. కాబట్టి *-అ ద్రావిడంలో ఉండేదని చెప్పవచ్చు. దీనికి తు చేరడం తమిళం తెలుగులలో కనపడుతోంది. తమిళం - మలయాళం - కొడగులలో ఉన్న *ఉణై (య) ప్రత్యేకక్రియ. దీనికి 'కలిగి ఉండు'. అని అర్థం (త. ఉటైమై 'కలిగి ఉండడం'). కొండ- పెంగొ-కూయి-కువిలలో ఉన్న ఇకారమూ, కోలామీ-నాయకీ-పర్జీ-గదబలలో ఉన్న నకారమూ ఈ భాషల సాన్నిహిత్యాన్ని సూచిస్తాయి.

(VI) సప్తమీ విభక్తి :

త. -ఇన్, -ఇల్ : వీట్టిల్ 'ఇంట్లో', ఊరిల్ 'ఊళ్ళో', ఇరనిన్ 'రాత్రి (లో)', కన్నినిన్ 'కలెలో'. ఇవికాక ఈ కింద ఇచ్చిన విభక్త్యర్థకాలు ఉన్నాయి: ఉళ్ : వైయత్తుళ్ 'లోకంలో', కణ్: వేట్టుమైక్కణ్ 'విభక్తిలో', కాల్ :ఊర్క్కాల్ 'ఊళ్ళో', ఇటై/ఇటం: కాట్టిటై/కాట్టిడం 'అడవిలో', మిచై, మేల్ 'మీద', కీళ్ 'కింద' ఇత్యాదులు. ప్రాచీన భాషలో నిలత్తు 'నేలలో' వంటి ప్రత్యయం లేనిరూపాలు కొన్ని ఉన్నాయి

మ. -ఇల్ : నీరిల్ 'నీళ్ళలో' పోరిల్ 'యుద్ధంలో', ప్రాచీన సాహిత్యంలో నిలత్తు 'నేలలో', 'గ్రీష్మకాలంలో' మొదలైనచోట్ల విభక్తి ప్రత్యయం లేదు. ప్రాచీన సాహిత్యంలో నకారం తరవాత -కల్ వస్తుంది: తంకల్ 'తనలో,' చూతింకల్ 'జూదంలో', రాత్రియింకల్ 'రాత్రి(లో)'.

కోత. -ల్ : కాట్ల్ 'అడవిలో, మర్త్ల్ 'చెట్టులో/మీద'.

తొ. ప్రాణివాచకాల తరవాత -కిడ్ష్ అప్రాణివాచకాల తరవాత -స్ : ఎన్కిడ్ష్ 'నాలో/నాతో', మేణ్త్స్ 'చెట్టులో/మీద', కులోయ్శ్ 'కుళాయిలో', అడ్యశ్ 'కుండలో'.

కొడ. -లు: మనెలు 'ఇంట్లో', తోటట్లు 'తోటలో'.

క. ప్రాచీన భాషలో ప్రచురంగా -ఒళ్ ఉంది, విరళంగా -అల్, అల్లి, -ఎ కూడా ఉన్నాయి. ఈ భాషలో సప్తమీ ప్రత్యయాలు కరణార్థాన్ని కూడా సూచిస్తాయి. గదెయిళ్ మోదిదం 'గదతో కొట్టేడు', ఆధునిక భాషలో సప్తమీ ప్రత్యయం/అల్లి. -కాలొళ్/ కాలినల్లి 'కాలిలో', పణ్ణొళ్/హణ్ణల్లి/హణ్ణినల్లి 'పండులో' మరదొళ్/మరదల్లి 'చెట్టులో/మీద', తన్నల్/తన్నల్లి 'తనలో', తలెయల్/తలెయల్లి 'తలలో', శిలెయల్లి 'శిలలో', మేలె 'పైన', కెళగె/కెళగె 'కింద'. కరణార్థానికి ఆధునిక భాషలో ఉదా. పెన్నల్లి బరెదె 'పెన్నుతో రాశాను'.

తు. -టు, డు : మరటు 'చెట్టులో/మీద', వస్త్రాంటు 'గుడ్డలో', ఎనటు 'నామీద', ఊరుడు 'ఊళ్ళో', ఇల్లు 'ఇల్లు' తరవాత-ఒళు ఉంది: ఇల్లొళు 'ఇంట్లో'

తె. లోన్ : ఇంటిలోన్, పోరిలోన్, -నన్ : కయ్యమునన్, జలమునన్, -న్ : అనిన్, భూమిన్, జలంబులన్, -అన్ (ఔపవిభక్తికాలలో) ఊరన్, కాలన్, అందున్ : కయ్యమునందున్, ఊరి యందున్, ప్రాఙ్నన్నయ యుగ శాసనాలలో లోన్‌కి ప్రాచీన రూపాలైన -ఒళన (రాజుల్లొళన), -ళోన (కయ్యంబు ళోన) అనేవి ఉన్నాయి.

గోం. (తృతీయకింద చూ.)

కొం. ఈ కింద ఇచ్చిన ప్రత్యయాలు ఔపవిభక్తిక ప్రాతిపదికకి కాక నామవాచకానికే చేరతాయి. (ఏకవచనంలో) -తు, -దు, -ఋ, -టొ, -ఱొ, -ఇ (తు, దు, ఋ లలో ఉకారం అజంత నామాల తరవాత లోపిస్తుంది; మకారాంతాల తరవాత -ఇ వస్తుంది; దీనికి లోపం కూడా ఉంది), ఱెయెతు 'రాత్రి(లో)', గట్‌తు 'గట్టుమీద', మరత్ 'చెట్టుమీద(కి)', సఙ్‌దు 'తోవలో', గొనెఋ 'వంట ఇంట్లో' (గొనెల్), నాటొ 'ఊళ్ళో' (నాఋ), సొన్‌ఱొ 'పొయ్యిలో' (సొలు); సాలమి 'గుహలో', ఱేకమి 'చూరుమీద', బహువచనంలో సప్తమి-ద్వితీయా- చతుర్థితో తుల్యం : అకుఱెకెజఙ్ 'ఆకు పాయలలో', ఇది కాక లొ?ఇ అనే విభక్త్యర్థకం కూడా ఉంది : సాలం లొ?ఇ 'గుహలో'.

పెం. -ఒ : గుడితా 'పాకలో', టాండితా 'కుండలో', నిపితా 'బుజం మీద'. బహువచనంలో ద్వితీయా - చతుర్థీ - సప్తములకి - అజ్ వస్తుంది. ఏజుకజ్ 'నీళ్ళలో', కెయ్‌కుకజ్ 'చేతులలో'.

కూయి. -తొ, -ండొ, -(త)ని, బహు : కాట్కని 'కాళ్ళ దగ్గర', సోర్కని 'కొండలమీద', కెతంగండొ 'పొలాలలో', కొద్ది నామాలలో -అ (ఏక వచనంలో) వస్తుంది : పహెరిఅ 'తోవలో', కంబోరిఅ 'అడవిలో'.

కువి. -అ, -ఒ : కడ్డత 'నదిలో', ఇజొ 'ఇంట్లో', నాటొ 'ఊళ్ళో'.

కో. ఏకవచనంలో -త్, బహువచనంలో -ఏజ్ (కొన్నింటిలో -త్): ఎల్లాత్ 'ఇంట్లో(కి)', ఊర్‌త్ 'ఊళ్ళో(కి)', గుర్రలేజ్ 'గుర్రాలలో', ఎల్లకూల్త్ 'ఇంటింటికీ', -నదజ్/నజ్, -అదజ్ (ఇది బహువచనంలో) అన్నదజ్/అన్నజ్ 'నాకు', పిల్లదజ్ 'స్త్రీకి'.

నా (ఛాం.) -ఇన్, -ఉన్, -ఎన్, -న్: కుడ్డిన్ 'గోడ మీద', ఊరున్ 'ఊళ్ళో'; లొపున్: ఈర్‌లొపున్ 'నీళ్ళలో', కెల్: అనెకెల్ 'ఇంటివైపు'.

ప. -తి: పొలుబ్‌తి 'పొలంలో', మర్తి 'చెట్టుమీద/లో', పుత్కల్తి 'పుట్టలో', దీనికి 'లోకి' అనే అర్థమూ, అపాదానార్థమూ కూడా ఉన్నాయి: చకుర్‌తాల్తి చెంద 'గొడ్లపాకలోకి వెళ్తుంది', ఓద్ మర్తి ఉర్కెద్ 'వాడు చెట్టుమీదనించి పడ్డాడు'.

ఒక్కొక్కసారి ఈ ప్రత్యయం లేకుండా ప్రాతిపదికమే సప్తమ్యర్థంలో ఉపయోగించబడుతుంది (అటువంటి చోట్ల పదం చివరి అకారం ఎకారంగా మారుతుంది). అన్ పెరెద్ డడ్డి ఉందెన్ 'నేను నదిగట్టు (మీద) కూచున్నాను', జువె పట్టెద్ 'నూతి(లో) పడ్డాడు'.

గ. -తిన్, -తున్: మర్తిన్ 'చెట్టుమీద/లో', కితిన్ 'చేతిలో', పొలుబ్‌తున్ 'ఊళ్ళో', సొడ్‌తున్ 'పొలంలో'; -న్: ఉలెన్ 'ఇంట్లో', ఈ ప్రత్యయాలు

కొన్ని పదాలలో లోపిస్తాయి: ఆన్ పెరెట్ పలి ఉండెన్ 'నేను నది ఒడ్డున కూర్చున్నాను', ఇదికాక తంద్రెల్ 'లోపల', పొయ్‌తన్ 'మీద', కకెల్ 'దగ్గర' మొదలైన విభక్త్యర్థకాలు కూడా ఉన్నాయి.

కూ. -నూ: ఎడ్పానూ 'ఇంట్లో', టోడంగ్‌నూ 'అడవిలో'.

మా. -నా, -ఇనా: మన్నా 'చెట్టుమీద/లో', టెటునా 'చేతిలో' మలెరినా 'మనుషులలో', మఖెరినా 'పిల్లలలో'.

బ్రా. -అటీ 'లో(కి): షహ్రాటీ 'ఊళ్ళో', ఉరాటీ 'ఇంట్లో(కి)'; -ఆఇ 'వైపు' : ఉరాఘాఇ 'ఇంటివైపుకి'. -ఇస్, -ఇస్క్, -ఇక్: మషిస్ 'కొండమీద', దూనిస్క 'నూతిదగ్గర', బాజ్‌ఖానిస్ 'బాజ్‌ఖాన్ దగ్గిర'.

సప్తమీవిభక్తిని సూచించేవి అన్నీ మొదట్లో ప్రత్యేక శబ్దాలే. తమిళం - కొడగులలో -ఇల్ మొదట్లో ఇల్ 'ఇల్లు' అనే శబ్దం. త. ఉళ్, క, ఉళ్, తె. లోన్ < మూ. ద్రా. *ఉళ్. ఇది 'లోపలిభాగం' అనే అర్థాన్నిచ్చే శబ్దం. అదే విధంగా కన్నడంలో అల్లి అనే దానికి ప్రత్యేక శబ్దంగా ఉన్నప్పుడు 'అక్కడ' అని అర్థం. చాలా మధ్యద్రావిడ భాషలలో తకారం సప్తమీ ప్రత్యయంగా ఉంది. ఇది ఔపవిభక్తిక తకారంతో తుల్యమై ఉండవచ్చు. తమిళ - మలయాళాలలో నిలత్తు మొదలైనచోట ప్రత్యయంలేక ఔపవిభక్తిక ప్రాదిపదికే సప్తమ్యర్థంలో ప్రయోగించబడడం ఈ సందర్భంలో గమనించదగినది.

కొండ - పెంగొలలో బహువచన ప్రత్యయం తరవాత ద్వితీయా - చతుర్థీ - సప్తములకి - అజ్ అని ఒకే ప్రత్యయం ఉండడం వీటి సాన్నిహిత్యాన్ని నిరూపిస్తుంది.

తెలుగు - న<, నాయకీ (ఛాం) -న్, కూడుఖ్ - మాల్తో నూ/నా నకారం కూడా ప్రాచీనమైన సప్తమ్యర్థకమని సూచిస్తాయి.

చాలా ద్రావిడభాషలలో కింద, మీద, పక్క, వెనక, ముందు మొదలైన వ్యవస్థావాచి శబ్దాలు సప్తమ్యర్థకాలుగా ఉపయుక్తమవుతున్నాయి.

(vii) సంబోధన ప్రథమ :

త -ఏ : మకనే 'కొడుకా', నెంచే 'హృదయమా', పురుష వాచకమైన -అన్ చివరి నకారం లోపిస్తుంది : మకిళ్నన 'సంతోషకరమైనవాడా' (మకిళ్నన్); చివరి అచ్చు దీర్ఘమవుతుంది, అన్నాయ్ 'తల్లీ' (అనై). మనుష్యవాచకాలకి బహు వచనంలో -ఈర్ చేరుతుంది : ఇళైయీర్ 'పడుచువాళ్లలారా' (ఇళైయర్), ప్రత్యయమేమీ ఉండదు: మకన్ 'కొడుకా', తోళీ 'స్నేహితురాలా'.

మ. -ఏ : మక్కళే 'పిల్లలారా', అమ్మే 'అమ్మా'; చివరి అచ్చు దీర్ఘం: దేవీ; పురుషవాచకమైన -అన్‌లో నకారం లోపిస్తుంది : రామ (రామన్).

కోత. -ఆ : అవా 'అమ్మా' (అవ్), -ఏ : పుజే 'పులీ', చివరి అచ్చుకి దీర్ఘం : చోయ్‌మీ 'స్వామీ', స్త్రీలు పిలిచేటప్పుడు ఆ కి బదులుగా ఓకారం వాడతారు: అవో 'అమ్మా'.

తొ. -ఆ : అఫ్ అఫా 'అమ్మా'. -యా: మొఖ్‌యా 'కొడుకా', కూఖ్‌యా 'కూతురా'. ప్రత్యయం ఉండదు: ముత్నాస్.

క. -ఏ/-ఎ : కరువే 'దూడా', అరసరె 'రాజులారా', పురుషవాచకమైన -అన్‌లో నకారం లోపిస్తుంది : అణ్ణ 'అన్నా', అరస 'రాజా', చివరి అచ్చు దీర్ఘమవుతుంది : నృపతీ, భానూ. మనుష్య బహువచనాలకి -ఇర చేరుతుంది (కావ్యభాషలో) దేవియరిర 'దేవతలారా', నందనంగళిర! 'కొడుకులారా!'

తు. -అ : అజ్జ 'తాతా' (అజ్జె); -ఎ: అజ్జియె 'నాయనమ్మా', సిమ్మనె 'సింహమా'; -ఒ: అరసొ 'రాజా'; -ఎ : అరసుళె 'రాజులారా'.

తె. ప్రాచీనభాషలో ఉకారాంతాల తరవాత -అ/-ఆ చేరడమూ, మిగిలిన నామాల చివరి అచ్చు వైకల్పికంగా దీర్ఘమవడమూ ఉంది. తమ్ముఁడ/తమ్ముఁడా, అన్న/అన్నా, అమ్మ/అమ్మా. ఆధునిక భాషలో పదాంతోకారం కూడా అన్ని

అచ్చులలాగే దీర్ఘమవుతుంది : తమ్ముడూ, అబ్బాయీ/అబ్బాయ్. బహువచనం తరవాత -అర : అన్నలార/అన్నలారా. సంబోధన ప్రథమలో నామానికి ముందు ఓ, ఓయి (పురుషవాచకాల ముందు), ఓసి (స్త్రీ వాచకాలకి ముందు మైత్రీగర్వార్థాలలో), ఓరి (పురుషవాచకాలకి ముందు మైత్రీగర్వార్థాలలో) వైభాషికంగా ప్రయోగించబడతాయి. ఓ రాముఁడా, ఓయీ విప్రకులావతంస. ఓసి ముద్దుబాల, ఓరీ రాక్షసాధమా, ఓరి చిన్ని కృష్ణ.

కూయి. ఏకవచనంలో -తి, బహువచనంలో -తెరు. ఇవి ఔపవిభక్తిక ప్రాతిపదికకి చేరతాయి. సకారం తరవాత -తి -డి గానూ, తెరు -డెరు గానూ మారతాయి. నామం ముందు ఓ కాని, ఏ కాని వైభాషికంగా వస్తుంది: ఓ ఆబతి 'తండ్రీ', ఆబగండెరు 'తండ్రులారా', నెగతి 'మంచివాడా/దానా', (నెగంజు, నెగరి), నెగతెరు 'మంచివాళ్ళలారా', అజండి 'అమ్మా', అజసండెరు 'అమ్మలారా.'

ప. ప్రత్యయం లేదు: ఇయ 'తల్లీ', పురుషవాచకాల చివర అల్ లో లకారం లోపిస్తుంది: కాన 'గుడ్డివాడా' (కానల్), -ఇనె (అచ్చు తరవాత -నె) వైభాషికం : డువినె 'పులీ', మెరినె 'చెట్టా', బడవినె 'ఎద్దూ', -ఎ: ముర్తచిలె 'ముసలి స్త్రీలారా.'

కూ. సంబోధనలో నామం మొదట ఏ, అన చేరతాయి. సంబోధన ప్రత్యయాలు -ఓ, అయ్, -అయో: ఏ/అన ఉర్బయో/ఉర్బయ్ 'అయ్యా', ఉర్బరో 'అయ్యలారా', ముక్కరో 'స్త్రీలారా.' స్త్రీలని సంబోధించేటప్పుడు అన అనయ్ గానూ, నామం చివర అకారం (ఏకవచనంలో) అయ్ గానూ మారతాయి: అనై ముక్కయ్ 'ఓ స్త్రీ.' స్త్రీలు స్త్రీలని పిలిచేటప్పుడు ఆన్, అనేగా మారుతుంది: ఆన్ ఖై 'ఓ కూతురా', ఆనే ఖైగుఠియరో 'ఓ కూతుళ్ళూ.'

బ్రా. ప్రత్యయం లేదు కాని, నామం ముందు ఏ/ఓ సాధారణంగా చేరతాయి : ఏ నీఆడీ 'ఓ స్త్రీ', ప్రార్థనలో యా : యా ఖుదా! 'ఓ దేవుడా!',

ఉడ్దే/అదే కూడా నామం ముందు చేర్చవచ్చు. ఉడ్దే/అడ్దేమార్ 'ఒరేయ్ అబ్బాయి!'

సాధారణంగా సంబోధనలో చివరి అచ్చు ఉదాత్తంగా ఉచ్చరించబడు తుంది. ఇదే సంబోధనని సూచించగలదు. కాబట్టి సంబోధనకి ఉన్న ప్రత్యయాలు వైభాషికాలే; కొన్ని భాషలలో అసలు ప్రత్యయాలే లేవు. దక్షిణ భాషలలో పురుషవాచకాల చివరి నకారం లోపించడమూ, -ఏ ప్రత్యయమూ ఉన్నాయి. పర్జీలో కూడా ఏ ఉంది. తెలుగులోలాగే చివరి అచ్చు దీర్ఘమవడం చాలా భాషలలో ఉంది. -ఆ చేర్చడంకూడా చాలా భాషలలో ఉంది.

తెలుగులో ఓ, కూయిలో ఓ/ఏ, కూడుఖ్‌లో ఏ/అన, బ్రాహూయిలో ఓ/ఏ సంబోధనలో నామం ముందు వైకల్పికంగా చేరడం గమనించదగినది.

బహువచన రూపాల తరవాత తమిళంలో -ఈర్, కన్నడంలో -ఇర, తెలుగులో -అర చేరడం సదృశంగా ఉంది. తమిళ, కన్నడ రూపాలకి మూల రూపమైన *-ఈర్ మధ్యమ పురుష బహువచన ప్రత్యయం సంబోధన 'నువ్వు, మీరు' అనే సర్వనామాలు ఆదేశించదగిన నామాలకే వర్తిస్తుంది కాబట్టి వీటిలో *-ఈర్ చేరిందని చెప్పవచ్చు..

# IV. క్రియలు

4.0. వ్యాపారాన్ని బోధించే శబ్దాలు క్రియలు. ద్రావిడ భాషలలో క్రియలు సమాపకాలూ, అసమాపకాలూ అని రెండు విధాలు, సమాపక క్రియలు వాక్యాన్ని సమాప్తి చేస్తాయి. వీటి చివర లింగ వచన పురుషబోధకమైన ప్రత్యయం ఉంటుంది. అసమాపక క్రియల చివర ఈ ప్రత్యయం ఉండదు. అసమాపక క్రియలు వాక్యంలో విశేషణంగా గాని క్రియా విశేషణం (**Adverb**)గా గాని పని చేస్తాయి. కాబట్టి వీటిని (ధాతుజ) విశేషణాలూ, క్రియా విశేషణాలూ అని రెండు విధాలుగా విభజించవచ్చు. ద్రావిడభాషలలో క్రియాపద నిర్మాణం కింద ఇచ్చిన విధంగా ఉంటుంది:

(క్రియా) ధాతువు (**Verb Base**) + (సకర్మక ప్రత్యయం (**Transitive Suffix**)) + (ప్రేరణ ప్రత్యయం (**Causative Suffix**))

+ ({ కాల ప్రత్యయం (**Tense Suffix**) / వ్యతిరేక ప్రత్యయం (**Negative Suffix**) }) + ({ పురుష ప్రత్యయం (**Pronominal Suffix**) / చేదర్థకం (**Conditional**) / విశేషణ ప్రత్యయం (**Adjectival Suffix**) })

[చారిత్రక వ్యాకరణంలో **Root** అనే పదానికి సమంగా ధాతువు అని వాడుతున్నాము కాబట్టి **Verb Base** అనే పదానికి తుల్యంగా క్రియా ధాతువు అని వాడాలి. కాని క్రియాధాతువు అనే పదానికి బదులుగా సంగ్రహంగా ధాతువు అని అర్థసందిగ్ధత రానిచోట్ల వాడవచ్చు. సమాపకక్రియలలో పురుష ప్రత్యయమూ, ధాతుజ విశేషణాలలో విశేషణ ప్రత్యయమూ ఉంటాయి. క్రియా విశేషణాలలో కాలప్రత్యయం/వ్యతిరేక ప్రత్యయం తరవాత ప్రత్యయం ఏదీ ఉండదు.]

**4. 1. సకర్మక ప్రేరణ ప్రత్యయాలు :**

ద్రావిడభాషలలో సకర్మక క్రియలని సిద్ధాలూ (Inherent) సాధ్యాలూ (Derived) అని రెండు రకాలుగా విభజించవచ్చు. సకర్మక ప్రత్యయం లేకపోయినా వాక్యనిర్మాణంలో సకర్మకాలుగా ఉండే క్రియలు సిద్ధాలు : తిను, కొను, చూచు మొ. సకర్మక ప్రత్యయం ఉన్నవి సాధ్యాలు : తడుపు, త్రిప్పు, కాఁచు, తూఁచు, మొ॥. సకర్మక క్రియలకి ఒక కర్త ఉంటుంది, ప్రేరణ క్రియకి హేతుకర్త (Cause), ప్రయోజ్యకర్త (Agent) అని రెండు కర్తలు ఉంటాయి. ప్రేరణక్రియలు సకర్మక క్రియలకి ప్రేరణ ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడతాయి.

తమిళం :

అకర్మక క్రియలనించి సకర్మక క్రియలు నిర్మించే పద్ధతులు మూడు ఉన్నాయి. వాటిలో మొదటిది : అకర్మక క్రియ చివర ఉన్న అనునాసిక సహితస్పర్శం లేక అద్విరుక్తస్పర్శం స్థానంలో దానికి సవర్ణమైన ద్విరుక్త స్పర్శాన్ని ఆదేశించడం :

| | |
|---|---|
| అటంకు 'అడగు' | అటక్కు 'అడచు' |
| పెరుకు 'పెరుగు' | పెరుక్కు 'పెంచు' |
| ఊంకు 'ఊగు' | ఊక్కు 'ఊపు' |
| ఆటు 'ఆడు' | ఆట్టు 'ఆడించు' |
| అళుతు 'నాక్కుపడు' | అళుత్తు 'నొక్కు' |
| నిరంపు 'విండు' | నిరప్పు 'నింపు' |
| తిరుంపు 'తిరుగు' | తిరుప్పు 'తిప్పు' |
| ఏఱు 'ఎక్కు' | ఏఱ్ఱు 'ఎక్కించు' |
| తోన్ఱు 'కనపడు' | తోఱ్ఱు 'చూపెట్టు' |

రెండోది : అకర్మకక్రియకి త్తు, ప్పు (రూపాంతరం -వు) అనే ప్రత్యయాలని చేర్చడం. త్తు చేర్చినప్పుడు ఈ కింద ఇచ్చిన సంధిసూత్రాలు ప్రవర్తిస్తాయి:

(i) న్/ల్ + త్తు → ఱ్ఱు; (ii) ణ్/శ్ + త్తు → ట్టు

| | |
|---|---|
| అలర్ 'వికసించు' | అలర్త్తు 'వికసింపచేయు' |
| కాయ్ 'కాగు' | కాయ్త్తు/కాచ్చు 'కాచు' |
| పర 'వ్యాపించు' | పరత్తు/పరప్పు 'వ్యాపింపచేయు' |
| నిల్ 'నిలబడు' | నిఱుత్తు 'నిలుపు' 'ఆపు' |
| తిన్ 'తిను' | తీఱ్ఱు 'తినిపించు' |
| తుయిల్ 'నిద్రించు' | తుయిఱ్ఱు 'నిద్రపోగొట్టు' |
| కాణ్ 'చూచు' | కాట్టు/కాణ్పి 'చూపించు' |
| ఉణ్ 'తిను, తాగు' | ఊట్టు/ఉణ్పి 'తినిపించు, తాగించు' |
| మరుశ్ 'భయపడు' | మరుట్టు 'భయపెట్టు' |
| నట 'నడచు, సంభవించు' | నటత్తు/నటవు/నటప్పి 'నడిపించు, జరిపించు' |

మూడోది : క్రియారూపాన్ని మార్చకుండా భిన్న కాల ప్రత్యయాలని ఉపయోగించడం, అంటే అకర్మకార్థంలో -త్ -/-ంత్ -(భూతాం), -కిన్ఱ్/-కిట్ -(వర్తమానం), -వ్ -(భవిష్యత్) అనే ప్రత్యయాల్నీ, సకర్మకార్థంలో -త్త్-(భూ.), -క్కిన్ఱ్-/ కిఱ్-(వ.), -ప్ప్-(భ.) అనే ప్రత్యయాలనీ ఉపయోగించడం. ఈ పద్ధతిని ఉపయోగించే క్రియలు (హ) అ హఉ అనే నిర్మాణాన్ని కలిగిగాని ఇ,ఐ,య్,ర్, ళ్ అనే వాటిలో ఒక దానితో అంతమవుతూగాని ఉంటాయి. ఉదా : కెటు 'చెడు, చెడగొట్టు' (కెట్టదు 'చెడింది', కెటుత్తాన్ 'చెడగొట్టేడు'), పిరి 'విడిపోవు', కళి 'గడచు, గడుపు', ఉడై 'పగులు, పగలగొట్టు' (ఉడైయుం 'పగులుతుంది', ఉడైప్పాన్ 'పగలగొడతాడు') మాయ్ 'చచ్చు, చంపు', చేర్ 'చేరు, చేర్చు', తాళ్ 'దిగు దింపు.'

ప్రేరణ ప్రత్యయం -వి- / -ప్పి- ( లఘుక్రియల (Weak verbs) తరవాతా, ప్పి గురుక్రియల (Strong verbs) తరవాతా వస్తాయి.) సంఘ వాఙ్మయంలో దీనికి ఉదాహరణలు చాలా తక్కువ. ఇది తరవాత కాలంలోనే

ప్రచారంలోకి వచ్చింది : చెయ్‌విత్తాన్ 'చేయించాడు', మఱప్పిత్తాన్ 'మరిపించాడు'. అయినా ప్రథమ గ్రంథమైన తొల్కాప్పియం (సూ. 761) లోనే కేట్పిక్కు౦ 'వినేటట్టు చేస్తుంది' అనే పదంలో ఈ ప్రత్యయం వాడబడడం వల్ల ఇది ప్రాచీన ప్రత్యయమే అయి ఉండాలని తెలుస్తుంది.

**మలయాళం :**

ఈ భాష తమిళంనించి పది పన్నెండు శతాబ్దుల మధ్య కాలంలో విడిపోయి ప్రత్యేక భాషగా రూపొందింది. కాబట్టి దీనిలోకూడా సకర్మక క్రియలు తమిళంలో లాగే మూడు పద్ధతులలో ఏర్పడతాయి. వాటికి వరసగా ఉదాహరణలు :

| | | | |
|---|---|---|---|
| (i) | అటఙ్ఙు 'అడగు' | అటక్కు | 'అడచు' |
| | ఆఱు 'చల్లారు' | ఆఱ్ఱు | 'చల్లార్చు' |
| | పెరుకు 'పెరుగు' | పెరుక్కు | 'పెంచు' |
| (ii) | నట 'నడుచు' | నటత్తు | 'నడిపించు' |
| | తిన్ 'తిను' | తీఱ్ఱు | 'తినిపించు' |
| | నీళ్ 'సాగు' | నీట్టు | 'సాగదీయు' |
| (iii) | ఈ పద్ధతి కిందకి ఇఴి 'దిగు, దింపు', ఒటి 'పగులు, పగులగొట్టు', కఴి 'గడచు, గడుపు' మొదలైన క్రియలు వస్తాయి. | | |

ప్రేరణ ప్రత్యయం లఘుక్రియలలో -ఇ(<*వి), గురు క్రియలలో ప్పి చెయ్యిచ్చు 'చేయించాడు, చేయించింది', కొల్లిచ్చు 'చంపించాడు, చంపించింది'. ఎటుప్పిచ్చు 'తీయించాడు, తీయించింది', కటిప్పిచ్చు 'కరిపించాడు, కరిపించింది' (వీటిలో పురుష ప్రత్యయం లేదు కాబట్టి అన్ని పురుషలకీ ఒకే రూపం).

**కోత :**

మొదటి పద్ధతి : అకర్మక క్రియ చివరనున్న నాదస్పర్శం స్థానంలో దానికి సవర్ణమైన శ్వాస స్పర్శాన్ని ఆదేశించడం :

కర్గ్ - 'కరుగు' కర్క్ - 'కరిగించు'
కూడ్ - 'కూడు' కూట్ - 'కూర్చు'
పర్ద్ - 'వ్యాపించు' పర్త్ - 'వ్యాపించేటట్టు చేయు'

రెండో పద్ధతి : అకర్మక క్రియకి -చ్-, -త్- అనే సకర్మక ప్రత్యయాలు చేర్చడం, (య, ంజలు చ ముందూ, ర, వలు త ముందూ లోపిస్తాయి. ణ్ + త్ → ట్.)

కల్ 'నేర్చుకొను' కల్చ్ 'నేర్పు'
కాయ్ 'కాగు' కాచ్ 'కాచు'
కొర్ంజ్ 'తగ్గు'. కొర్చ్ 'తగ్గించు'
చేర్ 'చేరు' చేత్ 'చేర్చు'
నడ్వ్ 'నడుచు' నడ్త్ 'నడిపించు'
ఉణ్ 'తాగు' ఊట్ 'తాగించు'

మూడో పద్ధతి : అకర్మకార్థంలో -ద్- నీ, సకర్మకార్థంలో -త్- నీ భూత ప్రత్యయంగా వాడడం. (కుండలీకరణాలలో ఇచ్చినవి భూత ప్రాతిపదికలు).

ఒడ్వ్ (ఒడ్ద్-) 'పగులు' ఒడ్వ్ (ఒడ్త్) 'పగలగొట్టు'
తేయ్ (తేచ్-) 'అరుగు' తేయ్ (తేచ్-) 'అరగతీయు'

ప్రేరణ ప్రత్యయం -క్ చ్-. / -గ్ చ్-, ఇది మొదట్లో గెయ్ (గెచ్) అనే క్రియ.

ఉణ్ 'తాగు' ఉణ్క్‌చ్ 'తాగించు.'

తొద :

మొదటి పద్ధతి : (కోతలోకి మల్లే)
ఈఖ్ 'దిగు' ఈక్ 'దింపు'
ఓడ్ 'ఆడు' ఓట్ 'ఆడించు'

ఓట్ 'చల్లారు' ఓత్ 'చల్లారబెట్టు'

రెండో పద్ధతి : (కోతలోకి మల్లే)

కల్ 'నేర్చుకును' కల్చ్ 'నేర్పు'

కొడ్ 'చచ్చు' కొడ్చ్ 'చంపు'

కడ్ 'దాటు' కడ్త్ 'దాటించు'

నడ్ 'నడుచు' నడ్చ్ 'నడిపించు'

కోణ్ 'చూచు' కోట్ 'చూపించు'

మూడో పద్ధతి : అకర్మకార్థంలో -స్-, -థ్- (θ), సకర్మకార్థంలో -చ్- -త్- భూతప్రత్యయాలుగా వాడడం. ఇటువంటి క్రియలలో సకర్మకాల చివర -ప్- ప్రత్యయం ఉంటుంది.

వడ్ (వడ్త్-) 'పగులు' వడ్ప్ (వడ్త్-) 'పగలగొట్టు'

కర్య్ (కర్స్-) 'మాడు' కర్య్ (కర్చ్-) 'మాడ్చు'

ప్రేరణప్రత్యయం -ఎత్- ( ∧ త. మ. ఎట్టు 'కొట్టు, వేయు')

తినెత్ 'తినిపించు'.

కొడగు :

మొదటి పద్ధతి :

ఆడ్ 'ఆడు ఆట్ 'ఆడించు'

ఎరంగ్ 'జారు' ఎరక్ 'జార్చు'

బొరడ్ 'భయపడు' బొరట్ 'భయపెట్టు'

రెండో పద్ధతి : అకర్మక క్రియకి -క్-, -త్-, -ఇప్- చేర్చడం.

ఉర్ 'కరుగు' ఉరుక్ 'కరిగించు'

||

తిర్ 'తిరుగు' తిరుక్ 'తిప్పు'

బూళ్ 'పడు' బూక్ 'పడగొట్టు'

అర్ 'ఎండు' అత్ 'ఎండబెట్టు'

కాణ్ 'చూచు' కాట్ 'చూపెట్టు'

నడ 'నడచు' నడత్ 'నడిపించు'

||

అరి 'కనుగొను' అరిప్ 'చెప్పు'

|| ||

ఎళ్ 'లేచు' ఎప్ప్ 'లేపు'

మూడో పద్ధతి: అకర్మకార్థంలో -ంద్- / -ంజ్ - (భూ.), -వ్- (భవి.) అనే కాలప్రత్యయాలనీ సకర్మకార్థంలో -త్ /-చ్- (భూ.) -ప్- (భవి.) అనే కాలప్రత్యయాలనీ వాడడం.

|| ||

ఇడి (.వ్-, -ంజ్-) 'గోడ) పడు' ఇడి- (ప్-, -చ్-) పడగొట్టు' ఒడె- (-వ్-, అంద్-) 'బద్దలవు' ఒడ- (-ప్-, -త్-) 'బద్దలుకొట్టు.'

ప్రేరణప్రత్యయం -చ్- : మాడిచ్ 'చేయించు'.

కన్నడం :

ఆధునిక కన్నడంలో బహుళ వ్యాప్తిగల సకర్మక ప్రేరణ ప్రత్యయం -ఇసు, ప్రాచీన కన్నడంలో ఇ, ఎ, ర్, ల్, ళ్ లతో అంతమయ్యే క్రియలలో ఇసుకి బదులు చు ఉంటుంది. కాబట్టి చు ఏ కాలక్రమాన్ని ఇసుగా మారిందని చెప్పవచ్చు. (మధ్యకాల కన్నడంలో చు కి బదులు ఇచు ఉంది.)

ఈ 'ఇచ్చు' ఈసు/ఈయిసు 'ఇప్పించు'

ఓడు 'పరిగెత్తు' ఓడిసు 'పరిగెత్తించు'

-కాయ్ 'కాగు' కాసు/కాయిసు 'కాచు'

కెరళ్ 'కోపపడు' కెరళ్చు/కెరళిసు 'కోపింపజేయు'

తీర్ 'తీరు' తీర్చు/తీరిసు 'తీర్చు'

అతి ప్రాచీన శాసన భాషలో (7-10 శతాబ్దాలు) -ప్పు-, ఋ అనే ప్రత్యయం కొన్ని క్రియలలో ఉంది : ముడిప్పిదార్ / ముడిపిదర్ 'పూర్తి చేయించారు'; ఎర్పు 'లేపు' (ఇది ఎళ్ 'లేచు' నించి వచ్చింది).

నాదస్పర్శం స్థానంలో శ్వాసస్పర్శాన్ని ఆదేశించడంవల్ల సకర్మక క్రియని నిర్మించే పద్ధతి చాలా కొద్ది క్రియలలో కనపడుతోంది:

| | | | |
|---|---|---|---|
| అడంగు / అడుగు | 'అడగు' | అడకు | 'అడచు' |
| ముడుగు | 'వంగు' | ముడుకు | 'వంచు' |
| అముగు | 'నొక్కుపడు' | అముకు | 'నొక్కు' |

కొన్ని క్రియలలో -త్ సకర్మక ప్రత్యయం ణ్, ళ్ లతో సంధి మార్పు పొంది నేటికీ నిలిచి ఉంది :

| | |
|---|---|
| ఉణ్ 'అన్నంతిను' | ఊడు 'తినిపించు' |
| నాన్ 'నాను' | నాఱు 'తడుపు' |
| నీళ్ 'సాగు' | నీడు 'సాగతీయు' |
| తెరళ్ 'చుట్టుకొను' | తెరటు 'చుట్టు' |

**తుళు :**

| | |
|---|---|
| కొన్ని క్రియలలో | సకర్మక ప్రత్యయం -పు- |
| ఒళి 'మిగులు' | ఒళిపు 'మిగుల్చు' |
| బొళె 'మొలుచు' | బొళెపు 'మొళిపించు' |
| ఉరి 'మండు' | ఉరిపు 'మంటచేయు' |
| పొరి 'వేగు' | పొరిపు 'వేయించు' |

మరికొన్ని క్రియలలో సకర్మక ప్రేరణ ప్రత్యయం -అవు-/ (మాండలిక భేదం -ఒ-), దీనికి ఎ, ఇలలో అంతమయ్యే ద్వ్యచ్క ధాతువులలోనూ ఏకాచ్క ధాతువులలోనూ -పావు-/ (మాం. -పో-) అనే రూపాంతరం ఉంది. కొన్ని క్రియలలో -పో- తో పాటు -సో- కూడా ఉంది.

| | |
|---|---|
| తళ్లు 'తోయు' | తళ్లో 'తోయించు' |
| తిన్ 'తిను' | తిన్పో 'తినిపించు' |
| బర్ 'వచ్చు' | బర్పో 'రప్పించు' |
| బూళు 'పడు' | బూళో/బూళ్పో 'పడగొట్టు' |
| ఓదు 'చదుపు' | ఓదో/ఓద్పో/ఓద్సో 'చదివించు' |
| సేరు 'చేరు' | సేరో/సేర్సో 'చేర్చు' |

**తెలుగు :**

సకర్మక ప్రత్యయాలు -పు-, -చు-, ఇంచు- :

| | | |
|---|---|---|
| -పు : | ఉడుగు | ఉడుపు |
| | తిరుగు | త్రిప్పు |
| | కఱచు | కఱపు |
| | నిలుచు | నిలుపు |
| | కలియు | కలుపు |
| | మాయు | మాపు/మాయించు |
| -చు : | చేరు | చేరుచు/చేర్చు |
| | కూలు | కూలుచు/కూల్చు |
| | ఆడు | ఆర్చు/ఆడించు |
| | ఓడు | ఓర్చు/ఓడించు |
| | కాఁగు | కాఁచు |
| | కలఁగు | కలఁచు |
| -ఇంచు: | పండు | పండించు |
| | నవ్వు | నవ్వించు |
| | మొలుచు | మొలిపించు |
| | వెలుగు | వెలిగించు |
| | వచ్చు | రావించు/రప్పించు |

ప్రేరణ ప్రత్యయం - ఇంచు, - ఇపించు (హ్రస్వాచ్చు కలిగి నుతో అంతమయ్యే క్రియలలో), -పించు (చుతో అంతమయ్యే వాటిలో; -పించు కి ముందు చు లోపిస్తుంది):

ప్రేరణ ప్రత్యయం సకర్మక ప్రత్యయాలైన చు, పుల తరవాత కూడా వస్తుంది: కాలు : కాల్చు, కాల్పించు, తడియు : తడుపు, తడిపించు, చచ్చు : చంపు, చంపించు. చులో చకారం ఇంచు ముందు పకారంగా మారుతుంది: చేర్పన్, చేయింపన్.

కొన్ని క్రియలలో సకర్మకార్థం ప్రత్యయం వల్ల కాక కొన్ని సహాయక క్రియలవల్ల (ఇవి తుమువ్నంత రూపానికి చేరతాయి) ద్యోతకమవుతుంది: పడవైచు/పడవేయు, పడగొట్టు, ఆరబెట్టు, ఆరబోయు, సాగదీయు, చెఱచు/చెడగొట్టు, భయపెట్టు, కష్టపెట్టు.

**గోండీ :**

బహుళ వ్యాప్తిగల సకర్మక ప్రేరణ ప్రత్యయం - ఊస్ -; దీని రూపాంతరాలు -హ్-, -వూస్-, కోయమాండలికంలో ఊస్‌కి బదులు ఇస్ ఉంటుంది; హకారం లోపిస్తుంది:

| | |
|---|---|
| ఉన్ 'తాగు' | ఉహ్/(కో.) ఉప్పిస్ 'తాగించు' |
| తిన్ 'తిను' | తిహ్/(కో.) తీసిస్ 'తినిపించు' |
| మేయ్ 'మేయు' | మెహ్ (కో.) మే- 'మేపు' |
| ఉద్ద్/(కో.) కుద్ 'కూర్చును' | ఉప్వూస్/(కో.) కుప్పిస్ 'కూర్చొబెట్టు' |
| కరీ 'నేర్చుకొను' | కరూస్ 'నేర్పు' |
| అట్ 'వండు' | అట్టూస్/(కో.) అట్టిస్ 'వండించు' |
| నార్ 'కడుగు' | నారూస్/(కో.) నార్దిస్ 'కడిగించు' |

**కొండ :**

కొన్ని అకర్మక క్రియ చివరనున్న జ్, జి, గ్, ంజ్, ంజి, ద్, ంబ్, వ్, వి, న్జి ల స్థానంలో వాటికి సవర్ణాలైన శ్వాసస్పర్శాలని, అంటే, క్, స్, త్, ప్, త్ ఆదేశించడంవల్ల సకర్మక ప్రేరణ క్రియ లేర్పడతాయి:

| | |
|---|---|
| దూజ్ 'కదులు' | దూక్ 'కదిలించు' |
| నిజ్ 'లేచు' | నిక్ 'లేపు' |
| ముడ్గ్ 'మునుగు' | ముడ్క్ 'ముంచు' |
| కింజ్ 'చిరుగు' | కిస్ 'చింపు' |
| ఊద్ 'తడియు' | ఊత్ 'తడుపు' |
| నంబ్ '(నిప్పు) ఆరు' | నప్ 'ఆర్పు' |
| తెవ్ 'తెగు' | తెప్ 'తెంపు' |
| నిన్డి 'నిండు' | నిట్ 'నింపు' |

చాలా క్రియలలో -ఇస్-(-స్-), -ప్-, పిస్- (-బిస్) ప్రత్యయాలు చేరి సకర్మక ప్రేరణ క్రియ లేర్పడతాయి.

| | |
|---|---|
| ఊక్ 'ఊదు' | ఊక్పిస్/ఊకిస్ 'ఊదించు' |
| కట్ 'కొరుకు' | కట్పిస్/కటిస్ 'కొరికించు' |
| త 'తెచ్చు' | తపిస్ 'తెప్పించు' |
| సిక్ 'నవ్వు' | సిక్పిస్ 'నవ్వించు' |
| ఉణ్ 'తాగు' | ఊట్పిస్ 'తాగించు' |
| ఊర్ 'మరుగు' | ఊరిస్ 'మరిగించు' |
| సీ 'ఇచ్చు' | సీబిస్ 'ఇప్పించు' |
| డిగ్ 'దిగు' | డిప్ 'దింపు' |
| నిల్ 'నిలుచు' | నిల్ప్ 'నిలబెట్టు' |
| మెయ్ 'మేయు' | మేప్ 'మేపు' |

పెంగో :

కొండలోలాగే పెంగోలో కూడా కొన్ని అకర్మక క్రియల చివర (అనునాసిక సహిత) నాదస్పర్శాన్ని శ్వాసస్పర్శంగా మార్చడంవల్ల సకర్మక ప్రేరణక్రియ లేర్పడతాయి.

| | |
|---|---|
| ఎం(గ్) 'మిగులు' | ఎక్ 'మిగుల్చు' |
| డుగ్ 'దాగు' | డుక్ (దాచు' |
| చోంజ్ 'కనపడు' | చోచ్ 'చూపెట్టు' |
| నడ్ 'చిరుగు' | నట్ 'చింపు' |
| ఊద్ 'తడియు' | ఊత్ 'తడుపు' |
| లబ్ 'దూరు' | లప్ 'దూర్చు' |
| మజ్ 'తిరుగు' | మహ్ (మస్త్-) 'తిప్పు' |

కొన్నిటిలో -త్- (-ట్-, -చ్-), -ప్- ప్రత్యయాలు ఉన్నాయి. (కొన్నింటిలో వీటికి ఆభీక్ష్ణ్యార్థకమైన (Intensive) ప చేరుతుంది)

| | |
|---|---|
| అర్ 'పడు' | రత్ 'పడగొట్టు |
| జూ 'దిగు' | జూత్ 'దింపు' |
| ఉణ్ 'తాగు' | ఊట్ప 'తాగించు' |
| తిన్ 'తిను' | తీచ్ (ప) 'తినిపించు' |
| దుమ్ 'ఎక్కు' | దుప్ 'ఎక్కించు' |
| రీ 'దిగు' | రిప్ 'దింపు' |

మండ :

(పెంగొలో లాగే)

| | |
|---|---|
| క్డుంగ్ 'ములుగు' | క్డుక్ 'ముంచు' |
| దాంగ్ 'పోవు(to be lost)' | దాక్ 'పోగొట్టు(కొను)' |
| డుగ్ 'దాగు' | డుక్ 'దాచు' |
| కెంజ్ 'చిరుగు' | కెచ్ 'చింపు' |
| రె 'పడు' | రెత్ 'పడగొట్టు' |
| ఉన్ 'తాగు' | ఊట్ 'తాగించు' |

కూయి :

అకర్మక క్రియ చివరి (అనునాసిక సహిత) నాదస్పర్శాన్ని శ్వాస స్పర్శంగా మార్చడంవల్ల సకర్మక ప్రేరణక్రియ లేర్పడతాయి.

| | |
|---|---|
| మూగ్ 'ముగియు' | మూక్ 'ముగించు' |
| నింగ్ 'లేచు' | నిక్ 'లేపు' |
| అజ్ 'చల్లారు' | అస్ 'చల్లారబెట్టు' |
| తోంజ్ 'కనపడు' | తోస్ 'చూపెట్టు' |
| బ్రాడ్ 'చెదురు' | బ్రాట్ 'చెదరగొట్టు' |
| పూండ్ 'కలియు' | పూట్ / పూడ్ '(ఎడ్లని) కట్టు' |
| కంబ్ 'కాలు' | కప్ 'కాల్చు' |
| గ్రాంబ్ 'నేర్చుకొను' | గ్రాప్ 'నేర్చు' |

కొన్ని క్రియలలో -ప్-, -స్-, -క్-, -ట్- / డ్- అనే ప్రత్యయాలు ఉన్నాయి :

| | |
|---|---|
| ఎ 'వచ్చు' | ఎప్ 'రప్పించు' |
| జా 'దిగు' | జాప్ 'దింపు' |
| సా 'చచ్చు' | సాప్ 'చంపు' |
| మీ 'స్నానంచేయు' | మీస్ 'స్నానం చేయించు' |
| తిన్ 'తిను' | తీస్ 'తినిపించు' |
| ప్రి 'ఊడు' | ప్రిక్ 'ఊడదీయు' |
| ఉణ్ 'తాగు' | ఊట్ / ఊడ్ 'తాగించు' |

ఒక క్రియకి సకర్మక ప్రేరణప్రత్యయం లేకపోతే, దాని తుమున్నంత రూపానికి గి- 'చేయు' చేర్చి ప్రేరణ రూపాన్ని సాధించవచ్చు.

కువి :

(అనునాసిక సహిత) నాదస్పర్శం స్థానంలో శ్వాసస్పర్శాన్ని ఆదేశించడం :

| | |
|---|---|
| తూంగ్ 'వేళ్లాడు' | తూక్ 'వేళ్లాడదీయు' |
| నింగ్ 'లేచు' | నిక్ 'లేపు' |
| ఊద్ 'తడియు' | ఊత్ 'తడుపు' |
| డంబ్ 'పగులు' | డప్ 'పగలగొట్టు' |

కొన్ని క్రియలలో -ట్- -హ్-, -ప్- చేర్చడం ఉంది :

| | |
|---|---|
| ఉన్ 'తాగు' | ఊట్ 'తాగించు' |
| ఓయ్ 'పగులు' | ఓహ్ 'పగలగొట్టు' |
| నెంజ్ 'నిండు' | నెహ్ 'నింపు' |
| రా 'పూర్తిఅవు' | రాప్ 'పూర్తిచేయు' |

చాలా క్రియలలో కి- 'చేయు' అనే క్రియని చేర్చడంవల్ల సకర్మక ప్రేరణార్థం ద్యోతక మవుతుంది. ఇది చేరిన క్రియ చివర ఇ (వి, పి, బి) అనే ప్రత్యయం ఉంటుంది :

నింగి కి- 'లేవు', హీవికి- 'ఇప్పించు', దొస్పికి- 'కట్టించు (to tie)', తపికి 'తెప్పించు', పున్బికి 'తెలుపు', హల్బికి 'పంపు.'

**కోలామీ :**

సకర్మక ప్రేరణ ప్రత్యయాలు - అప్-, ఇప్-, -ప్-, -క్-, -త్-.

| | |
|---|---|
| నెగయ్ 'ఎగురు' | నెగప్ 'ఎగరవేయు' |
| ముంగ్ 'మునుగు' | ముంగిప్ 'ముంచు' |
| పండ్ 'పండు' | పండిప్ 'పండించు' |
| ఆడ్ 'ఆడు' | ఆడ్ప్ 'ఆడించు' |
| తీర్ 'పూర్తి అవు' | తీర్ప్ 'పూర్తి చేయు' |
| కిని 'విరుగు' | కిన్క్ 'విరుచు' |
| ఇరి 'చిరుగు' | ఇర్క్ 'చింపు' |
| పడ్ 'గాయపడు' | పర్త్ 'గాయపరుచు' |
| ఉన్ 'తాగు' | ఉర్త్ 'తాగించు' |
| ఓడ్ 'పగులు' | ఓట్ 'పగలగొట్టు' |

**నాయకి (ఛాందా) :**

సకర్మక ప్రేరణ ప్రత్యయం -ప్-, -ఉప్-, -ఇప్-,.

| | |
|---|---|
| ఆర్ 'ఎండు' | ఆరుప్ 'ఎండబెట్టు' |
| ఇల్ 'నిలుచు' | ఇలుప్ 'నిలబెట్టు' |

| | |
|---|---|
| ఉద్ 'కూర్చొను' | ఉదుప్ 'కూర్చోబెట్టు' |
| కాయ్ 'కాగు' | కాప్ 'కాచు' |
| పయ్ 'పగులు' | పయిప్ 'పగలగొట్టు' |
| వయ్ 'కాలు' | వయిప్ 'కాల్చు' |

పర్జీ :

సకర్మక ప్రేరణ ప్రత్యయం -ఇప్- -ఇత్- (-ఇత్- భూత భవిష్యత్కాల రూపాలలోనూ, -ఇప్- మిగిలిన వాటిలోనూ వస్తుంది; కింద -ఇప్- రూపమే ఇవ్వబడింది.) కొన్ని క్రియలకి దీన్ని చేర్చినప్పుడు వాటి చివరి (అనునాసిక సహిత) నాదస్పర్శం శ్వాస స్పర్శంగా మారుతుంది. కొన్ని క్రియలలో దీని ముందు -క్-, -చ్-, -త్-, -ప్- ప్రత్యయాలు కూడా చేరతాయి.

| | |
|---|---|
| తాక్ 'నడచు' | తాకిప్/తాకిత్-'నడిపించు' |
| నొయ్ 'నెప్పిపెట్టు' | నొయిప్ 'నొప్పించు' |
| కెర్జ్ 'వెచ్చబడు' | కెర్చిప్ 'వెచ్చబెట్టు' |
| ఓడ్ 'బద్దలగు' | ఓటిప్ 'బద్దలుకొట్టు' |
| పోద్ 'తడియు' | పోతిప్ 'తడుపు' |
| ఊంగ్ 'ఊగు' | ఊకిప్ 'ఊపు' |
| ఎఞ్ (<ఎంజ్) 'లేచు' | ఎచిప్ 'లేపు' |
| నిర్ 'మండు' | నిర్కిప్ 'మంటచేయు' |
| మెర్ 'నేర్చుకొను' | మెర్చిప్ 'నేర్పు' |
| అడ్ 'ఏడ్చు' | అడ్తిప్ 'ఏడిపించు' |
| నిల్ 'నిలుచు' | నితిప్ 'నిలబెట్టు' |
| మేయ్ 'మేయు' | మేపిప్ 'మేపు' |
| ఉన్ 'తాగు' | ఉంటిప్ 'తాగించు' |

గదబ (ఒల్లారీ) :

సకర్మక ప్రేరణ ప్రత్యయం -ప్-/-త్- (పర్జీలో లాగా),

| | |
|---|---|
| అడ్ 'ఏడ్చు' | అడ్ప్/అడ్త్ 'ఏడిపించు' |
| ఇడ్గ్ 'దిగు' | ఇడ్గెప్ 'దింపు' |

**కూడుఖ్ :**

సకర్మక ప్రేరణ ప్రత్యయాలు -తా' అ-(-త్-), -ద్-, -ఆబ' అ-.

ఎస్' 'పగులు' ఎస్తా'అ 'పగలగొట్టు'

చూర్ 'అడ్డుఅవు' చూర్తా'అ 'అడ్డుపెట్టు'

ఒన్ 'తిను' ఒంద్ 'తినిపించు'

సిఖ్ర్ 'నేర్చుకొను' సిఖాబ'అ 'నేర్పు'

**మాల్తో :**

సకర్మక ప్రేరణప్రత్యయం -త్ర్-, -ద్-.

ఖంద్ర్ 'నిద్రించు' ఖంద్ర్త్ 'నిద్రపోగొట్టు'

అల్ఖ్ 'నవ్వు' అల్ఖ్త్ర్ 'నవ్వించు'

మేంజ్ 'చేయు' మేంజ్త్ర్ 'చేయించు'

ఒన్ 'తాగు' ఒంద్ 'తాగించు'

ఏర్ 'చూచు' ఏద్ 'చూపెట్టు'

త్ర్ ప్రత్యయంమీద -తిత్- చేర్చడంవల్ల ప్రేరణరూపం ఏర్పడుతుంది: ఎత్ 'దిగు', ఎత్త్ర్ 'దింపు', ఎత్త్ర్తిత్ 'దింపించు.'

(కూడుఖ్‌లోనూ) మాల్తోలోనూ. సకర్మకక్రియకి -గ్ర్-, -ర్- అనే ప్రత్యయాలు చేర్చడంవల్ల అకర్మకక్రియలు ఏర్పడతాయి. ఇటువంటి ప్రక్రియ ఏ ఇతర ద్రావిడ భాషలోనూ లేదు. ఇటువంటి క్రియలు ఆత్మార్థకాలుగా కూడా ఉంటాయి.

ఇస్ 'చింపు' ఇస్గ్ర్ 'చిరుగు'

ఇచ్ 'ఊడదీయు' ఇచ్గ్ర్ 'ఊడు'

నోడ్ 'కడుగు' నోడ్ర్ 'కడుగుకొను'

ఖోస్ 'తొక్కు' ఖోస్ర్ 'తొక్కబడు'

ఎజ్ 'లేపు' ఎజ్ర్ 'మెళకువగా ఉండు'

పుచ్ '(బట్టలు) విప్పు' పుచ్గ్ర్. 'విప్పుకొను'

బ్రాహుయీ :

సకర్మక ప్రేరణ ప్రత్యయం -ఇఫ్- (if), (అచ్చు తరవాత -ఫ్- (f)).

| | |
|---|---|
| బిన్ 'విను' | బినిఫ్ 'వినిపించు' |
| బా౯ర్ 'ఎండు' | బారిఫ్ 'ఎండబెట్టు' |
| ఖన్ 'చూచు' | ఖనిఫ్ 'రప్పించు' |
| బన్ 'వచ్చు' | బనిఫ్ 'రప్పించు' |
| సల్/సలీ 'నిలబడు' | సలిఫ్/సలీఫ్ 'నిలబెట్టు' |

సకర్మకమైన -ఇఫ్- మీద మళ్ళీ -ఇఫ్- ప్రత్యయం చేర్చడంవల్ల ప్రేరణరూపం ఏర్పడుతుంది.

క 'చచ్చు', కస్ఫ్ 'చంపు', కస్ఫిఫ్ 'చంపించు', ఖలీ 'భయపడు', ఖలీఫ్ 'భయపెట్టు', ఖలీఫిఫ్ 'భయపెట్టించు.'

## తులనాత్మక చర్చ

పై పరిశీలన వలన ద్రావిడ భాషలలో సకర్మక ప్రేరణక్రియలని నిర్మించే పద్ధతులు మూడు ఉన్నాయని తెలుస్తుంది.

**మొదటి పద్ధతి :** అకర్మక క్రియ చివరనున్న శ్వాస స్పర్శం లేక అనునాసికంతో కూడిన శ్వాసస్పర్శం స్థానంలో ద్విరుక్త శ్వాస స్పర్శాన్ని ఆదేశించడం (మూ. ద్రా. అద్విరుక్త శ్వాస స్పర్శం అన్ని భాషలలోనూ నాద స్పర్శంగా మారుతుంది. (తమిళ - మలయాళాలలో నాదస్పర్శాలకి ప్రత్యేకాక్షరాలు లేవు కాబట్టి వీటిలో ఈ మార్పు రాతలో సూచింపబడదు); మూ. ద్రా. ద్విరుక్త శ్వాసస్పర్శం తమిళ-మలయాళాలు తప్ప మిగిలిన భాషలలో అద్విరుక్త శ్వాసస్పర్శంగా మారుతుంది. అకర్మక క్రియలో అనునాసిక సహిత శ్వాస స్పర్శం ఉంటే, దానినించి వచ్చిన సకర్మక ప్రేరణ క్రియలలో మూల ద్రావిడంలో అనునాసిక సహిత ద్విరుక్త శ్వాస స్పర్శం ఉండేదని చెప్పడానికి ఆధారం ఉంది (చూ. 2. 36). కాని, ఇటువంటి క్రియలలో ద్విరుక్తస్పర్శం ముందు అనునాసికం ఏ దుహితృ భాషలోనూ మిగలలేదు, ఈ మొదటి పద్ధతి

దక్షిణోప కుటుంబంలో తమిళం - మలయాళం - కోత - తొద - కొడగు సముదాయంలో చాలా ప్రచురంగా ఉంది. కన్నడంలో ఇది అంత ప్రచురంగా లేకపోయినప్పటికీ ఆ భాషలో కూడా దీనికి కొన్ని ఉదాహరణలు ఉన్నాయి. తెలుగులో ఈ పద్ధతి పూర్తిగా నశించి దీనికి బదులు సకర్మక ప్రేరణ ప్రత్యయాన్ని ఉపయోగించే పద్ధతి సర్వత్రా వ్యాపించింది: ఉదా. త. కలంకు: కలక్కు; తె. కలఁగు; కలఁచు. మిగిలిన మధ్య ద్రావిడ భాషలలో ఇది కొండ - పెంగో - మంద - కూయి - కువి భాషలలోనే ప్రచురంగా ఉంది. ఇక పర్జీ భాషలో ప్రేరణ క్రియలలో ఒక ప్రత్యేకత ఉంది. ఈ భాషలో సకర్మక ప్రేరణ ప్రత్యయం -ఇప్- / -ఇత్- అయినా ఇది చేర్చినప్పుడు కొన్ని క్రియల చివరి నాదస్పర్శం లేక అనునాసికంతో కూడిన నాదస్పర్శం దానికి సవర్ణమైన శ్వాస స్పర్శంగా మారుతుందని పైన చూశాము. ఈ మార్పు ప్రస్తుత పర్జీ భాషలో ఒక సంధి మార్పు మాత్రమే అయినా ఇటువంటి క్రియలని మిగిలిన ద్రావిడ భాషలలో సమాన పదాలలో పోల్చి చూస్తే వీటి ప్రేరణ రూపాలు ఒకానొక కాలంలో అంటే పురాతన - పర్జీ (Pre - Parji) కాలంలో -ఇప్-/-ఇత్- లేకుండా ఉండేవని స్పష్టమవుతుంది. ఉదా. పర్జీ ఊంగ్: ఊకిప్; త. ఊంకు; ఊక్కు: పురాతన పర్జీ కాలంలో ఊక్‌లో క్ అనే శ్వాస స్పర్శమే ప్రేరణ ప్రత్యయం అన్నమాట. ఈ విషయాన్నే పర్జీ భాషలో విశేష పరిశోధన చేసిన టి. బరో సుధీభూషణ్ భట్టాచార్య ఇలా చెప్పేరు :

"Roots ending in nasal + voiced consonant usually substitute for this combination the corresponding un - voiced consonant. In old Dravidian, as found in Tamil for instance this substitution was in itself sufficient to from the causative base, so that in Parji the older and simpler causal forms have been enlarged by the addition of the suff- ix ip/it which has been generalized as the causal suffix." (*The Pa ji Language*. p. 46)

ఇటువంటి క్రియలలో -ఇప్- / ఇత్ - ప్రత్యయం సామ్యం వల్ల చేర్చబడింది అనే విషయం స్పష్టం. దీనివల్ల పర్జీ భాషలోకూడా ఒకానొక కాలంలో ఈ పద్ధతి ప్రచురంగా ఉండేదని తెలుస్తుంది. కోలామీలో ఇప్పుడు ఈ పద్ధతి లేకపోయినా ఆ భాషలో ఓడ్ (< మూ.ద్రా. *ఓట్) 'పగులు', ఓట్ (<మూ.ద్రా. *ఓట్ట్) 'పగలగొట్టు' అనే క్రియలో ఈ పద్ధతి నేటికీ అవశిష్టంగా నిలిచి ఉంది. రెండు లేక అంతకన్న ఎక్కువ ఉపకుటుంబాలలో తుల్యంగా ఉన్న ఒక విశేషం వాటిమూలభాషనించి వాటికి సంక్రమించినదై ఉంటుంది అనేది తులనాత్మక వ్యాకరణంలో ప్రాథమిక సూత్రం. కాబట్టి దక్షిణ మధ్యోపకుటుంబాలలో ఉన్న యీ పద్ధతి మూలద్రావిడ భాషకి చెందినదే అని మనం నిర్ణయించవచ్చు. కన్నడం, తుళు, తెలుగు, గోండీలలోనూ ఉత్తర భాషలలోనూ యీ పద్ధతి నశించడం ఒక అర్వాచీన పరిణామమే.

ఈ పద్ధతిని ప్రేరణరూపాలు నిర్మించదగిన క్రియలలో ఎక్కువ కంఠ్యాలూ, దంతమూలీయాలతోనే అంతమవుతాయి. తమిళం- కొడగు, కొండ-కువి ఉపకుటుంబాలలో యీ పద్ధతి కిందకి వచ్చే క్రియల్ని పోల్చి చూస్తే వీటిలో కంఠ్యాలు, దంతమూలీయాలతో అంతమయ్యే క్రియలనే మనం మూలద్రావిడ భాషా కాలానికి పునర్నిర్మించకలుగుతాము:

| | | | | |
|---|---|---|---|---|
| 1. | త. తూంకు | 'వేళ్ళాడు' | తూక్కు- | 'వేళ్ళాడదీయు' |
| | మ. తూజ్ఞు | ,, | తూక్కు | ,, |
| | కోత. తూగ్ | ,, | తూక్ | ,, |
| | తొ. తూఖ్ | ,, | తూక్ | ,, |
| | కొడ. తూంగ్ | ,, | తూక్ | ,, |
| | కొం. దూంగ్ | ,, | దూక్ | ,, |
| | పెం. తూంగ్ | ,, | తూక్ | ,, |
| | మం. త్రూంగ్ | ,, | త్రూక్ | ,, |
| | కూయి. ద్రూంగ్ | ,, | ద్రూక్ | ,, |
| | కువి. తూంగ్ | ,, | తూక్ | ,, |
| | మూ.ద్రా. *తూంక్ | | *తూక్క్- | (3376) |

| | | |
|---|---|---|
| 2. | త. మురుంకు 'విరుగు' | మురుక్కు 'విరుచు' |
| | కోలా. | ముర్క్ ,, |
| | కూయి. ముంగ్ 'చిరుగు' | ముక్ 'చింపు' |
| | కూ. | మురుక్ 'విరుచు' |
| | మా. | ముర్క్ ,, |
| | మూ.ద్రా. *మురుంక్ | *మురుక్ (4975) |
| 3. | త. అలంకు 'కదులు' | అలక్కు 'కదుపు' |
| | కోత. అల్గ్ ,, | అల్క్ ,, |
| | తొ. అల్ ఖ్ ,, | అల్క్ ,, |
| | క. అలగు ,, | అలచు ,, |
| | కూయి. లాంగ్ 'స్వభావం మారు' | లాక్ 'స్వభావం మార్పు' |
| | మూ.ద్రా. *అలంక్ | *అలక్ (240) |
| 4. | త. అఱు 'చల్లారు' | అఱ్ఱు 'చల్లార్చు' |
| | మ. అఱు ,, | అఱ్ఱు |
| | కోత. అర్ 'ఎండు' | అత్ 'ఎండబెట్టు' |
| | తొ. ఓఱ్ ,, | ఓత్ ,, |
| | కొ. అర్ ,, | అత్ ,, |
| | క. అఱు ,, | అఱిసు ,, |
| | తె, అఱు ,, | ఆర్చు 'చల్లార్చు' ఆర్పు '(నిప్పు) ఆర్పు' |
| | కూయి. ఆజ్ 'చల్లారు' | ఆస్ 'చల్లార్చు' |
| | మూ.ద్రా. *అఱ్ | *అఱ్ఱ్ (404) |
| 5. | త. ఊఱు 'ఊరు) | ఊఱ్ఱు 'ఊరబెట్టు' |
| | మ. ఊఱు ,, | ఊఱ్ఱు ,, |
| | తొ. ఊఱ్ 'తేరు' | ఊత్ 'తేర్చు' |
| | కూయి. ఊజ్ 'కూడు" | ఊస్ 'పోగుచేయు' |
| | మూ.ద్రా. ఊఱ్ | ఊఱ్ఱ్ (761) |

| | | | |
|---|---|---|---|
| 6. | త. తోన్ఱు 'కనపడు, తోచు' | | తోట్టు 'చూపెట్టు' |
| | మ. తోన్ను | ,, | తోట్టు ,, |
| | గోం. | — | తోహ్/తాహ్ ,, |
| | కొం. తోఙ్ | ,, | తోఙ్ ,, |
| | పెం. చోంజ్ | ,, | చోచ్ ,, |
| | మం. హూంజ్ | ,, | తూచ్ ,, |
| | కూయి. తోంజ్ | ,, | తోస్ ,, |
| | కువి. తోంజ్ | ,, | తోస్స్ ,, |
| | ప. తోంద్ | ,, | టోటిప్ ,, |
| | మూ.ద్రా. *తోన్ఱ్ | | *తోట్ట్ (3566) |

తమిళం-కొడగు ఉపకుటుంబంలో మూర్ధన్య టకారంతో అంతమయ్యే క్రియలలో కూడా యీ పద్ధతి వ్యాప్తిలో ఉంది. ఉదా : త. ఆటు 'ఆడు', ఆట్టు 'ఆడించు'. కూటు 'కూడు', కూట్టు 'కూర్చు', ఓటు 'పరిగెత్తు', ఓట్టు 'పరిగెత్తించు'. కాని వీటికి కూయిలో ఉన్న సమాన పదాలలో ఈ పద్ధతి లేక పోవడంవల్ల వీటి ప్రేరణరూపాలని మూల ద్రావిభాషకి పునర్నిర్మించడం సాధ్యంకాదు. కాని కోలామీ-పర్జీ ఉప కుటుంబంలో ఓడ్ 'పగులు', ఓట్ 'పగులగొట్టు (DED 799)' అనే క్రియలో ఈ పద్ధతి నేటికీ నిలిచి ఉండడం వల్ల మూలద్రావిడభాషలో టకారంతో అంతమయ్యే క్రియలలో కూడా ఈ పద్ధతిని ప్రేరణ రూపాలు ఏర్పడేవి అని మనం ఊహించవచ్చు. తమిళం - కొడగు భాషలలో దంత్యతకారంతో అంతమయ్యే క్రియలు చాలా కొన్నిటిలో యీ పద్ధతి కనిపిస్తోంది. మిగిలిన భాషలలో ఇటువంటి క్రియలలో ఇది లేక పోవడంవల్ల తమిళం - కొడగు భాషలలో ఇది అర్వాచీన పరిణామ మని చెప్ప వచ్చు. ఇక అనునాసికంతో కూడిన ఓష్ఠ్యపకారంతో అంతమయ్యే క్రియలలో యీ పద్ధతి తమిళం - కొడగు భాషలోనూ కొండ-కువి భాషలలోనూ కూడా కనిపిస్తోంది. కాని అటువంటి క్రియలలో ఒకటి కూడా మూలద్రావిడ భాషకి పునర్నిర్మించడం సాధ్యంకాదు కాబట్టి వీటిలో ఈ పద్ధతి తరవాత కాలంలో వ్యాప్తిలోకి వచ్చిందని చెప్పాలి.

రెండో పద్ధతి : ద్రావిడభాష లన్నిటిలోనూ చాలా క్రియలు ఒక సకర్మక ప్రేరణ ప్రత్యయాన్ని చేర్చడంవల్లనే సకర్మక ప్రేరణరూపాల్ని ఏర్పరుచుకుంటాయి. ఈ ప్రత్యయాలు *-త్-(సంధిరూపాలు *-ట్ట్-, *-ఱ్ఱ్-), *-ప్ప్-, *-చ్చ్-, *-ఇ-, అనే నాలుగు రూపాలనించి పుట్టాయి.

*-త్- నించి పుట్టిన ప్రత్యయాలు తెలుగు, గోండీ, బ్రాహుయీ తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఉన్నాయి. న, ల, ణ, ళ లతో అంతమయ్యే క్రియల తరవాత ఇది చేరినప్పుడు యీ కింద ఇచ్చిన సంధులు ప్రవర్తిస్తాయి :

(1) {న్ / ల్} + త్ → ఱ్ఱ్ ; (2) {ణ్ / ళ్} + త్ → ట్ట్

| | | |
|---|---|---|
| 1, | త. తిన్ 'తిను' | తీఱ్ఱు 'తినిపించు' |
| | మ. తిన్ ,, | తీఱ్ఱు ,, |
| | కోత. తిన్ ,, | తీత్ ,, |
| | కొడ. తిన్ ,, | తీత్ ,, |
| | క. తిన్ ,, | తీఱు 'ముద్దలుతిను' |
| | గోం. తిన్ ,, | తీహ్ /తీహ్ ,, |
| | పెం. తిన్ ,, | తీచ్ /తీచ్ప ,, |
| | కూయి, తిన్ ,, | తీస్ ,, |
| | కువి. తిర్ ,, | తీన్స్/ తీహ్ ,, |
| | ప. తిన్ ,, | తిత్రిప్ ,, |
| | కూ. మా. ,, | తింద్ ,, |
| | మూ, ద్రా. *తిన్ | *తీఱ్ఱ్ (3263) |
| 2. | త. ఉణ్ 'తిను, తాగు' | ఊట్టు 'తినిపించు, తాగించు' |
| | మ. ఉణ్ ,, | ఊట్టు ,, |
| | కోత ఉణ్ 'తాగు' | ఊట్ 'తాగించు' |
| | క. ఉణ్ 'తిను' | ఊడు 'తినిపించు' |
| | కొం. ఉం(డ్) 'తాగు' | ఉట్పిస్ 'తాగించు' |
| | పె: ఉణ్ ,, | ఉట్ప ,, |

| | | |
|---|---|---|
| మం. ఉన్ ,, | ఊట్ | ,, |
| కూయి. ఉణ్ ,, | ఊట్ / ఊఢ్ | ,, |
| కువి. ఉన్ ,, | ఊట్ | ,, |
| కూ. ఓన్ ,, | ఓన్‌తా' | ,, |
| మా. ఓన్ ,, | ఒంద్ | ,, |
| మూ.ద్రా. *ఉణ్ | *ఊట్ట్ | (600) |

(పై రెండు ఉదాహరణలలోనూ అప్రేరణ రూపంలో హ్రస్వాచ్చూ ప్రేరణరూపంలో దీర్ఘాచ్చూ దక్షిణ భాషలలోనూ గోండీ - కువి లలో కూడా ఉన్నాయి. కాబట్టి ఈ భేదం ఈ క్రియలలో మూలద్రావిడ భాషలోనే ఉండి ఉండాలి.)

| | | | |
|---|---|---|---|
| 3. | త. పూణ్ 'ధరించు,పూను' | పూట్టు 'పూన్చు, తాళం వేయు' | |
| | మ. పూణ్ ,, | పూట్టు | ,, |
| | కోత. పూఢ్ ,, | పూట్ | ,, |
| | తొ. పూళ్ ,, | పూట్ | ,, |
| | క. పూణ్ ,, | పూడు | ,, |
| | కొం. | పూట్ | ,, |
| | పెం. | పూట్ | ,, |
| | కూయి. పూండ్ 'కలియు' | పూట్ /పూఢ్ | ,, |
| | మూ ద్రా. *పూణ్ | పూట్ట్ | (4361) |

పై మూడు క్రియలలోనూ ప్రేరణరూపాలు దక్షిణభాషలలోనే కాకుండా గోండీ - కువి, పర్జీలలోకూడా ఉండడంవల్ల అవి మూలద్రావిడభాషకి చెందినవే అనీ, వాటిలో జరిగిన సంధి మార్పులు మూలద్రావిడ భాషాకాలంలోనే ఉండేవి అనీ మనం ఊహించవచ్చు. ల, ళ లతో అంతమయ్యే క్రియలలోకూడా ఇటు వంటి సంధిమార్పు దక్షిణభాషలలో చాలా ప్రచురంగా ఉన్నప్పటికీ (ఉదా : త. మ. ఉరుళ్ 'చుట్టుకొను' : ఉరుట్టు 'చుట్టు', ఇాల్ 'వేళ్ళాడు', ఇాఱ్ఱు "వేళ్ళాడ దీయు', నీళ్ 'పొడుగుగాఉండు', నీట్టు 'సాగదీయు', కళల్ 'జారు', కళఱ్ఱు

'జార్చు') వీటికి సమాన పదాలు మరి ఏ భాషలోనూ లేకపోవడంవల్ల వీటిని మూలద్రావిడ భాషకి పునర్నిర్మించడం సాధ్యం కాదు.

ఈ సందర్భంలో * త్- ప్రత్యయం మధ్య భాషలలో పైన ఇచ్చిన క్రియలలో తప్ప మరి ఎక్కడా లేదనే విషయం గమనించదగినది.

*-ప్- నించి వచ్చిన ప్రత్యయాలు గోండీ - కువి సముదాయం, కూడుఖ్-మాల్తోలు తప్ప మిగిలిన భాషలలో ప్రచురంగా ఉన్నాయి (కూ. -ఆబ' అ హిందీ నించి వచ్చినది.) తమిళంలో ఇది సర్వసాధారణంగా ఇ అనే మరొక ప్రత్యయంతో కలిసి ప్పి, విగా ఉండడం గమనించదగ్గది. ఇది ప్రాచీన కన్నడంలో కూడా ఉండేదని శాసనాలవల్ల తెలుస్తుంది; తరవాత కాలంలో ఇది నశించింది. పర్జి ఇప్ దీనికి సంబంధించినదే. దీని రూపాంతరమైన ఇత్ *ఇప్త్-లో పకారం లోపించడం వల్ల ఏర్పడినదనీ, అందులో తకారం భూత ప్రత్యయమనీ యీ కింది ఉదాహరణలలో కోలామీ రూపాలవల్ల తెలుస్తుంది. (కుండలీకరణాలలోనివి భూత ప్రాతిపదికలు) :

| కో. | ప. |
|---|---|
| కిటిప్ (కిటిప్త్-) | చిటిప్/చిటిత్ 'ఆర్పు' |
| వంగిప్ (వంగిప్త్-) | వంగిప్/వంగిత్ 'వంచు' |

బ్రాహుయీ -ఫ్- / -ఇఫ్- కూడా *ప్ - నించి వచ్చినదే.

| బ్రా. | తె. |
|---|---|
| బినిఫ్ | వినిపించు |
| బరిఫ్ | రావించు / రప్పించు |
| కస్ఫ్ | చంపు (కూయి. సాప్-) |

బ్రాహుయీలో ఇది అన్ని క్రియలకీ వ్యాపించింది.

*-చ్చ్ నించి వచ్చిన ప్రేరణప్రత్యయాలు తమిళం, మలయాళం, కొడగు, కూడుఖ్ - మాల్తో, బ్రాహుయీ తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఉన్నాయి. కన్నడంలో ప్రాచీనకాలంలో ప్రేరణప్రత్యయం -చు. ఇది హల్లుతో

అంతమయ్యే క్రియల తరవాత వచ్చినప్పుడు ఏర్పడే సంయుక్తాక్షరాలని విభజించడానికి తరవాత కాలంలో దీనిముందు ఇకారం చేరి ఇచు గానూ, ఆ తరవాత ఇసుగానూ మారింది. తెలుగు -ను, -ఇంచు దీనికి సంబంధించినవే. గోండీ ఈస్ దీనినించి వచ్చినదే. కూయిలో కాస్ 'కాచ్చు', ప్రొస్ 'కాల్చు', మీస్ 'స్నానం చేయించు', నాస్ 'నాప్పించు' మొదలైన క్రియలలో సకారం దీనినించి వచ్చినదే. తొదలో ఓడ్చ్ 'ఆడించు' కల్చ్ 'నేర్పు', తీర్చ్ 'తీర్చు', నడ్చ్ 'నడుపు' మొదలైన క్రియలలోనూ కోతలో కల్చ్ 'నేర్పు', తీర్చ్ 'తీర్చు', నాన్చ్ 'నానబెట్టు', ఓక్చ్ 'పంపు' మొదలైన క్రియలలోనూ ఈ ప్రత్యయ ప్రతిరూపం స్పష్టంగా కనిపిస్తోంది.

ప్రాచీనాంధ్రంలో - చు సకర్మక ప్రత్యయం అకారంముందు పకారంగా మారుతుంది. ఈ మార్పు నేటి వ్యావహారికంలో లేదు. ఉదా : తీర్చు. తీర్పన్ / (వ్యా.) తీర్చ. ప్రాచీనాంధ్రంలో సిద్ధ చకారం తాలవ్యేతరాచ్చుల ముందు వకారంగా మారడం పై మార్పుకి దోహదం చేసి ఉండవచ్చు.

తమిళం - కొడగు ఉపకుటుంబంలో యకారం తరువాత -త్తు- వస్తే ఆ రెండూ చ్చుగా మారతాయి. ఉదా : కాయ్ 'కాగు', (ప్రా.) కాయ్త్తు (తరవాత కాలంలో) కాచ్చు 'కాచ్చు'. ఈ 'చ్చు'త్తు నించి వచ్చినది కాబట్టి దీనికీ -చ్చ్- ప్రత్యయానికీ సంబంధం లేదు.

*.ఇ- ప్రత్యయం తమిళం - మలయాళం ప్పి/వి, తెలుగు ఇంచులలోనే ప్రధానంగా ఉంది.

| త. | తె. |
| --- | --- |
| కాణ్పి | కాన్పించు/కనిపించు |
| నటప్పి | నడపించు |
| మఱప్పి | మఱపించు |

పై ఉదాహరణలు పరిశీలిస్తే తెలుగులో కూడా మొదట పించు ఏ (గురు క్రియలలో) ప్రేరణ ప్రత్యయమనీ, దీని రూపాంతరమైన వించు లో వకారం

లోపించి ఇంచు ఏర్పడి ఉంటుందనే ఊహ కలగక మానదు. ఉదా: త. చెయ్‌వి, మ. చెయ్యి : తె. చేయించు (<*చెయ్‌వించు), త. కొయ్‌వి, మ. కొయ్యి: తె. కోయించు (<*కొయ్‌వించు). (మలయాళంలో కూడా విలో వకారం లోపించింది). చేసి, చేసెడిన్, చేసెదను మొదలైన రూపాలలోకి మల్లే 'చేయించు'లో ఇకారం ముందు య కారం స కారంగా మారకపోవడం కూడా ఇకారం ముందు వకారం ఉండేదనే ఊహని బలపరుస్తుంది.

కన్నడం -ఇసు, పర్జీ -ఇప్- / -ఇత్-, బ్రాహుయీ -ఇఫ్- మొదలైన వాటిలో ఇకారం స్వరభక్తివల్ల పుట్టినది కావచ్చు.

**మూడో పద్ధతి :** అకర్మక క్రియలో ఉపయోగించే కాల ప్రత్యయాల కంటె భిన్నమైన కాలప్రత్యయాలు ఉపయోగించడం వల్ల సకర్మకార్థాన్ని సూచించడం అనే యీ మూడోపద్ధతి తమిళం - మలయాళం - కోత - తొద - కొడగు అనే ఉప కుటుంబంలో మాత్రమే ఉంది. వీటిలో - కాలప్రత్యయాలు ఈ విధంగా ఉంటాయి:

| | అకర్మకం | సకర్మకం |
|---|---|---|
| భూతం | -ంత్ -(ఇ,య్‌ల తరవాత -ంచ్-) | -త్త్- (ఇ, య్‌ల తరవాత-చ్చ్-) |
| వర్తమానం | -కి(న్)ఱ్- | కి-(న్)ఱ్- |
| భవిష్యత్ | -వ్-/-ఉమ్ | -ప్ప్-/క్కుమ్. |

ఈ పద్ధతి మధ్యోత్తర భాషలలోనూ దక్షిణ భాషలైన కన్నడం, తుళులలోకూడా లేకపోవడంవల్ల ఇదీ పై ఉపకుటుంబంలో ఏర్పడిన నూతన పరిణామమే కావచ్చు. ఈ భాషలలో సకర్మక ప్రత్యయాలైన త్తు, ప్పు, (మొదటి పద్ధతిలో) క్కు - వీటితో తుల్యమైన రూపాలుగల పై కాలప్రత్యయాలు సకర్మకార్థాన్ని సూచించడానికి ఉపయోగపడేటందుకు దోహదం చేసిఉండవచ్చు. మొదటి పద్ధతిలో అప్రేరణంలో (అనునాసికసహిత) అద్విరుక్తస్పర్శం—ప్రేరణంలో ద్విరుక్తస్పర్శం అనే సూత్రానుసారంగానే ఈ ఉపకుటుంబంలో కాలప్రత్యయా

లలో ఈ భేదం ఏర్పడిం దన్నమాట. కాబట్టి ఈ మూడో పద్ధతి మూలద్రావిడ భాషాకాలంలో లేదని స్పష్టమవుతుంది.

ఈ మూలద్రావిడభాషాకాలంలో ఉండిన మొదటి పద్ధతికీ రెండోపద్ధతికీ నిజంగా ఏమైనా భేదం ఉందా అనే విషయాన్ని పరిశీలిద్దాం. రెండో పద్ధతిలో అకర్మకక్రియకి ఒక సకర్మక ప్రత్యయం చేర్చబడుతుండగా మొదటిపద్ధతిలో అకర్మకక్రియలో (అనునాసికసహిత) అద్విరుక్తస్పర్శం స్థానంలో ద్విరుక్త స్పర్శాన్ని ఆదేశించడంవల్ల సకర్మకక్రియ నిర్మించబడుతోంది. ఈ ద్విరుక్త స్పర్శమే అద్విరుక్తస్పర్శానికి సకర్మకప్రత్యయం చేర్చడంవల్ల జరిగిన సంధి ఫలితంగా ఏర్పడిందని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. తమిళం (మూ.ద్రా.) అటు 'ఆడు': ఆట్టు 'ఆడించు', ఏఱు 'ఎక్కు': ఏఱ్ఱు 'ఎక్కించు', తోన్ఱు 'కనపడు': తోఱ్ఱు 'చూపించు' వంటి క్రియలలో ద్విరుక్తమైన *ట్ట్, *ఱ్ఱ్ లు అద్విరుక్తమైన ట్, ఱ్ లకి *త్త్ అనే సకర్మకప్రత్యయం చేరి సంధి జరగగా సిద్ధించినవి అని చెప్పవచ్చు. వీటిలో జరిగిన—

$$\left\{\begin{matrix} \text{ట్} \\ \text{ఱ్} \end{matrix}\right\} + \text{త్త్} \rightarrow \left\{\begin{matrix} \text{ట్ట్} \\ \text{ఱ్ఱ్} \end{matrix}\right\}$$

అనే సంధి ద్రావిడ భాషలలో ట్, ఱ్ లతో అంతమయ్యే నామవాచకాల ఔప విభక్తిక రూపాలలో కూడా కనబడుతోంది: త. వీటు 'ఇల్లు'; ఔ.వి. వీట్ట్- (<*వీట్ + త్త్); యాఱు 'ఏరు'; ఔ.వి. యాఱ్ఱ్- (తె. ఏటి) (<*యాఱ్ + త్త్), తమిళాది భాషలలో త్త్ ఔపవిభక్తిక ప్రత్యయం 'అం'తో అంత మయ్యే నామవాచకాలలో సంధి మార్పు లేకుండా కనపడుతోంది; త. మరం 'చెట్టు'; ఔ.వి. మరత్త్. కాబట్టి పై సకర్మక క్రియలలో *త్త్ అనే ప్రత్యయం సంధిరూపంలో ఉన్నదని మనం నిస్సంశయంగా చెప్పవచ్చు. మూర్ధన్య దంత మూలీయ స్పర్శాలతో అంతమయ్యే క్రియలలో *త్త్ ప్రత్యయం చేయడంవల్ల ద్విరుక్త స్పర్శాలు ఏర్పడి, వీటినించి ఈ పద్ధతి ఓష్ఠ్య కంఠ్య దంత్యస్పర్శాలతో అంతమయ్యే క్రియలకి సామ్యంవల్ల వ్యాపించిందని మనం ఊహించవచ్చు.

కాబట్టి మొదటి పద్ధతి కూడా రెండో పద్ధతిలో ఒక అంతర్భాగమేననీ, ఆ రెండి టికీ పెద్ద భేదమేమీ లేదని నిర్ణయించవచ్చు.

తెలుగులో మొదటి పద్ధతి నశించింది. మొదటి పద్ధతి నశించిన భాషలు మూడు ఉపకుటుంబాలలోనూ ఉండడంవల్ల తెలుగు ఏ ఉప కుటుంబానికి చెంది నది అనే విషయాన్ని నిర్ణయించడానికి యీ పరిణామం ఉపయోగించదు. ఈ పరిణామం ఆయా భాషలలో ప్రత్యేకంగా జరిగినదే అయి ఉండాలి. కాబట్టి భద్రిరాజు కృష్ణమూర్తి (1961 : 266-7) తెలుగులో ఈ పరిణామం తెలుగుని మధ్యోత్తర ద్రావిడ భాషలలో చేర్చడానికి ఆధారమవుతుందని చెప్పడం సరికాదు. అదే విధంగా మొదటిపద్ధతి దక్షిణ ద్రావిడంలోనూ రెండో పద్ధతి మధ్యోత్తర భాషలలోనూ మాత్రమే ప్రచురంగా ఉందని అయన చెప్పినది కూడా నిజం కాదు. దక్షిణ భాషలలో కూడా రెండోపద్ధతి మొదటి పద్ధతంత ప్రచురంగా ఉందని పై చర్చ స్పష్టం చేస్తుంది.

మొదటి పద్ధతి నిలిచివున్న భాషలలో కొన్ని క్రియలలో సామ్యంవల్ల కొన్ని కొత్త మార్పులు ఏర్పడ్డాయి. అకర్మకక్రియ చివరివర్ణం మారడం లేక దానిలో ఒక కొత్త నిష్పాదకప్రత్యయం చేరడం అనే మార్పు చాలా భాషలలో కనపడుతోంది. సామ్యంవల్ల కొత్త సకర్మకక్రియలు ఏర్పడడం కూడా కొన్ని భాషలలో కనపడుతోంది. సకర్మకప్రత్యయం చాలా భాషల్లలో ఉండి దానికి సంబంధించిన అకర్మక ప్రత్యయం కొన్ని భాషలలోనే ఉంటే అటువంటి వాటిలో అకర్మక ప్రత్యయం సామ్యంవల్ల ఏర్పడిందని చెప్పవచ్చు. ఉదా: త.మ. ఎఝుంపు 'లేచు'లో -ంపు అకర్మకం; మిగిలిన భాషలలో ఇది లేదు. అంతేకాక తమిళ - మలయాళ - కన్నడాలలో ఎఝు అనే రూపం కూడా ఉంది. దీని సకర్మకరూపం *ఎఝుప్పు. ఇది తమిళం, మలయాళం, తొద, కన్నడం, కొడగు, తుళులలో ఉంది. ఈ క్రియలో సకర్మక ప్రత్యయం ప్పు అన్ని దక్షిణ భాషలలోనూ ఉండగా -ంపు తమిళ - మలయాళాలలో మాత్రమే ఉండడంవల్లా, వాటిలో కూడా అది లేని అప్రేరణరూపం కూడా ఉండడంవల్లా అవి ఈ రెండు భాషలలోనూ మొదటిపద్ధతి కిందకి వచ్చే సామ్యంవల్ల సృష్టించబడిందని చెప్పవచ్చు.

కూయి గ్రాంబ్ 'నేర్చుకొను' (త. కల్, తె. కఱచు) లో ంబ్ కూడా ఇలాగే సామ్యంవల్ల సృష్టించబడింది. కూయిలో దీని సకర్మకరూపం గ్రాప్ 'నేర్పు'. దీనిలోనూ తె. కఱపు, కోలామీ కర్ప్, నాయకీ కరప్‌లలోనూ ప్ ప్రత్యయం ఉంది. కూయి తప్ప మఱి ఏ భాషలోనూ ంబ్ యీ క్రియలో లేదు. కాబట్టి ఇది సామ్యంవల్ల ఏర్పడినది అయిఉండాలి.

త.మ. ఇాల్, క నేల్, కొడ. నేర్ 'వేళ్లాడు', త. ఇాట్టు మ. ఇాట్టు, కొడ. నేత్ 'వేళ్లాడదీయు'. ఇందులో కొడగు అకర్మక క్రియలో మిగిలినవాటిలో ఉన్న లకారం బదులు రేఫ ఉంది. ఈ రేఫ ధ్వని సూత్రానుసారంగా లకారం నించి వచ్చినది కాదు. కాబట్టి ఇది కొడగులో మార్ 'అమ్ము' (<*మాఱు) : మాత్ 'మార్చు' (<*మాట్టు) వంటి క్రియల సామ్యంవల్ల లకారం స్థానంలో వచ్చినది అయి ఉండాలి.

త. మ. తిరుంపు, తొ. తిర్బ 'తిరుగు'— ఈ మూడింటిలో మాత్రమే ంపు ఉంది. కాని పు సకర్మకం త.మ. తిరుప్పు, తొ. తిర్ప్, క. తిరుపు, తె. త్రిప్పులలో ఉంది. కాబట్టి యీ క్రియలో ంపు తమిళం, మలయాళం, తొద ఒకటిగా ఉన్న అతి ప్రాచీన కాలంలోనే సృష్టించబడి ఉండాలి.

త. మ. నీళ్, నీటు 'పొడుగు అగు', నీట్టు 'పొడుగు చేయు', కోత, నీడ్ : నీట్, తొ. నీడ్, నీళ్ నీట్, కొడ. నీడ్ : నీట్, క. నీళ్ : నీడు (<*నీట్టు)—ఇందులో నీళ్ అనే అక్మకరూపమే ప్రాచీనం. దీనితోబాటు నీటు అనే రూపంకూడా తమిళం - కొడగు మూలభాష కాలంలోనే సామ్యంవల్ల సృష్టించబడింది. చివరి రెండు ఉదాహరణలలోనూ సామ్యంవల్ల ఏర్పడిన అకర్మక రూపాలు తమిళం - కొడగు మూలభాషా కాలంలోనే సృష్టించబడడం గమనించదగినది.

మొదటి పద్ధతి నశించిన తెలుగు మొదలైన భాషలలో అన్ని క్రియల లోనూ రెండో పద్ధతి వ్యాపించడం సామ్యంవలన సకర్మక రూపాలు మార్పు చెందడానికి ఉదాహరణ: తె. కలఁగు: కలఁచు:: త. కలంకు: కలక్కు; తె. అడఁగు: అడఁచు:: త. అటంకు: అటక్కు; గోం. ఉన్ 'తాగు': ఉహ్ 'తాగించు': మూ.ద్రా. *ఉణ్: *ఊట్టు. దీనిలో ఉహ్ తిన్ 'తిను': తిహ్ (<*తీట్టు) సామ్యంవల్ల ఏర్పడింది. అలాగే కూయిలో తిన్: తీస్ (<*తీట్టు) సామ్యంవల్ల ఇన్ 'అను': ఇస్ 'అనిపించు', వెన్ 'విను, అడుగు': వెస్ 'వినిపించు, మాట్లాడు'లలో సకర్మక క్రియలు ఏర్పడ్డాయి.

సారాంశం :

1. ద్రావిడభాషలలో సకర్మకప్రేరణ రూపాలు నిర్మించడానికి మూడు పద్ధతులున్నాయి. అకర్మకక్రియ చివర ప్రత్యయం చేర్చే పద్ధతి చాలా ప్రచుర మైనది. ఇదికాక కొన్ని (అనునాసిక సహిత) స్పర్శాంత ధాతువులని ద్విరుక్త స్పర్శాంతాలుగా మార్చడం అనే పద్ధతికూడా ఉంది. ఇటువంటిచోట్ల ద్విరుక్త స్పర్శం *త్ ప్రత్యయం సంధిరూపమే అని చెప్పవచ్చు. ఈ పద్ధతి ఇప్పుడు తమిళం - కొడగు, కొండ - కువి సముదాయాలలోనే ప్రచురంగా ఉంది; కన్నడం పర్జీలలోకూడా ఇది ఒకానొక కాలంలో ఉండేది అని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. మిగిలిన భాషలలో అది నశించింది. మూడోపద్ధతి అకర్మ కార్థంలో ఒక కాలప్రత్యయరూపమూ, సకర్మకార్థంలో ఇంకొక కాల ప్రత్యయ రూపమూ, వాడడం. దిఇ తమిళం - కొడగు భాషలలో వచ్చిన నూతన పరి మణాం. ఇది సకర్మక క్రియారూపాన్ని సాధించడానికి (అనునాసిక సహిత) స్పర్శాన్ని ద్విరుక్త స్పర్శంగా మార్చాలి అనే సూత్రాన్ని కాల ప్రత్యయాలకి వ్యాప్తి చెయ్యడంవల్ల ఏర్పడింది.

2. తమిళం - కొడగు, కొండ - కువిలలో మొదటి పద్ధతి ఓష్ఠ్యాంతా లలో ఉండడం సామ్యఫలితం.

3. సకర్మక ప్రత్యయాలకి భిన్నమైన ప్రేరణ ప్రత్యయాలు ప్రాచీన తమిళం, మళయాళం, తెలుగు, మాల్తో, బ్రాహుయీలలో మాత్రమే ఉన్నాయి. వీటిలో ఈ ప్రత్యయాలకీ సకర్మక ప్రత్యయాలకీ దగ్గర సంబంధం ఉంది కాబట్టి మొట్టమొదట్లో సకర్మకరూపానికీ ప్రేరణరూపానికీ పదనిర్మాణంలో భేదం ఉండేదికాదని చెప్పవచ్చు.

## 4.2. భూతకాల ప్రత్యయాలు :

ద్రావిడభాషలలో భూతకాల క్రియా నిర్మాణం చాలా ప్రాచీనమైనది. మూలభాషలో భూతకాల ప్రత్యయాలు చాలా ఉండేవి. దక్షిణభాషలలో భూత కాల ప్రత్యయ వైవిధ్యం చాలావరకూ మిగిలి ఉంది. కాని తెలుగు మొదలైన దక్షిణశాఖేతర భాషలలో ఈ వైవిధ్యం సామ్యంవల్ల నశించింది.

**తమిళం :**

(i) సమాపక క్రియలు : భూతకాలిక ప్రత్యయానికి 1. -త్-, 2. ంత్-, 3. -త్త్-, 4. -ఇ- ఇన్- అనే రూపాంతరాలు ఉన్నాయి. కాబట్టి ఇవి ఆధారంగా క్రియల నన్నిటినీ నాలుగు వర్గాలుగా విభజించవచ్చు. మొదటి మూడు ప్రత్యయాలు చేరినప్పుడు ఈ క్రింది సంధి సూత్రాలు ప్రవర్తిస్తాయి:

1. త్ → { ఱ్ / ట్ } / { న్ / ణ్ } -

2. (హ)అ { కు / టు / ఱు } + త్ → (హ)అ { క్క / ట్ట / ఱ్ఱ }

3. { ల్ / ళ్ } + ంత్ → { ఱ్ / ంట్ }

4. { ల్ / ళ్ } + త్త్ → { ఱ్ఱ / ట్ట }

వీటిలో ఇకారం తప్ప మిగిలినవి పద నిర్ణీత పరిసరం (Morphological conditioning) కలిగినవి. ఇకారం స్వర్యాంత ధాతువులలో [(హ) అ హ‌ఉ అనే నిర్మాణం కలవి తప్ప] వస్తుంది. వీటి చివర ఉకారం దీనిముందు లోపిస్తుంది. తళ్ల 'త్రోయు', కిళ్ల 'గిల్లు' 'కోరు' మొదలైన చాలా కొన్ని ధాతువులకికూడా ఇవి స్వర్యాంతాలు కాకపోయినా ఇది చేరుతుంది; ఇటువంటి వాటి సంఖ్య చాలా తక్కువ.

ధాతువుకి భూతకాల ప్రత్యయాన్ని చేర్చడంవల్ల భూత ప్రాతిపదిక (Past Stem) ఏర్పడుతుంది. భూత ప్రాతిపదికే భూతకాలిక క్రియారూపాలు ఏర్పడడానికి ఆధారం. దీనికి పురుష ప్రత్యయాలు చేర్చడంవల్ల సమాపక క్రియ లేర్పడతాయి. క్త్వార్థకం, చేదర్థకం, చేదప్యర్థకం, భూతధాతుజ విశేషణం మొదలైన వాటికికూడా చాలా భాషలలో ఇదే ఆధారం.

– త్ - : చెయ్ 'చేయు' (భూ. ప్రా. చెయ్‌త్ -), పెయ్ 'కురియు' (పెయ్‌త్-), అళు 'ఏడ్చు' (అళుత్ .), నకు 'నవు' (నక్క్-), విటు 'విడుచు' (విట్ట్ -), ఇటు 'పెట్టు' (ఇట్ట్ - ), అఱు 'తెగు' (అఱ్ఱ్ -), తిన్ 'తిను' (తిన్‌ఱ్ -), ఎన్ 'అను' (ఎన్ఱ్ -), ఉణ్ 'తిను, తాగు' (ఉంట్ -), కాణ్ 'చూచు' (కంట్ -).

– ంత్ - : నట 'నడచు' (నటంత్ -), మఱ 'మరిచి (పోవు)' (మఱంత్ -), అఱి 'ఎరుగు' (అఱింత్ -), మేయ్ 'మేయు' (మేయ్ంత్ -), వళర్ 'పెరుగు' (వళర్ంత్), వరు/వా 'వచ్చు' (వంత్ -), తరు/తా 'ఇచ్చు' (తంత్ -) కొల్ 'చంపు' (కొన్ఱ్ -), చెల్ 'పోవు' (చెన్ఱ్ -), కొళ్ 'తీసు కొను' (కొంట్ -), ఆళ్ 'పరిపాలించు' (ఆంట్ -).

– త్త్ - : అటి 'కొట్టు' (అటిత్త్ -), కుటి 'తాగు' (కుటిత్త్ -), పూ '(పువ్వు) పూయు' పూత్త్-), వై 'వేయు' (వైత్త్-) పార్ 'చూచు' (పార్త్త్-),

చిరి 'నవ్వు' (చిరిత్త్ -), కొటు 'ఇచ్చు' (కొటుత్త్ -), చా 'చచ్చు' (చెత్త్ -), కల్ 'నేర్చుకొను' (కట్ట్ -), విల్ 'అమ్ము' (విట్ట్ -), కళ్ 'దొంగిలించు' (కట్ట్ -), కేళ్ 'అడుగు, విను' (కేట్ట్ -).

– ఇ -/న్ - : వాంకు 'కొను, తీసుకొను' (వాంకి -), అటంకు 'అడుగు' (అటంకి -), తూంకు 'నిద్రపోవు' (తూంకి -), పేచు 'మాట్లాడు' (పేచి -), పాటు 'పాడు' (పాటి -), కాట్టు 'చూపెట్టు', (కాబట్టి -), నీంతు 'ఈదు' (నీంతి -), ఎళుతు 'రాయు' (ఎళుతి -), కోరు 'కోరు' (కోరి -), తళ్ళు 'త్రోయు' (తళ్ళి -), నంపు 'నమ్ము' (నంపి -), మాఱు 'మారు' (మాఱి -) మాఱ్ఱు 'మార్చు' (మాఱ్ఱి -), పో / పోకు 'పోవు' (పోకి -, పోన్ -), చొల్ 'చెప్పు' (చొల్లి -, చొన్), [ఇకారం క్త్వార్థకంలో వస్తుంది, - ఇన్ - అజాది ప్రత్యయం ముందు ఉంటుంది. సంఘవాఙ్మయంలో భూతధాతుజ విశేషణంలో - ఇయ్ ఉంది; దీనిలో యకారం శ్రుతి (Glide).]

ప్రాచీన తమిళంలో త్, ంత్, త్త్‌ల తరవాత సమాపక క్రియలలో అన్ - అనే అగమం (తమిళ వైయాకరణులు దీనిని చారియై అన్నారు) వైభాషికంగా వస్తుంది. దీని తరవాత పురుష ప్రత్యయంలో దీర్ఘాచ్చు హ్రస్వ మవుతుంది అతులో అకారం లోపించి తు ఉగా మారుతుంది. ఈ కాలపు లిఖిత భాషలో - అన్ - మనుష్యేతర బహువచన ప్రత్యయమైన - అ ముందు నిత్యంగా ఉంటుంది; మిగిలిన పురుష ప్రత్యయాలకి ముందు ఇప్పుడు ఇది వాడుకలో లేదు.

వ్యావహారిక భాషలో ఇ, య్, ఎ (<అయ్)ల తరవాత వచ్చే ంత్, త్త్‌లు క్రమంగా ంచ్, చ్చ్‌లుగా మారతాయి. ఈ మార్పు వచ్చిన రూపాలు ఏడో శతాబ్ది సారస్వత గ్రంథాల్లో క్వాచిత్కంగా ఉన్నాయి కాబట్టి ఈ మార్పు వ్యవహారంలో ఆ కాలానికి ముందే ఏర్పడి ఉండాలి. వ్యావహారిక భాషలో అమనుష్యైక వచన రూపమే అమనుష్య బహు వచనార్థంలో వాడతారని గమ నించాలి.

వరు/హార్/వా (వంత్ -) రూపాలు

| | | ఏ. వ. | బ. వ. | | |
|---|---|---|---|---|---|
| 1. | | వంతనెన్ / వంతేన్ | | వంతనెమ్ / వంతేమ్/వంతోమ్ | |
| 2. | | వంతనై / వంతాయ్ | | వంతనిర్ / వంతీర్ (కళ్) | |
| 3. | పురుష | వంతనన్ / వంతాన్ | మనుష్య | వంతర్ / వంతార్ (కళ్) | |
| | స్త్రీ | వంతనళ్ / వంతాళ్ | | | |
| | అమనుష్య | వంతన్‌ఱు / వంతతు | | వంతన | |

(ii) క్త్వార్థక : భూతప్రాతిపదికే క్త్వార్థకంగా పని చేస్తుంది; ఇది హలంతమైతే దీని చివర ఉచ్చారణార్థకమైన ఉకారం చేరుతుంది: ఉళుతు 'దున్ని', చేయ్‌తు 'చేసి', తిన్‌ఱు 'తిని', ఉంటు 'తిని, తాగి', పార్‌త్తు 'చూసి', నటంతు 'నడిచి', పాటి 'పాడి', తిరుంపి 'తిరిగి', చొల్లి 'చెప్పి'. ప్రాచీన తమిళంలో వీటితోపాటు -అఅ, -ఊఉ, -పు, -ఈఇ అనే ప్రత్యయాలుకూడా ఉన్నాయి : పుకాఅ/పుక్కు 'ప్రవేశించి', కాణూఉ/కంటు 'చూచి', ఇటువు/ఇట్టు 'పెట్టి', తరువు/తరీ ఇ/తంతు 'ఇచ్చి', (-అఅ, -ఊఉ, -ఈఇ అనేవి ప్లుతాచ్చులు కాని రెండచ్చుల సముదాయాలు కావు; ఇటువంటి వాటిని తమిళంలో "అళపెడై" అంటారు.)

(iii) భూతధాతుజవిశేషణం : భూతప్రాతిపదికకి విశేషణ ప్రత్యయమైన అ చేర్చడంవల్ల ఇది ఏర్పడుతుంది : వంత 'వచ్చిన', ఉంట 'తిన్న, తాగిన', ఎళుతియ/ఎళుతిన 'రాసిన'.

సంఘవాఙ్మయంలో -ఈఇ- ప్రత్యయంతో ఉన్న రూపాలు కూడా ఉన్నాయి: ఇరీఇయ 'పెట్టిన', తఈఇయ 'కౌగిలించుకొన్న'.

(iv) చేదర్థక, చేదప్యర్థకాలు: సంఘవాఙ్మయంలో ధాతువుకి -ఇన్ చేర్చడంవల్ల చేదర్థకం ఏర్పడుతుంది; కాణిన్ 'చూస్తే', వరిన్ 'వస్తే', ఇరుప్పిన్ 'ఉంటే' (గుర్వుక్రియలలో దీనిముందు ప్చ్- అరుదుగా -క్క్- చేరుతుంది). తరవాతకాలపు భాషలో భూత ప్రాతిపదికకి -అల్ చేర్చడంవల్ల చేదర్థకం ఏర్పడుతుంది: కంటాల్ 'చూస్తే', వంతాల్ 'వస్తే', చెయ్‌తాల్ 'చేస్తే'.

చేదప్యర్థకం చేదర్థానికి -ఉం అనే సముచ్చయార్థకం చేర్చడంవల్ల ఏర్పడుతుంది. కాణినుం/కంటాలుం 'చూసినా', చెయ్యినుం/చెయ్‌తాలుం 'చేసినా'.

మలయాళం :

ఈ భాషలో భూత ప్రాతిపదిక నిర్మాణం తమిళంలో లాగే ఉంటుంది. కాని ఇందులో కొన్ని అధికమైన మార్పులు ఉన్నాయి. అవి :

1. { *ంత్ / *త్ } → { ఞ్ఞ / చ్చ } / { ఇ / య్ } –

అఱి 'ఎరుగు' (అఱిఞ్ఞ - <*అఱింత్ -), మేయ్ 'మేయు' (మేఞ్ఞ <*మేయ్ంత్-), అరయ్ 'రుబ్బు' అరచ్చ - <* అరయ్‌త్-).

2. { *ంత్ / *న్‌ఱ్ } → మ. న్న

నట 'నడచు (నటన్న - <నటంత్ -), వరు 'వచ్చు' (వన్నె -<* వంత్ -), నిల్ 'నిలుచు' నిన్న - <*నిన్‌ఱ్ -), ఈ మార్పు లేనిరూపాలు 11, 12 శతాబ్ది శాసనాలలో ఉన్నాయి. కాబట్టి ఇది ఆ సమీపకాలంలో మొదలయి ఉండాలి.

3. *ళ్ ంత్ → ప్రా. మ. ణ్ట / అ. మ. ణ్.

వీళ్ 'పడు' (వీణ్ట/వీణ్ - <*వీళ్ ంత్-).

మలయాళంలో పురుషప్రత్యయాలు ఉండవు (చూ. 4, 5.)

(ii) క్త్వార్థకం : భూతప్రాతిపదికే క్త్వార్థకంగా పనిచేస్తుంది. (హలంతం తరవాత ఉకారం చేరుతుంది) ఆధునిక భాషలో కొన్ని మాండలికాలలో సమాపక క్రియ చివర ఉకారమూ, క్త్వార్థకం చివర సంవృత అకారమూ (ఐ) చేరతాయి. వన్ను 'వచ్చి', చెయ్‌తు 'చేసి', కణ్టు 'చూసి', పాటి 'పాడి.'

(iii) భూత ధాతుజ విశేషణం : ఇది భూత ప్రాతిపదికకి విశేషణార్థకమైన అకారం చేరడంవల్ల ఏర్పడుతుంది. ఇకారం భూతప్రత్యయమైతే దానికీ, అకారానికీ మధ్య యకారం శ్రుతిగా వస్తుంది (సంఘవాఙ్మయంలోలా): చెయ్‌త 'చేసిన', ఎళుతియ 'రాసిన.' ప్రాచీన భాషలలో అన్ ఆగమం ఉన్న విశేషణ రూపాలు కూడా ఉన్నాయి. చివంతన 'ఎర్రబడ్డ', ఇట్టన 'పెట్టిన' (అన్ ఇకి తరవాత మాత్రం రాదు).

(iv) చేదర్థక చేదప్యర్థకాలు : ప్రాచీన భాషలో గురుక్రియలలో చేదర్థకం -క్కల్, లఘుక్రియలలో -ఇల్ / -కిల్ : ఇరుక్కల్ 'ఉంటే', వరిల్ / వరుకిల్ 'వస్తే'. ఆధునిక భాషలో ఇది భూత ప్రాతిపదికకి - అల్ చేర్చడంవల్ల ఏర్పడుతుంది : ఇరున్నాల్ 'ఉంటే', వన్నాల్ 'వస్తే', చేదర్థకానికి - ఉం చేరడంవల్ల చేదప్యర్థకం ఏర్పడుతుంది : వరిలుం / వరుకిలుం / వన్నాలుం 'వచ్చినా', చెయ్యిలుం / చెయ్‌కిలుం / చెయ్‌తాలుం 'చేసినా.'

**కోత :**

(i) సమాపక క్రియలు : కోతలోనూ తొదలోనూ ప్రాచీన కాలపు భూత ప్రాతిపదికే భూత వర్తమాన కాలిక క్రియలు ఏర్పడడానికి ఆధారం అవుతుంది. కాబట్టి దీనిని భూతప్రాతిపదిక అనడం కంటె ద్వితీయ ప్రాతిపదిక (Secondary Stem) అనడం సమంజసం. దీనికి భూతార్థంలో భూతకాలిక ప్రత్యయం చేరుతుంది; వర్తమానార్థంలో వర్తమానకాలిక ప్రత్యయం ఏదీలేకుండా ద్వితీయ ప్రాతిపదికకే పురుష ప్రత్యయాలు చేరతాయి.

కోతలో ధాతువుకి 1. -ద్-, 2. -త్-, 3. -య్- అనే ప్రత్యయాలు చేర్చడంవల్ల ద్వితీయ ప్రాతిపదిక ఏర్పడుతుంది. ఇవి చేరినప్పుడు చాలా రకాల సంధి మార్పులు ఏర్పడతాయి. వీటిలో ముఖ్యమైనవి :

1. య్ + తి → చ్

2. {[త్ {ట్ ḍ్} డ్]} + య్ → {చ్ … జ్}

-ద్- : మర్వ్ 'మరిచిపోవు' (మర్ద్-), కళ్వ్ 'దొంగిలించు' (కళ్ద్-), ఈన్ 'ఈను' (ఈన్ద్-), వార్ 'వచ్చు' (వద్-), ఉణ్ 'తాగు' (ఉడ్-).

-త్- : తవ్ 'చచ్చు' (తత్-), అగ్ 'ఏడ్చు' (అడ్‌త్-), కొయ్ 'కోయు' (కొచ్-), య్కల్ 'నేర్చుకొను' (కత్).

-య్- ; నంబ్ 'నమ్ము' (నంబ్‌య్-), ఎశ్‌ద్- 'రాయు' (ఎశ్‌ద్‌య్-). తీత్ 'తినిపించు' (తీచ్-), కాట్ 'చూపెట్టు, (కాచ్-), ఓఢ్ 'పరిగెత్తు' (ఓచ్) తోడ్ 'తవ్వు' (తోజ్-).

భూతకాలంలో ద్వితీయ ప్రాతిపదికమీద భూతకాలిక ప్రత్యయమైన ప్/ (మాండలికం వ్) చేరుతుంది: ప్రథమ పురుషలో దీని రూపాంతరం క్. (ఎమెనో ఇచ్చిన ప్రత్యయం. - వ్-).

వా (వద్-) 'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1 | వద్‌వే (న్) | వద్ వేం<br>వద్‌వోం (ఉభయం) |
| 2. | వద్‌పీ | వద్‌పీం |
| 3. | వదుకో (ఏ.వ., బ.వ.) | |

క్రియాతి పత్తిని (అంటే క్రియ జరగకపోవడాన్ని) సూచించడానికి ద్వితీయ ప్రాతిపదికకి చ్ ప్రత్యయం చేర్చి ఏర్పరచిన రూపాలు ఉన్నాయి. వద్‌చే 'వచ్చి ఉందును', వద్ ఛానే 'వాడు వచ్చును.'

(ii) క్త్వార్థకం : ద్వితీయ ప్రాతిపదికకి త్ చేరుతుంది. వద్ త్ 'వచ్చి', అళ్ద్ త్ 'కాలిచి' ఇద్దిత్ 'అని'.

(iii) భూత ధాతుజ విశేషణం : ద్వితీయ ప్రాతిపదికకి వ్ద్ / బ్ద్ చేరుతుంది : తిద్వ్‌ద్/తిద్వ్‌ద్ 'తిన్న'.

(iv) చేదర్థకం : ద్వితీయ ప్రాతిపదికకి మేల్ 'తరవాత' చేరుతుంది: వద్ మేల్ 'వస్తే'.

తొ ద[1] :

(i) సమాపక క్రియలు : ద్వితీయ ప్రాతిపదిక 1. -థ్- (θ=interdental voiceless fricative), 2. -త్-, 3. -ద్-, 4. -య్- లు చేర్చడం వల్ల ఏర్పడుతుంది. ఇవి చేరినప్పుడు జరిగే ముఖ్యమైన మార్పులు :

1. య్ + థ్ → స్
2. య్ + త్ → చ్
3. { దంతమూలీయం / మూర్ధన్యం } + త్ → { త్ / ట్ }
4. { దంతమూలీయం / మూర్ధన్యం } + ద్ → { ద్ / డ్ }

-థ్ -: నెన్ 'ఆలోచించు' (నెన్థ్-), నడ్ 'జరుగు' (నడ్థ్-), మట్ 'మరచిపోవు' (మట్థ్-), మీయ్ 'మేయు' (మీస్-), కోయ్ 'కాగు' (కోస్-);

---

1. ఈ భాషలో ముఖ్యంగా పాటలలో భాషలలో ద్వితీయ ప్రాతిపదికకి నేరుగా పురుషప్రత్యయాలు చేర్చడంవల్ల ఏర్పడిన రూపాలు ఉన్నాయి. పొ ద్-ఎన్>త, *వ-ంల్-ఏన్ 'వచ్చాను'. వీటి అర్థం సాధారణంగా 'భూతకాలం'; అరుదుగా 'వర్తమానం'. ఇవి ఈ భాష ప్రాచీన స్థితిని తెలుపుతాయి.

-థ్ -: కోఫ్ 'ఆగు (కోత్-), ఉష్ఫ్ 'ధున్ను' (ఉష్త్-), తీయ్ 'కాల్చు' (తీచ్-), కల్ 'నేర్చుకొను' (కత్-), తుధ్ 'కాలు' (తుట్-);

-ద్-: కొశ్ 'దొంగిలించు' (కొశ్ద్-), పోర్ 'వచ్చు' (పొద్-), తిన్ 'తిను' (తిద్-), ఊశ్ 'చుట్టుకొను' (ఊడ్-), కోణ్ 'చూచు' కొడ్-),

-య్- : నొబ్ 'నమ్ము' (నొబ్య్-), ఒడ్ 'ఆడు' (ఒడ్య్-), కూర్ 'కలియు' (కూర్య్), నీజ్ 'ఈదు' (నీడ్-).

భూతప్రాతిపదిక మీద చేరే భూతకాల ప్రత్యయానికి శ్ స్థాని రూపం; దీనికి స్, స్త్, ష అనే సంధిరూపాలు ఉన్నాయి.

పీథ్ - (పీ-) 'పోవు'

| | I (ప్రశ్నార్థకపదం లేనివాక్యంలో) | | II (ప్రశ్నార్థకపదం ఉన్నవాక్యంలో) | |
|---|---|---|---|---|
| | ఏ. వ. | బ. వ. | ఏ. వ. | బ. వ. |
| 1. | పీశ్ పెన్ | (అనుభయం) పీశ్ పెం<br>(ఉభయం) పీశ్ పుం | పీశ్న్ | ఫీశ్మ్ |
| 2. | పీశ్ప్య్ | పీశ్ | పీచ్ | పీశ్ |
| 3. | (ఏ.వ.,) బ. వ. పీచ్ | | పీశ్క్ | |

(ii) క్త్వార్థకం : భూతప్రాతిపదికకి -స్, -చ్ చేరతాయి; పీచ్ 'పోయి', పొజ్ 'వచ్చి', నడ్త్స్ 'నడిచి'.

(iii) భూతధాతుజవిశేషణం : భూతప్రాతిపదికకి ఫొయ్ చేరుతుంది; నడ్త్ఫొయ్ 'నడిచిన', పొద్ఫొయ్ 'వచ్చిన'. ఇందులో ఫ్ *-వ్-నించి వచ్చినదనీ, ఒయ్ *అయ- 'అయిన' అనే దాని ప్రతిరూపమనీ ఎమెనో (1984, Toda Grammar, P 162) చెప్పేరు.

కొడగు :

(i) సమాపకక్రియలు : ధాతువుకి 1. -ద్-, 2. -ంద్-, 3. -త్-, 4. -ఇ- చేర్చడంవల్ల భూతప్రాతిపదిక ఏర్పడుతుంది. మూడు దంత్యప్రత్యయాలూ మూర్ధన్యాల తరువాత మూర్ధన్యాలుగానూ, ఇ, ఎ, య్‌ల తరవాత తాలవ్యాలుగానూ మారతాయి.

-ద్- : తిన్ 'తిను' (తింద్-), ఉణ్ 'అన్నంతిను' (ఉండ్-), బూళ్ 'పడు' (బుద్ద్-) కెయ్ 'చేయు' (-కెజ్జ్-) కొయ్ 'కోయు' (కొజ్జ్-)

-ంద్- : అళ 'కొలుచు' (అళంద్-), కర 'పితుకు' (కరంద్-), అణి 'ధరించు' (అణింజ్-), కాయ్ 'కాగు' (కాంజ్-), బర్ 'వచ్చు' (బంద్-), కొళ్- 'తీసుకొను' (కొంద్-).

-త్- : నెన 'ఆలోచించు' (నెనత్-), నెర 'నిండు' (నెరత్-), కడి 'కరుచు' (కడిచ్-), కుడి 'తాగు' (కుడిచ్-), మేయ్ 'మేయు' (మేచ్-) కళ్ 'దొంగిలించు' (కట్-), బుడ్ 'విడుచు' (బుట్-).

-ఇ- : నంబ్ 'నమ్ము' (నంబి-), ఓద్ 'చదువు' (ఓది-). పాడ్ 'పాడు' (పాడి-).

బర్ - (బంద్-) 'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| | ॥ | ॥ |
| 1. | బందె | బందెతు / బాతు |
| 2. | బందియ | బందిర |
| | ॥ | |
| 3. | బందెతు / బాతు (ఏ.వ., బ.వ.) | |

(ii) క్త్వార్థకం : భూతప్రాతిపదికకి -ఇతు చేరుతుంది. బందితు 'వచ్చి', తందితు 'ఇచ్చి', కెజ్జితు 'చేసి', మాడితు 'చేసి'.

(iii) భూత ధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి ఎ̈ చేరుతుంది; దీని ముందు ఇ వైకల్పికంగా ఇన్‌గా మారుతుంది : బందె̈ 'వచ్చిన', మాడినె̈/ మాడియె̈ 'చేసిన'.

(iv) చేదర్థకం : భూతప్రాతిపదికకి -ఏంగి చేరుతుంది : బందేంగి 'వస్తే', కెజ్జేంగి 'చేస్తే' -ఏంగి భూతేతరానికికూడా చేరుతుంది : ఎదుపేంగి̈ 'తీసుకొంటే'.

కన్నడం :

(i) సమాపక క్రియలు : భూతకాలప్రత్యయాలు 1. -ద్-, 2. - త్-, 3. -ంద్-, 4. -ఇద్- (S -ఇ). -ంద్- చాలా కొద్ది క్రియలలోనే వస్తుంది; దీని ముందు వాటికి (హ)అ- రూపమే ఉంటుంది (ధాతువు చివరి ల్, ళ్, ర్ దీని ముందు లోపిస్తాయి; ళ్ తరవాత ఇది -ండ్-గా మారుతుంది.) ఇతర ముఖ్య సంధులు :

1. ద్ → డ్ / ణ్-.

2. $\left\{\begin{matrix} \text{గ్} \\ \text{ద్} \\ \text{డ్} \end{matrix}\right\}$ + త్ → $\left\{\begin{matrix} \text{క్}_{K} \\ \underline{\text{త్త}} \\ \text{ట్ట్} \end{matrix}\right\}$

మధ్యకాల కన్నడం నించీ ధాతువు చివరి ళ్, ల్, ర్, య్‌లు ద్, త్‌ల ముందు లోపిస్తాయి. ప్రాచీన కన్నడంలో హలంతాలైన కొన్ని క్రియలకి మధ్యకాలంలో ఉకారం చేరి అవి అజంతాలయ్యాయి. కాబట్టి అటువంటి వాటిలో భూతకాల ప్రత్యయం -ఇద్- (ప్రాచీనమైన -ద్-కి బదులుగా) వస్తుంది. ఉదా. ప్రా. కేళ్‌ద్- మధ్యకాల, ఆధునిక కాల భాష కేళిద్-, కేళ్ 'అడుగు, విను' భూతప్రాతిపదిక.

-ద్- : ఇర్ 'ఉండు' (ఇర్ద్- / ఇద్ద్-). తిన్ 'తిను' (తింద్-), బీశ్ (బిశ్ ద్-) బిర్ద్ / (బిద్ద్-), ఉణ్ 'అన్నంతిను' (ఉండ్-), అరె 'రుబ్బు' (అరెద్-), కొయ్ 'కోయు' (కొయ్ద్-), నెయ్ 'నేయు' (నెయ్ద్- / నేద్-).

-త్- : ఉశ్ 'దున్ను' ఉశ్త్ - / ఉత్త్-), కాయ్ 'కాయు' (కాయ్త్ - కాత్-) ఇడు 'పెట్టు' (ఇట్ట్-), నగు 'నవ్వు' (నక్క్-), ఈ 'ఇచ్చు' (ఇత్త్-), అఱి 'ఎరుగు' (అఱిత్- / అఱిద్-).

-ంద్- : మీ (యు) 'స్నానం చేయు' (మింద్-), బర్ / బార్ 'వచ్చు' (బంద్-), తర్ / తార్ 'తెచ్చు' (తంద్-), కొల్ 'చంపు' (కొంద్-) కొళ్ 'తీసుకొను' (కొండ్-).

-ఇద్-: మాడు 'చేయు' (మాడిద్-), కట్టు 'కట్టు' (కట్టిద్-), తూగు 'వేళ్ళాడు' (తూగిద్-).

కేళ్ (కేళ్ద్-) 'అడుగు, విను'

| | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|
| 1. | కెళ్దెం / -ఎను | | కేళ్దెం / -ఎవు |
| 2. | కేళ్దయ్ | | కేళ్దిర్ |
| 3. పు. | కేళ్దం/-అను | మనుష్య. | కేళ్దర్ |
| స్త్రీ. | కేళ్దళ్ | | |
| అమనుష్య. | కేళ్దుత్తు / -అత్తు | | కేళ్దువు |

(ii) క్త్వార్థకం : భూతప్రాతిపదికే క్త్వార్థకంగా పనిచేస్తుంది (దీని చివర ఉచ్చారణార్థకమైన ఉకారం చేరుతుంది, -ఇద్- లో దకారం లోపిస్తుంది). కేళ్దు/ కేళి 'విని', బందు 'వచ్చి', సత్తు 'చచ్చి', బిట్టు 'విడిచిపెట్టి'.

(iii) భూతధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి -అ చేరుతుంది : కేళ్ద 'అడిగిన, విన్న', బంద 'వచ్చిన', సత్త 'చచ్చిన'.

(iv) చేదర్థక, చేదప్యర్థకాలు : ప్రాచీన కన్నడంలో చేదర్థకానికి భూత ప్రాతిపదికకి - ఒడె చేరుతుంది: పేళ్దొడె 'మాట్లాడితే', ఆధునిక భాషలో - -అరె చేరుతుంది: బందరె 'వస్తే', బరెదరె 'రాస్తే'. చేదప్యర్థకం ఏర్పరచటానికి భూతప్రాతిపదికకి -అరూ (<చేదర్థక -అరె + సముచ్చయార్థకం -ఊ) చేర్చాలి. బందరూ 'వచ్చినా', బరెదరూ 'రాసినా'.

తుళు :

(i) సమాపక క్రియలు : తుళులో ఆసన్నభూతం (**Immediate Past**), దూరభూతం (**Distant Past**) అని రెండురకాల భూతకాలపు క్రియలున్నాయి. ఆసన్న భూతంలో 1. -య్-, 2. -త్-, 3. -ద్- ( ∽ -డ్-) అనే ప్రత్యయాలూ, దూరభూతంలో 1. -తుద్-, 2. -త్-, 3. -ద్- అనే ప్రత్యయాలూ ధాతువుకి చేరతాయి. ఆసన్న భూతంలో -ద్- నకారాంత తరవాతా, -డ్- ణకారాంతాల తరవాతా చేరతాయి.

| | | ఆ. భూ. ప్రా. | దూ. భూ. ప్రా. |
|---|---|---|---|
| కల్ | 'నేర్చుకొను' | కల్త్ | కల్తుద్- |
| అడి | 'ఊడ్చు' | అడిత్- | అడితుద్- |
| పరు | 'తాగు' | పరుయ్- | పర్త్ |
| తూ | 'చూచు' | తూయ్- | తూత్ |
| పో | 'పోవు' | పోయ్- | పోత్- |
| పాడు | 'పెట్టు' | పాడుయ్- | పాడ్ద్ |
| పణ్ | 'చెప్పు' | పండ్- | పణ్త్- |
| తిన్ | 'తిను' | తింద్- | తింత్- |
| బర్ | 'వచ్చు' | బత్త్- | బత్తుద్- |
| తయ్ | 'చచ్చు' | తయ్త్ | తయ్తుద్- |

కల్ (పు) 'నేర్చుకొను'

| | | ఆసన్నభూతం | | దూరభూతం | |
|---|---|---|---|---|---|
| | | ఏ. వ. | బ. వ. | ఏ. వ. | బ. వ. |
| 1. | | కత్తె | కత్త | కల్తుదె | కల్తుద |
| 2. | | కత్త | కత్తరు | కల్తుద | కల్తుదరు |
| 3. | పు. | కత్తె | మ. కత్తెరు | కల్తుదె | కల్తుదెరు |
| | స్త్రీ. | కత్తలు | | కల్తుదలు | |
| | అమ. | కల్తుండు | కత్త | కల్తుదుండు | కల్తుద |

(ii) క్త్వార్థకం : చాలా ధాతువులలో ఇది భూతప్రాతిపదికతో తుల్యం. కొన్నింటిలో ధాతువుకి -తు, -దు చేరతాయి: కల్తు/కల్తుదు 'నేర్చుకొని', కొర్దు 'ఇచ్చి', పోదు 'పోయి'.

(iii) భూతధాతుజ విశేషణం: ఆసన్నదూర భూతప్రాతిపదికలకి -ఇ చేరుతుంది: కత్తి/కల్తుది 'నేర్చుకొన్న', పోయి/పోతి 'పోయిన'.

(iv) చేదర్థక చేదప్యర్థకాలు: సమాపక క్రియకి -డ చేర్చడంవల్ల చేదర్థకం ఏర్పడుతుంది; కత్తెడ 'వాడు నేర్చుకొంటే' చేదర్థకానికి -ల చేరిస్తే చేదప్యర్థకం ఏర్పడుతుంది: కత్తెడల 'నేర్చుకొన్నా'.

**తెలుగు:**

(i) సమాపక క్రియలు : ప్రాచీనాంధ్రంలో ఉత్తమ మధ్యమ పురుషలలో భూతప్రత్యయం -ఇతి-; హ్రస్వాచ్చు కలిగి ను తో అంతమయ్యే క్రియల తరవాత ఇది టిగా మారుతుంది: తింటిని, వింటిని, ప్రథమపురుషలో మనుష్య బహువచన ప్రత్యయమైన -రి ముందు -ఇ-, మిగిలినచోట్ల -ఎను ఉంటాయి.

| | | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| 1. | | చెప్పితిని | చెప్పితిమి |
| 2. | | చెప్పితి(వి) | చెప్పితిరి |
| 3. | (వాడు/అది/అవి) | చెప్పెను | మ. చెప్పిరి |

ఆధునిక భాషలో ఇటువంటి క్రియలు పోయి వాటి స్థానంలో ధాతుజ విశేషణ నామాలు క్రియలుగా వచ్చాయి : చెప్పేను / చెప్పినాను (<చెప్పిన వాఁడను), చెప్పేరు/చెప్పినారు (<చెప్పినవారు), తిన్నాను (<తిన్న వాఁడను) మొ. ఏ (E) ఉన్న రూపాలు కోస్తాప్రాంతంలోనూ, -ఇన్- ఉన్న రూపాలు రాయలసీమ ప్రాంతంలోనూ ఉన్నాయి. ఏ కి ది ముందు రూపాంతరం -ఇన్-: చెప్పింది; హ్రస్వాచ్‌పూర్వక నకారాంత క్రియలలో లోపం: తింది (రా. తినింది), (రా. వినింది).

(ii) క్త్వార్థకం: -ఇ (ఇ, ఎ, ఏల ముందు యకారం సకారమవుతుంది): చెప్పి, తిని, చేసి, కోసి.

(iii) భూతధాతుజ విశేషణం: -ఇన (ఇందులో -ఇన్- భూతప్రత్యయం -అ విశేషణప్రత్యయం): చెప్పిన, చేసిన, తిన్న (<తినిన).

(iv) చేదర్థక చేదప్యర్థకాలు : ప్రాచీన భాషలో రెండిటికీ ప్రత్యయం -ఇనన్: చెప్పినన్, అనినన్. ఆధునిక భాషలో -ఇనన్ -ఇనాగా మారి చేదప్యర్థకంగా మాత్రం ఉంది: చెప్పినా, అన్నా. ఆధునికభాషలో చేదప్యర్థకప్రత్యయం -ఇతే, -తే : అడిగితే, చేస్తే. హ్రస్వాచ్‌పూర్వక నకారాంత క్రియలలో టే: వింటే, తింటే. ఇది ప్రాచీనకాలపు భూత మధ్యమ పురుషైక వచన క్రియకి ఏని శబ్దం చేర్చడంవల్ల ఏర్పడింది : అడిగితి(వి) + ఏని → అడిగితే(న్). ఇది అన్ని పురుషవచనాలకీ సామాన్యంగా వ్యాపించింది.

గోండీ :

(i) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -త్; -ఉన్ 'తాగు' తరవాత మాత్రం -ట్- (ఉన్ + త్ → ఉట్ట్-). నకారాంతాలలో నకారం త్ ముందు థకారం అవుతుంది: తిన్ 'తిను' (తిత్త్-).

పా 'కొట్టు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | పాతోన్ | పాతోం |
| 2. | పాతీ | పాతీట్ |
| 3. | మ. పాతోర్ | పాతేర్ |
| | అమ. పాతా | పాతాజ్ |

కోయ మాండలికంలో భూతప్రత్యయం -త్'- (నాదతంత్రీయస్పర్శ సహితం; Glottalized) కొన్నిటిలో -త్-: కా 'తవ్వు' (కాత్'-), తల్ప్ 'అడుగు' (తల్ప్త్'-), వర్ 'వచ్చు' (వత్-).

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -సీ, -చీ, -జీ; -జీ నకారాంతాల తరవాతా, చీ చ, జ, త, ద, హ లలో అంతమయ్యే వాటి తరవాతా, తర్- 'తెచ్చు' తరవాతా, -సీ మిగిలినవాటి తరవాతా వస్తుంది. కాచ్చీ 'తవ్వి', ఉచ్చీ 'కూర్చొని' (ఉద్-), తాహ్చీ 'చూపెట్టి', తచ్చీ 'తెచ్చి (తర్-), తింజీ 'తిని', వాసీ 'వచ్చి', కోయలో -ఇ కూడా కొన్నింటిలో ఉంది: తిరియి 'మాట్లాడి', మేయి 'మేసి'.

(iii) భూతధాతుజ విశేషణం: భూత ప్రాతిపదికకి -అ చేరుతుంది : వెహ్తా' చెప్పిన.'

(iv) చేదర్థక చేదప్యర్థకాలు : చేదర్థంలో భూత ప్రాతిపదికకి - ఏకే చేరుతుంది: సూడ్ తేకే 'చూస్తే' (కోయలో -'కు' : అత్ 'కు' 'పోతే'), చేదర్థ కానికి తేర్/గిర్ (కోయ - ఆన) చేరిస్తే చేదప్యర్థకం ఏర్పడుతుంది: వాతేకే తేర్/గిర్ 'వచ్చినా', (కో.) వత్ 'కా'న 'వచ్చినా'.

కొండ :

(i) సమాపక క్రియలు: భూతకాల ప్రత్యయం -త్-, -ఇత్-: పండ్ 'పండు' (పండిత్-), తెవ్ 'తెగు' (తెవిత్-), కాప్ 'కాపాడు' (కాప్త్-), ఇన్ 'అను' (ఇత్ < *ఇన్ -త్-), ఉణ్ 'తాగు' (ఉట్-).

డిగ్ (డిగిత్-) 'దిగు'

డిగ్ (డిగిత్-) 'దిగు'

| | | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| 1. | | డిగిత | (అనుభయం) డిగితప్ |
| | | | (ఉభయం) డిగితట్ |
| 2. | | డిగితి(ద్) | డిగితిదెర్ |
| 3. | పు. | డిగితన్ | డిగితర్ |
| పురుషేతరం. | | డిగితద్ | డిగితె |

(ii) క్త్వార్థకం: ప్రత్యయం జి (zi), సి: అర్సి 'పడి', తసి 'తెచ్చి', వాజి 'వచ్చి', పిండ్ జి 'మోసి'.

(iii) భూతధాతుజ విశేషణం: భూత ప్రాతిపదికకి -ఇ చేర్తుతుంద: నాతి 'చచ్చిన', గూరితి 'నిద్రపోయిన'.

(iv) చేదర్థకం: భూత ప్రాతిపదికకి -ఇజ్ చేరుతుంది; వాతిజ్ 'వస్తే'.

పెంగో :

(i) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -త్-, ఇది చేరినప్పుడు చాలా రకాల సంధి మార్పులు ఉంటాయి. హీ 'ఇచ్చు' (హీత్-), ఉజ్ 'తాగు' (ఉట్-), వెచ్ 'చెప్పు' (వెచ్చ్-), ఇన్ 'అను' (ఇచ్-).

హుడ్ 'చూచు'

| | | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|---|
| 1. | | హుడ్తజ్ | (అనుభయం) | హుడ్తప్ |
| | | | (ఉభయం) | హుడ్తస్ |
| 2. | | హుడ్తయ్ | | హుడ్తదెర్ |
| 3. | పు. | హుడ్తన్ | పు. | హుడ్తర్ |
| | | | స్త్రీ. | హుడ్తిక్ |
| పురుషేతరం. | | హుడ్తెత్ | అమానుషం. | హుడ్తాజ్ |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -సి, -చి, -హి, -జ్జి, -జి, -ఇస్ : అస్సి 'పట్టుకొని,' కూక్సి 'పిలిచి', నిల్చి 'నిలిచి', తహి 'తెచ్చి', కిజ్జి 'చేసి', ఉణ్‌జి 'తాగి', పెస్కిస్ 'ఏరి'.

(iii) భూతధాతుజ విశేషణం : భూత ప్రాతిపదికకి -ఇ చేరుతుంది : ఏండ్‌తి 'ఆడిన', వెచ్చి 'చెప్పిన'.

(iv) చేదర్థక చేదప్యర్థకాలు : చేదర్థకానికి భూత ప్రాతిపదికకి -ఇస్ చేరుతుంది : వాతిస్ 'వస్తే'. ధీనికి ప 'కూడా' చేరిస్తే చేదప్యర్థకం అవుతుంది.

**మండ :**

(i) సమాపక క్రియలు : ప్రత్యయం -త్ -

క్ణ̣గ్ - 'కాను'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | క్ణ̣క్తు | క్ణ̣క్తుణ్ |
| 2. | క్ణ̣క్తి | క్ణ̣క్తిర్ |
| 3. పు. | క్ణ̣క్తున్ | క్ణ̣క్తిర్ |
| పురుషేతరం. | క్ణ̣గి | క్ణ̣క్తిజ్ |

(ii) క్త్వార్థకం : -హె, -జె : కడ్‌హె 'దొంగిలించి', ఉంజె 'తాగి'.

(iii) భూతధాతుజవిశేషణం : భూతప్రాతిపదికకి -ఇ చేరుతుంది : హెంతి 'పండిన'.

**కూయి :**

(1) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -ఇత్-, -త్-, -ద్-, ఆజ్ 'అరు' (ఆజిత్-), ఇట్ 'పెట్టు' (ఇటిత్-), నాగ్ 'కడుగు' (నాగ్‌ద్-), సుగ్ 'కాల్చు' (సుగ్‌ద్-), ఆర్ 'పిలుచు' (ఆర్త్-), వా 'వచ్చు' (వాత్-), తిన్ 'తిను' (తిస్-).

కో 'కోయు'

| | | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| 1. | | కోతె | (అనుభయం) కోతము |
| | | | (ఉభయం) కోతసు |
| 2. | | కోతి | కోతెరు |
| 3. | పు. | కోతెంజు | కోతెరు |
| పురుషేతరం. | | కోతె | కోతు |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -అ, -స, -జ. దీనితో అకారం మన్ -'ఉండు' అనే సహాయక్రియ ముందే ఉంటుంది; మిగిలినచోట్ల అది ఇగా మారుతుంది : గ్రాంబ 'నేర్చుకొని', అర్స 'పిలిచి' సాజ 'చచ్చి', సజ 'పోయి'.

(iii) భూతధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి -ఇ చేరుతుంది : ముంజితి 'ములిగిన', పూతి 'పూసిన', తిసి 'తిన్న'.

(vi) చేదర్థక చేదప్యర్థకాలు : చేదర్థకంలో భూతప్రాతిపదికకి -ఎక చేరుతుంది : తాకితెక 'నడిస్తే', చేదర్థకానికి -వె చేరిస్తే చేదప్యర్థకం ఏర్పడు తుంది : సహ్‌తెకవె 'కొట్టినా'.

కువి :

(i) సమాపకక్రియలు : భూతకాల ప్రత్యయం -ఇత్-, -హ్-, -త్-. అజ్జ్ 'భయపడు' (అజ్జిత్ -), కక్ 'నవ్వు' (కక్‌హ్-), పెర్ 'ఏరు' (పెర్హ్-), ఢూ 'దున్ను' (ఢూత్-), తిన్ 'తిను' (తిచ్చ్-).

(కువిలో వాక్యంలో మధ్యమోత్తమ పురుష సర్వనామాలు కర్మగా ఉన్నప్పుడు ఒక ప్రత్యేక ప్రత్యయం క్రియలో ఉంటుంది. కింద ఇచ్చినవి అటువంటి ప్రత్యయం లేని సాధారణ రూపాలు).

హి 'ఇచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | హితె'ఎ( | హితా(మి) |
| 2. | హితి | హితెరి |
| 3. పు. | హితెసి | హితెరి |
| పురుషేతరం. | హితె | హితు. |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -అ, -హ, -స, -చ, -జ, పాయ 'కొట్టి', హిహ 'ఇచ్చి', తోస్స 'చూపెట్టి', వెచ 'కొట్టి', వెంజ 'విని'.

(iii) భూతధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి -ఇ చేరుతుంది : పాయితి/పాయతి 'కొట్టిన'

(iv) చేదర్థకం : భూతప్రాతిపదికకి -ఇహె చేరుతుంది : తోస్తి / తోస్తిహె 'చూపెడితే'.

**కోలామీ :**

(i) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -త్-, -ద్- (రెండోది ఆరు క్రియలలో మాత్రమే ఉంది) : పాడ్ 'పాడు' (పాడ్త్-), ఓల్ 'చూచు' (ఓల్త్-), ఎన్ 'అను' (ఎన్త్-), వర్ 'వచ్చు' (వత్త్-), తిన్ 'తిను' (తింద్-), గోల్ 'కొట్టు' (గొడ్డ్-). సెర్ 'పోవు' (సెద్ద్-).

సీ- 'ఇచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | సీతాన్ | సీతాం |
| 2. | సీతీవ్ | సీతీర్ |
| 3. పు. | సీతేం(ద్) | సీతేర్ |
| పురుషేతరం. | సీతిన్/సీతూన్ | సీతేవ్. |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం - ఊత్ : సియ్యూత్ 'ఇచ్చి', కూగూత్ 'పిలిచి', తూలూత్ 'పరిగెత్తి', పీరూత్ 'అమ్మి', సుల్లూత్ 'లేచి'.

(iii) భూతధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి -అ చేరుతుంది : తింద 'తిన్న', వత్త 'వచ్చిన'.

(iv) చేదర్థకం : భూతప్రాతిపదికకి -ఏ చేరుతుంది : కత్తే 'చేస్తే', వేత్తే 'అడిగితే', తిందే 'తింటే'.

**నాయకీ (ఛాందా) :**

(i) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -త్-, -ద్-, ఉద్ 'కూర్చొను' (ఉత్-), సుడ్ 'కాల్చు' (సుట్-), తిన్ 'తిను' (తింద్-).

కక్ 'చేయు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | కక్తన్ | కక్తం |
| 2. | కక్తి | కక్తర్ |
| 3. పు. | కక్తెన్ | కక్తెర్ |
| పురుషేతరం. | కక్తున్ | కక్తె |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -తున్ : పంక్తున్ కొట్టి, తిందున్ 'తిని'.

(iii) భూతధాతుజ విశేషణం : భూతప్రాతిపదికకి -అ చేరుతుంది : అరుప్త 'కోసిన'.

(iv) చేదర్థకం : సమాపక క్రియకి తె చేరుతుంది. సీతన్‌తె 'నేను ఇస్తే'.

**పర్జీ :**

(i) సమాపక క్రియలు : భూతకాలప్రత్యయం -త్-, -ఞ్- (<* -ంచ్-), -న్-, -ద్-, -φ- (లోపం). -జ్- *-ంత్- నించి తాలవ్యీకరణంవల్ల వచ్చింది. పయ్- 'విడదీయు' (పయ్త్-), నిల్ 'నిలుచు' (నిల్త్-), వెర్ 'వచ్చు' (వెఞ్-), అడ్ 'ఏడ్చు' (అడ్న్-), తిన్ 'తిను' (తింద్-), చూడ్ 'చూచు' (చూడ్-).

చూడ్ 'చూచు'.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | చూడ్దన్ | చూడ్దాం |
| 2. | చూడ్దాత్ | చూడ్దార్ |
| 3. పు. | చూడ్దెద్ | చూడ్దెర్ |
| పురుషేతరం. | చూడ్దాతా / (ద.) చూడ్దత | చూడ్దావ్ |

దక్షిణమాండలికంలో భూతప్రత్యయంలేని క్రియలలో అది లేని రూపాలు దానికి బదులు -ఎత్- /ఒత్- అనే ప్రత్యయం ఉన్న రూపాలుకూడా ఉన్నాయి. (ఎకారంతో మొదలయ్యే పురుష ప్రత్యయం ముందు -ఎత్-, ఒకారంతో మొదలయ్యే దానిముందు -ఒత్- ఉంటాయి) : 1. ఏ. వ. చూడ్దెతెన్, బ. వ. చూడ్దొతాం మొ. వాయవ్యమాండలికంలో దీని బదులు -అత్- ఉంటుంది.

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -ఇ, -చి, -చ్ అనేకాచ్క ధాతువుల తరవాత వస్తుంది. వెరి 'వచ్చి', చెని 'వెళ్ళి', తూలి 'పరిగెత్తి', నిల్చి 'నిలిచి', తితిచ్ 'తినిపించి'.

గదబ (ఒల్లారి) :

(i) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -త్-, -న్-, -φ- (లోపం); పే 'కనపడు' (పేత్-), వెన్ 'విను' (వెట్-), వర్ 'వచ్చు', (వన్-), సయ్ 'చచ్చు' (సన్-).

వర్ 'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | వనాన్ | వనాం |
| 2. | వనాట్ | వనార్ |
| 3. పు. | వనా | వనార్ |
| పురుషేతరం. | వనె | వనెన్ |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -ఇ, -సి (-జ్జి) : వరి 'వచ్చి', కొయి 'కోసి', కర్సి 'దాటి', సర్సి 'తోలి', తింజ్జి 'తిని', సెంజ్జి 'వెళ్ళి'.

(iii) చేదర్థకం : ధాతువుకి -కొ'డెన్ చేరుతుంది; సీకొ'డెన్ 'ఇస్తే' సెన్ గొ'డెన్ 'వెళ్తే', (కొణేకోర్ మాం.) ఒట్, గొట్; సిల్కొట్ 'వేస్తే', తిన్‌గొట్ 'తింటే'.

**కూడుఖ్ :**

(i) సమాపక క్రియలు : మధ్యమోత్తమ పురుషలలో కొన్ని క్రియలలో భూతప్రత్యయం -క్-, మరికొన్నింటిలో -చ్క్-, ప్రథమపురుష ప్రత్యయాలముందు -త్- లోపిస్తుంది, -చ్క్-కి బదులు -చ్- మాత్రం ఉంటుంది' ఇవి చేరినప్పుడు ధాతువులలో చాలా రకాల మార్పులు ఉన్నాయి. -ఎస్-, 'పగలగొట్టు' (ఎస్క-), ఎర్చ్ 'వెతుకు' (ఇర్చ్క్-) ఏర్ 'చూచు' (ఈర్క-), ఉయ్ 'దున్ను' (ఉస్క-), బ' 'అను' (బాచ్క-), ఒన్ 'తాగు' (ఒండ్క్-).

బ' - 'అను'

| | | ఏ. వ. | | బ. వ, |
|---|---|---|---|---|
| | 1 | బాచ్కన్ | (అనుభయం) | బాచ్కం |
| | | | (ఉభయం) | బాచ్కట్ |
| | 2. | బాచ్కయ్ | | బాచ్కర్ |
| (స్త్రీలభాష) | | బాచ్కి | | |
| | 3. | పు. బాచస్ | మనుష్య. | బాచర్ |
| పురుషేతరం. | | (ఏ. వ., బ. వ.) | | బాచ |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -అర్ (బహుశా <హిందీ కర్): చిఅర్ 'ఇచ్చి'.

(iii) భూతధాతుజ విశేషణం : ప్రత్యయం - కా: కుంద్‌కా 'పుట్టిన', (ఇది ధాతువుకి చేరుతుంది).

**మాల్తో :**

(1) సమాపక క్రియలు : భూతకాల ప్రత్యయం -చ్-, -ల్-, -స్-, -య్-: బర్ 'వచ్చు' (బర్చ-), ఓన్ 'తాగు' (ఒండ్-), మెన్ 'ఉండు'

(మెంజ్-), (మహా పాత్ర 1979 : 163) ప్రకారం ప్రత్యయాలు -త్-, -య్-, -$\phi$.

బంద్ 'లాగు'

| | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|
| 1. | బందెకెన్ | (అనుభయం) | బందెకెం |
| | | (ఉభయం) | బందెకెత్ |
| 2. | బందెకె | | బందెకెర్ |
| (స్త్రీలభాష) | బందెకి | | |
| 3. | పు. బందహ్ | మనుష్య. | బందర్ |
| పురుషేతరం. | (ఏ. వ., బ. వ.) | | బందద్ |

(ii) క్త్వార్థకం : ప్రత్యయం -ఇ/-లె, ఏచి/ఏచ్లె 'కట్టి', ఒండి/ఒండ్లె 'తాగి'.

(iii) భూతధాతుజ విశేషణం : -పె ధాతువుకి చేరుతుంది. బంద్పె 'లాగిన', దర్యెపె 'పట్టుకొన్న'.

**బ్రాహుయీ :**

భూతప్రాతిపదిక ఏర్పడడానికి ధాతువుకి -ఆ-, -ఏ-, -క్- (నకారం తరవాత -గ్-), -ఇస్- (-స్-, -స్స్-) చేరతాయి. చాలా ధాతువులకి -ఆ- చేరు తుంది. బిన్ 'ఏరు' (బినా-), తిఖ్ 'పెట్టు' (తిఖా-), పాన్ 'అను' (పారే-), బిస్ 'కాల్చు' (బిసే-), ఖల్ 'కొట్టు' (ఖల్క్-), బిన్ 'విను' (బిన్గ్-), బన్ 'వచ్చు' (బస్స్-), తిన్ 'ఇచ్చు' (తిస్స్-), కున్ 'తిను' (కున్గ్-).

భూతప్రాతిపదికకి మిగిలిన భాషలలోలా పురుష ప్రత్యయాలు [illegible]. కాని దానికి అన్ 'ఉండు' అనే సహాయక క్రియ వర్తమాన భూతకాల రూపాల[illegible] చేర్చడంవల్ల అర్థ విశేషాలు వస్తాయి.

కున్ 'తిను'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | కున్గుట్ | కన్గున్ |
| 2. | కున్గుస్ | కున్గురె |
| 3. | కున్‌గ్ | కున్గుర్ |

ఇందులో ఉట్, ఉన్ మొదలైనవి అన్ అనే క్రియ భూతకాల రూపాలు. బ్రాహూయిలో అసమాపక క్రియారూపాలు లేవు.

## తులనాత్మక చర్చ

దక్షిణ భాషలలో ముఖ్యంగా తమిళం - కొడగు శాఖలో భూతకాల ప్రత్యయాలలో చాలా వైవిధ్యం ఉంది. ఇతర దక్షిణ భాషలైన కన్నడం, తుళులలోనూ, మధ్య భాషలలోనూ ఈ వైవిధ్యం చాలావరకు తగ్గి, ఒకటి లేక రెండు ప్రత్యయాలు అన్ని క్రియలకీ సామాన్యం అయ్యాయి. కాబట్టి మూల భాషా పరిస్థితి చాలావరకూ మార్పులేకుండా తమిళ - కొడగు శాఖలో నిలిచి ఉందని చెప్పవచ్చు. కోత - తొద సముదాయంలో ప్రాచీన భూతకాలరూపాలు వర్తమానకాల రూపాలుగా మారడం ఒక ముఖ్య పరిణామం. ఇది వీటి మూల భాషాకాలంలో జరిగి ఉంటుంది. ఆ తరవాత వీటిలో భూతకాల రూపాలు వేరు విధంగా ఏర్పడ్డాయి. ఉత్తర శాఖలో భూతకాల క్రియా నిర్మాణానికి మిగిలిన రెండు శాఖలలో నిర్మాణానికీ చాలా భేదం ఉంది. ముఖ్యంగా వీటిలో ఉన్న -క్-ప్రత్యయం దక్షిణ మధ్యభాషలలో మృగ్యం.

మూలద్రావిడ భాషకి ఏడు భూతకాల ప్రత్యయాలని పునర్నిర్మించవచ్చు. అవి. 1. -త్- (సంధిరూపాలు *-క్ -, *త్తి-, *-ట్-), 2. -ంత్ -, 3. *-త్తి 4. -ఇ-, 5. *-చ్చ్-, 6. -క్క్-, 7. *న్ర్-.

1. *-త్- : ఇది తమిళం - కొడగు శాఖలో మాత్రమే మిగిలిన దంత్యాలకన్న భిన్నంగా ఉంది. ఇది సాధారణంగా హ్రస్వాచ్చు కలిగి యకా

రంతో అంతమయ్యే ఏకాచ్క ధాతువులలో వస్తుంది: త. మ. కొయ్ 'కోయు' (కొయ్త్-), కోత. కొయ్- (కొచ్-), తొ. క్వీయ్-(క్వీస్-), కొడ. కొయ్ (కొజ్జ్-), క. కొయ్ (కొయ్ద్-). ఇది భాషలలో *అక్ష్ 'ఏడ్చు', *ఉక్ష్ 'దున్ను' అనే క్రియలలో కూడా ఉంది. (త. మ. ఉళు 'దున్ను' (ఉళుత్-), కోత, ఉగ్ - ఉడ్త్-), తొ. ఉష్ఫ్ (ఉష్త్-), కొడ. ఊళ్- (ఉత్త్-), క. ఉళ్ ఉళ్త్- / ఉత్త్-).

హ్రస్వాచ్పూర్వకమైన కు, టు, ఱు, లతో అంతమయ్యే క్రియలలో భూతప్రాతిపదిక ద్విరుక్తమైన క్క్, ట్ట్, ఱ్ఱ్ లతో అంతమవుతుంది. వీటిలో రెండవ హల్లు తకారం సంధిరూపమేనని చెప్పవచ్చు. ఇట్టి భూతప్రాతిపదికలు దక్షిణభాషలలో ప్రచురంగానూ కోలామీ - పర్జి, కూకుఖ్ - మాల్తో శాఖలలో కొన్ని క్రియలలో మాత్రం ఉన్నాయి. త. మ. నకు 'నవ్వు' (నక్క్-) క. నగు / నగె (నక్క్-); త. మ. పటు (పట్ట్-), కోత పడ్ (పట్-), తొ. పొఢ్ (పొట్-)' కొ. పడ్ (పట్ట్-), నా. ప.పడ్ (పట్ట్-), గ. పర్- (పట్-).

త. మ. పెఱు 'పొందు' (పెఱ్ఱ్), కొడ, పెర్- (పెత్త్-), క. పెఱ్ (పెత్త్-), తు. పెద్ (పెత్త్), ప. పెద్ (పెత్త్-) ఇటువంటి భూతప్రాతిపదిక చాలా శాఖలలో ఉండడంవల్ల ఇది మూల భాషకి చెందినదే అని చెప్పవచ్చు. తెలుగులో పడు, చెడు, విడు, తగుల ధాతుజ విశేషణాలైన పడ్డ, చెడ్డ, విడ్డ' తగ్గలలో మొదటి మూడింటి చేదర్థకాలైన పడ్డన్ మొ. వాటిలో ఈ ప్రాచీన భూతప్రాతిపదిక నిలిచి ఉంది. సమాపక క్రియలలో దీని స్థానాన్ని -ఇతి-ప్రత్యయసహిత భూతప్రాతిపదిక ఆక్రమించుకొంది.

దంతమూలీయ నకార, మూర్ధన్యణకారాల తరవాత వచ్చే తకారం క్రమంగా ఱ్, ట్ లుగా మారుతుంది: త. తిన్ 'తిను' (తిన్ఱ్-), గోం. తిన్ (తిత్త్-), కొం. తిన్ (తిన్ట్-, తిఱ్ఱ్), పెం. మండ. తిన్ (తిచ్-), కూయి తిన్ (తిస్-). కువి. తిన్ (తిచ్-) గోండీ - కువిలో భూతప్రాతిపదిక *తిఱ్ఱ్- నించి

వచ్చినది: వీటిలో మూ. ద్రా. *తిన్ట్‌కి బదులు *తిట్ట్- (<*తిన్ట్ట్- <*తిన్-త్-) ఉంది.[1]

త. మ. ఉణ్ 'తిను, తాగు' (ఉంట్-), గోండీ - కువి ఉన్ (ఉట్ట్- <ఉంట్ట్-), ప. గ. ఉన్ (ఉండ్-), కూ. మా. ఓన్ (ఒండ్-).

2. *-ంత్ -: ఇది తమిళం - కొడగు శాఖలోనే ప్రచురంగా ఉంది. ఇది ప్రాచీన పర్జి - గదబలలోకూడా ఉన్నదనడానికి ఆధారాలు ఉన్నాయి. కన్నడంలో ఇది నో (నొంద్-), బర్ 'వచ్చు' (బంద్-), తర్ 'తెచ్చు' (తంద్-), 'స్నానం చేయు' (మిలద్- / మీద్-) బే 'వేడిగా ఉండు' (బెంద్-) అనే అయిదు క్రియలలోనే మిగిలింది. వీటిలో ఇది హల- అనే ధాతురూపం తరవాత ఉండడం గమనించదగినది. మిగిలిన స్థానాల్లో దీనిలో అనునాసికం లోపిస్తుంది: ఇర్ 'ఉండు'. (ఇర్ద్- / ఇద్ద్- <*ఇరుంత్-: త. ఇరుంత్-). తుళులో దీని ప్రతిరూపాలు వ్యతిరేకాసమాపక క్రియలలో ఉన్నాయి.

తమిళం-కొడగు శాఖలో ఇ, యల తరవాత ఇది తాలవ్య ంచ్‌గా మారుతుంది. త. అఱి 'ఎరుగు' (అఱింత్ -), మ. అఱి (అఱిఞ్ఞ్ -), కోత. అయ్‌ర్ (అర్చ్-), తొ. అట్‌య్ (అట్‌స్-), కొడ అరి (అరింజ్).

పర్జి ఇఞ్, గదబన్ <* -ంత్-; ప. చీ 'ఇచ్చు' (చిఞ్-). గ. సీ (సీన్-) : త, ఈ (ఈంత్-); ప. ఉయ్ 'తీసుకువెళ్లు', (ఉఞ్-), గ. ఉయ్ (ఉన్-): త. ఒయ్ (ఒయ్ంత్-). పర్జిలో కూడా తమిళం-కొడగు శాఖలోలా తాలవ్యీకరణం జరిగింది.

తమిళం - కొడగు శాఖలో {ల్ / ళ్} + ంత్ → {న్ఱ్ / ంట్}

1. ఈ గోండీ - కువి *తిట్ట్- ని తెలుగు తింటి- (తిను భూ. ప్రా.) తో పోల్చిచూస్తే మూల తెలుగు - కువి రూపం *తిన్- ట్ట్ - అని తెలుస్తుంది. గోండీ - కువిలో ఇందులో నకారం లోపించింది.

అనే సంధి ప్రవర్తిస్తుంది. కాని కన్నడంలో ధాతువులో హ్రస్వాచ్చు ఉండి అది ఏకాచ్కమైతేనే ఈ సంధి ప్రవర్తిస్తుంది. కాబట్టి మూలభాషలో ఇది (హ) అల్ /ళ్ ఈ రూపంగల ధాతువులలోనే ఉండేదనీ, తమిళం-కొడగు శాఖలో ఇది మిగిలిన రకాల ధాతువులకి (అంటే దీర్ఘాచ్చు గలవి కాని ద్వ్యచ్కాలు గాని) సామ్యంవల్ల వ్యాపించిందని చెప్పవచ్చు.

3. * -ఒత్-: ఇది తమిళం-కొడగు శాఖలో మాత్రమే మిగిలిన దంత్య ప్రత్యయాలకన్న భిన్నంగా ఉంది. కన్నడంలో కూడా ఇది కొన్ని క్రియలలో ఉంది. మధ్యద్రావిడ భాషలలో భూతప్రత్యయమైన శ్వాస తకారం దీనినించి వచ్చినదేననీ, అది ఆ భాషలలో ఇంచుమించు అన్ని క్రియలకీ వ్యాపించిందనీ గుర్తించాలి. తెలుగు -ఇతి-, గోండీ -త్- అన్ని క్రియలకీ వస్తాయి.

తమిళం - కొడగు శాఖలో ల్ ళ్ / + త్ ⟶ ట్ / ట్ట్ అనే సంధీ, ఇకార యకారాల తరవాత ఇది 'చ్చ'గా మారడమూ ఉన్నాయి.

4. * ఇ- : ఇది గోండీ, పెంగొ, కోలామీ - నాయకీ బ్రాహుయీలు తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఉంది. కోత, తొద, తుళు, కూడుఖ్-మాల్తోలలో ఇది య్ గా మారింది. ఇది మూలద్రావిడంలో స్పర్శంతో అంతమయ్యే క్రియలలో వచ్చేదని చెప్పవచ్చు.

తెలుగు -ఇతి-, కొండ-కూయి. కువి -ఇత్-, ఇ. త్ అనే రెండు భూత ప్రత్యయాల కలయిక గలవి. తెలుగులో ప్రథమ పురుషలో తకారం ఉండదు. తమిళంలో ఇ కారం తరవాత న్ద కారమూ, కన్నడంలో ఇకారం తరవాత దకారమూ ఉన్నాయి. తెలుగులో కూడా ధాతుజవిశేషణ చేదర్థకాలంలో ఇకారం తరవాత నకారం ఉంది: త. పాటిన్ద, మ. పాటియ, క. పాడిద, తె. పాడిన, కన్నడంలో న్దకారం స్థానాన్ని దకారం సామ్యంవల్ల ఆక్రమించిందని ఎమెనో అభిప్రాయం,

5. *-చ్చ్-: తమిళంలో సంఘవాఙ్మయంలో ఉత్తమ పురుషైక వచన, ప్రథమ పురుషైక వచన భూతకాల రూపాలలోనూ, భూతధాతుజవిశేషణ నామాలలోనూ -చిన్/-ఇచిన్ అనే ప్రత్యయం ఉంది : కంటిచిన్ 'చూశాను', వంతిచిన్ 'వచ్చాను', చెన్ఱిచిన్ 'వెళ్ళాడు, వెళ్ళింది', కంటిచిన్నోర్ 'చూచినవాళ్ళు'. ఇందులో చకారం ఒక భూతకాల ప్రత్యయం. కోతలో చకారం భూతాతిపత్తి ప్రత్యయంగా ఉంది. తొదలో -శ్- *-చ్- ప్రతిరూపమే అని ఎమెనో అన్నారు కాని ఇది సరికాదు; ఇది *-ర్ ప్రతిరూపం. తొ. పొడ్శ్ పెన్ 'వచ్చాను' *వంతు ఇరుప్పేన్ 'వచ్చిఉన్నాను' అనేదాన్నించి వచ్చింది (చూ. సుబ్రహ్మణ్యం 1991, 86). మధ్యద్రావిడ భాషలలో (కోలామీ తప్ప మిగిలినవి) కొన్ని క్రియల క్త్వార్థకరూపాలలో చి/సి అనే ప్రత్యయం ఉంది. దీనిలో చ/స కూడా భూతకాల ప్రత్యయమే. ఉత్తర భాషలలో కొన్ని క్రియలలో చకారం భూతప్రత్యయంగా ఉంది: కూ. మా. బర్ (బర్చ్-) 'వచ్చు', బ్రా. బన్ (బస్స్-). ఈ ఆధారాలవల్ల మూలభాషలో చకారం కూడా ఒక భూతప్రత్యయంగా ఉండేదని చెప్పవచ్చు.

6. *-క్క్- : కుడుఖ్ -మాల్తోలలో ఉత్తమ మధ్యమపురుషలలో భూత ప్రత్యయం -క్-, బ్రాహుయీలో కొన్ని క్రియలలో క్ / గ్ భూతప్రత్యయం ఉంది. కాబట్టి మూలోత్తర ద్రావిడంలో *క్క్ అనే భూతప్రత్యయం ఉంది అని చెప్పవచ్చు. ఇతర భాషలతో దీనికి ప్రతిరూపం లేదు. కాని తెలుగు, గోండీ, కూయి, కువి, పర్జీ - గదబలలో వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయమైన -అకలో కకారాన్ని భూతప్రత్యయంగా పరిగణిస్తే అది దీని ప్రతిరూపమని చెప్పవచ్చు.

7. *-న్ఱ్-: తమిళం, మలయాళం, తెలుగు, పర్జీలు ఆధారంగా ఈ ప్రత్యయాన్ని మూలద్రావిడ భాషలో పునర్నిర్మించవచ్చు. తమిళ, మలయాళాలలో -ఇన్- ప్రత్యయం స్పర్శాంత క్రియలలో వస్తుంది. ఇదికాక తమిళంలో -అన్ఱ్- అనే చారియై ఉంది: వంతన్ఱర్ 'వచ్చారు', చిన్ఱ్‌లో కూడా నకారం ఉంది. తెలుగు భూతధాతుజ విశేషణాలలో -ఇన, వ్యతిరేక ధాతుజ విశేషణాలలో -అని ఉన్నాయి.

పర్జీలో కొన్ని క్రియలలో నకారం భూతప్రత్యయంగా ఉంది: అడ్‌నెద్ 'ఏడ్చింది'. తమిళ- మలయాళాలు తెలుగులో -ఇన్- రెండు భూతప్రత్యయాల కలయిక (ఈ నకారం దంతమూలీయం కానీ దంత్యం కాదు).

క్త్వార్థకం : దక్షిణ భాషలలో భూతప్రాతిపదికే క్త్వార్థకంగా పనిచేస్తుంది (అది హలంతమైతే చివర ఉకారం చేరుతుంది). స్వరాంత క్రియలలో ఇకారం మాత్రం దాని తరవాత నకారం లేకుండా ఉంటుంది. ఉత్తర భాషలలో కూడుఖ్ - అర్ హిందీ కర్ (జాకర్ 'వెళ్ళి') నించి వచ్చినది; బ్రాహుయీలో క్త్వార్థకం లేదు.

మధ్య భాషలలో కోలామీ - నాయకీలలో దక్షిణ భాషలలో లాగా భూత ప్రాతిపదికే క్త్వార్థకంగా పనిచేస్తుంది. మిగిలిన భాషలలో * -ఇ, *-చి అనే ప్రత్యయాలు ఉన్నాయి. మొదట్లో *ఇ స్వరాంత క్రియలలోనూ *చి మిగిలిన క్రియలలోనూ ఉండేదని ఊహించవచ్చు. కృష్ణమూర్తి (1961., θ 4.47) అభిప్రాయంలో చి, చ్, ఇ అనే రెండు భూతప్రత్యయాల కలయిక, కోయ తప్ప మిగిలిన గోండి మాండలికాలలోనూ, కొండ, పెంగొలలోనూ చియే అన్ని క్రియలకి వ్యాపించి, ఇ నశించింది.

తెలుగులో చాలా క్రియల చివర చువర్ణం ఉండగా వాటి సమాన రూపాలలో ఇతర బాషలలో చువర్ణం ఉండదు. ఉదా: వచ్చు (త. మ. వరు), ఇచ్చు (త. ఈ.), నిలుచు (త. మ. క. నిల్), నడచు (త. మ. నట. క. నడె). ఇటువంటి క్రియలలో చివరి చువర్ణం మొదట్లో క్త్వార్థకానికి చెందినదనీ అది అనుచిత విభాగం (Wrong Splitting) వల్ల క్రియలో భాగమైందనీ కృష్ణమూర్తి నిరూపించారు. ఈ అనుచిత విభాగం చాలా క్రియలలో ఇ వర్ణం క్త్వార్థకంగా ఉండడం వల్ల జరిగింది. అంటే నిలిచి అనే దానిలో మొదట్లో విభాగం నిలి-చి; కాని తిని, విని, చెప్పి మొదలైన అనేక క్రియలలో ఇకారం క్త్వార్థకం కాబట్టి నిలి-చి మొదలైన వాటిలో కూడా ఇకారమే ప్రత్యయమని వ్యవహర్తలు భ్రమించి నిలిచ్-ఇ అని విభజించి చకారాన్ని ధాతువులో కలిపివేశారు. విధ్యర్థ

కాలలో చకారం లేకపోవడమూ నిలుము, రమ్ము, నడు (వు) ము, అకారం ముందు చకారానికి బదులు వకారం ఉండడమూ (నిలువక, నిలువఁడు, రాక, రాఁడు మొ.) మొదట్లో చకారం క్రియాంగం కాదని విశదీకరిస్తాయి. చువర్ణాంత తెలుగు క్రియల క్త్వార్థక రూపాలని గోండీ క్త్వార్థకాలతో పోలిస్తే వీటిలో చువర్ణం మొదట్లో క్త్వార్థక ప్రత్యయభాగమేనని తెలుస్తుంది:

వచ్చి : గోం. వా - సీ (వా 'వచ్చు')
ఇచ్చి : గోం. సీ - సీ (సీ 'ఇచ్చు')
నిలిచి : గోం. నిల్ - సీ (నిల్ 'నిలుచు')

తెలుగులో వర్తమాన రూపాలలో చువర్ణం మిగిలినా వర్తమాన కాల రూపాలు అర్వాచీనాలే కాబట్టి ఇవి సిద్ధాంతాన్ని తోసివెయ్యలేవు. అదే విధంగా యు వర్ణాంత క్రియల క్త్వార్థకాలలో మొదట్లో విభాగం కొయ్-సి (>కోస్-ఇ) కెయ్-సి (>చేస్-ఇ) ఈ విధంగానే ఉండేది : గోండీలో వీటి సమానరూపాలు కొయ్-సీ, కీ-సీ. వీటిలో -సి, -చికి రూపాంతరం.

గోండీ - కువి శాఖలో నవర్ణ ణవర్ణాల వర్ణాంత క్రియలలో -జి అనే క్త్వార్థక ప్రత్యయ రూపాంతరం ఉంది :

| తె. | గోండీ. | కొండ. | పెంగొ. | కూయి. | కువి. |
|---|---|---|---|---|---|
| అని | ఇంజీ | ఇంజ్జి | ఇంజి | ఇంజ | ఇంజ |
| తిని | తింజీ | తింజ్జి | తింజి | తింజ | తింజ |
| తాగి | ఉంజీ | ఉణ్‌జ్జి | ఉణ్‌జ | ఉణ్‌జ | ఉంజ |

ఇది ఈ శాఖలో సదృశపరిణామం.

క్త్వార్థకం పూర్వకాలిక క్రియకి చేరుతుంది. ఒక వాక్యంలో ఎన్ని క్త్వార్థకాలైనా ఉండవచ్చు. కొన్ని వాక్యాలలో ఇది కారణాన్ని సూచిస్తుంది: పనిచేసి అలిసిపోయాడు (త. వేలై చెయ్‌తు కళైత్తు ప్పోయినాన్), గుండెనొప్పి వచ్చి చచ్చిపోయాడు (త. నెంచువలి వంతు ఇఱంతు-విట్టాన్). కొన్నిటిలో ఇది

ప్రకార క్రియవిశేషణం (**Manner Adverb**) గా పనిచేస్తుంది : నడిచి వెళ్లాడు (త. నటంతు పోనాన్). ఇటువంటి ఉపయోగాలు ఇతర ద్రావిడ భాషలలో కూడా ఉన్నాయి.

భూతధాతుజ విశేషణం : ఇది బ్రాహుయీ తప్ప మిగిలిన అన్ని భాషల లోనూ ఉంది. ఇది భూతప్రాతిపదికకి *అ/*ఇ అనే ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడుతుంది. *అ చాలా భాషలలో ఉంది : *ఇ తుళు, కొండ - పెంగొ - మండ - కూయి - కువి శాఖలలో మాత్రం ఉంది. తుళు కి కొండ - కువి శాఖకి సన్నిహిత సంబంధం లేనందువల్ల *ఇ మూలభాషకు చెందినదేననీ *అ, *ఇలు మూలభాషలో మాండలిక భేదాలనీ నిర్ణయించాలి. (తెలుగులో వ్యతిరేక ధాతుజ విశేషణాలలో -ఇ ఉంది.)

తెలుగు -ఇన లో -ఇన్ -భూతకాలిక ప్రత్యయం, -అ విశేషణ ప్రత్యయం : తె. ఆడిన : త. ఆటిన్న, తె. కలఁగిన : త. కలంకిన. తమిళంలో -ఇన్- స్వరాంత క్రియలలోనే ఉంటుంది. తెలుగులో ఇది అన్ని క్రియలకీ వ్యాపించింది. కాని పడ్డ, ఇడ్డ, చెడ్డ, తగ్గ అనే రూపాలు పడిన, ఇడిన, చెడిన, తగిన అనేవాటి పర్యాయాలుగా ఉన్నాయి. వీటిలో ప్రాచీన భూతప్రాతిపదిక నిలిచి ఉంది. చూ. త. పట్ట, ఇట్ట, తక్క, వీటి పర్యాయ రూపాలలో ఇన్ సామ్యంవల్ల వచ్చింది. (మొదటి మూడింటి చేదర్థకాలైన పడ్డన్ మొ. వాటిలో కూడా ప్రాచీన భూతప్రాతిపదిక శేషించింది.) తిన్న/తినిన, కొన్న/కొనిన మొదలైన వాటిలో మొదటి రూపాంతరం రెండు నకారాల మధ్య అకారం లోపించటం వల్ల ఏర్పడింది.

సంఘకాల తమిళంలోనూ మలయాళంలోనూ భూతధాతుజ విశేషణాలలో -ఇయ (స్వరాంత క్రియలలో ఉంది), దీనిలో యకారం శ్రుతి (Glide).

కూడుఖ్ - మాల్తోలలొ ఈ రూపంలోనూ సమాపక క్రియలలోనూ భూతప్రత్యయం కకారమవడం గమనించదగింది.

ధాతుజ విశేషణం తరవాత వచ్చే నామవాచకం ఆ క్రియలతో ఏ కారక సంబంధంతో నయినా ఉండవచ్చు. చూసిన మనిషి, చూసిన కన్ను, చూసిన సినిమా, వాణ్ణి చూసినచోటు మొ. నామవాచకాలేకాక కొన్ని క్రియా విశేషణాలు కూడా ధాతుజ విశేషణం తరవాత రావచ్చు : చూచిన తరవాత, చూసినప్పుడు, చూసిన వెంటనే మొ.

చేదర్థక చేదప్యర్థకాలు : ప్రాచీన తమిళంలో క్రియకి -ఇన్ (మధ్య కాలంలో -ఇల్) చేర్చడంవల్ల చేదర్థకం ఏర్పడుతుంది. ప్రాచీన మలయాళంలో క్రియకి -ఇల్ చేరుతుంది. కాని సాధారణంగా అన్ని ద్రావిడభాషలలో చేదర్థక ప్రత్యయం భూతప్రాతిపదికకి చేరుతుంది. కాని చేదర్థక ప్రత్యయం అన్ని భాషలలోనూ తుల్యంగా లేదు. తమిళం -ఆల్, తె. -అన్ (త. పాటినాల్, తె. పాడినన్) ఒకే ప్రత్యయం రూపాలు కాబట్టి ఇదే మూలద్రావిడ ప్రత్యయం (*-ఆల్) కావచ్చు. తమిళం తెలుగులకి జన్మసాన్నిహిత్యం లేనందువల్ల ఈ తుల్యత్వం మూలభాషనించి సంక్రమించిందని చెప్పాలి. ప్రాచీనాంధ్రంలో చేదర్థక చేదప్యర్థకం ఇప్పుడు చేదప్యర్థకంగా మిగిలింది.

గోం. -ఏకే, కూయి. -ఎక, కొండ. -ఇఙ లకి జన్మసంబంధం ఉంది. పెంగొ -ఇస్, కువి. -ఇహి / -ఇహెలు కూడా సంబంధంగల రూపాలే. ఇవి ఈ భాషల సాన్నిహిత్యాన్ని నిరూపిస్తాయి.

చేదప్యర్థకం అన్ని భాషలలోనూ చేదర్థకానికి 'కూడా' అనే అర్థంవచ్చే పదంగాని సముచ్చయార్థకంగాని చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

### 4. 3. వర్తమాన భవిష్యత్కాల ప్రత్యయాలు :

అతి ప్రాచీన కాలంలో వర్తమానకాలాన్నీ భవిష్యత్కాలాన్నీ సూచించడానికి ద్రావిడభాషలలో ఒకే ప్రత్యయం ఉండేది. తరవాత కాలంలో భవిష్యత్కాలిక క్రియలకంటె భిన్నమైన వర్తమానకాలిక క్రియారూపాలు ఏర్పడ్డాయి. తుళు, కోలామీ మొదలైన భాషలలో వర్తమానకాలిక ప్రత్యయాలకీ, భవిష్యత్కాలిక ప్రత్యయాలకీ మధ్య ఇప్పటికీ స్వల్పభేదమే ఉంది (కింద చూడండి)

ఛాలా భాషలలో వర్తమానకాలిక క్రియలు అనేక శబ్దయుక్త నిర్మాణాలు (Periphrastic Consructions). ఒకేశాఖకు చెందిన భాషలలో కూడా వర్తమానకాలిక రూపనిర్మాణంలో వైవిధ్యం ఉంది. ఈ కారణాలవల్ల ద్రావిడ భాషలలో వర్తమానకాలిక రూపాలు అర్వాచీనాలని చెప్పవచ్చు.

భవిష్యత్కాలిక రూపాలు తద్ధర్మార్థాన్ని (Habitual Sense) కూడా సూచిస్తాయి.

**తమిళం :**

(i) వర్తమానకాలం : సంఘవాఙ్మయానికి తరవాత కాలంలో దీనికి ప్రత్యయం -కిన్ఱ్-, 14వ శతాబ్దినించి దీనిలో నకారం లోపించి -కిఱ్- అనే రూపాంతరంకూడా ఏర్పడింది. సంఘవాఙ్మయంలో దీనికి ప్రయోగాలు అతి విరళం. ఇప్పటి లిఖిత భాషలో అమహద్బహువచనంలో కిన్ఱ్ వాడతారు; మిగిలినచోట్ల కిన్ఱ్, కిఱ్ రెండూ వాడతారు. దీనిలో కకారం గుర్వక్రియలలో మద్విరుక్తవుతుంది.

చెయ్ 'చేయు'

| | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|
| 1. | చెయ్కి(న్) ఱేన్ | | చెయ్కి(న్) ఱోం |
| 2. | చెయ్కి(న్) ఱాయ్ | | చెయ్కి(న్) ఱీర్ (కళ్) |
| 3.పు. | చెయ్కి(న్) ఱున్ | మ. | చెయ్కి(న్) ఱార్ (కళ్) |
| స్త్రీ. | చెయ్కి(న్) ఱాళ్ | | |
| అమ. | చెయ్కి(న్) ఱతు | | చెయ్కిన్ఱన. |

మధ్యకాల తమిళంలో ధాతువుకి -అ ప్రత్యయం చేర్చి దానికి నిల్ 'నిలుచు', కిట 'పడిఉండు', ఇరు 'ఉండు' అనే క్రియలలో ఒకదాని భూత కాలిక రూపాన్ని చేర్చడంవల్ల కూడా వర్తమానకాలం సూచించబడేది : చెయ్యానిన్ఱాన్ 'చేస్తున్నాడు' మొ॥.

(ii) భవిష్యత్కాలం : లఘుక్రియలలో ప్రత్యయం -వ్-, ఇది అను నాసికం తరవాత -ప్- గా మారుతుంది. గురుక్రియలలో -ప్ప- (ల్/ళ్ + ప్ప → ఱ్ప/ట్ప). అమనుష్యైకవచన బహువచనాలలో లఘుక్రియలలో ఉమ్, గురుక్రియలలో -క్కుమ్ (ఈ రెండిటి తరవాతా పురుషప్రత్యయం లేదు). సంఘవాఙ్మయం ఉమ్-, -క్కుమ్‌లు ఉన్న రూపాలు పురుషైకవచన, స్త్రీ లింగైకవచన, అమనుష్య బహువచనాలలోకూడా ఉండేవి. కొన్ని క్రియలు అకర్మకార్థంలో లఘుక్రియలుగానూ, సకర్మకార్థంలో గుర్రుక్రియలుగానూ ఉంటాయి: చేర్వేన్ 'చేరతాను', చేర్ ప్పేన్/ 'చేరుస్తాను'.

| | | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| 1. | | చెయ్వేన్ | చెయ్వేం/చెయ్వోం |
| 2. | | చెయ్వాయ్ | చెయ్వీర్ (కళ) |
| 3. | పు. | చెయ్యుం / చెయ్వాన్ | మ. చెయ్వార్ (కళ) |
| | స్త్రీ. | చెయ్యుం / చెయ్వాళ్ | |
| | అమ. | చెయ్యుం | చెయ్యుం |

సంఘ వాఙ్మయంలో ప్పకి బదులు క్కువ్, వ్‌కి బదులు కువ్ కూడా ఉన్నాయి: కొటుక్కువేన్/కొటుప్పేన్ 'ఇస్తాను', చెల్కువం/చెల్వేం 'వెళ్తాము'.

ప్రాచీన భాషలో -క్- ప్రత్యయం (గురు క్రియలలో -క్క-) కూడా ఉత్తమ పురుషలో ఉంది: కాణ్క 'చూస్తాను', వరుకం 'వస్తాం'. ప్రాచీన భాషలో -ప్- ప్రత్యయం తరవాత అ కారం ఉన్న రూపాలు మనుష్యామనుష్య బహువచనాలుగా ఉన్నాయి: ఎన్ప 'అంటారు, అంటాయి', ఆకువ 'అవుతారు, అవుతాయి'.

(iii) అతి ప్రాచీన భాషలో -త్- (లఘు క్రియలలో), -త్త్- (గురు క్రియలలో) ప్రత్యయాలు గల రూపాలు కూడా ఉత్తమ పురుషబహువచన,

మధ్యమ పురుషైకవచన బహువచనాలలో మాత్రం ఉన్నాయి: 1. బ. వ. అంచుతుం 'భయపడతాం', అటిత్తుం 'కొడతాము', 2. ఏ. వ. ఎన్‌తి 'అంటావు', పోకుతి 'పోతావు', 2 బ. వ. అఱితిర్ 'తెలుసుకొంటారు'.

దంత్య ప్రత్యయం సాధారణంగా భూతకాలార్థకం కాబట్టి ఇవి తరవాత భాషలో తొలగిపోయాయి.

(iv) ప్రాచీనభాషలో -మార్ ప్రత్యయసహిత రూపాలు తుమున్నర్థకాలుగానూ, మనుష్య బహువచనార్థకాలుగానూ కూడా ఉన్నాయి: కొణ్మార్ 'తేవడానికి, తెచ్చారు', ముటిమార్ 'పూర్తి చెయ్యడానికి, పూర్తి చేశారు'.

(v) సంఘ వాఙ్మయంలో -పు ప్రత్యయం అనంతర్యార్థకంగా ఉంది: ఇటుపు 'పెట్టగానే', చుట్టుపు 'చూపెట్టగానే'.

తరవాత కాలపు భాషలో శత్రర్థం క్త్వార్థకానికి కొళ్ అనే ఆత్మార్థక క్రియ క్త్వార్థం + ఏ చేర్పడంవల్ల వ్యక్తం చెయ్యబడుతుంది: పార్‌త్తుక్కొండే 'చూస్తూ(నే)', చొల్లిక్కొండే 'చెప్తూ(నే)'.

(vi) వర్తమానధాతుజ విశేషణం: ధాతువు + కి (న్) ఱ్ + అ: చెయ్‌కి(న్)ఱ 'చేస్తున్న'.

(vii) తద్ధర్మధాతుజ విశేషణం: ధాతు + ఉం (గురు క్రియలలో -క్కుం): చెయ్యుం 'చేసే', పార్‌క్కుం 'చూసే'.

(viii) మధ్యకాల తమిళంలో -వాన్/-ప్పాన్, -పాక్కు ప్రత్యయాలు ప్రయోజనార్థంలో ఉన్నాయి: వరువాన్ 'రావడానికి', పడుపాక్కు 'కష్టపడడానికి'.

(ix) ధాతుజ విశేషణ నామాలు: ధాతుజ విశేషణాలకి తదర్థక సర్వనామాలు చేర్చడంవల్ల ఇవి ఏర్పడతాయి. వీటిలో ఉండే కాల ప్రత్యయాలు: -కి(న్ఱ)ఱ్-: చెయ్‌కి(న్ఱ)అవన్ 'చేసేవాడు', -ఉం-/-మ్-: ఎన్మర్ 'అనేవాళ్ళు', -వ్-/-ప్ప్-: కాప్పోర్ 'కాపాడేవాళ్ళు', వరుపవర్ 'వచ్చేవాళ్ళు', -ఉన్-/-న్- (దంత్యనకారం): చెప్పునర్ 'చెప్పేవాళ్ళు, వరునర్ 'వచ్చేవాళ్ళు', కొళ్ళునర్ 'తీసుకొనేవాళ్ళు'. చివరి రెండు రకాలకీ ఆధారాలైన ధాతుజ విశేషణాలు వ్యవహారంలో లేవు.

మలయాళం :

(i) వర్తమానకాలం : ప్రత్యయం -ఉన్- (దంత్యనకారం): చెయ్యున్ను 'చేస్తున్నాను' మొ. ఇది త. -కిన్ఱ్- నించి వచ్చినది.

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -ఉం (గురుక్రియలలో -క్కుం) వరుం 'వస్తాను' మొ.

(iii) వర్తమాన ధాతుజవిశేషణం : ధాతువు + ఉన్న్ + అ: చెయ్యున్న 'చేస్తున్న', నటక్కున్న 'నడుస్తున్న'.

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : ధాతువు + ఉం : అఱియుం 'తెలిసే', వరుం 'వచ్చే'.

కోత :

(i) వర్తమానకాలం : ఇది ద్వితీయప్రాతిపదికకి పురుషప్రత్యయాలు చేర్చడంవల్ల ఏర్పడుతుంది.

వా- 'వచ్చు'

| | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|
| 1. | వదే(న్) | (అనుభయం) | వదేం |
| | | (ఉభయం) | వదోం |
| 2. | వదీ | | వదీం |
| 3. | (అన్నీ) వదో | | |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -క్వ్-.

వా 'వచ్చు'

| | ఏ. వ. | | బ. వ. |
|---|---|---|---|
| 1. | వక్వే(న్) | (అనుభయం) | వక్వేం |
| | | (ఉభయం) | వక్వోం |
| 2. | వక్వీ | | వక్వీం |
| 3. | (అన్నీ) వక్వో / వకోకో / వకుగో | | |

ఇదికాక భవిష్యత్కాల సూచకంగా -క్- ప్రత్యయంకూడా ఉంది : వకేన్ 'వస్తాను', వకేం '(మేం) వస్తాము', వకోం '(మనం) వద్దాం', వకిక్ '(నువ్వు) వస్తావు', వకిమ్క్ '(మీరు) వస్తారు', వకోన్క్ '(వాడు) వస్తాడు', వకోళ్క్ '(ఆమె) వస్తుంది', వకోర్క్ '(వాళ్లు)వస్తారు', వక్కోట్క్ 'వస్తుంది/ వస్తాయి'.

(iii) శత్రర్థకం : ద్వితీయప్రాతిపదికకి -ర్ చేరుతుంది: కొడ్త్ర్ 'ఇస్తూ'.

తొద :

(i) వర్తమాన భవిష్యత్కాలం : ద్వితీయ ప్రాతిపదికకి పురుష ప్రత్యయాలు చేర్చడంవల్ల ఇది ఏర్పడుతుంది.

కియ్ - (కిస్-) 'చేయు'

| ఏ. వ. | | బ. వ. |
|---|---|---|
| 1. కిస్ని | (అనుభయం) | కిస్మి |
| | (ఉభయం) | కిస్మి |
| 2. కిస్ని | | కిస్త్ |
| 3. (అస్ని) కిస్తి | | |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -క్- : కియెకిన్ 'చేస్తాను', మొ.

(iii) తద్ధర్మ ధాతుజవిశేషణం : ధాతువుకి -త్ / -ఠ్ చేరుతుంది : నడ్త్ 'నడిచే', పొద్త్ 'వచ్చే'.

కొడగు :

(i) వర్తమాన భవిష్యత్కాలం : ప్రత్యయం -వ్- (లఘు క్రియలలో), -వ్- (గురుక్రియలలో).

కెయ్ 'చేయు'

| ఏ. వ. | బ. వ. |
|---|---|
| 1. కెయ్వి | కెయ్వ |
| 2. కెయ్వియ | కెయ్విర |
| 3. (అస్ని) కెయ్వ | |

(ii) అభ్యనుజ్ఞార్థకం : ప్రత్యయం -ఉ (<*ఉం) : కెయ్యు 'చెయ్యవచ్చు', తింగు 'తినవచ్చు'.

(iii) తద్ధర్మధాతుజ విశేషణం : వర్తమాన భవిష్యత్కాల ప్రాతిపదికకి -ఎ చేరుతుంది: మాడువె 'చేసే', బప్పె 'వచ్చే'.

కన్నడం :

(1) వర్తమానకాలం : ప్రాచీన కన్నడంలో ఈ కింది విధంగా అనేక పదనిర్మాణం ఉంది :

క్త్వార్థకం + ఆగు 'అవు' భవిష్యత్కాలరూపాలు.

కేళ్ 'విను, అడుగు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | కేళ్దప్పెం | కేళ్దప్పెం/కేళ్దప్పెవు |
| 2. | కేళ్దప్పయ్ | కేళ్దప్పిర్ |
| 3. పు. | కేళ్దప్పం | మ. కేళ్దప్పిర్ |
| స్త్రీ. | కేళ్దప్పళ్ | |
| అమ. | కేళ్దప్పుదు | కేళ్దప్పువు |

(పై వాటిలో ద్విరుక్తపకారానికి బదులు అద్విరుక్తం కూడా ఉండవచ్చు.) ఆధునిక కన్నడంలో వర్తమానకాల ప్రత్యయం -ఉ-/ఉత్త్-.

బర్ 'వచ్చు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | బరుత్తేనె | బరుత్తేవె |
| 2. | బరుత్తి/బరుత్తీ | బరుత్తీరి |
| 3. పు. | బరుత్తానె | మ. బరుత్తారె |
| స్త్రీ. | బరుత్తాళె | |
| అమ. | బరుత్తదె<br>బరుత్తయ్తె | బరుత్తవె/బరుత్తావె |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -వ్-; ప్రాచీనభాషలో అనునాసికం తరవాత దీని రూపాంతరం -బ్-, గురుక్రియలలో ప్రాచీన భాషలో -ప్-/-ప్- ఉండేది.

కుడు 'ఇచ్చు'

| | ఏ. వ. | బ.వ. |
|---|---|---|
| 1. | కుడువెం/కొడువెను | కుడువెం/కొడువెవు |
| 2. | కుడువయ్/కొడువె/కొడువి | కుడువిర్ |
| 3. పు. | కుడువం/కుడువాం | మ. కుడువర్/కుడువార్ |
| స్త్రీ. | కుడువళ్/కుడువాళ్ | |
| అమ. | కుడువుదు/కొడువదు | కుడువువు/కొడువవు |

(iii) ప్రాచీన భాషలో -గుం / కుం అనే ప్రత్యయంతో రూపాలు ప్రథమ పురుషలో (అన్ని లింగవచనాలలో) అన్ని కాలాలలోనూ ఉండేవి. దీనిలో మకారం మధ్యకాలంలో లోపించింది: ఆళ్ గుం 'పరిపాలిస్తాడు/రు, పరిపాలిస్తుంది' బర్కుం 'వస్తాడు/రు, వస్తుంది.' ఇది తద్ధర్మార్థకం వంటిది. ఇప్పటి కన్నడంలో ఈ ప్రత్యయం బేకు 'కావాలి' (ప్రా. బేళ్కుం), సాకు 'చాలు' (ప్రా. సాల్కుం) అనే మాటలలో మాత్రం మిగిలింది.

(iv) ఉభయ ప్రార్థనం : భవిష్యత్కాల ప్రాతిపదికకి ప్రాచీన భాషలో -అం, ఆధునిక భాషలో -అన, -అణ చేర్చడం వల్ల ఇది ఏర్పడుతుంది : ప్రా. ఇర్పం 'ఉందాం', ఆ. హోగువన, హోగువణ, హోగోణ 'పోదాం'.

(v) శత్రర్థకం : దీనికి ప్రత్యయం ప్రాచీన భాషలో -ఉత్తుం / ఉతుం, ఆధునిక భాషలో -ఉత్తా : బరుత్తా 'వస్తూ'.

(vi) తద్ధర్మధాతుజ విశేషణం : భవిష్యత్కాల ప్రాతిపదికకి -అ చేరుతుంది: ఆళ్వ 'పరిపాలించే', బర్ప బరువ 'వచ్చే'.

**తుళు :**

(i) వర్తమాన - భవిష్యత్కాలం : ప్రత్యయాలు - పువ్-, -ప్-, -వ్-,

కల్ (పు) 'నేర్చుకొను'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | కల్పువె | కల్పువ |
| 2. | కల్పువ | కల్పువరు |
| 3. | పు. కల్పువె | మ. కల్పువెరు |
| | స్త్రీ. కల్పువళు | |
| | అమ. కల్పుండు | కల్పువ |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయాలు -ప్-, -వ్-, -బ్-, ఈ ప్రత్యయాలు పై ప్రత్యయాలతో తుల్యమే అయినా వీటికీ వాటికీ పంపకం (**Distribution**) లో తేడా ఉంది.

| | | |
|---|---|---|
| 1. | కల్పె | కల్ప |
| 2. | కల్ప | కల్పరు |
| 3. | పు. కల్పె | కల్పెరు |
| | స్త్రీ. కల్పళు | |
| | అమ. కల్పు | కల్ప |

(iii) శత్రర్థకం : ఆసన్నభూత ప్రాతిపదికకి బ్రాహ్మణ మాండలికంలో -ఒంతు, సామాన్య మాండలికాలలో -ఒందు చేరుతుంది: కల్తొంతు / కల్తొందు 'నేర్చుకొంటూ', తిందొంతు / తిందొందు 'తింటూ'.

(iv) తద్ధర్మ ధాతుజ విశేషణం : వర్తమాన భవిష్యత్కాల ప్రాతిపదికకి -ఇ చేరుతుంది: కల్పి / కల్పుబి 'నేర్చుకొనే', కొర్పి 'ఇచ్చే', తూపి 'చూసే'.

**తెలుగు :**

(i) వర్తమాన కాలం : ఇది శత్రర్థకానికి ఉండు ధాతువు నించి వచ్చిన ధాతుజ విశేషణ నామం చేర్చడం వల్ల ఏర్పడుతుంది: చేయుచున్నవాఁడను, చేస్తున్నాను మొ॥. చేస్తూ ఉన్నాను అనే పదాల సమాహారం.

(ii) భవిష్యత్కాలం : శక్యార్థకమైన 'గల' ప్రాచీన భాషలో క్వాచిత్కంగా భవిష్యత్కాలార్థాన్ని సూచించడానికి వాడబడేది. కాని సాధారణంగా -దు- / -ఎద-, -ఎడు- / -ఎడి- లతో కూడిన తద్ధర్మార్థకమే భవిష్యత్తుకి కూడా ఉపయోగిస్తుంది.

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | వండుదును / వండెదను | వండుదుము / వండెదము |
| 2. | వండుదువు / వండెదవు | వండుదురు / వండెదరు |
| 3. | మ. అమ. (+బ.వ.) వండును / వండెడును / వండెడిని. | మ. వండుదురు / వండెదరు |

ఆధునిక భాషలో భవిష్యత్కాల ప్రత్యయం -తా-: చేస్తాను, చేస్తారు మొ॥. అమహదేకవచనంలో -తున్-: వస్తుంది. తకారం (హ) అను క్రియలలో టకారంగా మారుతుంది: తింటాను, తింటుంది.

(iii) ఉభయప్రార్థనం : ప్రాచీనభాషలో ప్రత్యయం -ద-; ఇప్పటి భాషలో -దా-: చేయుదము/చేద్దాం.

(iv) శత్రర్థకం : ప్రాచీనభాషలో -చున్-, ఇప్పటిభాషలో -తూ; చేయుచున్, చేస్తూ, తింటూ.

(v) తద్ధర్మ ధాతుజ విశేషణం ప్రాచీనభాషలో -ఎడు/ఎడి/$\phi$ (లోపం). ఇప్పటి భాషలో -ఏ (-ఏటి కొన్ని అజాదిపదాలముందు) చేసెడు, చేసెడి, చేయు, చేసే, చేసేటప్పుడు, చేసేటంత. -ఎడు, -$\phi$ లకి అచ్చుముందు నుగాగమం వస్తుంది : చేసెడునతఁడు, చేయునతఁడు.

**గోండి :**

(i) వర్తమాన భవిష్యత్కాలం : హలంతాలలో ప్రత్యయం -ఆంత్-; అజంతాలలో -ంత్-

సూఢ్ 'చూచు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | సూఢాంతోన్ | సూఢాంతోం |
| 2. | సూఢాంతీ | సూఢాంతీట్ |
| 3. | పు. సూఢాంతోర్ | సూఢాంతేర్ |
| పురుషేతరం. | సూఢాంతా | సూఢాంతాజ్ |

(ii) భవిష్యత్కాలం : ఉత్తమ మధ్యమ పురుషలలో -క్-, ప్రథమ పురుష అమనుష్యైక వచనంలో -అర్-, మిగిలిన వాటిలో -అన్-,

అట్ - 'వండు'

| | ఏ. వ. | బ. వ. |
|---|---|---|
| 1. | అట్కా | (అనుభయం) అట్కోం) |
| | | (ఉభయం) అట్కాట్ |
| 2. | అట్కి | అట్కిట్ |
| 3. | పు. అట్టానూర్ | అట్టానీర్ |
| పురుషేతరం. | అట్టార్ | అట్టానూజ్ |

కోయ మాండలికంలో ప్రత్యయాలు -ఇత్-, -త్-, -ఈద్-, ఊడితాన 'చూస్తాను', ఊడీదె 'చూస్తుంది' మొ.

-ఒద్-: ప్రత్యయం క్రియాతిపత్తిని సూచిస్తుంది. పాంఢూన్ 'కొడుదును' మొ. కోయలో దీనికి -కో'- ప్రత్యయం : నొర్దకో'ను 'కడుగుదును', మొ. ఉభయప్రార్థనంలో -క్' - అడ చేరుతుంది : తర్కా'ద 'ఎక్కుదాం'.

(iii) శత్రర్థకం : ప్రత్యయాలు - సేర్, -చేర్, -జేర్ : వార్సేర్ 'పాడుతూ', తొహ్‌చేర్ 'చూపెడ్తూ' ఉంజేర్ 'తాగుతూ', కోయలో -ఓర్, -సోర్, -చోర్, -జోర్ : తల్సోర్ 'అడుగుతూ', వస్తూ', తచ్చోర్ 'తెస్తూ'. ఉణ్జోర్ 'తాగుతూ'.

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : -వాల్ ప్రత్యయం చేరిన కృదంతమే తద్ధర్మధాతుజవిశేషణంగా ఉపయోగపడుతుంది : వెహ్వాల్ మాయ్‌నాల్ 'చెప్పే మనిషి', కోయలో క్రియకి -అన్- -అ చేరుతుంది : ఊఢ్ధాన 'చూసే', వాదాన 'వచ్చే'.

**కొండ :**

(i) వర్తమానకాలం : ప్రత్యయం -సిన్- జిన్

కి - 'చేయు'

| | | | |
|---|---|---|---|
| 1. | కిజ్జిన | (అనుభయం) | కిజ్జినప్ |
| | | (ఉభయం) | కిజ్జినట్ |
| 2. | కిజ్జిని(ద్) | | కిజ్జినిదెర్ |
| 3. పు. | కిజినన్ | | కిజ్జినె |
| పురుషేతరం. | కిజ్జినద్ | | కిజ్జినె |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -న్-,

త - 'తెచ్చు'

| | | | |
|---|---|---|---|
| 1. | తన | (అనుభయం) | తనప్ |
| | | (ఉభయం) | తనట్ |
| 2. | తని(ద్) | | తనిదెర్ |
| 3. పు. | తనన్ | | తనర్ |
| పురుషేతరం. | తనద్ | | తనె |

(iii) తద్ధర్మ ధాతుజ విశేషణం ; భవిష్యత్కాల ప్రాతిపదికకి ఇ చేరుతుంది. ఢూని 'దున్నే', గూర్ని 'నిద్రపోయే'.

**పెంగో :**

(i) వర్తమాన భవిష్యత్కాలాలు : భవిష్యత్కాల ప్రత్యయం -న్-.

హుడ్ - 'చూచు'

| | | | |
|---|---|---|---|
| 1. | హుడ్నజ్ | (అనుభయం) | హుడ్నప్ |
| | | (ఉభయం) | హుడ్నస్ |

| | | |
|---|---|---|
| 2. | హుడ్న య్ | హుడ్న దర్/హుడ్ని దెర్ |
| 3. పు. | హుడ్నన్ | హుడ్నర్ |
| | | స్త్రీ. హుడ్నిక్ |
| పురుషేతరం. | హుడ్నత్ | అమ. హుడ్నిజ్ |

భవిష్యత్కాల రూపాలకి అకారం చేర్చడంవల్ల వర్తమాన రూపాలు ఏర్పడతాయి: హుడ్నంగ, (అనుభయం) హుడ్నప, (ఉభయం) హుడ్నహ, మొ.

(ii) తద్ధర్మధాతుజ విశేషణం : భవిష్యత్కాల ప్రాతిపదికకి ఇ చేరుతుంది : ధూని 'దున్నే', కొడ్ని 'కానే', ఏంద్ని 'ఆడే'.

మంద :

(i) వర్తమాన భవిష్యత్కాలాలు : భవిష్యత్కాల ప్రత్యయం -ద్-, -న్-.

క్డగ్ - 'కాను'

| | | |
|---|---|---|
| 1. | క్డగి | క్డగ్డుజ్ |
| 2. | క్డగ్ధి | క్డగ్ధిర్ |
| 3. పు. | క్డగ్నన్ | క్డగ్నిర్ |
| పురుషేతరం. | క్డగిన్ | క్డగ్నిజ్ |

పై రూపాలకి -బ చేర్చడంవల్ల వర్తమాన రూపాలు ఏర్పడతాయి. క్డగిబ మొ.

(ii) తద్ధర్మ ధాతుజ విశేషణం : ధాతువుకి -న్ -ఇ చేరుతుంది : డింజ్ని 'తెల్లబడిన'.

తూయి :

(i) వర్తమానకాలం : శత్రర్థకానికి మన్ - 'ఉండు' అనే క్రియ భవిష్యత్కాల రూపాలు చేరతాయి . తాకఇ మఇ 'నడుస్తున్నాను'.

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయాలు - ద్-, న్-, మొదటిది మధ్యమ పురుషలో ఉంటుంది

కో 'కోయు'

| | | |
|---|---|---|
| 1. | కో'ఇ | (అనుభయం) కోనము |
| | | (ఉభయం) కోనసు |
| 2. | కో'ది | కో'దెరు |
| 3. పు. | కో'నెంజు | కో'నెరు |
| పురుషేతరం. | కో'నె | కో'ను |

ఈ భాషలో అభ్యనుజ్ఞార్థకంగా- క్-/-అక్-ప్రత్యయం ఉంది: తాకకను 'నన్ను నడవనీ', తాకకంజు 'వాణ్ణి నడవనీ' మొ.

(iii) శత్రర్థకం : దీనికి ముఖ్యప్రత్యయాలు -కి, -పి, -జి, -అఇ : అట్కి 'కలుపుచూ', అస్కి 'భయపడుతూ', దెగఇ 'పరిగెడుతూ', అర్పి 'పిలుస్తూ', సజి 'పోతూ', తింజి 'తింటూ', ఉణ్బి 'తాగుతూ'.

(iv) తద్ధర్మధాతుజవిశేషణం : ధాతువుకి భవిష్యత్కాలిక ప్రత్యయం -ఇన్- / -న్- చేరిన తరవాత -ఇ చేరుతుంది: గ్రాంబిని 'నేర్చుకొనే', కోని' 'కో'సే', నొగ్ని 'కడిగే', తిన్ని 'తినే'.

కువి :

(i) వర్తమానకాలం : శత్రర్థకానికి మన్- 'ఉండు' భవిష్యత్కాల రూపాలు చేరతాయి: తోస్సి మ.ఇ/మంజ.ఇ 'చూపెడుతున్నాను'.

(ii) భవిష్యత్కాలం: ప్రత్యయాలు -ద్-, -న్-; ప్రథమ పురుషైక వచనంలో కంఠమూలీయ స్పర్శం.

హీ 'ఇచ్చు'

| | | |
|---|---|---|
| 1. | హీ'ఇ | (అనుభయం) హీనామి |
| | | (ఉభయం) హీనా |

| | | |
|---|---|---|
| 2. | హీది | హీదెరి |
| 3. | పు. హీనెసి | హీనెరి |
| పురుషేతరం. | హీనె | హీను |

అభ్యనుజ్ఞార్థక ప్రత్యయాలు : -ప్-, ంబ్-, -అప్-, -బ్-: వాపెసి 'వాణ్ణి రానీ' మొ.

(iii) శత్రర్థకం : ప్రత్యయాలు -ఇ, -హి, -సి, -చి, -జి : పాయి 'కొడుతూ', హిహీ 'ఇస్తూ', తోస్సి 'చూపెడుతూ', వెచి 'కొడుతూ', వెంజి 'వింటూ'.

(iv) తద్ధర్మధాతుజవిశేషణం : ధాతువుకి భవిష్యత్కాలిక ప్రత్యయమైన -ఇన్- చేరి దానికి -ఇ చేరుతుంది : పాయిని 'కొట్టే'.

**కోలామీ :**

(i) వర్తమాన భవిష్యత్కాలం : ప్రత్యయం -సత్-, ప్రథమపురుషలో -స్- (వార్ధామాండలికంలో వీటిలో సకారం లోపిస్తుంది).

తిన్ 'తిను'

| | | |
|---|---|---|
| 1. | తిసత్ | తిసతుం |
| 2 | తిసతి(వ్) | తిసతిర్ |
| 3. | పు. తిసం(ద్) | తిసర్ |
| పురుషేతరం. | తిసద్ | తిస(వ్) |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -దత్-; ప్రథమపుషలో -ద్-; సీదతున్ 'ఇస్తాను', సీదం(ద్) 'ఇస్తాడు' మొ. అభ్యనుజ్ఞార్థక ప్రత్యయం -క్-; వక్కం(ద్) 'వాణ్ణిరానీ' మొ.

(iii) శత్రర్థకం : ప్రత్యయం -క్- : తిసన్ 'తింటూ'.

(iv) తద్ధర్మధాతుజవిశేషణం : ప్రత్యయం -ఎక : తినెక 'తినే'.

**నాయకీ (ఛాం) :**

(i) వర్తమాన భవిష్యత్కాలం : ప్రత్యయం -త్-; అంతన్ 'ఉంటాను' మొ.

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయాలు -అత్-, -ద్-, అన్-.

కక్ 'చేయు'

| | | |
|---|---|---|
| 1. | కకతున్ | కకతుం |
| 2. | కకతి | కకతిర్ |
| 3. పు. | కక్దన్ | కక్దర్ |
| పురుషేతరం. | కకన్ | కక్ద |

(iii) తద్ధర్మధాతుజ విశేషణం : ప్రత్యయం -ఎక : నెరెక 'వెళ్ళే'.

**పర్జీ :**

(i) వర్తమానకాలం : ప్రత్యయం -మ్- :

వెర్ 'వచ్చు'

| | | |
|---|---|---|
| 1. | వెర్మెన్ | వెర్మాం |
| 2. | వెర్మాత్ | వెర్మార్ |
| 3. పు. | వెర్మెద్ | వెర్మెర్ |
| పురుషేతరం. | వెర్మా | వెర్మావ్ |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -ర- (దక్షిణమాండలికంలో -ఇయ-). కొన్ని ప్రాంతాలలో ర కి బదులు -ద- ఉంది. కొన్ని క్రియలలో -త- ఉంది.

చూడ్ 'చూచు'

| | | |
|---|---|---|
| 1. | చూడ్ రన్ | చూడ్ రం |
| 2. | చూడ్ రత్ | చూడ్ రర్ |
| 3. పు. | చూడ్ రద్ | చూడ్ రర్ |
| పురుషేతరం. | చూడ్ ర | చూడ్ రవ్ |

(iii) -ఒద్, -ఎక్, -ఎం అనే ప్రత్యయాలు "(ఒక పని) చేస్తూ ఉండగా" అనే అర్థం ఇస్తాయి, వెరొద్ 'వస్తూ ఉండగా', వక్రెక్ 'కాగుతూ ఉండగా' అడెం 'ఏడుస్తూ ఉండగా'.

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : భవిష్యత్కాల ప్రత్యయం తరవాత -అన్ చేరుతుంది : చొక్రన్ 'ఎక్కే', నిల్తన్ 'నిలబడే', వెందన్ 'వినే'.

గదబ :

(i) వర్తమానకాలం : ధాతువుకి ఇన్ 'ఉండు' అనే క్రియ భవిష్యత్కాల రూపాలు చేరతాయి : సూడిందన్ 'చూస్తున్నాను'.

(ii) వర్తమాన భవిష్యత్కాలం : ప్రత్యయాలు -ద-, -త-, య-- (చివరది నకారాంతాలలో): వండ్దన్ 'వండుతాను', పేతన్ 'కనపడతాను', తియన్ 'తింటాను'.

(iii) శత్రర్థకం: ప్రత్యయం -ఇజ్ /-ఉజ్ : ఉనుజ్ తాగుతూ (ఉండగా), ఈలిజ్ 'పడుతూ (ఉండగా)',

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : భవిష్యత్కాల ప్రత్యయం తరవాత అన్ చేరుతుంది : సీదన్ 'ఇచ్చే' వండ్దన్ 'వండే'.

తూడుఖ్ :

(i) వర్తమానకాలం : ప్రత్యయం -ద్-; దీని రూపాంతరమైన -న్. మనుష్య బహువచనంలో ఉంటుంది. స్త్రీలు -వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకొనే టప్పుడు ఉత్తమపురుష దకారం కంఠమూలీయ స్పర్శంగా మారుతుంది. కుండలీకరణాలలో ఉన్నవి స్త్రీ భాషారూపాలు.

ఎస్ 'పగలగొట్టు'

| | | |
|---|---|---|
| 1. | ఎస్దన్ (ఎస్'ఏన్) (అనుభయం) ఎస్దం (ఎస్'ఏం) (ఉభయం) ఎస్దల్ | |
| 2. | ఎస్దయ్ (ఇస్ది) | ఎస్దర్ (ఎస్దయ్) |

3. పు. ఎస్‌దస్      మ. ఎస్‌నర్ (ఎన్‌నయ్)
పురుషేతరం. ఇస్'ఇ

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -ఒ-.

| | | | |
|---|---|---|---|
| 1. | ఎస్'ఒన్ | (అనుభయం) | ఎస్'ఒం |
| | | (ఉభయం) | ఎస్'ఒట్ |
| 2. | ఎస్'ఒయ్ | | ఎస్'ఒర్ |
| 3. పు. | ఎస్'ఒస్ | | ఎస్'ఒర్ |
| | ఎస్'ఒ పురుషేతరం. | | |

(iii) శత్రర్థకం : ప్రత్యయం -నూ / -నుం, ఎస్నూ, ఎస్నుం 'పగలగొడుతూ'.

(iv) తద్ధర్మధాతుజవిశేషణం : ప్రత్యయం -ఈ, ఇసీ 'పగలగొట్టే'

మాల్తో :

(i) వర్తమానకాలం : ప్రత్యయాలు -న్-, -ఇ-, నకారం మధ్యమ పురుష ప్రథమ పురుష మనుష్య బహువచనాలలో ఉంటుంది. (మహాపాత్ర (1979 : 163) ఇచ్చిన ప్రత్యయాలు -ద్-, -న్-, -$\phi$-).

బంద్ 'లాగు'

| | | | |
|---|---|---|---|
| 1. | బందిన్ | (అనుభయం) | బందిం |
| 2. | బంద్నె (బందిని) | (ఉభయం) | బంద్నెర్ |
| 3. పు. | బందిహ్ | మ. | బంద్నెర్ |
| | బందిధ్ పురుషేతరం. | | |

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -ఒ- (మహాపాత్ర ఇచ్చిన ప్రత్యయాలు -న్-, -$\phi$-).

1. బందొాన్ (అనుభయం) బందొాం
(ఉభయం) బందొాత్
2. బందొా బందొార్
3. పు. బందొాహ్ మ. బందొార్
బందొాద్ పురుషేతరం.

(iii) శత్రర్థకం : ప్రత్యయాలు -నె/ -లె/ -ఇ/ -ఎ; బంద్నె/బంద్లె/ బంది/బందె 'లాగుతూ'.

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : ప్రత్యయం -ఉ, బజు 'కొాస్టే'.

బ్రాహుయీ :

(i) వర్తమానకాలం : ప్రత్యయాలు ఇ, ఏ; ఇ కి ప్రథమ పురుషైక వచనంలో రూపాంతరం ఎ.

బిన్ 'విను'

| | | |
|---|---|---|
| 1. | బినివ్ | బినిన్ |
| 2. | బినిస్ | బినిరె |
| 3. | బినె | బినిర్ |

వర్తమాన భవిష్యత్కాల రూపాలు పైవాటిలో హలంతాలకి అకారం చేర్చడం వల్ల ఏర్పడతాయి, బినివ 'వింటున్నాను, వింటాను' మొ. మధ్యమ పురుష బహువచనం రెండింటిలోనూ సమానమే. ప్రథమ పురుషైక వచనం చివరి ఎ కి బదులు ఇక్ వస్తుంది: బినిక్ 'వింటున్నాడు / వింటోంది'.

(ii) భవిష్యత్కాలం : ప్రత్యయం -ఒ-.

| | |
|---|---|
| 1. బినొాట్ | బినొాన్ |
| 2. బినొాస్ | బినొారె |
| 3. బినొా | బినొార్ |

(iii) శత్రర్థకం : ఇస, బినిస, 'వండుతూ' కరిస 'చేస్తూ'

(iv) తద్ధర్మధాతుజ విశేషణం : -ఒక్ (ఇది బలూచీ నుంచి వచ్చినది) బినాక్ 'వినే', పారాక్ 'చెప్పే, అనే.'

## తులనాత్మక చర్చ

మూల భాషలలో భూతేతర కాలవాచకాలుగా 1. *ప్ప్ / *ప్, 2. *క్క్ / *క్, 3. *త్, / 4. *-ఉం, 5. *న్ —ఈ ప్రత్యయాలని పునర్నిర్మించవచ్చు. మూలోత్తర ద్రావిడంలో *ఒ ప్రత్యయం భవిష్యదర్థకంగా ఉంది కాని ఇది *ప్ నించి వచ్చినది కావచ్చు. కోత, తొద భాషలలో ప్రాచీన భూతకాల రూపాలు వర్తమాన కాలరూపాలుగా మారడం ఒక ప్రత్యేక పరిణామం. ఇది ఈ భాషల సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది.

1. *ప్ప్/*ప్ : ఇది దక్షిణశాఖలో అన్ని భాషలలోనూ ఉంది. తమిళంలో అమనుష్యైకవచన బహువచనాలలో దీనికి బదులు వకారయుక్త రూపాలే ఉన్నాయి. త. వరుం : క. బరువుదు 'వస్తుంది', బరువవు 'వస్తాయి'.

మధ్యోత్తర భాషలలో దీని ప్రతిరూపాలు చాలా అరుదు. కొండలో సమకాలార్థకమైన - పు, కూయి శత్రర్థకంలో - పి, - బి, - ప్కి, కువి అభ్యనుజ్ఞార్థకంలో - ప్ -, - బ్ -, - ంబ్ - దీని ప్రతిరూపాలే. ఉత్తర శాఖలో బ్రాహుయీ వ్యతిరేక క్రియల భూతేతర కాలరూపాలలో - ప్ - ఉంది. మూడు ఉత్తర భాషలలోనూ భవిష్యదర్థకమైన - ఒ - *ప్ ప్రతిరూపమని రామస్వామి అయ్యర్ ప్రభృతుల అభిప్రాయం. తమిళం - కొడగుశాఖలో ఉన్న గురుక్రియా లఘుక్రియా భేదానికి ఇంచు మించు తుల్యమైన భేదం కొండ, పెంగొ, పర్జీ, గదబలలో ఉంది కాబట్టి యీ భేదం మూలభాషకి చెందినదే.

2. *క్క్ / *క్ : దీని ప్రతిరూపాలు తమిళం, మలయాళం, కోత, తొద, కొడగు, కన్నడం, గోండీ, కోలామీ - పర్జీశాఖ, బ్రాహుయీలలో ఉన్నాయి. తమిళ మలయాళాలలో గురు క్రియలకి అజాది ప్రత్యయాలు (విధ్యర్థక మధ్యమపురుష బహువచన ప్రత్యయం తప్ప) చేరేటప్పుడు వాటి చివర క్క్ చేరుతుంది. ఉదా. పార్క్క 'చూడ' (పార్ 'చూచు' తుమున్నర్థకం). ఇది దీని ప్రతిరూపమే. తమిళంలో వర్తమానార్థకమైన కిన్ఱ్ / కిఱ్ లో కూడ దీని

ప్రతిరూపం ఉంది. ఇది మొదట్లో ప్రత్యయం కాదనీ, దీని విభాగం మొదట్లో కు + ఇన్ఱ్ అనీ, దీనిలో కు ప్రత్యయం తరవాత ఇల్ 'ఉండు' అనే సహాయక క్రియరూపం ఉందనీ ఆంద్రొనొవ్ ప్రభృతుల ఊహ. కాల్‌డ్‌వెల్ దీనిలో ఇన్ఱ్ ఇన్ఱు 'నేడు' అనే పదమేనని అన్నా కాని ఈ ఊహ సరియైనట్లు తోచదు. బ్రాహుయీ ప్రథమ పురుషైక వచనంలో ఉన్న ఇక్ - దీని ప్రతిరూపమే కావచ్చు.

3. *త్ / ద్ : దీని ప్రతిరూపాలు ప్రాచీన తమిళం, కన్నడం, కొండ, పెంగొలు తప్ప/ అన్ని మధ్య ద్రావిడభాషలు, కూడుఖ్‌లలో ఉన్నాయి. తమిళంలో ఇది తరవాత కాలంలో పోయి ఓష్ఠ్యప్రత్యయమే భూతేతర కాలార్థకంగా మిగిలిపోయింది. దంత్యప్రత్యయాలు భూతేతరకాలార్థకంగా మిగిలిపోయింది. దంత్యప్రత్యయాలు భూతకాలార్థకాలుగా ప్రచురంగా ఉండడమే ఇది నశించడానికి కారణం కావచ్చు. ప్రాచీన తమిళంలోకూడా ఇది ఉన్న రూపాలు ఉత్తమ పురుష బహువచనం, మధ్యమ పురుషైక వచన బహువచనాలలోనే దొరుకుతున్నాయి.

ఉత్తమ భాషలలో ఇది కూడుఖ్‌లో మాత్రం మిగిలి ఉంది.

మూల భాషలో ఓష్ఠ్యాలూ, దంత్యాలుకూడా భూతేతర కాలార్థకాలుగా ఉండేవని పై చర్చ స్పష్టం చేస్తుంది. కాని తరవాతకాలంలో దక్షిణశాఖలో ఓష్ఠ్యం ప్రచురమైంది. ఈ పరిణామం ఈ శాఖల ప్రత్యేక లక్షణంగా గ్రహించవచ్చు.

4. *-ఉం : దీని ప్రతిరూపాలు తమిళం, మలయాళం, కొడగు, కన్నడం, తుళు, తెలుగు, కోలామీ, పర్జీలలో ఉన్నాయి.

పర్జీ తప్ప మిగిలిన భాషలలో దీని ప్రతిరూపాల తరవాత పురుష ప్రత్యయాలు ఉండవు, తెలుగులో చేయును, చెప్పును మొదలైన వాటిలో -ఉను *-ఉం నించి వచ్చినదే. పదాంత మకారం నకారంగా మారడం తెలుగులో ఉంది : త. మరల / మరన్ఱ్ : తె. మ్రాను, త. కుళం / కుళన్ : తె. కొలను. ప్రాచీన తమిళం, ప్రాచీన తెలుగు ఆధారాలవల్ల ఇది మూలభాషలో మనుష్య బహువచనం తప్ప మిగిలిన అన్ని ప్రథమ పురుషరూపాలలోనూ

ఉండేదని నిర్ణయించవచ్చు. ఈ రెండు భాషలలోనూ తరవాత కాలంలో ఇది పోయి దీని స్థానంలో వేరే కాల ప్రత్యయమూ పురుష ప్రత్యయాలూ ఉన్న రూపాలు వ్యాప్తిలోకి వచ్చాయి : ప్రా. తె. వాఁడు వచ్చును, ఆ. తె. వాడు వస్తాడు. ఇది అర్థ సందిగ్ధతని నివారించడానికి జరిగిన మార్పు.

మలయాళంలో ఉం రూపాలు అన్ని పురుషలలోనూ ఉంటాయి.

తుళు భవిషత్కాలమనుష్యైక వచన రూపాలలో చివర మకారం లోపించింది : తు. బరు : త. వరుం 'వస్తుంది'.

కోలామీ - ఉన్, నాయకీ - అన్ (భవిష్యత్కాల పురుషేతరైక వచనంలోనివి) కూడా *ఉం నించి వచ్చినవే.

పర్జీలో వర్తమాన కాలార్థకమైన మకారం *ఉ నించి వచ్చినదే. పర్జీలో ఇది అన్ని పురుష వచనాలకి వ్యాపించడమేకాక దీనికి పురుష ప్రత్యయాలు కూడా చేరేయి. ప్రాచీన తమిళంలో కూడా ధాతుజవిశేషణ నామాలలో ఉం తరవాత పురుష ప్రత్యయాలు వస్తాయి : కొయ్యుమోన్ 'కోసేవాడు'. పర్జీ ఉత్తర మాండలికంలో ప్ / త్ లతో అంతమయ్యే క్రియలలో మకారం ముందు ప్ / త్ ల స్థానంలో కకారం వస్తుంది. ఈ కకారం తమిళాది భాషలలో గురు క్రియలలో ఉండే కకారానికి సజాతీయమైనదే. ప. నిల్క్‌మెన్ 'నిలబడుతున్నాను'. త. నిఱ్కుం 'నిలబడుతుంది / నిలబడతాయి'.

5. *న్. ఇది మూల భాషలో దంత్యనకారమని తమిళంవల్ల తెలుస్తుంది. దీని ప్రతిరూపాలు ప్రాచీన తమిళం, తుళు, గోండీ, కొండ, పెంగో, కూయి, కోలామీ, కూడుఖ్, మాల్తోలలో ఉన్నాయి.

ఇది కొండ పెంగోలలో అన్ని పురుషలలోనూ ఉండడం గమనించదగ్గది. తమిళంలో ఇది తద్ధర్మ ధాతుజ విశేషణ నామాలలో మాత్రమే ఉంది. తుళులో నకారం పర్ణగ 'తాగుతూ ఉండగా' వంటి రూపాలలో మాత్రమే ఉంది. మధ్యోత్తర భాషలలో మాత్రమే ఇది సమాపక క్రియలలో ఉంది.

కొండ, పెంగో, కూయి, కువిలలో తద్ధర్మ ధాతుజ విశేషణాలలో ఇది ఉండడం వాటి సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది.

శత్రర్థకం: తమిళ మలయాళాలలో దీనికి ప్రత్యయం లేదు. ఈ అర్థాన్ని సూచించడానికి క్త్వార్థకానికి కొళ్ 'తీసుకొను' అనే క్రియ క్త్వార్థకం చేరుతుంది. తుళులో శత్రర్థకాలు కూడా ఇటువంటి నిర్మాణం నించి వచ్చినవే. కన్నడంలో -తు, -తా ప్రత్యయ రూపాలూ, క్త్వార్థకం + కొళ్ క్త్వార్థకమూ మాడుత్తా / మాడికొండు 'చేస్తూ') అనే నిర్మాణమూ రెండూ ఉన్నాయి. వ్యావహారికాంధ్రంలో -తూ కన్నడ ప్రభావంవల్ల వచ్చింది కావచ్చు. ప్రాచీనాంధ్రంలో -చున్‌కి సంబంధించిన ప్రత్యయాలు గోం. సేర్ / సోడ్ే / సోర్, కొండసిన్, కూయి. జి, కు వి హి / చి / జి, జి, కో, సాన్, బ్రా. -ఇస, వీటన్నిటిలోనూ చకారం ప్రత్యయంగా ఉంది. మొదట్లో తెలుగులో చున్, తూలు మాండలిక భేదాలు అయి ఉంటాయి. రెండోది కన్నడ భాషా ప్రాంత మాండలికంలో పుట్టి ఉంటుంది.

కూడుఖ్-నూ, మాల్తో-నె పరస్పర సంబంధం గలవి.

తద్ధర్మధాతుజ విశేషణం : దీనిలో తమిళ మలయాళాలలో ధాతువుకి -ఉం చేరుతుంది. తెలుగులోకూడా ఎడు, లోపాల తరవాత అచ్చు ముందు నకారం వస్తుంది : చెప్పునతఁడు. ఈ నకారం ఉం ప్రతిరూపమే, హల్లు ముందు ఇది లోపించింది. కూడుఖ్-మాల్తో-ఊ కూడా ఉం నించి వచ్చి ఉండవచ్చు. కాబట్టి ధాతుజ విశేషణంలో మూలద్రావిడంలో -ఉం ఉండేదని చెప్పవచ్చు.

కొడగు, కన్నడం, తుళులలో ధాతుజ విశేషణంలో ప్/వ్ ప్రత్యయం ఉంది. తమిళంలో వరుపవన్ 'వచ్చేవాడు' మొదలైన ధాతుజవిశేషణ నామాలలో ప్/ప్ప్ ప్రత్యయం ఉంది. కాబట్టి మూలదక్షిణ ద్రావిడంలో ఈ రకం ధాతుజ విశేషణం పుట్టి ఉంటుంది.

కొండ, పెంగొ, (మండ), కూయి, కువిలలో ఈ రూపంలో కాల ప్రత్యయంగా నకారమూ విశేషణ ప్రత్యయంగా ఇకారమూ ఉన్నాయి. ఇది వీటి సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది. గోండీ -వాల్ ఇండో ఆర్యన్ నించి వచ్చింది. అయినా గోండీ పైవాటికి సన్నిహితభాషే కాబట్టి పురాతనకాలంలో ఆ భాషలో ధాతుజ విశేషణం కొండ - కువిలలోలాగే ఉండి ఉండవచ్చు. (కోయ మాండలికంలో -ఆన నకారంతో ఉండడం గమనించాలి.)

విశేషణ ప్రత్యయాలైన తుఋ, కొండ-కువిలలో ఇకారమూ, మిగిలిన భాషలలో అకారమూ మూలద్రావిడంలో మాండలిక భేదాలు కావచ్చు.

కోలామీ నాయకీలలో ఉన్న -ఎకలో -ఎక్- కాలప్రత్యయమూ, అకారం విశేషణ ప్రత్యయమూ.

పర్జీ గదబలలో ఈ రూపంలో దంత్యం కాలప్రత్యయంగా ఉండడమూ, విశేషణ ప్రత్యయం -అన్ కావడమూ ప్రత్యేకతలు.

**4. 4. వ్యతిరేక ప్రత్యయాలు :**

ద్రావిడభాషలలో క్రియా పదాలలో వ్యతిరేక ప్రత్యయం ఉండటం ఒక ప్రత్యేకత. వ్యతిరేక ప్రత్యయంతో సమాపక క్రియలూ, వ్యతిరేకక్త్వార్థకమూ, వ్యతిరేక ధాతుజ విశేషణమూ, వ్యతిరేకనామమూ, వ్యతిరేక విధ్యర్థకాలూ ఉన్నాయి. వీటన్నిటిలో వ్యతిరేక ప్రత్యయం కాలప్రత్యయం స్థానంలో వస్తుంది. మధ్యభాషలు చాలావాటిలో భూత వ్యతిరేక రూపాలుకూడా ఏక శబ్ద నిర్మాణంగా ఉన్నాయి; వీటిలో భూతప్రత్యయం వ్యతిరేక ప్రత్యయం తరవాత ఉంటుంది.

**తమిళం :**

(i) సమాపక క్రియలు : ప్రథమ పురుషామనుష్యైకవచన బహు వచనాలలో ప్రత్యయం -అ-; మిగిలిన పురుష ప్రత్యయాలముందు ఇది లోపిస్తుంది. దీని తరవాత అమనుష్య బహువచన ప్రత్యయం లోపిస్తుంది. ఈ రూపాలు భూతేతికాలంలో వ్యతిరేకతని సూచిస్తాయి.

కాణ్ 'చూచు'

| | | | | |
|---|---|---|---|---|
| 1. | | కాణేన్ | | కాణేన్ / కాణోం |
| 2. | | కాణాయ్ | | కాణీర్ (కళ్) |
| 3. | పు. | కాణాన్ | మ. | కాణార్ (కళ్) |
| | స్త్రీ. | కాణాళ్ | | |
| | అమ. | కాణాతు | | కాణా |

ఆధునిక భాషలో అన్ని క్రియలకి ఇటువంటి రూపాలు అమనుష్యైక వచనంలో మిగిలి ఉన్నాయి: చెయ్యాతు 'చెయ్యదు', వరాతు 'రాదు'. మిగిలిన చోట్ల తుమున్నర్థకరూపంలో ఉన్న ప్రధానక్రియకి "మాట్టు" అనే సహాయక క్రియ వ్యతిరేకరూపాలు చేరతాయి : చెయ్య మాట్టేన్ 'చెయ్యను' మొ॥

(ii) సంఘ వాఙ్మయంలో అల్- 'కాకుండాఉండు', ఇల్- 'లేకుండా ఉండు' అనే వ్యతిరేకక్రియలు అన్ని పురుష వచనాలలోనూ ఉన్నాయి. అల్ రూపాలు వేరు ధాతువుకి చేర్చినప్పుడు భూతేతరకాలంలో వ్యతిరేకతని సూచిస్తాయి. ఇల్ రూపాలు వేరుధాతువు క్త్వార్థకరూపానికి చేరి భూతకాలంలో వ్యతిరేకతని సూచిస్తాయి: చెల్లలం 'మేము వెళ్ళం', నిల్లలన్ 'వాడు నిలబడడు'.

అల్ రూపాలు సమాపకక్రియలకి చేరడంకూడా ఉంచి. కలంకినేన్ అల్లేన్ 'నేను భయపడలేదు', చెల్వేం అల్లేం 'మేం వెళ్ళం'.

ఆధునిక భాషలో తుమున్నర్థకానికి ఇల్లై 'లేదు' చేర్చడంవల్ల భూతకాలంలో వ్యతిరేకతా, వర్తమాన భవిష్యత్కాలిక ధాతుజవిశేషణ నామానికి ఇల్లై చేర్చడంవల్ల భూతేతరకాలంలో వ్యతిరేకతా సూచించబడతాయి: చెయ్యవిల్లై '(కర్త) చేయలేదు' (ఇందులో వకారం శ్రుతి), వరుకిఱతు ఇల్లై 'రావడం లేదు", వరువతు ఇల్లై 'రావడంలేదు (భవిష్యత్తులో)'.

(iii) వ్యతిరేకక్త్వార్థకం : -ఆ, -ఆతు, -ఆమల్ (మొదటిది ప్రాచీన భాషలో మాత్రమే ఉంది) : చెయ్యా, చెయ్యాతు, చెయ్యామల్ 'చెయ్యకుండా'.

(iv) వ్యతిరేకధాతుజ విశేషణం : -ఆ, -ఆత (మొదటిది ప్రాచీన భాషలో మాత్రమే ఉంది; -ఆతలో -అత్. -వ్యతిరేకం, / -అ విశేషణ ప్రత్యయం) చెయ్యా, చెయ్యాత 'చేయని'.

(v) వ్యతిరేకనామం : ధాతువు + ఆ (వ్యతిరేకం) + మై (కృత్తు) చెయ్యామై 'చేయకపోవడం'.

**మలయాళం :**

(i) సమాపక క్రియలు : ప్రాచీన మలయాళంలో అటిథియోం 'ఎర గము' మొదలైన లోపప్రత్యయ సహితరూపాలు ఉన్నాయి. ఇవికాక చెయ్యా వంటి అప్రత్యయసహితరూపాలు అన్ని పురుష వచనాలలోనూ ఉన్నాయి. ఇవి రెండూ కాక -ఆయ్- వ్యతిరేక ప్రత్యయం తరవాత కాలప్రత్యయమూ, పురుష ప్రత్యయమూ ఉన్న సమాపకక్రియలు కూడా ప్రాచీనభాషలో ఉన్నాయి : (వ. కా.) కాణాయిన్ను 'చూడడంలేదు', (భూ. కా.) వరాఞ్ఞు 'రాలేదు', (భ. కా.) వరాయుం 'రాను, రాము మొ॥

ఇప్పటి భాషలో వ్యతిరేకతని సూచించడానికి సమాపక క్రియకి ఇల్ల 'లేదు' చేరుస్తారు. భవిష్యత్తులో మాత్రం ఇది తుమున్నర్థకానికి చేరుతుంది.

(భూ. వ్య) చెయ్‌తు ఇల్ల 'చెయ్యలేదు'

(వ. వ్య.) చెయున్ను ఇల్ల 'చెయ్యడంలేదు'

(భ.వ్య.) (లిఖితం) చెయ్యుక /(వ్యావహారికం) చెయ్య ఇల్ల 'చెయ్యను' మొ.

(ii) వ్యతిరేకక్త్వార్థకం : ప్రాచీన భాషలో -ఆతు, ఇప్పటి భాషలో -ఆతె : ఉణ్ణాతె 'తినకుండా'.

(iii) వ్యతిరేక ధాతుజ విశేషణం : భూతకాలంలో -ఆఞ్ఞ (<*-ఆయ్-ఞ్ - అ; ఇందులో - ఞ్ - భూతప్రత్యయం), భూతేతర కాలంలో -ఆత్త.

(భూ.) కాణాఞ్ఞ / (అభూ.) కాణాత్త 'చూడని'.

(iv) వ్యతిరేకనామం : ధాతువు + ఆయ్ (వ్యతిరేకం) + క (కృత్తు) : చెయ్యాయ్క 'చేయకపోవడం.'

**కోత :**

(i) సమాపక క్రియలు : ప్రత్యయం ϕ- (లోపం).

తిన్ 'తిను'

1. తినే (న్) (అనుభయం) తినేం
(ఉభయం) తినోం
2. తినీ తినీం
3. (ఏ. వ., బ. వ.) తిన్‌కో

ఇదికాక వ్యతిరేక ప్రత్యయమైన -ఆయ్ - తరవాత కాలప్రత్యయమూ (భూతం -ప్ -, భూతేతరం -క్ వ్ -), పురుష ప్రత్యయాలూ ఉన్న రూపాలు కూడా ఉన్నాయి : వారాయ్ పే(న్) 'నేను రాలేదు', వారాయ్క్వే(న్) 'నేను రాను' మొ.

(ii) వ్యతిరేక క్త్వార్థకం : -అద్: గెయాద్ 'చెయ్యకుండా'.

(iii) వ్యతిరేక ధాతుజ విశేషణం : -అ(ద్) : కొథా(ద్) 'ఇయ్యని'.

(vi) వ్యతిరేక నామం : ధాతువు + అయ్ (వ్యతిరేకం) + వ్ద్ / బ్ద్ (కృత్తు); తినాయ్వ్ద్ / తినాయ్బ్ద్ 'తినకపోవడం'.

తొద:

(i) సమాపక్రియలు : ఉత్తమ మధ్యమ పురుషలలో ప్రత్యయం లోపం, ప్రథమ పురుషలో -ఒత్. వీటిలో ప్రథమ ప్రాతిపదికే ఉంటుంది.

కియ్ 'చేయు'

| | | | |
|---|---|---|---|
| 1. | కియెని | (అనుభయం) | కియెమి |
| | | (ఉభయం) | కియుమి |
| 2. | కియ్ఫి | | కియ్శ్ |

3. (ఏ. వ., బ. వ.) కియొత్

ఇది అన్ని కాలాలలో వ్యతిరేకతని సూచిస్తుంది.

(ii) వ్యతిరేకక్త్వార్థకం : ఒత్ : తినొత్ 'తినకుండా'.

(iii) వ్యతిరేకధాతుజ విశేషణం : ఒపొయ్ : మోటొ పొయ్ 'అమ్మని', -ఒ(త్) : కటొ(త్) 'పితకని', ఉణొ(త్) 'తాగని'

కొడగు :

(i) సమాపక్రియలు : వ్యతిరేక ప్రత్యయమైన -అ గల రూపమే అన్ని పురుషవచనాలలోనూ ఉంది : కెయ్య 'చెయ్యను, చెయ్యం' మొ॥

భూతకాలంలో వ్యతిరేకతని సూచించడానికి క్త్వార్థకానికి ఇల్లె 'లేదు' చేరుతుంది : బందిల్లె/బందితిల్లె 'రాలేదు'. అదే విధంగా భవిష్యత్కాల ప్రాతి పదికకి ఇల్లె చేరితే భవిష్యత్కాలంలో వ్యతిరేకత సూచించబడుతుంది : బప్పిలె 'రాను, రాం' మొ.

(ii) వ్యతిరేకక్త్వార్థకం : -అతె : బక్కతె 'రాకుండా'.

(iii) వ్యతిరేకధాతుజ విశేషణం : ధాతువు + అత్ (వ్యతిరేకం) + ఎ (విశేషణం) బక్కతె 'రాని'.

కన్నడం :

(i) సమాపక క్రియలు : ప్రథమపురుషామనుష్యైక వచన బహువచనాలలో వ్యతిరేక ప్రత్యయం -అ-, మిగిలినచోట్ల లోపం.

నోడు 'చూచు'

| | | | | |
|---|---|---|---|---|
| 1. | | నోడెం/నోడె(ను) | | నోడెం/నోడెవు |
| 2. | | నోడయ్/నోడె | | నోడిర్/నోడిరి |
| 3. | పు. | నోడం/నోడ(ను) | మ. | నోడర్/నోడరు |
| | స్త్రీ. | నోడళ్/నోడళు | | |
| | అమ. | నోడదు | | నోడవు |

ఆధునిక భాషలో ఇది వ్యాప్తిలో లేదు. దీని బదులు భూతకాలంలో తుమున్నర్థకానికి ఇల్ల 'లేదు' చేరే నిర్మాణం ఉంది : నోడలిల్ల 'చూడలేదు', భూతేతర కాలంలో కాలంలో ధాతుజవిశేషణ నామానికి ఇల్ల చేరుతుంది : బరువదు ఇల్ల 'రాను' మొ॥

(ii) వ్యతిరేకక్త్వార్థకం : -అదె : ఇరదె 'ఉండకుండా', ప్రాచీన శాసనాలలో -అదె ఉంది.

(iii) వ్యతిరేకధాతుజ విశేషణం : -అద్ -అ ; మాడద 'చెయ్యని', కరెయద 'పిలవని'.

**తులు :**

(i) సమాపకక్రియలు : వ్యతిరేక ప్రత్యయం అమనుష్యైక వచనంలో -అ-, మిగిలినచోట్ల -అయ్-.

కేణు 'విను'

| | | | |
|---|---|---|---|
| 1. | కేణయె | | కేణయ |
| 2. | కేణయ | | కేణయరు |
| 3. | పు. కేణయె | మ. | కేణయెరు |
| | స్త్రీ. కేణయళు | | |
| | అమ. కేణందు / కేణను | | కేణయ |

(ఇదికాక భూత భూతేతర ప్రాతిపదికలకి -జి / (బ్రా)-రి (< *ఇజ్జి 'లేదు') చేరే రూపాలు కూడా ఉన్నాయి. దీని తరవాత ఉత్తమ పురుషైకవచన, ప్రథమపురుషామనుష్యైకవచనాలు తప్ప మిగిలిన వాటిలో పురుష ప్రత్యయాలు చేరతాయి : కల్తుజి / కల్తుదుజి 'నేను చదవలేదు', కల్పుజి 'నేను చదవడంలేదు' మొదలగునవి.

ii) వ్యతిరేకక్త్వార్థకం : బ్రాహ్మణ మాండలికంలో -అంతె, మిగిలిన మాండలికాలలో -అందె ధాతువుకి చేరుతుంది : బరంతె బరందె 'రాకుండా'.

(iii) వ్యతిరేకధాతుజ విశేషణం : బ్రాహ్మణ మాండలికంలో -అంత్-ఇ, మిగిలిన వాటిలో -అంద్ -ఇ : పోవంతి / పోవంది 'వెళ్ళని'.

**తెలుగు :**

(i) సమాపక క్రియలు : వ్యతిరేక ప్రత్యయం -అ-; దీర్ఘాచ్చుతో అంతమయ్యే క్రియల తరవాత ఇది లోపిస్తుంది: రాడు, లేడు, కాడు, తేడు మొ.

| | | | |
|---|---|---|---|
| 1. | చెప్పను | | చెప్పం |
| 2. | చెప్పవు | | చెప్పరు |
| 3. పు. | చెప్పడు | మ. | చెప్పరు |
| పురుషే. | చెప్పదు | అమ. | చెప్పవు |

ప్రాచీన భాషలో ఇది భూతకాలానికికూడా వర్తిస్తుంది. ప్రాచీన భాషలో భూతకాలార్థంలో తరచుగా భూతకాలికమైన అగుధాతు వన్ప్రయుక్తమవుతుంది: రాదయ్యెను మొ. తుమున్నర్థకానికి 'లేదు' చేరడంవల్లకూడా భూతకాలిక వ్యతిరేకం వ్యక్తమవుతుంది : రాలేదు. వర్తమాన కాలవ్యతిరేకానికి భావార్థకానికి 'లేదు' చేరుతుంది : వచ్చుట / రావటం లేదు.

(ii) వ్యతిరేకక్త్వార్థకం : -అక (దీర్ఘం తరవాత అకార లోపం) చెయ్యక, రాక, ఆధునిక భాషలో చెప్పకుండా మొ. వాటిలో అకుండా <అక + ఉండ (ఉండుధాతువు తుమున్నర్థకం) -అక రూపం సహాయక క్రియలముందూ (చెయ్యక తప్పదు), హేత్వర్థంలోనూ (ముందు తాగక రోగం తగ్గలేదు) రాక రాక మొదలైన ఆమ్రేడిత రూపాలలోనూ ఉంది.

(iii) వ్యతిరేక ధాతుజ విశేషణం : -అని : చెయ్యని, రాని.

(iv) వ్యతిరేకనామం : -అమి చూదమి. రామి; ఆధునిక భాషలో వ్యతిరేకక్త్వార్థకానికి పోవు భావార్థకం చేరుతుంది; చూడకపోవడం, రాకపోవడం.

**గోండి :**

(i) సమాపక క్రియలు: వ్యతిరేక ప్రత్యయం మధ్యమ పురుషలో -వ్-, మిగిలినచోట్ల -ఓ- (ఇది ప్రథమపురుష పురుష బహువచనంలో లోపిస్తుంది.)

తిన్ 'తిను'

| | | |
|---|---|---|
| 1. | తిన్నోవ్ | తిన్నోం |
| 2. | తిన్వీ | తిన్వీట్ |
| 3. పు. | తిన్నోర్ | తిన్నేర్ / తిన్నూర్ |
| పురుషే. | తిన్నో | తిన్నోజ్ |

కోయలో (హ) అహ, హఆ, హఅ నిర్మాణంగల ధాతువుల తరవాత -వో-, మిగిలిన ధాతువుల తరవాత -ఓ- (వీటిలో అచ్చు మధ్యమ పురుష ప్రత్యయాలముందు లోపిస్తుంది.) నార్వోను 'కడగను', నార్వీని '(నువ్వు) కడగవు' మొ.

భూతకాలంలో వ్యతిరేకానికి (i) ధాతువుకి మకి (న్) చేరుతుంది : తర్మకి(న్) '(క ర్త) తేలేదు', (ii) లేకపోతే సిల్ల్ అనే వ్యతిరేక క్రియా రూపాలు భూతధాతుజ విశేషణానికి చేరతాయి: వాచ్చిల్లోర్ 'వాడు రాలేదు' మొ.

(ii) వ్యతిరేకక్త్వార్థకం : -వాక్ (కోయ -అకుంట)సూఢ్ వాక్ / (కో.) ఊడకుంట 'చూడకుండా'.

(iii) వ్యతిరేకధాతుజ విశేషణం : కోయలో ధాతువుకి వ్యతిరేక ప్రత్యయం చేరుతుంది : ఊడో 'చూడని', ఉడ్వో 'దున్నని'.

కొండ :

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం -ʔ- (కంఠమూలీయస్పర్శం.)

కి- 'చేయు'

| | | |
|---|---|---|
| 1. | కిʔ ఎ | (అనుభయం) కిʔ ఎప్ |
| | | (ఉభయం) కిʔ ఎట్ |
| 2. | కిʔ ఇ | కిʔ ఇదెర్ |
| 3. పు. | కిʔ ఎన్ | కిʔ ఎర్ |
| పురుషే. | కిʔ ఎద్ | కిʔ ఉ |

(ii) భూతవ్యతిరేకం : దీని నిర్మాణం ధాతువు + ? (వ్యతిరేకం) + ఎత్/ఇత్/ఉత్ (భూతం) + పురుష ప్రత్యయం,

నెస్ 'తెలియు, చేయగలుగు'

| | | | |
|---|---|---|---|
| 1. | నెస్? ఎత | (అనుభయం) | నెస్? ఎతప్ |
| | | (ఉభయం) | నెస్? ఎతట్ |
| 2. | నెస్? ఇతి | | నెస్? ఇతిదెర్ |
| 3. పు. | నెస్? ఎతన్ | | నెస్? ఎతర్ |
| పురుషే. | నెస్? ఎతద్ | | నెస్? ఉతె |

(iii) వ్యతిరేకక్త్వార్థకం :- ? ఎండ: సి? ఎండ 'ఇవ్వకుండా'.

పెంగో :

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం -ఉ- హుడ్ 'చూచు'

| | | | |
|---|---|---|---|
| 1. | హుడుజ్ | (అనుభయం) | హుడుప్ |
| | | (ఉభయం) | హుడుస్ |
| 2. | హుడుయ్ | | హుడుదెర్ |
| 3. పు. | హుడున్ | | హుడుర్ |
| | | స్త్రీ. | హుడుక్ |
| పురుషే. | హుడుల్ | అమ. | హుడుజ్ |

(ii) భూతవ్యతిరేకం : ధాతువు + వ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు. ప్ర.

| | | | |
|---|---|---|---|
| 1. | హుడ్వతజ్ | (అనుభయం) | హుడ్వతప్ |
| | | (ఉభయం) | హుడ్వతస్ |
| 2. | హుడ్వతయ్ | | హుడ్వతదెర్ |
| 3. పు. | హుడ్వతన్ | | హుడ్వతర్ |
| | | స్త్రీ. | హుడ్వతిక్ |
| పురుషే. | హుడ్వతత్ | అమ. | హుడ్వితిజ్ |

(iii) వ్యతిరేకక్త్వార్థకం :- వదజ్ : తిన్వదజ్ 'తినకుండా'.

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం : ఈ భాషలో భూత కాలానికి ఒక రూపమూ భూతేతర కాలానికి వేరొక రూపమూ ఉన్నాయి. భూతేతర కాల రూపంలో వ్యతిరేక ప్రత్యయమైన -వ్- తరవాత విశేషణ ప్రత్యయమైన -ఇ ఉంటుంది. ఇన్వి 'అనని'.

భూతకాల రూపంలో వ్యతిరేక ప్రత్యయానికీ విశేషణ ప్రత్యయానికీ మధ్య భూత ప్రత్యయమైన -ఇత్- ఉంటుంది: నార్వితి 'ఖాళీ చేయని' (భూతార్థం).

మంద :

(i) భూతేతర వ్యతిరేకం: ప్రత్యయం -వ్-, -ఊ.

ట్రక్- 'కొట్టు'

| | | |
|---|---|---|
| 1. | ట్రకూ | ట్రకూజ్ |
| 2. | ట్రక్వి | ట్రక్వీర్ |
| 3. పు. | ట్రకూన్ | ట్రక్వీర్ |
| పురుషేతరం. | ట్రకూద్ | ట్రక్వీజ్ |

(ii) భూతవ్యతిరేకం : ధాతువు + వ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు. ప్ర.

హల్ - 'వెళ్లు'

| | |
|---|---|
| హల్వాతు | హల్వాతుజ్ |
| హల్వాతి | హల్వాతిర్ |
| హల్వాతున్ | హల్వాతిర్ |
| హల్వాఇ | హల్వాతిజ్ |

తూయి :

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం–?–.

తిన్ 'తిను'

| | | |
|---|---|---|
| 1. | తిన్ ? ఎను | (అనుభయం) తిన్ ? అము |
| | | (ఉభయం) తిన్ ? అసు |
| 2. | తిన్ ? అఇ | తిన్ ? ఎరు |
| 3. పు. | తిన్ ? ఎంజు | తిన్ ? ఎరు |
| పురుషే. | తిన్ ? ఎ | తిన్ ? ఒ |

(ii) భూతవ్యతిరేకం : ధాతువు + ? అ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు. ప్ర.

| | | | |
|---|---|---|---|
| 1. | తిన్ ? అతెను | (అనుభయం) తిన్ ? అతము | |
| | | (ఉభయం) తిన్ ? అతసు | |
| 2. | తిన్ ? అతి | తిన్ ? అతెరు | |
| 3. పు. | తిన్ ? అతెంజు | తిన్ ? అతెరు | |
| పురుషే. | తిన్ ? అతె | తిన్ ? అతు | |

(iii) వ్యతిరేక క్త్వార్థకం :- అరంగె / -అరఅ, సీఅరంగె / సీ అరఅ 'ఇవ్వకుండా'.

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం : భూతేతరకాలంలో ధాతువుకి - ? అ-న్-ఇ చేరుతుంది : తిన్ ? అని 'తినని', కో? అని 'కొయ్యని', భూత కాలంలో - ? అ-త్-ఇ చేరుతుంది : తిన్ ? అత, కో ? అతి.

**కువి :**

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం - ? ఒ - .

పాయ్ 'కొట్టు'

| | | |
|---|---|---|
| 1. | పాయ్ ? ఒ( | (అనుభయం) పాయ్ ? ఒమి |
| | | (ఉభయం) పాయ్ ? ఒహి |
| 2. | పాయ్ ? ఒది | పాయ్ ? ఒదెరి |
| 3. పు. | పాయ్ ? ఒసి | పాయ్ ? ఒరి |
| పురుషే. | పాయ్ ? ఎ | పాయ్ ? ఉ |

(ii) భూత వ్యతిరేకం : ధాతువు + ? అ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు. ప్ర.

| | | |
|---|---|---|
| 1. | పాయ్ ? అతె ? ఎ( | (అనుభయం) పాయ్ ? అతొమి |
| | | (ఉభయం) పాయ్ ? అతొ |
| 2. | పాయ్ ? అతి | పాయ్ ? అతెరి |
| 3. పు. | పాయె ? అతెసి | పాయ్ ? అతెరి |
| పురుషే. | పాయ్ ? అతె | పాయ్ ? అతు. |

(iii) వ్యతిరేకక్త్వార్థకం : ?అహనహ / -?అనహ, పాయ్ ?అహనహ 'కొట్టకుండా'.

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం : భూతేతరకాలంలో ధాతువుకి - ? అ చేరుతుంది : పాయ్ ? అ 'కొట్టని', భూతకాలంలో - ? అ-త్-ఇ చేరుతుంది : తోహ్ ? అతి 'చూపెట్టకుండా'.

(v) వ్యతిరేకనామం : - ?అతయి, పాయ్?అతయి 'కొట్టకపోవడం.'

**కోలామీ :**

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం -ఏ-.

సీ 'ఇచ్చు'

| | | |
|---|---|---|
| 1. | సీయేన్ | సీయేం |
| 2. | సీయేవ్ | సీయేర్ |
| 3. పు. | సీయేన్ | సీయేర్ |
| పురుషే. | సీయే(ద్) | సీయేవ్ |

(ii) భూత వ్యతిరేకం : ధాతువు + ఎ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు.ప్ర

| | | |
|---|---|---|
| 1. | సీయేతాన్ | సీయేతాం |
| 2. | సీయేతీవ్ | సీయేతీర్ |
| 3. పు. | సీయేతేన్ | సీయేతేర్ |
| పురుషే. | సీయేతీన్ | సీయేతేవ్ |

(iii) వ్యతిరేక క్త్వార్థకం : సెల్ (వార్థా) / -సెటయ్ (ఆదిలాబాద్) : తిన్ సెల్ / తిసెటయ్ 'తినకుండా.'

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం : ధాతువుకి -ఏ చేరుతుంది : తినే 'తినని,' వరే 'రాని.'

**నాయకీ (ఛాం.) :**

(i) భూతేతర వ్యతిరేకం : వ్యతిరేక ప్రత్యయం -ఎ-.

అఢ్ 'ఆడు'

| | | |
|---|---|---|
| 1. | అఢేన్ | అఢేం |
| 3. పు. | అఢేన్ | అఢేద్ |
| పురుషే. | అఢేద్ | అఢే. |

(ii) భూత వ్యతిరేకం : ధాతువు + ఎ (వ్యతిరేకం) + త్ (భూతం) + పు. ప్ర.

| | | |
|---|---|---|
| 1. | అఢ్‌ెతన్ | అఢ్‌ెతం |
| 2. | అఢ్‌ెతి | అఢ్‌ెతిర్ |
| 3. పు. | అఢ్‌ెతెన్ | అఢ్‌ెతెర్ |
| పురుషే. | అఢ్‌ెతున్ | అఢ్‌ెతె |

పర్జీ :

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం -అ-. ఈ భాషలో చాలా క్రియలలో పురుషప్రత్యయం తరవాత కూడా అకారం చేరుతుంది.

చూడ్ 'చూచు'

| | | |
|---|---|---|
| 1. | చూడన | చూడమ |
| 2. | చూడత | చూడర |
| 3. పు. | చూడద | చూడర |
| పురుషే. | చూడయ | చూడవ |

దీనికి భూతవ్యతిరేకార్థం కూడా కొన్నిచోట్ల ఉంది.

(ii) భూతవ్యతిరేకం : ఇది మూడు విధాలుగా ఉంది.

1. భూతేతర వ్యతిరేకం చివరి అకారానికి బదులు ఇకారం చేర్చడం : చూడని 'నేను చూడలేదు' మొ॥.

2. భూతకాల క్రియా రూపాలకి చివర వ్యతిరేకార్థమైన అకారం చేర్చడం : చూడెన్ 'చూశాను' చూడెన 'నేను చూడలేదు,' ఇటువంటి వ్యతిరేక రూపాలలో అన్ని క్రియలలో భూతప్రత్యయం లోపిస్తుంది. అఢ్‌నోర్ 'మీరు ఏడ్చేరు,' అఢ్‌ర 'మీరు ఏడవలేదు.'

3. అకార ప్రత్యయంతో ఉన్న క్త్వార్థకానికి మెన్ 'ఉండు' ధాతువు భూతకాల రూపాలు చేర్చడం: ఒలె చెన మెఁదిద్ 'వాడు ఇంటికి వెళ్ళ (వెళ్ళిఉండ) లేదు.'

(iii) వ్యతిరేకక్త్వార్థకం: -అక: చూడక 'చూడక', వెరక 'రాక.'

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం: -అ: చెన 'వెళ్ళని' చియ 'ఇయ్యని.'

గదబ (ఒల్లారి) :

(i) భూతేతర వ్యతిరేకం : ప్రత్యయం -అ- :

సూడ్ 'చూచు'

| | | |
|---|---|---|
| 1. | సూడన్ | సూడం |
| 2. | సూడట్ | సూడర్ |
| 3. పు. | సూడండ్ | సూడర్ |
| పురుషే. | సూడ | సూడవ్ |

(ii) భూతవ్యతిరేకం : భూతేతర వ్యతిరేక రూపాలకి చివర భూత ప్రత్యయమైన ఇకారం చేరి వీటికి అదే పురుష వచనాలలో ఉన్న మన్ 'ఉండు' ధాతువు భూతకాలిక రూపాలు చేరతాయి. ఈలని మటాన్ 'నేను పడలేదు', ఈలమి మటాం 'మేం పడలేదు', (కొణేకోర్ మాం). ఏందుటాన్ 'నేను ఆడ లేదు'; ఏందుటామ్ 'మేము ఆడలేదు', మొ; వీటిలో-ఉటా-ప్రత్యయం.

(iii) వ్యతిరేకక్త్వార్థకం : -అ. దీని చివర సాధారణంగా కెరిన్ చేరు తుంది. సూడకెరిన్ 'చూడకుండా.'

(iv) వ్యతిరేక ధాతుజ విశేషణం : -అ, పున 'తెలియని.'

కూడుఖ్ :

ఈ భాషలో ఏకశబ్ద నిర్మాణం గల వ్యతిరేక క్రియా రూపాలు లేవు. వ్యతిరేకతని సూచించడానికి మల్ / మాల్ / మల్? అ 'లేదు, కాదు' అనే శబ్దం ఉపయోగపడుతుంది:

మల్ కెరస్, మల్ క ఒస్ 'వాడు వెళ్ళలేదు, వెళ్ళడు.' మల్ 'లేకుండా ఉండు' అనే క్రియ భూత భవిష్యత్కాలాలలో ఉంది.

ఈస్ ఎంబస్ మల్యాస్ 'ఈయన మా తండ్రి కాదు.'

ఈర్ కుడ్ ఖర్ మల్యార్ 'వీళ్ళు కూడుఖ్ జాతివాళ్ళు కారు.'

మాల్తో :

ఇందులో కూడా ఏకశబ్ద నిర్మాణం గల వ్యతిరేక క్రియారూపాలు లేవు. వ్యతిరేకతని సూచించే పదం మల 'లేదు, కాదు,' ఆడెన్ మల 'నేను ఏరను,'

అదెం మల 'మేం ఏరం' మొ. మహాపాత్ర (1979: 167): (భూత వ్యతిరేకం) అంబ్లతన్ 'నేను వదలి పెట్టలేదు,' (వర్తమాన వ్య.) అంబొామల్తన్, (భవిష్యత్ వ్యతిరేకం) అంబ్లన్ (ఇది ఉత్తమ పురుషైకమువచన రూపాలు), వీటిలో మల్-అనే వ్యతిరేక ధాతువు రూపాలు ముఖ్యక్రియతో కలిపి కొన్ని మార్పులతో ఏక పదంగా అయ్యాయి.

బ్రాహుయీ :

(i) భూతేతర వ్యతిరేకం : వ్యతిరేక ప్రత్యయం -ప- (ఇందులో పకారం మొదట్లో భూతేతర కాలప్రత్యయం అయి ఉండాలి). అచ్చులముందూ ప్రథమ పురుషైక వచనంలోనూ దీనిలో ఆకారం లోపిస్తుంది.

తిఖ్ 'పెట్టు'

| | | |
|---|---|---|
| 1. | తిఖ్‌పర్ | తిఖ్‌పన్ |
| 2. | తిఖ్ పేస్ | తిఖ్ పేరె |
| 3. | తిఖ్‌ప్ | తిఖ్‌పస్ |

(ii) భూతవ్యతిరేకం : ఈ నిర్మాణంలో మాత్రం ప్రాచీన భూత ప్రాతిపదిక (లేక క్త్వార్థకం) నిలిచి ఉంది. ఇది ధాతువుకి భూతప్రత్యయమైన -త్- చేర్చడంవల్ల ఏర్పడుతుంది. (బ్రాహుయీలో -త్- భూతప్రత్యయం మరి ఎక్కడా లేదు). దీనికి అన్ 'ఉండు' అనే క్రియ భూతేతర వ్యతిరేక రూపాలు కొన్ని మార్పులతో చేరడంవల్ల భూతవ్యతిరేకం ఏర్పడుతుంది.

| | |
|---|---|
| 1. తిఖ్‌తవట్ | తిఖ్‌తవన్ |
| 2. తిఖ్‌తవేస్ | తిఖ్‌తవేరె |
| 3. తిఖ్‌తవ్ | తిఖ్‌తవస్ |

(ఈ తిఖ్‌తవట్ 'నేను పెట్టలేదు' <*తిఖ్‌త్ + అవట్.) విడిగా ఉన్నప్పుడు అన్- భూతేతర వ్యతిరేక రూపాలు :

| | |
|---|---|
| 1. అఫ్‌ఫట్ | అఫ్‌ఫన్ |
| 2. అఫ్‌ఫేస్ | అఫ్‌ఫేరె |
| 3. అఫ్‌ఫ్ (అక్) | అఫ్‌ఫస్ |

## తులనాత్మక చర్చ

కూడుఖ్ -మాల్తోలు తప్ప మిగిలిన దక్షిణ అన్ని భాషలలోనూ వ్యతిరేక ప్రత్యయంగల ఏకశబ్ద నిర్మాణం ఉంది. తెలుగు, గోండీ తప్ప మిగిలిన అన్ని మధ్యభాషలలోనూ భూతవ్యతిరేకానికి ఏకశబ్ద నిర్మాణం ఉంది. ఈ రెండూ మూలద్రావిడ భాషలో ఉండేవని చెప్పడానికి తగిన ఆధారాలు ఉన్నాయి.

తుళు తప్ప మిగిలిన దక్షిణ భాషలలో వ్యతిరేక ప్రత్యయమైన*-అ- ప్రథమ పురుషామనుష్యరూపాలలో మాత్రమే ఉంటుంది; మిగిలిన పురుష ప్రత్యయాల ముందు లోపసపదము (Zero Allomarph) ఉంటుంది. కాని తుళు, మధ్యభాషలు, బ్రాహూయిలలో *-అ- నించి వచ్చిన అకారం అన్ని పురుషవచనాలలోనూ ఉంటుంది. *-అ- అన్ని పురుషవచనాలలోనూ ఉండడం మూడు ఉపకుటుంబాలకి చెందిన భాషలలోనూ ఉంది కాబట్టి ఇదే మూలభాషలో పరిస్థితి అని చెప్పడం సమంజసం. తుళు తప్ప మిగిలిన దక్షిణ భాషల మూల భాషలో అంటే, మూల తమిళ - కన్నడంలో *-అ- ప్రత్యయం అమనుష్య రూపాలు తప్ప మిగిలిన రూపాలలో లోపించింది. దీనికి కారణం ఈ రూపాలలో *-అ- తరవాత అజాదియైన పురుష ప్రత్యయం ఉండడమే. అమనుష్య రూపాలలో మాత్రం పురుష ప్రత్యయం అజాది కాదు. కాబట్టి వాటిలో *-అ- మిగిలింది. తుళులో వ్యతిరేక ప్రత్యయం లోపించకుండా దానికీ అజాది పురుష ప్రత్యయాలకీ మధ్య యకార శ్రుతి వచ్చింది. కాబట్టి మూల దక్షిణ ద్రావిడంలో *-అ- ప్రత్యయం అన్ని పురుష ప్రత్యయాలముందూ ఉండేదనీ, అది తుళు తప్ప మిగిలిన భాషలలో అజాది ప్రత్యయాలముందు లోపించిందనీ చెప్పవచ్చు. పై విధంగా కాక తుళు తప్ప మిగిలిన దక్షిణ భాషలలో స్థితే మూల భాషలో ఉండేది అనుకుంటే మిగిలిన భాషలలో *-అ- సామ్యంవల్ల అమనుష్యరూపాల నించి అన్ని రూపాలకీ వ్యాపించిందని చెప్పాలి. ఈ రెండు వాదాలలో మొదటి వాదమే సమంజసమనీ యుక్తతరమనీ తోస్తుంది.

*-ఆ- : మూలభాషలో వ్యతిరేక ప్రత్యయం -ఆ-, దీని దీర్ఘత తమిళం - మలయాళం, కోత, తొదలలో మిగిలింది. మిగిలిన భాషలలో ఇది హ్రస్వంగా

మారింది. ఈ మార్పుకి కారణం ఇది అనాద్యక్షరంలో ఉండడమే. ఇటువంటి మార్పుకి ఉదా:

త. ఏమాఱు, కోత. ఏమార్-, తె. ఏమఱు.

త. మ. అరాయ్, క. అరయ్, తె. అరయు.

కోలామీ-నాయకీ -ఏ- *-ఆ-నించి వచ్చినదే. గోండీ-కువి శాఖలో వ్యతిరేక ప్రత్యయం *-వా- (కింద చూడండి).

కాల్డ్‌వెల్ వ్యతిరేక ప్రత్యయం ప్రశ్నార్థకమైన ఆ నించి వచ్చింది అనడం సరికాదు. అదేవిధంగా కిట్టెల్ దీనికీ తుమర్థకానికీ ముడిపెట్టడం కూడా సమర్థనీయం కాదు.

*-φ- (లోపం) : ఇది తమిళ - కన్నడ శాఖలో అమనుష్యేతర రూపాలలో ఉందని ఇంతకు మునుపే చెప్పబడింది. ఇది *-అ- ప్రత్యయ లోపరూపమేనని కాల్డ్‌వెల్ చేసిన ఊహ సమంజసమే అని తోస్తుంది. ఆయన కాలప్రత్యయాభావమే వ్యతిరేకార్థాన్ని సూచిస్తుందని చెప్పేరు : "The absence of signs of tense appears to contribute to the expression of the idea of negation; it may at least be said that it precludes the signification of the affirmative" (P.469)." లోపసహిత వ్యతిరేక రూపాలకి ప్రత్యేకమైన స్వరం ఉండేదని కొందరు పండితులు చేసిన ఊహ నిరాధారం.

*-వా : గోండీ-కువి శాఖలో, అంటే గోండీ, కొండ, పెంగో, (మండ), కూయి, కువిలలో వ్యతిరేక ప్రత్యయాల మూల రూపం *-వా-. ఇది గోండీలో -ఓ- గానూ, పెంగోలో -ఉ-గానూ, కువిలో ఒ గానూ మారింది. కొండ, కూయి, కువిలలో కంఠ మూలీయ స్పర్శం *ప్ నించి వచ్చింది. గోండీలో మధ్యమ పురుష రూపాలలో వకారం ఉండడమూ, కోయలో -వో- చాలా క్రియలలో ఉండడమూ, పెంగో భూతవ్యతిరేకంలో ప్రత్యయం -వ- అవడమూ గమనించ దగినవి.

ఈ శాఖలో మూ. ద్రా. *-ఆ-కి వకారం అధికంగా చేరింది. ఈ వకారం మొదట్లో భూతేతర ప్రత్యయం కావచ్చు. భూతవ్యతిరేక రూపాలలో కూడా ఇది ఉండడం సామ్యంవల్ల సంభవించి ఉండవచ్చు. బ్రాహుయిలో

వ్యతిరేక ప్రత్యయం -ప- అవడం కూడా ఈ సందర్భంలో స్మరించదగ్గది. అయితే బ్రాహుయీకి గోండీ - కువిలకి ఏమీ సన్నిహిత సంబంధం లేకపోవడం వల్ల ఈ పరిణామాలు సదృశపరిణామాలే కాని జన్మ సంబంధమున్న పరిణామాలు కావు.

**భూతవ్యతిరేకం** : తమిళం, కన్నడం, తెలుగులలో తుమర్థకానికి ఇల్లె ఇల్ల / లేదు చేర్చడంవల్ల ఇది సూచించబడుతుంది. మలయాళంలో ఈ నిర్మాణమే భవిష్యత్ వ్యతిరేకార్థకం. ఆ భాషలో భూతకాల సమాపక క్రియకి ఇల్ల చేర్చడంవల్ల భూతవ్యతిరేకం ఏర్పడుతుంది. ఈ నిర్మాణం పైభాషలలో ఏదో ఒకదానిలో మొదటపుట్టి తరవాత మిగిలినవాటిలోకి వ్యాపించి ఉండవచ్చు.

ప్రాచీన తమిళంలో క్త్వార్థకానికి ఇల్ - వ్యతిరేక క్రియా రూపాలు చేరడం ఉంది. ఇటువంటి నిర్మాణమే గోండీ. బ్రాహుయీలలోకూడా ఉంది.

మధ్యభాషలైన కొండ, పెంగొ, (మండ), కూయి, కువి, కోలామీ, నాయకీలలో ఏకశబ్ద నిర్మాణాలైన భూత వ్యతిరేక క్రియలు ఉన్నాయి. వాటి నిర్మాణం పై భాషలన్నిటిలోనూ ధాతువు - వ్యతిరేకం - భూతం - పు. ప్ర. ఇందులో భూతప్రత్యయాల మూలరూపం *-త్-. పర్జీ గదబలలో ఈ నిర్మాణం నశించి దీని స్థానంలో వేరొక రకం ఏకశబ్ద నిర్మాణాలు వచ్చాయి.

ఈ ఏకశబ్ద నిర్మాణం మూలమధ్యద్రావిడంలో ఉండేదని నిస్సందేహంగా చెప్పవచ్చు. తెలుగు, గోండీ. పర్జీ, గదబలలో ఇది లోపించింది. వ్యతిరేక క్రియలు ద్రావిడ భాషల ప్రత్యేకత కాబట్టి ఇది మూలద్రావిడంలోనే ఉండేదనీ దక్షిణోత్తరశాఖలలో లోపించిందనీ అనవచ్చు. ప్రాచీన మలయాళంలో ఏకశబ్ద నిర్మాణంగల భూత వ్యతిరేక రూపాలు ఉండడంవల్ల ఇది మూలద్రావిడభాషా కాలానికే చెందినదనడానికి చాలా అవకాశం ఉంది. ప్రాచీన మలయాళ రూపాలలో కూడా మధ్యభాషల భూత వ్యతిరేక రూపాలలో ఉన్న నిర్మాణమే ఉండడం గమనించదగ్గది. కాని మలయాళం నిర్మాణంలో భూతప్రత్యయం -ఒత్-, మధ్యభాషలలో (ఈ నిర్మాణంలో) *-త్-.

వ్యతిరేకక్త్వార్థకం : ప్రాచీన తమిళంలో ధాతువుకి వ్యతిరేక ప్రత్యయమైన- ఆ చేరడంవల్లే ఇది ఏర్పడింది. మూల భాషలోకూడా ఇటువంటి నిర్మాణమే ఉండి ఉండాలి. దక్షిణ భాషలలో (ప్రాచీన తమిళం తప్ప) దీని చివర *త్

ప్రతిరూపాలు చేరేయి; తుళులో ంత్ / ంద్ చేరేయి. ఈ దంత్యం భూత ప్రత్యయం కావచ్చు. ఈ క్రియారూపం భూతకాలంలో జరగని పనిని సూచి స్తుంది కాబట్టి ఇందులో భూతకాలిక ప్రత్యయం చేరడం సహజమే. దక్షిణ భాషలలో జరిగిన ఈ మార్పు వాటి సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది.

తెలుగు-అక. గోండీ-వాక్, కూయి-అరంగె, కువి-? అకి, పర్జీ-గదబ-అకలలో అ<*ఆ: దాని తరవాత కకారం కూడా భూతప్రత్యయమే అయి ఉండవచ్చు.

తమిళం-అమల్‌లో మల్ కూడుఖ్-మాల్త్రోలలో ఉన్న మల్ 'లేకుండా ఉండు' అనే క్రియే కావచ్చు. కోలామీ-సెల్ మూ.ద్రా. *చిల్ (DED 2106) అనే వ్యతిరేక క్రియ కావచ్చు.

వ్యతిరేక ధాతుజ విశేషణం : మూల ద్రావిడంలో ఇదికూడా వ్యతిరేక క్త్వార్థకంలా ధాతువుకి *-ఆ- ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడేది. ఈ నిర్మాణం దక్షిణ భాషలలో ప్రాచీన తమిళ మలయాళాలు, కోతలోనూ, మధ్య భాషలలో గోండీ, కువి, కోలామీ - నాయకీ - పర్జీ - గదబలలోనూ నిలిచి ఉంది.

మూలదక్షిణ ద్రావిడంలో ఈ రూపంలో కూడా దంత్యం అధికంగా చేరి దాని తరవాత విశేషణ ప్రత్యయం చేరింది. తమిళం, కోత, కన్నడాలలో ఇది *త్ ప్రతిరూపం మలయాళంలో *ంత్. దంత్యం లేని ప్రాచీన తమిళ రూపాలు అతి ప్రాచీనాలు అన్నమాట. ఈ దంత్యం భూతప్రత్యయమే. ఇందులో భూత ప్రత్యయం చేరడం వ్యతిరేకక్త్వార్థకంతో సామ్యంవల్ల జరిగి ఉండాలి.

తెలుగు -అనిలో అకారం వ్యతిరేకం, నకారం భూతేతర ప్రత్యయం, ఇ విశేషణ ప్రత్యయం. దక్షిణ భాషలలో పరిణామంతో పోలిస్తే తెలుగులో నకారం భూతప్రత్యయం అనిపిస్తుంది. కాని తెలుగుకి సన్నిహితమైన కూయిలో భూతేతర వ్యతిరేక ధాతుజ విశేషణంలో నకారం భూతేతర ప్రత్యయం కాబట్టి తెలుగులో కూడా ఇది భూతేతర ప్రత్యయమే అయి ఉండాలి.

మలయాళంలోనూ, పెంగొ - (మండ) - కూయి - కువిలలోనూ వ్యతి రేక ధాతుజ విశేషణాలు రెండేసి ఉన్నాయి. ఒకటి భూతకాలానికి సంబంధించి

నది, ఇంకొకటి భూతేతర కాలానికి సంబంధించినది. ఈ విషయం పెంగొ - మండ - కూయి - కువిల సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది. వీటికి దూరంగా ఉన్న మలయాళంలో కూడా ఈ భేదం ఉండడంవల్ల మూలభాషలో వ్యతిరేక ధాతుజ విశేషణాలు రెండు ఉండేవి అని చెప్పాలి. పై భాషలు తప్ప మిగిలిన భాషలలో భూతవ్యతిరేక ధాతుజ విశేషణం నశించి భూతేతర వ్యతిరేక ధాతుజ విశేషణమే అన్ని కాలాలలోను ఉపయోగంలో ఉంది.

ఈ రూపంలో విశేషణ ప్రత్యయాలు *అ, *ఇ ల నించి వచ్చినవి. *ఇ ప్రతిరూపాలు తుళు, తెలుగు (వ్యతిరేకంలో మాత్రం). కొండ - కువిలలో ఉన్నాయి. *అ ప్రతిరూపాలు మిగిలిన భాషలలో ఉన్నాయి. ఈ భేదం మూల భాషలో మాండలిక భేదం అయి ఉండవచ్చు.

వ్యతిరేక నామం : ప్రాచీనాంధ్రాలలో వ్యతిరేక ప్రత్యయం తరవాత *మై (త. మై, తె. మి) అనే కృత్ప్రత్యయం చేర్చడంవల్ల ఇది ఏర్పడుతుంది. త. అఱియామై, తె. ఎఱుఁగమి. ఇది తమిళం తెలుగులలో ఉండడంవల్ల ఇది మూలభాషకి చెందినదని నిర్ణయించాలి. మలయాళం, కువిలలో కూడా వేరు ప్రత్యయాలతో వ్యతిరేక నామాలు ఉన్నాయి.

వ్యతిరేక ధాతువులు : ద్రావిడ భాషలలో అస్తిత్వ వ్యతిరేకాన్నీ, ఏకత్వ వ్యతిరేకాన్నీ సూచించడానికి క్రియలు ఉన్నాయి. అస్తిత్వ వ్యతిరేకాన్ని సూచించేది మూ.ద్రా. *చిల్ (DED 2106). దీని ప్రతిరూపాలు అన్ని దక్షిణ భాషలలోనూ, కోలామీ - నాయకీ తప్ప మిగిలిన మధ్య భాషలలోనూ ఉన్నాయి.

ఏకత్వ వ్యతిరేకాన్ని సూచించేది మూ. ద్రా. *అల్- (DED 198). దీని ప్రతిరూపాలు అన్ని దక్షిణ భాషలలోనూ, బ్రాహుయీలోనూ ఉన్నాయి. మధ్య భాషలలో వీటికి అన్ని పురుష ప్రత్యయాలూ చేరతాయి.

కుడుఖ్ - మాల్తోలలో మల్- వ్యతిరేక క్రియ ఉంది.

తెలుగులో అగు ధాతువు వ్యతిరేక రూపాలు ఏకత్వ వ్యతిరేకాన్ని సూచిస్తాయి: కాఁడు, కాదు, మొ. గోండీలోకూడా ఆ-ధాతువు వ్యతిరేక రూపాలు ఈ అర్థంలో ఉన్నాయి: ఆయో 'కాదు', పెంగొలో ఆకయ్ అంటే 'కాదు' అని

అర్థం. పెంగొలో కా-ధాతువు 'ఒప్పుకొను' అనే అర్థంతో వ్యతిరేకంలో మాత్రమే ఉంది. కొండ కె-'ఒప్పుకొను' కూడా వ్యతిరేకంలో మాత్రమే ఉంది. ఈ గోండీ, పెంగొ, కొండ ధాతువులుకూడా తెలుగు అగు - (త. అకు, (DED 282)కి సంబంధించినవే.

కొండ ఆట్ - 'చేయగలుగు', కూడుఖ్ బల్ - 'తెలుసుకొను', పొల్ - 'చేయగలుగు' కూడా వ్యతిరేకంలో మాత్రమే ఉన్నాయి.

కోలామీ - నాయకీలలో వ్యతిరేక క్రియ తోత్-; ఇది మూ. ద్రా. *తోట్ట్ - 'చూపెట్టు' (DED 2942) నించి వచ్చింది. ఈ భాషలలో ఇది వ్యతిరేకంలో మాత్రమే ఉంది.

## 4, 5. పురుష ప్రత్యయాలు

ద్రావిడభాషా క్రియలలో పురుష ప్రత్యయాలు వాటికి సంబంధించిన సర్వనామాలని పోలి ఉంటాయి. కాబట్టి కాల్డ్‌వెలూ మరికొందరు పండితులూ మొదట్లో ద్రావిడభాషా క్రియలలో మలయాళంలోలాగా పురుషప్రత్యయాలు లేవనీ వాటికి సర్వనామాలు స్పష్టత కోసం తరవాత కాలంలో చేర్చబడ్డాయనీ ఊహించారు. ఇలా చేర్చబడిన సర్వనామాలే ఉచ్చారణ వేగంవల్ల పురుష ప్రత్యయాలుగా మారేయని వారి ఊహ. ఈ ఊహని మొదట వ్యక్తం చేసిన కాల్డ్‌వెలే ద్రావిడ క్రియలలో పురుషప్రత్యయాలు లేకుండా ఉండడం మూల ద్రావిడభాష మాండలికాలుగా విడిపోయిన కాలానికి చాలా ముందు కాలానికి చెందినదనీ అనాగరక భాషలలో సహితం పురుషప్రత్యయాలు ఉన్నాయనీ నిర్ణయించాడు. "The period when Dravidian verb was uninflected must have been long prior to the separation of the present tongue (i, e,, Proto - Dravidian) into dialects, in all which, even in the rudest, a system of inflexions has been developed" (1956 : 486).

కింద పట్టికలో వివిధ భాషలలో పురుష ప్రత్యయాలు ఇవ్వబడ్డాయి. తులనాత్మక చర్చలో ఒక్కొక్కదాని మూల రూపమూ దాని పరిణామాలూ చర్చించబడతాయి.

| భాష | ఉ. ఏ. వ | ఉ. బ. వ. (అనుభయం) | ఉ. బ. వ. (ఉభయం) | మ. ఏ. వ. | మ. బ. వ. |
|---|---|---|---|---|---|
| తమిళం | ఎన్‌,ఏన్‌,అన్‌, అల్ | ఏం,ఏం,అం,ఆం ఓం,ఉం | | ఇ,అయ్,ఆయ్ ఆయ్,ఆ | ఇర్, ఈర్(కళ్) ఈర్ |
| ప్రా. మలయాళం | ఏన్,ఆన్ | ఓం | | | |
| కోత | ఏ(న్) | ఏం | ఓ(ం) | ఈ | ఈమ్,ఈర్ |
| తొద | ఎన్,ఇన్,న్ | ఎం,ఇం,మ్ | ఉం | య్,ఇ | స్,శ్,ష్ |
| కొడగు | ఎ,ఇ | అ | | ఇయ | ఇర |
| కన్నడం | ఎను,ఎం,ఎ | ఎం,ఎవు | అం | (ప్రా.)అయ్,ఎ,ఇ, | ఇర్,ఇరి |
| తుళు | ఎ | అ | | అ | అరు, |
| తెలుగు | ను,ని | ము,మి | అము | (వు),(వి) | రు,రి |
| గోండి | ఓన్,ఊన్,న్,అ | ఓం,ఊం,మ్ | ఆట్ | ఈ | ఈట్ |
| కొండ | అ | అప్ | అట్ | ఇ,ఇద్(-అచ్చుముందు) | ఇందెర్, ఇదెర్ |
| పెంగో | అజ్ | అప్ | అస్ | అయ్ | అదెర్, ఇదెర్ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| మండ | అ, ఉ, ఇ | ఉజ్ | | ఇ | ఇర్ |
| కూయి | ఇ, ఎ, ఎను | అము | అసు | ఇ | ఎరు |
| కువి | ఇ(, ఎ(, (ని) | ఒమి / అమి | ఒ, బహి | ఇ | ఎరి |
| కోలామీ | ఉన్, అన్, న్ | ఉం, అం, మ్ | అం | ఇవ్, వ్ | ఇర్, ర్ |
| నాయకీ (ఛాందా) | ఉన్, అన్, న్ | ఉం, అం, మ్ | | ఇ | ఇర్ |
| పర్జీ | ఎన్ / ఒన్, అన్ | ఒం, అం, ఉం | (విధి) ఆర్<br>(భవి.) ఉముర్ | ఒత్, అత్, ఉత్ | ఒర్, ఆర్, ఉర్ |
| గదబ | ఎన్, ఒన్, అన్ | ఒం, అం, ఎం | | ఎట్, ఒట్, అట్ | ఎర్, ఒర్, అర్ |
| కూడుఖ్ | న్ | మ్ | అత్, త్ | అయ్, య్<br>(స్త్రీ) అఇ<br>(నపుం.) ఈ | ఆర్, ర్<br>(స్త్రీ) అఇ<br>(నపుం.) ఈ |
| మాల్తో | ఇన్, ఎన్, ఒన్ | ఇం, ఎం, ఒం | ఇత్, ఎత్, బత్ | (పుం.)నె,ఎ,ఎన్,ఒఎర్,ఒర్<br>(స్త్రీ & నపుం.) ని,<br>ఇ, ఎని | |
| బ్రాహుయీ | ఇవ్, ఏవ్, వ్, ర్ | ఇన్, న్ | | ఇస్, ఏస్, స్ | ఇరె, ఏరె, రె |

| భాష | ప్ర. పు. ఏ. వ. | ప్ర. స్త్రీ. ఏ. వ. | ప్ర. నపుం ఏ. వ. | మహత్ బ. వ. | అమహత్ బ. వ. |
|---|---|---|---|---|---|
| తమిళ | అన్, అన్ | అళ్ అళ్ | (అ) తు | అర్, అర్ (కళ్) | అ |
| ప్రా. మలయాళం | ఆన్ | ఆళ్ | అతు | ఆర్ | అ, అవ |
| కోత | ఆన్ | ఆళ్ | ద్ | ఆర్ | |
| తొద | త్, ఉ, చ్, క్ | | | | |
| కొడగు | ॥ అ, ఎతు | | | | |
| కన్నడం | అను, అం, ఒం, అ | అళ్, అఌ, అళ్, ఒళ్ | ఉదు, దు, దు, ఇతు, తు | ఆర్, అరు, అర్, ఒర్ | ఉవు, అవు |
| తుళు | ఎ | అఌ / అలు | ఇ, ఉ, ందు, ందు | ఎరు | అ |
| తెలుగు | ండు, ను | ది, దు, ను | | రు, రి | వు, వి, ను |
| గోండి | ఓల్, ఊల్, ల్<br>ఓర్, ఊర్, ర్ | ఆ, ఊ, φ | | ఓఢ్, ఉఢ్, ఢ్<br>ఏర్, ఈర్, ర్ | ఆజ్, ఊ,జ్ జ్ |
| కొండ | అన్, అన్ట్ (అచ్చుముందు) | అత్ / అద్ | | అర్ | ఎ |

| | | | | |
|---|---|---|---|---|
| పెంగో | అన్ | అత్ | అర్ | (స్త్రీ) ఇక్ (నపుం.) ఇజ్ |
| మండ | ఉన్ | ఇ, ఇన్, ందె | ఇర్ | ఇజ్ |
| కూయి | ఎంజు | ఎ | ఎరు | ఉ, ఒ |
| కువి | ఎసి | ఎ | ఎరి | ఉ |
| కోలామీ | అన్, ఎన్, న్ (అదిలా,)ంద్ | అ(ద్), (ద్), ఉన్, ఇన్ | అర్, ఎర్ | అవ్, ఎవ్ |
| నాయకీ (ఛాందా) | ఎన్, అన్, న్ | ద్, ఉన్, అన్ | అర్, ఎర్, ర్ | ఎ, అ |
| పర్జీ | ఎద్/ఒద్, అద్, ఇద్ | ఒ, అ, ఉ | ఎర్/ఒర్, అర్, ఇర్ | ఒవ్ |
| గదబ | ఎండ్, ఒండ్, అండ్ | ఎ, అ | ఎర్, ఒర్, అర్ | ఎవ్, అవ్ |
| కూడుఖ్ | అస్, స్ | అ, $\phi$ | అర్, ర్ | — |
| మాల్తో | అహ్, ఇహ్, ఎహ్ ఒహ్ | ఇఢ్, అఢ్, ఎఢ్, ఒఢ్ | ఎర్, అర్, ఒర్ | — |
| బ్రాహుయీ | ఎ, ఇక్, అక్ | | ఇర్, ఏర్, అస్, ఒ | |

## తులనాత్మక చర్చ

మలయాళంలో పురుష ప్రత్యయ లోపం : మలయాళంలో పురుష ప్రత్యయాలు లేకపోవడం ఒక ప్రత్యేకత. ఆధునిక మలయాళంలో దీనివల్ల అసమాపక సమాపక క్రియలమధ్య భేదం నశించింది. కాని వ్యావహారిక భాషలో ఉచ్చారణార్థకంగా క్త్వార్థకం చివర సంవృత అకారమూ (ə), సమాపక క్రియ చివర ఉకారమూ చేరడంవల్ల ఈ భేదం వ్యక్తమవుతుంది : **vann ə** 'వచ్చి', **vannu** 'వచ్చాను, మొ.' ప్రాచీన తమిళాంధ్రాలలో కూడా పురుష ప్రత్యయాలు లేని కొన్ని ప్రథమ పురుష సమాపక క్రియలు ఉన్నాయి. వీటి ఆధారంగా మూల భాషాక్రియలలో పురుష ప్రత్యయాలు ఉండేవి కావనీ, ఆ స్థితిని మలయాళం ఈనాటికీ నిలుపుకొందనీ కొందరు పండితులు వాదించారు. కాని ఎల్.వి. రామస్వామి అయ్యర్ (1936 : 52 - 62) మలయాళం చారిత్రకాధారాలు మూలంగా ఈ వాదాన్ని ఖండించి ఆ భాషలో ప్రాచీనకాలంలో పురుష ప్రత్యయాలు ఉండేవనీ అర్వాచీన కాలంలో అవి నశించాయనీ నిరూపించారు. దీనికి ఆయన చూపిన ఉపపత్తులు :

1. మలయాళం ప్రత్యేక భాషగా మధ్యకాల తమిళం నించి 10 వ శతాబ్ది ప్రాంతంలో మాత్రమే విడిపోయింది. అంతకు ముందు ఈ రెండు భాషలూ ఒకటిగానే ఉండేవి.

2. సాహిత్య గ్రంథాలలోనూ, శాసనాలలోనూ పురుష ప్రత్యయాలు లేని రూపాలు ప్రాచీన కాలంలో తక్కువగా ఉన్నా కాలక్రమంలో అటువంటివాటి సంఖ్య ఎక్కువయింది. (శాసనాలలో ఈ పరిణామం ఉందని చెప్పినవారు ఎ.సి. శేఖర్.) పురుష ప్రత్యయాలు ఉన్న రూపాలకంటె అవి లేనిరూపాలు కాలక్రమంగా ఎక్కువ అవడం భాషలో కాలక్రమంగా పురుష ప్రత్యయాలు లోపించడాన్ని సూచిస్తుంది.

3. లీలాతిలకం అనే 14 వ శతాబ్ది మలయాళం వ్యాకరణంలో పురుష ప్రత్యయాలున్న రూపాలు నిమ్నకులమాండలికాలలో ఉన్నట్టు సూచించబడింది. దీనివల్ల ఆ కాలంలో ఇంకా కొన్ని మాండలికాలలో పురుషప్రత్యయాలు మిగిలి ఉన్నట్లు తెలుస్తుంది.

4. అమినిదీవు, లక్కదీవులలో మహమ్మదీయుల మాండలికంలో నేటికి పురుషప్రత్యయాలు నశించకుండా ఉన్నాయి.

5. మలయాళం తప్ప మిగిలిన అన్ని ద్రావిడ భాషలలోనూ పురుష ప్రత్యయాలు ఇంచుమించు తుల్యరూపాలతో ఉన్నాయి.

**ఉత్తమపురుషైకవచనం *-ఎన్, *ఏన్ :**

ఇది బ్రాహుయీ తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ ఉంది. బ్రాహుయీ -ఇవ్, -వ్ ఆర్యభాషలనించి వచ్చినదని జూల్ బ్లాక్ అభిప్రాయం. పెంగో--అజ్ అ భాషలో ఉత్తమపురుష సర్వనామమైన ఆన్ / ఆనెజ్ రెండవ రూపం చివరనున్న -ఎజ్‌కి సంబంధించినది. కాని ఈ -ఎజ్ ఎలా వచ్చిందో తెలియదు.

ప్రాచీన తమిళంలో చారియై -అన్- తరవాత హ్రస్వాచ్చు గల పురుష ప్రత్యయాలే వస్తాయి. చారియై లేనిచోట్ల సాధారణంగా దీర్ఘాచ్చుగల రూపాలే ఉంటాయి. కాని ప్రాచీన భాషలో చారియై లేనిచోట్ల కూడా హ్రస్వాచ్చుగల ప్రత్యయాలు కొన్ని చోట్ల ఉన్నాయి: నిఱుప్పెన్ 'పెడతాను.' సంఘవాఙ్మయంలో -అన్ కూడా ఉంది : అఱికువన్ 'నేను ఎరుగుదును.' దీని రూపాంతరం -అల్ భవిష్యత్కాల క్రియలలో ఉంది.: వేంటువల్ 'అడుగుతాను.'

చాలా భాషలలో పురుషప్రత్యయాల అచ్చులు పదం చివర భాగంలో ఉండడంవల్ల సూత్రీకరణ సాధ్యంకాని విధంగా చాలా మార్పులు పొందేయి.

**ఉత్తమ పురుష బహువచనం (అనుభయం) *-ఏం, *-ఎం :**

దీని ప్రతిరూపాలు అన్ని భాషలలోనూ ఉన్నాయి.

**ఉత్తమపురుష బహువచనం (ఉభయం) :**

అనుభయార్థక ప్రత్యయంకంటె భిన్నమైన ఉభయార్థక ప్రత్యయం ఈ క్రింది భాషలలో మాత్రమే ఉంది : కోత - తొద, కన్నడం, తెలుగు, గోండీ - కొండ - పెంగొ - మండ - కూయి - కువి, పర్జీ, కుడుఖ్ - మాలో

కన్నడం, తెలుగులలో ఇది ఉభయ ప్రార్థనం (Hortative) లో మాత్రమే ఉంది. పర్జీలలో కూడా ఇది విధ్యర్థకాలలో మాత్రమే ఉంది; దీనికి చెందిన ప్రత్యయాలు భిన్న శాఖలలో భిన్నంగా ఉన్నాయి కాబట్టి దీని మూలరూపం నిర్ణయించడం దుస్సాధ్యం. కాని కోత -ఓం, తొద -ఉం, కన్నడం- -అం, తెలుగు -అము / -ఆం ఆధారంగా దీని మూలరూపం *అం / *ఆం అని పునర్నిర్మించవచ్చు.

గోండీ - కొండలలో *-అట్ ప్రతిరూపాలుండడం వీటి సాన్నిహిత్యాన్ని నిరూపిస్తుంది.

పెంగో - మండ - కూయి - కువి ప్రత్యయాల మూలరూపం *అస్.

కుడుఖ్ - మాల్తో ప్రత్యయాల మూలరూపం *-(అ)త్, దీనికి ఈ భాషలలో ఉభయార్థక సర్వనామమైన *నాం కి సంబంధమే లేదు. మిగిలిన భాషలలో ప్రత్యయాలు వాటికి సంబంధించిన సర్వనామాన్ని పోలి ఉంటాయి.

ఈ ప్రత్యయంలో భాషల మధ్యనున్న భేదం వల్ల ఈ ఉభయానుభయ భేదం క్రియలలో ఎక్కువ వ్యాప్తి చెందలేదని ఊహించవచ్చు. సర్వనామాలలో ప్రాచీనకాలం నించీ ఉన్న ఈ భేదం క్రియలలోకి భిన్న భాషా శాఖలలో కాలక్రమంగా వ్యాప్తిచెంది ఉండవచ్చు.

**మధ్యమ పురుషైక వచనం *అయ్, *-ఇ :**

తెలుగు, కోలామీ, నాయకీ, పర్జీ, గదబ, బ్రాహుయీలు తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ వీటి ప్రతిరూపాలు ఉన్నాయి. పర్జీలో -త్, గదబలో -ట్ ఉండటం వీటి ప్రత్యేకత. బ్రాహుయీ ప్రత్యయం ఆర్యభాషల నించి వచ్చినది.

తెలుగు -వు, -వి భూతభవిష్యత్కాలాల్లో వైభాషికం : వచ్చితి(వి), వత్తు(వు). సర్వనామమైన *నీ నివుగా మారిన తరవాత క్రియలో వు, వి చేరేయి. ఇవి వైభాషికం కావడం వీటి అర్వాచీనతని తెలుపుతుంది.

ప్రాచీన తమిళంలో -ఇ భవిష్యత్కాల ప్రత్యయమైన త్/త్ తరవాత మాత్రమే వస్తుంది; -ఆయ్ మిగిలినచోట్ల వస్తుంది. చారియై ఉంటే దీని హల్లు హ్రస్వమై ఇది ఐగా మారుతుంది.

**మధ్యమపురుష బహువచనం *-ఈర్ :**

గోండీ తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ దీని ప్రతిరూపాలు ఉన్నాయి. గోండీ - ఈట్ ఆ భాషలో సర్వనామమైన నిమ్మేట్/ఇమ్మట్‌కి సన్నిహిత మైనది. ఈ సర్వనామం మూ.ద్రా. *నీమ్ కి ఏట్/అట్ అనే కొత్త బహువచన ప్రత్యయం చేరి ఏర్పడ్డది. కోయమాండలికంలో -ఈరి మిగిలి ఉంది.

మూలభాషలో మధ్యమ పురుష బహువచన సర్వనామానికి *నీం, *నీర్ అని రెండు రూపాలు ఉన్నాయి. (చూ. పేజీ 241-42). వీటిలో *నీం ప్రాచీన తరమని ఇంతకుముందే చూశాము కాని *-ఈర్ ప్రత్యయం అర్వాచీనమైన *నీర్ కి సంబంధించినది. *నీం కి చెందిన *-ఈం కోత, వ్యావహారిక తమిళాలలో మాత్రమే ఉంది (వ్యా. త. వంతింకె < *వంతీంకళ్, లిఖితభాషారూపం వంతీర్‌కళ్). అతి ప్రాచీన కాలంలో మూలభాషలో *-ఈం ఉండేదనీ, *నీర్ వ్యాప్తిలోకి వచ్చాక *-ఈం కి బదులు *-ఈర్ వ్యాప్తిలోకి వచ్చిందనీ మనం ఊహించవచ్చు.

**ప్రథమపురుష :**

ప్రథమపురుషలో మనుష్య బహువచనానికి తప్ప మిగిలిన వాటికి మొదట్లో పురుషప్రత్యయాలు లేవు (పేజీ 190). కాబట్టి ప్రథమపురుషలో ఏకవచన పురుష ప్రత్యయాలూ, మనుష్యేతర బహువచన పురుషప్రత్యయమూ కొంత అర్వాచీన కాలంలో అర్థసందిగ్ధతని నివారించడానికి ఆయా సర్వనామ రూపాలు ఆధారంగా సృష్టించబడ్డాయని అనాలి.

**పురుషైకవచనం :**

దక్షిణశాఖలో ప్రత్యయం *-ఆన్, *అన్. మధ్యశాఖలో *అన్‌ట్; ఇది ఈ శాఖలో సర్వనామరూపమైన *అవన్‌ట్‌కు సన్నిహితం'

కూడుఖ్ -అస్, మాల్తో - అహ్ సర్వనామాలైన కూ. ఆస్. మా. ఆహ్‌లకు సన్నిహితాలు. గోండీ -ఓల్/-ఓర్ ఆ భాషలో సర్వనామమైన ఓల్/వోర్ కు సన్నిహితం.

ప్రతి భాషలోనూ లేక శాఖలోనూ సర్వనామం పొందిన మార్పులకు అనుగుణమైన మార్పు దానికి సంబంధించిన పురుష ప్రత్యయంలో కూడా జరగడం గమనించదగినది. దీనివల్ల పురుష ప్రత్యయాలు సర్వనామాల ప్రభావానికి లోనవుతాయి అనే విషయం స్పష్టమవుతుంది.

**స్త్రీలింగైక వచనం - అళ్, *-అళ్ :**

ఇది దక్షిణశాఖలో మాత్రమే ఉంది; ఈ ప్రత్యయం మొదట్లో *అళ్ 'స్త్రీ' అనే ప్రత్యేకపదం (చూ. పేజీ 188).

**మనుష్య బహువచనం *-అర్ :**

లింగభేదం నశించిన తొద తప్ప మిగిలిన అన్ని భాషలలోనూ (బ్రాహుయీతో సహా) దీని ప్రతిరూపాలు ఉన్నాయి.

తెలుగు తప్ప మిగిలిన అన్ని మధ్యభాషలలో ఈ ప్రత్యయం పురుష బహువచన సూచకమే అయినా కర్తృపదబంధం (Subject Noun Phrase) లో స్త్రీ పురుష వాచకపదాలు కలిసి ఉన్నప్పుడు కూడా అఖ్యాత పద బంధంలో ఈ ప్రత్యయంతో ఉన్న క్రియరూపమే ఉంటుంది. దీనికి ఉదాహరణలు:

పర్జీ : కూయెద్ ఏరొడ్ ఓర్ ఎకె వెర్రర్‌గె 'వాడు పిలిచినప్పుడు వాళ్ళు (వాడి అన్నలూ వారి భార్యలూ) వచ్చారు.'

గోండి : వెడ్డీల్ వెయ్‌లో వేర్నీ తెరీసీ సూడ్ లే లా ణ్తేర్ 'ముసలివాడూ ముసలిదీ మూతతీసి చూశారు.'

దీనివల్ల ఈ శాఖలోకూడా ప్రాచీనకాలంలో ఈ ప్రత్యయం మనుష్య బహువచన సూచకమే అని తెలుస్తుంది.

ప్రాచీన తమిళంలో భవిష్యత్కాల ప్రత్యయం తరవాత -అర్, -ఆర్ కి బదులు వైభాషికంగా -అ కూడా ఉంటుంది: ఎన్పప '(వాళ్ళు) అంటారు.'

**పురుషేతరైక వచనం / అమనుష్యైక వచనం *-(అ)త్ :**

దీని ప్రతిరూపాలు అన్ని దక్షిణశాఖా భాషలలోనూ, తెలుగు, కొండ, పెంగొ, మండ, కోలామీ, నాయకీ (ఛాందా), కూడుఖ్ - మాల్తోలలోనూ ఉన్నాయి. ఇది దీనికి సంబంధించిన సర్వనామమైన *అత్‌కి చాలా సన్నిహితం.

**అమనుష్య బహువచనం (పురుషేతర బహువచనం) *-అవ్ :**

మూలద్రావిడంలో అమనుష్య బహువచనం తెలుగుతప్ప మిగిలిన మధ్య భాషలలో పురుషేతర బహువచనంగా మారింది. మిగిలిన భాషలలో దీని అర్థంలో మార్పులేదు.

ప్రాచీన తమిళ మలయాళాలలోనూ, తుళులోనూ దీనికి ప్రత్యయం -అ. ప్రాచీన తమిళం తోన్ఱువ (అవి) కనబడతాయి. తుళంకిన్న '(అవి) కదిలేయి', *-అవ్ వకారలోపం వల్ల -అగా మారిందని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి.

కన్నడం, తెలుగు, కోలామీ, పర్జి, గదబలలో ప్రత్యయంలో వకారం ఉంది. కూయి - కువిలో పశ్చిమాచ్చులు కూడా *-అవ్ నించి వచ్చినవి కావచ్చు. ప్రత్యయమైన *-అవ్‌కీ సర్వనామమైన *అవ్/అవయ్‌కీ సన్నిహిత సంబంధం ఉంది.

గోండీ - అజ్, పెంగొ - ఇజ్ అజంత నామాలలో అమనుష్య బహు వచన ప్రత్యయమైన జ్ కి సంబంధించినవి. ఇది సామ్యం వల్ల క్రియకి చేరింది. పెంగొలో బహువచనంలో స్త్రీలింగంలో -ఇక్, అమనుష్య లింగంలో -ఇజ్ ప్రత్యయాలు ఉన్నాయి; పెంగొకి సన్నిహితమైన భాషలలో క్రియారూపాలలో ఇటువంటి భేదం లేదు (చూ. పేజీ 183).

వ్యావహారిక తమిళం, కూడుఖ్ - మాల్తోలలో అమనుష్య బహువచనానికి వేరే ప్రత్యయం లేదు. ఏకవచనరూపాలే బహువచనానికికూడా వాడబడతాయి. ఈ పరిస్థితి మొదట్లో అమనుష్య బహువచన ప్రత్యయం వైకల్పికం అనే సత్యాన్ని నిరూపిస్తుంది.

## 4. 6. తుమర్థక ప్రత్యయాలు

తుమర్థకం శబ్దనిర్మాణంలో క్లిష్టత లేకపోయినా వాక్య నిర్మాణంలో అది నానావిధాలుగా పనిచేస్తుంది.

**తమిళం :**

ప్రత్యయం - అ; దీనిముందు గురుక్రియలలో ప్రాచీన భాషలో ప్ప్, అర్వాచీన భాషలో క్క్ చేరతాయి, చెయ్య 'చేయడానికి', మఱప్ప / మఱక్క 'మరచిపోవడానికి.'

ప్రాచీనభాషలో -ఇయ(ర్), -మార్, -వాన్ (-ప్పాన్), -పాక్కు కూడా ఉన్నాయి : కాణియ(ర్) 'చూడడానికి' కాణ్మార్ 'చూడడానికి', కొళ్వాన్ 'తీసుకొందుకు', పటుపాక్కు 'బాధపడడానికి'.

**మలయాళం :**

ప్రత్యయం - అ (దీనిముందు గురుక్రియలలో క్క్ ఉంటుంది). ప్రాచీన భాషలో ఇదికాక -వాన్ (-ప్పాన్, -మాన్) కూడా ఉంది. ఆదునిక భాషలో -ఆన్ (<*వాన్) మాత్రమే ఉంది.

చెయ్యాన్ కళియుక ఇల్ల 'చెయ్యడం కుదరదు'. ఆధునిక భాషలో -ఎ (<*అ) ప్రత్యయరూపాలు కొన్ని సామెతలలోనూ, సహాయక క్రియల ముందూ, విభక్త్యర్థకాలుగానూ మాత్రమే ఉన్నాయి : ఇరిక్కె 'ఉండగా', ఏఱె/ వళరె 'ఎక్కువ'.

-ఉక ప్రత్యయరూపాలు తుమర్థకాలుగానూ, ప్రార్థనార్థకాలు (Polite Imperatives) గానూకూడా ఉపయోగిస్తాయి : వరుక 'రావడానికి, రండి'.

**కోత :**

ప్రత్యయం -ల్ (క్) (<*అల్ + *క్) (చతుర్థీ ప్రత్యయం) నోడ్ల్క్ ఇలా 'చూడను, చూడం' మొ.

**కన్నడం :**

ప్రత్యయాలు -అ, -అల్ (ఆధునికం -అలు), -ఎ. అల్‌కి చతుర్థీ ప్రత్యయం -కె (ఆధునిక భాషలో -ఇకె) వైభాషికంగా చేరుతుంది. -ఎ ప్రాచీన భాషలో మాత్రమే ఉంది. బర, బరె, బరల్(కె), బరలికె 'రావడానికి'.

**తుళు :**

ప్రత్యయం (బ్రాహ్మణ మాండలికం) -అరె, ఇతర మాండలికాలలో -ఎరె, -అర : తిన్నరె/ తిన్నెరె 'తినడానికి.'

**తెలుగు :**

ప్రత్యయం -అన్, చేయన్, చెప్పన్. ఆధునిక భాషలో దీని చివరి నకారం కొన్ని నిపాతాల (Clitics) ముందు మాత్రమే మిగిలి, మిగిలినచోట్ల లోపించింది: చెప్పనా?, చెప్పనే / చెప్పేలేదు, అన్నం తినాలేదు పెట్టాలేదు.

ఆధునిక భాషలో ఈ రూపం కొన్ని సహాయక క్రియల ముందూ, గా, గానేలముందూ మాత్రమే మిగిలింది : చెప్పకూడదు, చెప్పగలను, చెప్పలేను, చెప్పవచ్చు, చెప్పగా, చెప్పగానే మొ. మిగిలినచోట్ల దీని స్థానంలో కృదంతాలు వాడుకలో ఉన్నాయి : (ప్రా.) చూడఁబోయితిని, (ఆ.) చూడడానికి వెళ్ళాను.

**గోండీ :**

ప్రత్యయం -ఆ, -లే (-నేన్) తిండా, తిండ్‌లే, తిండ్ నేన్ 'తినడానికి'. నన్నా వెహా పరాంతోన్ 'నేను చెప్పగలను'.

**కొండ :**

ప్రత్యయం -తెజ్, దెజ్. -తెజ్ సాధారణంగా శ్వాసస్పర్శాలతో అంతమయ్యే ధాతువుల తరవాతా, హ్రస్వాచ్పూర్వక ర, ఢలతో అంతమయ్యే వాటి తరవాతా, అజంతాలైన ఏకాచ్క-ద్వ్యచ్క ధాతువుల తరవాత వస్తుంది. -దెజ్ మిగిలినవాటి తరవాత వస్తుంది.

ఈ భాషలో తుమర్థకం కృదంతంగానూ, విధ్యర్థకంగానూ కూడా పని చేస్తుంది; నిక్‌తెజ్ 'లేపడం, లేపడానికి, లేపాలి.' సీదెజ్ 'ఇవ్వడం, ఇవ్వడానికి, ఇవ్వాలి.'

అస్తెజ్ 'పట్టుకోవడం', తతెజ్ "తేవడం', కెరతెజ్ 'కుయ్యడం', పిరితెజ్ 'పెరగడం', సీదెజ్ 'ఇవ్వడం', కొయ్‌దెజ్ 'కొయ్యడం', ఇన్తెజ్ 'అనడం', నిన్‌తెజ్ 'అనడం', నిన్‌తెజ్ 'నిలబడడం' (నిల్-), ఉండెజ్ 'తాగడం', కొండెజ్ 'కొనడం' (కొల్ < *కొళ్)

**పెంగొ :**

ప్రత్యయం -తెజ్, -దెజ్ : కూక్‌తెజ్ 'పిలవడం, పిలవడానికి', తూబ్‌దెజ్ 'ఊదడం', ఉండెజ్ 'తాగడం', తింజెజ్ 'తినడం'.

ద్విరుక్తిలో తుమర్థక ప్రత్యయం -ఉ: పంజు పంజు '(పొట్ట) నిండగా నిండగా'.

మండలో ప్రత్యయం -తెగ్, -దెగ్.

**కూయి :**

ప్రత్యయం -అ, -ప, -వ, బ : పంద 'పంపడానికి', వేప 'కొట్టడానికి' సీవ 'ఇవ్వడానికి', ఉణ్బ 'తాగడానికి'. ఇది కృదంతంగా కూడా ఉపయోగిస్తుంది: ఢూవ 'దున్నడం దున్నడానికి' మొ.

-ఒండిప్రత్యయం కూడా ఉంది : పాగొండి 'దెబ్బలాడడానికి'.

**కువి :**

ప్రత్యయాలు -అలి (రూపాంతరాలు సలి, చలి, జలి, హలి), -నయి (-ఇనయి) : పాయలి / పాయినయి 'కొట్టడానికి', హీయలి / హీనయి 'ఇవ్వడానికి', తోస్సలి/తోహ్‌నయి 'చూపెట్టడానికి', వెంజలి/వెనయి 'అడగడానికి', వెచలి / వెనయి 'కొట్టడానికి'.

**కోలామీ :**

ప్రత్యయం -ఎజ్(గ్) : కొరుం(గ్) 'తేవడానికి'.

ఇది ఉభయప్రార్థనంలో కూడా ఉపయోగిస్తుంది : నేండ్ తినెం (గ్) 'మనం తిందాం'.

**నాయకి (ఛాందా) :**

ప్రత్యయం -ఎన్ : తినెన్ 'తినడానికి', కత్కెన్ 'కొయ్యడానికి'. ఇది కృదంతంగా కూడా ఉపయోగపడుతుంది : తినెన్, ఉనెన్ 'తినడమూ, తాగడమూ'.

**పర్జీ :**

వాయవ్యమాండలికంలో ప్రత్యయం -ఉ, దక్షిణ మాండలికంలో -ఉజ్, ప్/త్ లు చివరగల ధాతువులకి వాయవ్యమాండలికంలో ప్/త్ ల స్థానంలో -(ఉ)క్ చేరుతుంది; దక్షిణ మాండలికంలో పాంతరూపానికి -ఉజ్ చేరుతుంది: (వా.) కొయు 'కొయ్యడానికి', ఎంద్రు 'తేవడానికి', నిలుక్ 'నిలబడడానికి' (నిల్ప్/నిల్త్-); (ద.) తినుజ్ 'తినడానికి', మేయుజ్ 'మెయ్యడానికి', కడ్పుజ్ 'దాటడానికి' (కడ్ప్-/కడ్త్-).

**(గదబఒల్లారీ) :**

ప్రత్యయం -ఉజ్ (-ఇజ్), -ఉ పర్జీలోలాగా ప్/త్ చివర గల ధాతువులకి ప్/త్ ల స్థానంలో క్ చేరుతుంది; సూడ్కుజ్ 'కాపలా కాయడానికి', పొకు 'మాట్లాడడానికి', (కొండేకోర్ మాం): -ఇన్, -ఉన్: ఇనిన్ 'అనడానికి', కుయున్- 'కొయ్యడానికి'.

**కూడుఖ్ :**

ప్రత్యయం -ఆ (ఆర్యభాషలనించి వచ్చిన -నా కూడా ఉంది): ఎసా/ఎస్నా 'పగలగొట్టడానికి, పగలగొట్టడం.'

**మాల్తో :**

ప్రత్యయం -ఒతి: ఏకొతి 'వెళ్ళడానికి.'

బ్రాహుయి :

-ఇంగ్ (-ఏంగ్) ప్రత్యయ సహిత రూపాలు తుమర్థకాలుగానూ, కృదంతాలుగానూ ఉపయోగిస్తాయి: బినింగ్ 'వినడం, వినడానికి', తినింగ్ 'ఇవ్వడం, ఇవ్వడానికి', అడేంగ్ 'చిక్కుపడడం, చిక్కుపడడానికి'.

## తులనాత్మక చర్చ

మూలభాషలో తుమర్థక ప్రత్యయం * -అ ని పునర్నిర్మించవచ్చు, ఇది తమిళం, (ప్రాచీన) మలయాళం, కన్నడం, తెలుగు, గోండీ, కూయి, కూడుఖ్ లలో మిగిలి ఉంది.

కన్నడంలో -అ -అల్(కె)తో స్వేచ్ఛాప్రవృత్తి (Free Variation)లో ఉంది -అల్ కృత్ప్రత్యయం. కాల్డ్‌వెల్ ఈ రెండూ జన్మ సంబంధం గలవని ఊహించారు. కాని చాలా భాషలలో తుమర్థకం ఉండే అన్ని నిర్మాణాలలోనూ దాని బదులు కృదంతాన్ని ఉపయోగించడం సాధ్యంకాదు. కాబట్టి ఈ రెండూ మొదటినుంచీ భిన్న ప్రత్యయాలు అయి ఉండాలి.

తెలుగు -అన్ లో నకారం అధికంగా ఉంది. రామస్వామి అయ్యర్ ఇది అల్ నించి వచ్చి ఉంటుందనీ పదాంతంలో లకారం నకారంగా మారడం ద్రావిడ భాషలలో సహజమేననీ అన్నారు. కాని వాక్య నిర్మాణంలో తుమర్థకానికి కృదంతానికీ ప్రవృత్తిలో కొన్ని భేదాలు ఉండడంవల్ల తెలుగు -అన్ మిగిలిన భాషలలో -అ కి చెందినదని చెప్పడమే సమంజసమని తోస్తుంది. దీని చివరి నకారం చతుర్థీ విభక్తి ప్రత్యయంలో నకారంలా తరవాత చేరింది కావచ్చు. ఇది మొదట్లో సముచ్చయార్థకంగాని శ్రుతిగాని అయి ఉంటుంది.

కూయి తుమర్థక నిర్మాణం తులనాత్మక చర్చకి బాగా ఉపయోగిస్తుంది. ఈ భాషలో చాలా క్రియలలో ఆకారంముందు ఓష్ఠ్యహల్లు (ప, బ, వ) ఉంటుంది. సంఘవాఙ్మయంలో గురు క్రియలలో ఆకారం ముందు ప్ప్ ఉంటుంది. ఈ కూయి క్రియలలో చాలా తమిళంలో గురుక్రియలకి సంబంధించినవి. పర్జీ వాయవ్య మాండలికంలో ప్/త్ చివరగల క్రియల తుమర్థక రూపంలో

వాటి బదులు క్ ఉంటుంది. వీటిలో చాలా తమిళంలో గురు క్రియలకి సంబంధించినవి. ప. కాక్ 'ఎదురుచూడడానికి' త. కాక్క-, ప. పూక్ 'పుయ్యడానికి' త. పూక్క-, ప్రాచీన తమిళ గురు క్రియల తుమర్థకరూపాలలో అకారం ముందు ప్ప్/క్క్- రెండూ ఉన్నాయి. వీటిలో మొదటిది కూయిలో కూడా ఉంది, రెండోది పర్జీలో కూడా ఉంది. పర్జీలో ఈశాన్యేతర మాండలికాలలో క కారం స్థానంలో ప కారం ఉంది. కాబట్టి గురుక్రియలలో మూలభాషలో పకార కకారాలు (తుమర్థకంలో) మాండలిక భేదాలు అయి ఉండవచ్చు.

కొండ పెంగోలలో తుమర్థకాలకి చాలా సాదృశ్యం ఉంది.

మూల కోలామీ - పర్జీలో తుమర్థక ప్రత్యయం *ఎంక్ / *ఉంక్ అని పునర్నిర్మించవచ్చు. ఇది చతుర్థీ ప్రత్యయం అయి ఉండవచ్చు. తుమర్థకానికి బదులు చతుర్థీ ప్రత్యయంతో ఉన్న కృదంతాన్ని వాడడం చాలా భాషలలో ఉన్నదే. ఇక్కడ చతుర్థీ ప్రత్యయం ముందు కృత్ ప్రత్యయం లోపం అని అనుకోవాలి.

**వాక్యనిర్మాణంలో తుమర్థక ప్రయోగం :**

(i) తుమర్థక ప్రధానార్థం "ప్రయోజనం." ఈ అర్థంలో తుమర్థకానికి బదులు చతుర్థీ విభక్తితో ఉన్న కృదంతాన్నికూడా వాడవచ్చు.

త. నాన్ **చాప్పిట** / చాప్పిటువతఱ్క్క- వంతేన్. 'నేను తినడానికి వచ్చాను'.

మ. ఞాన్ **ఉణ్ణాన్** వన్ను. నేను తినడానికి వచ్చాను'.

క. అవరు **నోడల్ / నోడలిక్కె** బందరు. 'ఆయన చూడడానికి వచ్చారు'.

తు. ఆరు ఎన్నను **తూయర** బత్తెరు. 'ఆయన చూడడానికి వచ్చారు'.

తె. వారిచ్చటనుండి యీ క్షణమ యేగిరి కానకుఁబండ్లు **తేరన్** (భారతం, ఆది).

గోం. వోర్ కుహిత్క్ ఏర్ **తర్లే** సొత్తోర్. 'వాడు నీళ్లు తేవడానికి **నూతికి వెళ్ళాడు**'.

పెంగొ. మర్ జొపి పుయ్ ఎక్జెజ్ దుమ్తత్. 'అది పువ్వులు కొయ్య దానికి చెట్టు ఎక్కింది'.

కొండ. దెడ్క తెతెజ్ నెస్ ?ఎత. 'తలుపు తియ్యడం నాకు తెలియదు'.

(ii) దీని ఇంకొక అర్థం "కారణం".

త. మళై పెయ్య పెయ్పతాల్ కుళం నిఱైతతు.

'వాన కురవడంవల్ల చెరువు నిండింది'.

ప్రా. క. మళె బరలు కెఱె తుంబితు. ' ,,

ప్రా. తె. వాన కురియఁ బంటలు పండును.

(iii) దీనికున్న ఇంకొక అర్థం "ఫలితం".

త. కుళం నిఱైయ మళై పెయ్తతు.

'చెరువు నిండేటట్టు వాన కురిసింది.'

మ. కుళం నిఱయాన్ మళ పెయ్తు. ' ,,

ప్రా. తె. చెఱువు నిండన్ వాన కురిసెను.

తెలుగులో ఉండనిచ్చు, పడవైచు/వేయు, పగులగొట్టు, పండ్లూడదన్ను, చావంజేయు, తలద్రెవ్వనేయు మొదలైన పదబంధాలలో తుమర్థకానికి ఈ అర్థమే ఉంది.

(iv) దీని ఇంకొక అర్థం "భావలక్షణం" (చూ. తుమర్థభావలక్షణంబు లందు నుఱియగు, బాలవ్యా, క్రియా. సూ. 40; భావలక్షణం అంటే ప్రధాన వాక్యంలో క్రియ జరిగిన కాలాన్ని సూచించే క్రియ).

త. అవన్ వర నాన్ పోనేన్, 'వాడు వస్తూ ఉండగా నేను వెళ్ళాను.'

ప్రా. క. గాయకం పాడె దేవం మెచ్చిదం. 'గాయకుడు పాడుతూ ఉండగా దేవుడు మెచ్చుకొన్నాడు.'

క. అవను బరలు నాను హోదె. 'వాడు వస్తూఉండగా నేను వెళ్ళాను.'

ప్రా.తె. ననుఁ బంకజనాభ యొకండు.... ఈ యేవురు **చూడఁగా** సభకు నీడ్చెన్ (భారతం, ఉద్యోగ ప.)

నీవని **నొవ్వ** నొండువలను చనుట (భారతం, ద్రోణ ప.)

**పెంగొ. ఆన్ నిండెంగె కొజు క్రైతత్, 'నేను లేస్తూ ఉండగా కోడి కూసింది.'**

బ్రాహుయి. **ఒప్‌తా తవార్ కన్నింగ్** ననా ఉరానా పేహింగ్. **'వాళ్లు అరవగానే మేం ఇంట్లోకి వెళ్ళాం'.**

ఆధునిక తెలుగులో ఈ అర్థంలో తమర్థకానికి -గా, -గానే నిత్యంగా చేరతాయి : తినగా తినగా, తినగానే.

భావలక్షణార్థంలో పౌనఃపున్యాన్ని సూచించడానికి తుమర్థకం ద్విరుక్తమవుతుంది (ఇది కన్నడం, తుళులలో మాత్రం లేదు).

త. నాన్ **చొల్లచ్చొల్ల** అవన్ కేట్కవిల్లై
'నేను ఎంత చెప్పినా వాడు వినలేదు'.

ప్రా. తె. **తినఁగ తినఁగ** వేము తీయనగును.
నీవలని వైరము కీడని **చెప్పఁ జెప్ప**
నీ కౌరవరాజు మానఁడు (భారతం, భీష్మ ప.)

అ. తె. అడగగా అడగగా వాడు డబ్బు ఇచ్చాడు.

(v) తుమర్థకం బాలా భాషలలో ఆశీరర్థం (శాపం)లో ఉంది.

ప్రా.త. ఇఱీఇయర్ ఎన్నుయిర్ ' నా జీవితం నశించుగాక!'

మ. రాజావు నీణాళ్ వాళ్క 'రాజు వర్ధిల్లుగాక!'

క. నిన్నమనె హాళాగ / హాళాగలి. 'నీ ఇల్లు పాడుపడ!'

తె. నీ కడుపుకాల!, మొహం మండ! నిన్ను తగలబెట్ట!

(vi) చాలా భాషలలో తుమర్థకం కృదంతనామంగా పనిచేస్తుంది. కోలామీలో తుమర్థకం ఉభయప్రార్థనంలో ఉంది. అదేవిధంగా కొండలో ఇది

కృదంతంగానూ, విధ్యర్థకంగానూ కూడా పనిచేస్తుంది (ఉదాహరణలకి పైన చూడండి). కూయి తుమర్థకం కృదంతంగా కూడా పనిచేస్తుంది. కాబట్టి ఇది నామవిశేషణంగా కూడా కొన్ని పదబంధాలలో ఉంది. పున్నగటరి 'తెలివైన ఆడది,' ఉణ్బ సిద్రు 'తాగేనీళ్ళు.'

బ్రాహుయిాలో కూడా తుమర్థకం నామంగా పనిచెయ్యడం వల్ల దానికి అన్ని విభక్తి ప్రత్యయాలూ చేరతాయి.

దుష్మన్నా **ఖల్లింగ్** జ్యాన్ ఎ. 'శత్రువుని చంపడం సంతోషకరం.'

ననా **తూలింగ్నా** జాగ దాద్ ఎ. 'ఇది మేం కూర్చొనే చోటు.'

**4.7. విధ్యాద్యర్థక ప్రత్యయాలు :**

**తమిళం :**

(i) విధిలో ఏకవచనంలో ప్రత్యయం లేదు. కేళ్ 'విను, అడుగు,' చొల్ 'చెప్పు'. ప్రాచీన భాషలో ఇటువంటి రూపాలతో పాటు -ఆయ్ పురుష ప్రత్యయం ఉన్న రూపాలు కూడా ఉన్నాయి. కేళాయ్ 'విను, అడుగు.'

ప్రాచీన భాషలో మో, మే, మ్ ప్రత్యయాలుకూడా వచన భేదం లేకుండా ఉన్నాయి: చెయ్‌మో, చెయ్‌మే, చెయ్‌మ్ 'చెయ్యి, చెయ్యండి'. - మతి ప్రత్యయం కూడా వచన భేదరహితంగా ఉంది. కరైమతి 'పిలు, పిలవండి'.

బహువచనంలో - మిన్, - ఉంకళ్ ఉన్నాయి : పమ్మిన్, వారుంకళ్ 'రండి', మొదటిది ఇప్పటికి భాషలో లేదు. ప్రాచీన భాషలో ధాతువుకి - ఈర్ చేరటం కూడా ఉంది. కాణీర్ 'చూడండి'.

(ii) ఆశీరాద్యర్థక ప్రత్యయాలు - క (-క్క), - ఇయ(ర్) : కాణ్క, కాణియ(ర్) "చూచుగాక', - అల్, - తల్ ప్రత్యయ సహిత కృదంతాలుకూడా ఆశీరాద్యర్థంలో ప్రయుక్తమవుతాయి, చెయల్ 'చెయుగాక', దీనికి వేంటుం 'కావాలి' చేర్చవచ్చు, చెయల్ వేంటుం 'చెయ్యాలి' ఆధునిక భాషలో. తుమర్థకానికి వేంటుం చేరిస్తే అవశ్యకర్తవ్యాన్ని సూచిస్తుంది; వరవేంటుం 'రావాలి'.

(iii) వ్యతిరేకవిధి ఏకవచనం - (అల్ అరుదుగా - ఎల్) బహు వచనంలో దీని తరవాత - మిన్ గాని, - ఇర్‌గాని చేరుతుంది. చెల్లల్ 'వెళ్ళకు' చెల్లన్మిన్ / చెల్లలిర్ 'వెళ్ళకండి'.

పైవి ప్రాచీన భాషలో మాత్రమే ఉన్నవి. ప్రాచీన భాషలోనూ ఆధునిక భాషలోనూకూడా ధాతువుకి (ఏ. వ.) -ఆత్ -ఇ/ -ఏ, (బ. వ.) -ఆత్ -ఈం (కళ్) చేర్చడంవల్ల వ్యతిరేక విధి ఏర్పడుతుంది.

చొల్లాతి }
చొల్లాతే } 'చెప్పకు' చొల్లాతీం (కళ్) 'చెప్పండి'

(iv) వ్యతిరేకాశీరాద్యర్థకంలో ధాతువుకి -అఱ్ -క (*-అల్ -క్క)గాని -అల్ -ఇయర్ గాని చేరుతుంది.

కాణఱ్క, కాణలియర్, కాణిలియర్ 'చూడకుండుగాక'.

పై వాటిలో వ్యతిరేక ప్రత్యయాలు -అత్-, -అల్-, -ఇల్-; చివరి రెండూ వ్యతిరేక ధాతువులైన అల్-, ఇల్- లకు సంబంధించినవి.

**మలయాళం :**

(i) ప్రాచీన మలయాళంలో విధిలో ఏకవచనంలో ధాతువే ఉంటుంది, దీనికి వైభాషికంగా ఉ చేర్చవచ్చు. గురు క్రియలలో ఉకారం ముందు క్క్ ఉంటుంది, చొల్, చొల్లు 'చెప్పు', నట, నటక్కు 'నడు'.

బహువచనంలో -విన్ (-ప్పిన్, -మిన్ (అనునాసికం తరవాత) చేరుతుంది. చెయ్విన్ 'చెయ్యండి', కేళ్ప్పిన్ 'వినండి, అడగండి', కాణ్మిన్ 'చూడండి'.

ప్రాచీన భాషలో భవిష్యత్కాల ప్రత్యయ సహితరూపాలు కూడా విధిలో ఉన్నాయి, పోవితు 'వెళ్లు', కొటుప్పూతు / కొటుప్పతు 'ఇయ్యి' (ఇవి కృదంతాలు), కేళ్పూ 'విను', కొళ్వూ 'తీసుకో'.

(ii) ఆధునిక భాషలో విధిలో వచనభేదం లేదుగాని గౌరవభేదం ఉంది. ధాతువుకి ఉ చేరిస్తే అది గౌరవార్థక విధి, ə (సంవృతమైన అకారం) చేరిస్తే అది గౌరవరహిత విధి. పోవు 'వెళ్ళు / వెళ్ళండి' (గౌరవసహితం), పోవ (poovə) 'వెళ్లు', వెళ్ళండి' (గౌరవరహితం),

(iii) ప్రార్థన (Polite Imperative) లో -(ఉ) క / -క్క చేరు తుంది : అటిక 'తెలుసుకోండి', పఱక్క, పఱుక్కుఱ 'చెప్పండి'.

చేదవ్యర్థకాలు కూడా ప్రార్థనలో ఉపయోగిస్తాయి, చెయ్‌తాలుం' చెయ్యండి' '(అసలు అర్థం 'చేసినా', దీని తరవాత నన్ను మంచిది' లోపించి ఉండవచ్చు).

(iv) అతిసర్గార్థం (Permissive) లో తుమర్థకానికి - అట్టే చేరుతుంది, వరట్టే 'రానీ' తుమర్థకానికి - ఆం (< *ఆకుం 'అవుతుంది') కూడా చేరవచ్చు. వరాం 'రావచ్చు.'

(v) వ్యతిరేకవిధిలో ప్రాచీన భాషలో ధాతువుకి వ్యతిరేక ప్రత్యయమూ (-అయ్-), బహువచన ప్రత్యయమూ (-విన్) చేరడం ఉంది, నిల్లాయ్‌మిన్ 'నిలబడకండి', వ్యతిరేక కృదంతం కూడా వ్యతిరేక విధిలో ఉంది. దీనికి వేంటుం 'కావాలి' వైభాషికంగా చేరుతుంది. చెయ్యాయ్‌క (వేంటుం) 'చెయ్య వద్దు'.

తుమర్థకానికి వేంటా 'వద్దు', ఒల్లాతే 'వద్దు' కూడా చేరతాయి. చెయ్య వేంటా, చెయ్యొల్లాతే 'చెయ్యవద్దు'.

ప్రాచీన భాషలో తుమర్థకానికి అరుతు 'అరుదైనది' చేరితే కష్టం, అసాధ్యం అనే అర్థాలు ఉండేవి. ఇప్పటి భాషలో ఈ నిర్మాణానికి అర్థం వ్యతి రేక విధి, వర (అ)రుతు 'రావద్దు' చెయ్య (అ) రుతు 'చెయ్యవద్దు'.

**కోత.** (i) విధి: ఏకవచనం -$\phi$, బహువచనం -మ్

ఓగ్ 'వెళ్ళు' ఓగ్‌మ్ 'వెళ్ళండి'

(ii) వ్యతిరేక విధి : వ్యతిరేక ప్రత్యయం - అద్ -తరవాత ఏ.వ. -ఈ, బ.వ. -ఈం చేరతాయి.

అంజాదీ 'భయపడకు' అంజాదీం 'భయపడకండి'

తొద (i) విధి : ఏకవచనం -$\phi$, బహువచనం -శ్.

పో 'వెళ్ళు' పోశ్ 'వెళ్ళండి'

(ii) అతిసర్గంలో ప్రత్యయం -కు (-గు), పశ్‌కు 'రావచ్చు'

(iii) ఆశీరాద్యర్థక ప్రత్యయం - మో, నఢ్‌మో 'నడవనీ'

(iv) వ్యతిరేకవిధిలో ద్వితీయ ప్రాతిపదికకి (ఏ.వ.) -ఒటి, (బ.వ.) -ఒట్‌షి చేరతాయి: (ఏ.వ.) పింతొటి, (బ.వ.) పింతొట్‌షి 'వినవద్దు'

కొడగు (i) విధి : ఏకవచనం -, బహువచనం -ఇ(రి) (-రి).

బా 'రా' బారి 'రండి'

మాడు 'చెయి' మాడి(రి) 'చెయ్యండి'

(ii) వ్యతిరేవిధి : వ్యతిరేక ప్రత్యయం -అత్ -తరవాత ఏ.వ. -ఎ, బ.వ. -ఇ చేరతాయి.

తరతె 'ఇవ్వకు' తరతి 'ఇవ్వకండి'

(iii) అవశ్యకార్థంలో -ఒండు ప్రత్యయం, ఒక్కొండు 'రావాలి', వ్యతిరేకావశ్యకార్థకంలో ప్రత్యయ - అండ, బక్కండ 'రాకూడదు'.

కన్నడం :

(i) విధి : ఏకవచనం -$\phi$, బహువచనం (ప్రా.) -ఇం, (ఆ) -ఇ(రి).

నోడు 'చూడు' నోడిం, నోడి(రి) 'చూడండి'.

అమనుష్యైక వచన భవిష్యత్కాల రూపం కూడా విధ్యర్థంలో వాడబడు తుంది. ఈవుదు 'ఇవ్వాలి',

(ii) ఆశీరాద్యర్థకం ; ప్రాచీన భాషలో ప్రత్యయం -కె(-గె), ఆధునిక భాషలో -అలి.

ప్రా. కాణ్గె, ఆ, కాణలి 'చూచుగాక'.

(iii) వ్యతిరేకవిధి : ప్రాచీనభాషలో వ్యతిరేక ప్రత్యయమైన -అల్ తరవాత ఏ. వ. -φ, బ. వ. -ఇం చేరతాయి.

నోడల్ 'చూడకు', నోడలిం 'చూడకండి'.

ఆధునికభాషలో తుమర్థకానికి బేడ 'వద్దు' బరబేడ 'రావద్దు'.

తుళు :

(i) విధి : ఏకవచనం -φ/-ల, బహువచనం -ఇ/-లె.

ఉణు, ఉణ్ల 'తిను' ఉణి, ఉణ్లె 'తినండి'

బల 'రా' బలె 'రండి'

(ii) ఉభయప్రార్థనంలో ప్రత్యయం -క (-గ), కల్పుగ 'నేర్చుకొందాం' బర్క 'వద్దాం'.

(iii) ఆశీరాద్యర్థకం -అడు, తినడు 'తినుగాక', బరడు 'వచ్చుగాక'.

(iv) అశార్థంలో బ్రాహ్మణమాండలికంలో -ఒళీ, సాధారణ మాండలికాలలో -ఒలి, బరొళి, బరొలి 'రావచ్చు'.

(v) ఆవశ్యకార్థంలో -ఒడు (<బోడు 'కావాలి').

పోవొడు 'వెళ్ళాలి'.

దీని వ్యతిరేకంలో బ్రా. -ఒడ్త్రి (<బోడ్త్రి 'అక్కరలేదు'). పా. -ఒడ్చి (<బొడ్చి), కల్పొడ్త్రి, కల్పొడ్చి 'నేర్చుకోనక్కరలేదు'.)

(iv) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -అడ్ -కి ఏ.వ. -అ.బ.వ. -ఎ చేరతాయి.

కేణడ 'అడగకు' కేణడె 'అడగకండి'

తెలుగు :

(i) విధి : ప్రాచీన తెలుగులో ఏకవచనంలో ప్రత్యయం -ము, బహువచనంలో -ఉండు, ప్రాచీనభాషలో హల్లు ముందూ అవసానంలోనూ ము వైభా

షికంగా లోపిస్తుంది. కాని రమ్ము, పొమ్ము మొదలైనవాటిలో, అంటే (హ) అ- అనే ధాతురూపాంతరం ఉన్నచోట ము లోపించదు. ఆమ్రేడితంలో మొదటి దానిలో ప్రత్యయం వైభాషికంగా లోపిస్తుంది. రా రమ్ము, రమ్మురమ్ము, రా రండు, రండు రండు -ఉండులో ఉకారం (హ) అ- రూపధాతు రూపాంత రాల తరవాత లోపిస్తుంది: రండు, ఇండు, కండు.

| | |
|---|---|
| చేయు(ము) | చేయుండు, చేయుఁడు, |
| చెప్పు(ము) | చెప్పుండు. చెప్పుఁడు. |

ఆధునిక భాషలో ము లేకపోయినా, ఇయ్యమన్నాడు, తినమంటారు మొదలైన నిర్మాణాలలో అను ధాతువు ముందు ఈ ప్రాచీన మకారం మిగిలి ఉంది. -(ఉ)ండు ఆధునిక భాషలో -(అం)డిగా మారింది (తమిళనాడు మాండలికా లలో -(అ)ండా).

(ii) ఆశీరాద్యర్థకం: ప్రాచీన భాషలో -ఎడువ్, -తన్: మీకు మేలు గలిగెడున్, గలుగుతన్. అదితో కూడిన భూతేతరధాతుజ విశేషణం కూడా విధ్యాశీరాద్యర్థాలలో ఉంది. వచ్చునది, గాక భవిష్యత్కాలరూపాలకి చేరుతుంది: "ఎటిఁగెదవుగాక రజ్జాదనేల యిపుడు" (కాశీఖండము).

అధునికభాషలో అవశ్యకాశీరాద్యర్థకమైన -అలి వలయునుంచి వచ్చినది. చూడాలి<చూడవలయును.

(iii) వ్యతిరేకవిధి: ధాతువుకి వ్యతిరేక ప్రత్యయమైన -అకు- చేరిన తరవాత ఏ. వ. (ప్రా.) -(ము), (ఆ.) -$\phi$, బ. వ. (ప్రా.) -ఉండు, (ఆ.)-అండి చేరతాయి

| | |
|---|---|
| తినకు(ము) | తినకుండు, తినకుఁడు, తినకండి. |

**గోండి :**

(i) విధి : -అ (-మ్, -$\phi$), మ్ (హ) అ -రూపం ఉన్న ధాతువుల తరవాతా, $\phi$ (లోపం) సకారాంత ధాతువుల తరవాతా వస్తాయి. ఇది విధి ప్రత్యయం. దీని తరవాత ఏ. వ. -$\phi$, బ. వ. -ట్ ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| వరా | 'రా' | వరాట్ | 'రండి' |
| సీం | 'ఇయ్యి' | సీమ్ట్ | 'ఇయ్యండి' |
| తిన్ | 'తిను' | తిన్ట్ | 'తినండి' |

కోయ మాండలికంలో -ము (హ) అహ-, హ) అ- (హ) ఆ- రకాల ధాతువుల తరవాత ఉంటుంది. నకారాంతాల తరవాత -ఉ, మిగిలిన వాటి తరవాత -అ ఉంటాయి, పీటి తరవాత ఏ. వ. -$\phi$, బ. వ. -టు (అకారం తరవాత -టి, వీటిముందు అచ్చు దీర్ఘమవుతుంది.)

| | | | |
|---|---|---|---|
| వ్రర | 'రా' | వ్రరాటి | 'రండి' |
| కొయ్ము | 'కొయ్యి' | కొయ్మూటు | 'కొయ్యండి' |
| తొమ్ము | 'కట్టు' | తొమ్మూటు | 'కట్టండి' |
| కాము | 'తవ్వు' | కామూటు | 'తవ్వండి' |
| తిన్ను | 'తిను' | తిన్నూటు | 'తినండి' |

(ii) ఆవశ్యకార్థకమైన -ఈ -తరువాత ప్రథమ పురుష ప్రత్యయాలు చేరతాయి: వోర్‌కామ్ కర్యీర్ 'వాడు పని నేర్చుకోవాలి', కోయలో ప్రత్యయాలు -ఫీ-, ఈ-, నార్వీ 'అది కడగాలి', అన్నిరి 'వాళ్ళు వెళ్ళాలి'.

(iii) వ్యతిరేక విధి : వ్యతిరేక ప్రత్యయమైన -వా-/-మా- కి ఏ. వ. $\phi$, బ. వ. -ట్ చేరతాయి.

వాయ్వా, వాయ్మా 'రాకు' వాయ్వాట్, వాయ్మాట్ 'రాకండి'

కోయలో తుమర్థకానికి ఏ. వ. లో మా, బ. వ. లో -మాటి చేరతాయి:

| | | | |
|---|---|---|---|
| వాదమా | 'రాకు' | వాదమాటి | 'రాకండి', |

కొండ :

(i) విధి : ఏ. వ. -?అ, బ. వ. -దు (-ఋ, -డు, -తు) (వీటి పరిసరాలు తుమర్థకంలో లాగే ఉంటాయి, చూ. పేజీ 407).

| | | | |
|---|---|---|---|
| ర? అ | 'రా' | రదు | 'రండి' |
| నిల్? అ | 'నిలబడు' | నిన్ఋ | 'నిలబడండి' |
| ఉణ్? అ | 'తాగు' | ఉండు | 'తాగండి' |
| వెఋ? అ | 'చెప్పు' | వెఋతు | 'చెప్పండి' |

ఈ కింది క్రియలలో పై ప్రత్యయాలకి అపవాదాలు ఉన్నాయి.-

| | | | | |
|---|---|---|---|---|
| త- | తగ | 'తే' | తగట్ | 'తెండి' |
| సి-. సీ- | సిద | 'నాకుఇయ్యి' | సిదట్ | 'నాకు ఇయ్యండి' |
| | సి? అ | 'ఇయ్యి' | సిదు | 'ఇయ్యండి (ప్రథమ పురుషకి)' |
| లె- | లె? ఎ | 'లే' | లెదు | 'లేవండి' |
| *ఉన్- | ఉంద | 'తీసుకో' | ఉందట్ | 'తీసుకోండి' |

పై వాటిలో త- 'తెచ్చు'లో అధికంగా ఉన్న గకారం పెంగొ -మంద కూయి- కువిలలో ఉన్న గమనార్థక ప్రత్యయం (Motion Particle)తో తుల్యమనీ, సి-, సీ- 'ఇచ్చు'లో విధిలో రెండు రూపాలు పై భాషలలో అన్ని క్రియలలో ఉన్న ప్రథమ పురుష కర్మ, ప్రథమేతర పురుష కర్మల భేదానికి తుల్యమనీ టి. బరో, కృష్ణమూర్తి కొండ గ్రంథం ఉపోద్ఘాతంలో వివరించారు. పెంగొ -మంద -కూయి -కువిలలో సర్వత్ర ఉన్న ఈ ప్రత్యయాలు కొండలో ఈ క్రియలలో మాత్రమే మిగిలాయి అన్నమాట.

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -మ. కి ఏ. వ. -$\phi$, బ. వ. -ట్ చేరతాయి.

కిమ 'చెయ్యకు' కిమట్ 'చెయ్యకండి'

పెంగొ :

(i) విధి : ఏ.వ. -అ, బ.వ. అట్ /-అడ్. త-'తెచ్చు', వా-'వచ్చు'ల తరవాత బహువచనంలో -డు ఉంది.

| | | | |
|---|---|---|---|
| వీత | '(విత్తనాలు) చల్లు' | వీతట్ | 'చల్లండి' |
| తయ | 'తే' | తడు | 'తెండి' |
| వయ | 'రా' | వడు | 'రండి' |

ఏకవచన రూపాల తరవాత దె, ఢా, తా అనే నిపాతాలు (Particles) వైభాషికంగా చేరతాయి. ఇవి చేరినప్పుడు ఏకవచన రూపాలకి వీటికి మధ్య మ్ చేరుతుంది, కియమ్దె 'చెయ్యి', తినమ్దె 'తిను'. ప్రాచీన భాషలో ఏ.వ. ప్రత్యయం -అం అని దీనివల్ల తెలుస్తుంది.

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -మ- కి ఏ. వ. -$\phi$ బ. వ. -ట్ చేరతాయి.

హీమ 'ఇవ్వకు' హీమట్ 'ఇవ్వకండి'

(iii) అభ్యనుజ్ఞానం (Permissive). ఇది ఉత్తమ ప్రథమ పురుషలలో మాత్రమే ఉంది. దీనికి ప్రత్యయం -ఎ-, దీనికి పురుషప్రత్యయాలు చేరతాయి: హలెజ్ 'నన్ను వెళ్ళనీ' హలెన్ 'వాణ్ణి వెళ్లనీ', హలెత్ 'దాన్ని వెళ్ళనీ' మొ.

దీని వ్యతిరేకరూపంలో ధాతువుకి వ్యతిరేక ప్రత్యయమైన -మ్- చేరి దానికి అభ్యనుజ్ఞానార్థకమైన -ఎ- చేరి, దానికి పురుషప్రత్యయాలు చేరతాయి, డూమెన్ 'వాణ్ణి దున్ననివ్వకు', డూమెర్ 'వాళ్ళని దున్ననివ్వకు'.

మండ :

(i) విధి : ఏ. వ. -అ, బ. వ. -అత్, -దు: హల 'వెళ్ళు', హలత్ 'వెళ్ళండి', కియత్ /కిదు 'చెయ్యండి'.

(ii) వ్యతిరేకవిధి : ధాతువు + వ్ (వ్యతిరేకం) + (ఏ. వ.) అ, (బ. వ.) అత్, హల్వ 'వెళ్ళకు', హల్వత్ 'వెళ్ళకండి'.

తూయి :

(i) విధి : ఏ. వ. -ము (-అము, -ఉము). బ. వ. -దు (-డు, -జు), -అటు.

ఏందము 'నాట్యం చెయ్యి' ఏందటు 'నాట్యం చెయ్యండి'
కోము 'కొయ్యి' కోదు 'కొయ్యండి'
సోలుము 'ప్రవేశించు' సోడు 'ప్రవేశించండి'
సలుము 'వెళ్లు' సజు 'వెళ్ళండి'

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -? అ-కి ఏ. వ. -$\phi$, బ. వ. -టు చేరతాయి.

కో ? అ 'కొయ్యకు' కో ? అటు 'కొయ్యకండి'.

**కువి :**

(i) విధి : ఏ. వ. -అము (-ము), బ. వ. -అదు (-దు).

పాయము 'కొట్టు' పాయదు 'కొట్టండి"

హీము } 'ఇయ్యి' హీదు } 'ఇయ్యండి'
హీయము } హీయదు }

(పై వాటిలో రెండో రూపాలు ఉత్తమ మధ్యమ పురుషలు కర్మ అయినప్పుడు ఉపయోగించేవి.)

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -?అ -కి ఏ.వ. -ని బ.వ. -దు చేరతాయి.

పాయ్? అని 'కొట్టకు' పాయ్? అదు 'కొట్టకండి.'

**కోలామీ :**

(i) విధి : ఏ. వ. -$\phi$, బ.వ. -ఊర్ (-ర్). ఇ, ఈలు తప్ప మిగిలిన అచ్చులతో అంతమయ్యే ధాతువులకి -ర్ చేరుతుంది. వార్ధా మాండలికంలో న, డలతో అంతమయ్యే ఏకాచ్క ధాతువులలో అచ్చు ఏకవచనంలో దీర్ఘ మవుతుంది.

సీ 'ఇయ్యి' సీఊర్ 'ఇయ్యండి'

తీన్ 'తిను' తినూర్ 'తినండి'

మూడ్ 'మాట్లాడు' ముడూర్ 'మాట్లాడండి'

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -నే -కి ఏ. వ. -మ్' బ.వ. (వార్ధా) -ర్ / (ఆదిలాబాద్) -డ్ చేరుతాయి.

సీనేం 'ఇవ్వకు' సీనేర్ / సీనేడ్ 'ఇవ్వకండి'

**నాయకి (ఛాందా) :**

(i) విధి : ఏ.వ. -$\phi$.

అఢ్ 'ఆడు,' ఉద్ 'కూర్చో.'

(ii) వ్యతిరేకవిధి : కోలామీ (వార్ధామాండలికంలో లాగా)

అఢ్ నేం 'ఆడకు' అఢ్నేర్ 'ఆడకండి.'

**పర్జీ :**

(i) విధి : ఏ.వ. -$\phi$, బ.వ. -ఉర్.

చూడ్ 'చూడు' చూడ్డుర్ 'చూడండి.'

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -మ్ -కి ఏ.వ. -ఎన్, బ.వ. -ఒర్ చేరతాయి; -మ్- ముందు కొన్ని క్రియలలో ఏ.వ. లో ఏ.బ.వ.లో ఒ చేరతాయి.

| | | | |
|---|---|---|---|
| వెన్మెన్ | 'వినకు' | వెన్మొర్ | 'వినకండి' |
| చూడెమెన్ | 'చూడకు' | చూడొమొర్ | 'చూడకండి' |

**గదబ : (ఒల్లారి) :**

(i) విధి : ప్/త్ ప్రేరణ ప్రత్యయాలున్న ధాతువులతో మాత్రం ఏ.వ. -ఉట్, బ.వ -ఉర్, మిగిలిన ధాతువులలో రెండు వచనాలలోనూ ప్రత్యయం లేదు.

| | | | | |
|---|---|---|---|---|
| | సూడ్ | 'చూడు' | సూడ్ | 'చూడండి' |
| | ఈలుపుట్ | 'పడగొట్టు' | ఈలుపుర్ | 'పడగొట్టండి' |
| (కొణేకోర్ మాం.) | ఏంద్ | 'ఆడు, | ఏందుర్ | 'ఆడండి' |

(ii) వ్యతిరేకవిధి : రెండు వచనాలలోనూ -మ్ -ఎన్ ఉంటుంది.

సూడ్మెన్ 'చూడకు' చూడకండి.'

(కొణేకోర్ మాం.) ఏ.వ. ఏంద్మెన్ 'ఆడకు,' బ.వ. ఏంద్మెర్ 'ఆడకండి.'

**కూడుఖ్ :**

(i) విధి : వచనభేదం లేకుండా -అ ప్రత్యయం ఉపయోగిస్తుంది. పురుషేతరాలను ఉద్దేశించినప్పుడు -అయ్, స్త్రీలు వారిలో వారు మాట్లాడుకొనేటప్పుడు -ఏ.

ఎస్ 'అ, ఎస్' అయ్, ఎస్' ఏ 'పగలగొట్టు, పగలగొట్టండి.'

ప్రార్థన (Polite Imperative) లో -కే, -కో, -కా? ఎ ఉపయోగిస్తాయి, బర్? కె, బర్? కొ, బర్? కా? ఎ '(వస్తే) రా. రండి.' కో, కా? ఎలు -కే కి కూడా చేరవచ్చు, బర్? కే కో, బర్? కే కా? ఎ.

(ii) వ్యతిరేకవిధి : అంబా (స్త్రీల భాషలో అంబయ్, అంబే) విధికి ముందు చేరుతుంది. ఇదికాక అర్గా, అర్గీ కూడా ఉపయోగపడతాయి.

**మాల్తో :**

(i) విధి : ప్రత్యయం -అ (వచనభేదరహితం), ప్రార్థనలో -కు, బంద, బంద్క్ 'లాగు'.

**బ్రాహుయీ :**

(i) విధి : ఏ. వ. -$\phi$, -అ, -ఎ. లోపం ఉన్న క్రియలలో -అక్ అవశ్య కర్తవ్యాన్ని సూచిస్తుంది. బినక్ 'విను', బిసక్ 'కాల్చు (రొట్టె)'. బ. వ. -బొ (-ఇబొ, -అబొ).

బిన్ 'విను' బింబొ 'వినండి'

దక్క్ 'దాచు' డక్కిబొ 'దాచండి'

సలె 'నిలబడు' సలిబొ, సలీబొ 'నిలబడండి'

(ii) వ్యతిరేకవిధి : వ్యతిరేక ప్రత్యయమైన -ప- (-ఫ-) కి ఏ. వ. $\phi$, బ. వ. -బొ చేరతాయి.

బిస్ప 'కాల్చకు' బిస్పబొ 'కాల్చకండి'

బఫ 'రాకు' బఫబొ 'రాకండి'

## తులనాత్మక చర్చ

(i) విధ్యేకవచనం : చాలా భాషలలో ధాతువే విధ్యేకవచనంగా పని చేస్తుంది.

గోండీ, కొండ, పెంగొ, కువి (ఒక మాండలికం) లలో -అ ప్రత్యయం ఉంది. కూడుఖ్ - మాల్తోలలోకూడా -అ ప్రత్యయం ఉంది, వీటితో సన్నిహిత సంబంధంగల బ్రాహుయీలోకూడా ఇది చాలా క్రియలలో ఉంది. ఈ ఉత్తర భాషలలో ప్రార్థనలో *క్క్ ప్రత్యయం చేరడంకూడా ఒక ప్రత్యేకత.

పర్జి - గదబలలో ప్/త్ లు చివరగల క్రియలలో విధ్యేకవచనంలోకూడా చివర పకారం ఉంటుంది. పర్జి ఉత్తర మాండలికంలో దీని బదులు క కారం ఉంటుంది. పకార కకారాలు మొదట్లో భూతేతర కాలప్రత్యయాలు అయినా ఇవి విధిలోకూడా ఉండడం ఈ భాషల ప్రత్యేకత.

ప్రాచీన తమిళంలో విధ్యేకవచనంలో వైభాషికంగా -ఆయ్ మధ్యమ పురుషైక వచన ప్రత్యయం ఉంటుంది. ఇది చేరడానికి కారణం బహువచనంలో పురుషప్రత్యయమైన -ఈర్ ఉండడమే.

తెలుగు - కువి శాఖలో చాలా భాషలలో, అంటే (ప్రాచీన) తెలుగు, గోండి (కోయ), కూయి, కువి (మాండలికం) లలో ఏకవచనంలో -మ్ ప్రత్యయం ఉంది. పెంగొలోకూడా ఇది నిపాతాలముందు ఉంటుంది. కోయలో ము మిగిలిన గోండి మాండలికాలలోకన్నా అధిక సంఖ్యాకమైన క్రియలలో ఉంటుందని పైన చూశాము. కిందచర్చవల్ల మూలభాషలో *-మ్ బహువచనానికి చెందినదని తెలుస్తుంది. తెలుగు - కువి శాఖలో బహువచనానికి వేరొక ప్రత్యయం రావడంవల్ల ఇది ఏకవచనంలోకి మారింది. ఇది ప్రాచీన తెలుగులో వైభాషికం కావడమూ, గోండిలో కొన్ని క్రియలలో మాత్రమే ఉండడమూ, కువిలో మాండలికంగానే మిగలడమూ, కొండలో అసలు లేకపోవడమూ, కూయిలో వ్యతిరేకవిధిలో లేకపోవడమూ, పెంగొలో నిపాతాల ముందు మాత్రమే మిగిలి ఉండమూ ఇది ప్రాచీనకాలంలో ఏకవచనానికి చెందినది కాదు అని సూచిస్తాయి.

(ii) విధిబహువచనం : మూలద్రావిడంలో విధిబహువచనం ప్రత్యయం *ఉం/*ఇం అని పునర్నిర్మించడానికి చాలా ఆధారాలు ఉన్నాయి. ప్రాచీన తమిళంలో -మిన్ (<మ్ + ఇన్) కాక మ్ కూడా ప్రత్యయంగా ఉంది. మ్ ఏకవచనంలో కూడా ఉండడం తరవాత కాలంలో జరిగి ఉండవచ్చు. ఆధునిక తమిళం - ఉంకళ్ <*ఉమ్ + కళ్. ప్రాచీన కన్నడంలో -ఇం ఇప్పటి భాషలో పదాంత మకారం లోపించి -ఇగా మారింది.

ప్రాచీన తెలుగు -ఉండు <*-ఉమ్-ట్ నించి వచ్చిందని కింద చర్చవల్ల తెలుస్తుంది. కాబట్టి ఇందులో కూడా ఉం ఉంది. గోండి, కోయలలో మ్ కొన్ని క్రియలలో విధిప్రత్యయంగా ఉంది. బ్రాహుయీ- బొలో బకారం మకారం నించి వచ్చి ఉండవచ్చు.

మూలభాషలో మధ్యమపురుష బహువచన సర్వనామాల *నీం, *నీర్ అని రెండు ఉండేవి. వీటిలో మొదటిది అతిప్రాచీనం, రెండవది కొంత

అర్వాచీనం. విధి బహువచన ప్రత్యయమైన *ఉం/*ఇం *నీం కి సంబంధించి నది. (ఇం లో ఇకారం మకార ప్రభావంవల్ల ఉ కారంగా మారింది అని చెప్ప వచ్చు.) *నీర్ కి చెందిన ప్రత్యయాలు కూడా కొన్ని భాషలలో ఉన్నాయి.

తుళు ఏ. వ. ల, బ. వ. లె మొదట్లో -అల్ ప్రత్యయంతో కూడిన కృదంతానికి ఆ(కు)ం 'అవుతుంది' అనేది చేరిన పదబంధం నించి వచ్చాయి. త. వరల్ ఆ(కుం) 'రావచ్చు' : తు. బల (ఏ.వ.), బలె (బ. వ.). తుళులో వచనభేదం తరవాత ఏర్పడి ఉంటుంది. ఈ భాషలో ఇంకొక బ.వ. ప్రత్యయ మైన ఇ, కన్నడం -ఇ లాగే *ఇం నించి వచ్చింది.

తెలుగు - కువిశాఖలో విధిబహువచనంలో *ట్ అనే కొత్త ప్రత్యయం వచ్చింది. ఈ భాషలలో ప్రత్యయాలు :

| | |
|---|---|
| (ప్రాచీన) తెలుగు | -ఉండు |
| గోండీ | -ఆ-(-మ్-) + -ట్ |
| కోయ | -ఆ-(-మూ-) + -టి (-టు) |
| కొండ | -దు (-డు, -ఋ) |
| పెంగో | -అట్ /-అడ్ |
| మండ | -అత్ |
| కూయి | -అటు, -దు (-డు, -జు) |
| కువి | -అదు, -దు (-జు) |

ఈ ప్రత్యయాన్ని *-ట్ (రూపాంతరం *-త్) గా పునర్నిర్మించవచ్చు. కూయిలో రెండూ ఉన్నాయి. కొండ కువిలలో దంత్యం మాత్రమే ఉంది (కొండ వ్యతిరేకవిధిలో మూర్ధన్యం ఉంది). మిగిలిన భాషలలో మూర్ధన్యం మాత్రమే ఉంది. కూయి రెండు రూపాంతరాలని కలిగి ఉండడంవల్ల ప్రాచీనతని నిలుపు కొన్నట్లు తోస్తుంది.

తెలుగు విధి బహువచన రూపాలని గోండీ రూపాలతో పోలిస్తే తె. -ఉండు *-ఉమ్ట్ నించి వచ్చినట్లు స్పష్టమవుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| గోండి | సీమ్ | 'ఇయ్యి' | సీమ్‌ట్ | 'ఇయ్యండి' |
| కోయ | ఈము | ,, | ఈమూటు | ,, |
| తెలుగు | ఇమ్ము | | ఇండు (<*ఇమ్‌ట్) | |
| గోండి | కీమ్ | 'చెయ్యి' | కీమ్‌ట్ | 'చెయ్యండి' |
| తెలుగు | చేయుము | | చేయుండు (<*కేయుమ్‌ట్) | |

గోండి కోయలలో -మ్-ట్, -మూటు కొన్ని క్రియలలో మాత్రమే ఉంది (గోండిలో కన్నా కోయ మాండలికంలో ఇది అధిక సంఖ్యాక క్రియలలో ఉంది). తెలుగులో -ఉండు అన్ని క్రియలలోనూ ఉంది; దక్షిణ భాషలలోకూడా -మ్ అన్ని క్రియలలోనూ ఉంది కాబట్టి గోండి, కోయలలో ఇది కొన్ని క్రియలకే పరిమితమవడం ఆ భాషలలో వచ్చిన మార్పు అని తెలుస్తుంది. కొత్త బహువచన ప్రత్యయం వచ్చిన తరవాత అదిపోగా మిగిలిన రూపం ఏకవచనార్థకంగా మారింది. ఇటువంటి మార్పు గోండి సర్వనామాలలో కూడా జరగడం గమనించాలి.

ఆధునిక మలయాళం, కూడుఖ్ - మాల్తోలలో వచన భేదం నశించింది.

(iii) ఆశీరాద్యర్థకం : దక్షిణభాషలలో ప్రాచీన తమిళం, మలయాళం, ప్రాచీన కన్నడం, తుళులలో *-క (*-క్క గురు క్రియలలో) ప్రత్యయంతో ఆశీరాద్యర్థకం ఉంది. మలయాళంలో ఇది ప్రార్థనార్థకంగానూ, తుళులో ఉభయ ప్రార్థనంగానూ ఇది అర్థవిపరిణామం పొందింది. ఇది మొదట్లో తుమర్థకమే అయి ఉండవచ్చు. గురుక్రియలలో తుమర్థకానికి, దీనికి భేదం లేదు కాని, లఘు క్రియలలో తుమర్థకంలో అ ఉండగా ఇందులో క ఉంటుంది. ఈ మార్పు తరవాత జరిగి ఉండవచ్చు. ప్రాచీన తమిళంలో -ఇయ(ర్) ప్రత్యయ సహిత రూపాలు తుమర్థకాలుగానూ ఆశీరాద్యర్థకాలుగానూ ఉండడం మొదట్లో ఈ రెండిటికీ భేదం లేదని ఋజువు చేస్తుంది. తుమర్థకం విధ్యర్థకంగా పని చెయ్యడం చాలా భాషలలో ఉంది. ఆధునిక కన్నడం -అలి మొదట్లో -అల్ కృత్ప్రత్యయం అయి ఉండవచ్చు. తెలుగు గాక (అగు నించి వచ్చినది) అనే దాంట్లోనే ఈ ఆశీరాద్యర్థక రూపం మిగిలి ఉంది.

తుమర్థకం + వేంటుం 'కావాలి' / వేంటా 'అక్కరలేదు' అనే అనేక శబ్దనిర్మాణం దక్షిణ శాఖా భాషలలో ప్రత్యేకత. ఇది తమిళం, మలయాళం, కొడగు, కన్నడం తుళులలో ఉంది.

గోండీ, కోయ, పెంగోలలో ప్రత్యేక ప్రత్యయంతో ప్రథమ పురుషకి అభ్యనుజ్ఞ సూచించే అతిసర్గార్థకం (Permissive) ఉంది (పెంగొలో ఇది ఉత్తమ పురుషలో కూడా ఉంది).

(iv) విధిలో భవిష్యత్కాల రూపాల ప్రయోగం.

చాలా ద్రావిడ భాషలలో భవిష్యత్కాలరూపాలు విధిలో ఉపయోగ పడతాయి.

(v) వ్యతిరేకవిధి (ఏకవచన బహువచనాలు) :

తుళు, కూడుఖ్ - మాల్తోలు తప్ప మిగిలిన అన్ని ద్రావిడ భాషలలోనూ వ్యతిరేక విధికి ఏకశబ్ద నిర్మాణం ఉంది. దీని నిర్మాణం ఈ కిందివిధంగా ఉంటుంది :

ధాతువు + వ్యతిరేకం + { 2. ఏ. వ. / 2. బ. వ. }

కాని ఇందులో వ్యతిరేక ప్రత్యయం అన్ని భాషలలోనూ తుల్యంగా లేదు. కాబట్టి ఈ నిర్మాణం మూలభాషకి చెందినదని నిశ్చయంగా చెప్పలేము. కాని భిన్నోపశాఖలలో ఉన్న ప్రత్యయాలకి కొంతవరకు సాజాత్యం ఉంది.

దక్షిణశాఖలో తమిళం, కోత, కొడగులలో వ్యతిరేక విధిలో వ్యతిరేక ప్రత్యయం *-అత్-, దీనికి చేరే పురుష ప్రత్యయాలు ఏ. వ. -ఇ, బ. వ. -ఈం; కన్నడం తుళులలో ఇది లేకపోవడం వల్ల దీనిని మూల దక్షిణ ద్రావిడ భాషకి పునర్నిర్మించటం సాధ్యం కాదు.

ప్రాచీన తమిళం, ప్రాచీన కన్నడాలలో -అల్- వ్యతిరేక ప్రత్యయంగా ఉన్న నిర్మాణం ఉంది. దీనిలో ఏ. వ. $\phi$, బ. వ. (త.)-ఇర్; -మిన్, (క.)

-ఇం. ఇది మూల దక్షిణ ద్రావిడ భాషకి చెందినది కావచ్చు. ఇందులో -అల్- వ్యతిరేక ధాతువైన అల్ -కి తుల్యమే. తుమర్థకం + వేంటా 'అక్కరలేదు' కూడా దక్షిణ శాఖలో ప్రత్యేకత అని ఇంతకుముందే చూశాము.

తెలుగు - అకు - లో కకారమూ, తమిళం, కోత, కొడగులలో -అ- తరవాత ఉన్న తకారమూ భూతేతర కాల ప్రత్యయాలు కావచ్చు. వ్యతిరేకక్త్వార్థ కాలలో ఉన్న ఈ హల్లులనే మనం ఇంతకుముందు భూతప్రత్యయాలుగా పరిగణించాం (చూ. పే. 392-393). వ్యతిరేక విధిలో భూతప్రత్యయం ఉండడం సంభావ్యం కాదు కాబట్టి. ఇక్కడ వీటిని భూతేతరకాల ప్రత్యయాలుగా పరిగణించాలి. ప్రాచీన తమిళంలో చెన్తి (<చెల్ -త్ -ఇ) 'వెళ్తావు, వెళ్ళు', చెల్లాతి 'వెళ్ళకు' పోల్చి చూస్తే ఈ రెండింటిలోనూ ఉన్న తకారం భవిష్యత్కాలార్థక మని స్పష్టమవుతుంది.

గోండీ, కొండ, పెంగొలలో - మా - వ్యతిరేక ప్రత్యయంగానూ, దాని తరవాత ఏ. వ. -$\phi$, బ. వ - ట్ ఉన్నాయి. కోయలో మూ, మాట్ తుమర్థ కానికి చేరడంవల్ల ఈ భాషలలో కూడా ఇది మొదట్లో అనేక శబ్దనిర్మాణమే కావచ్చు. ఇది ఈ భాషల సాహితాన్ని సూచిస్తుంది.

కోలామీ - నాయకి వ్యతిరేక విధిలో వ్యతిరేక ప్రత్యయం - నే -, ఈ భాషలలో మిగిలినచోట్ల వ్యతిరేక ప్రత్యయం - ఏ -; - నే - లో అధికంగా ఉన్న నకారం భవిష్యత్కాల ప్రత్యయం కావచ్చు.

పర్జీ - గదబలలో వ్యతిరేకవిధిలో వ్యతిరేక ప్రత్యయం - మ్ -, ఇది గొండీ - కొండ - పెంగొలలో మా కి సంబంధించినదా అనే విషయం మీద ఇంగా పరిశోధన జరగాలి. వీటిలో ఏ. వ. ప్రత్యయమైన - ఎన్ విలక్షణ మైనది. కాని పర్జీ బ. వ. ప్రత్యయమైన -ఒర్ విధిలో -ఉర్‌కి సంబంధించినదే (ఈ రెండూ మ. పు. బ. వ. *-ఈర్ నించి వచ్చినవి).

431

# V. ఉపకుటుంబ విభజన

## 5. 1. ఉపోద్ఘాతం.

ద్రావిడ భాషల పరస్పర సంబంధాలని వివరించి, వాటిని ఉపకుటుం బాలుగా విభజించడాన్ని గురించిన చర్చ ద్రావిడ భాషా తులనాత్మక వ్యాకరణ పితామహుడైన బిషప్ కాల్డ్‌వెలే ప్రారంభించారు. ఆయన "తమిళ మలయాళాలు చాలా సన్నిహిత సంబంధం గలవి" అనీ, "తమిళం తెలుగుల మధ్య చాలా దూరం ఉంది" అనీ చెప్పడమేకాక తుళుకి తమిళ, మలయాళ కన్నడాలకీ మధ్య చాలా భేదం ఉందని కూడా సూచించారు.[1] స్టెన్‌కొనో (లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా, వాల్యూమ్ 4 (1906) : 283-85) కూడా ద్రావిడ భాషలలో సామ్యా లని చూపుతూ వాటి విభజనని గురించి కొంత చర్చించారు. ఈయన ద్రావిడ భాష లన్నిటినీ తమిళ సముదాయం (Tamil - group), తెలుగు సముదాయం (Telugu - group) అని రెండుగా విభజించారు. ఈ విభజన నిర్దుష్టమైనది కాకపోయినా ఇది దక్షిణోపకుటుంబం మధ్యోపకుటుంబం అనే విభజనకు నాంది అని చెప్పవచ్చును. ఉపకుటుంబ విభజనను గురించి శాస్త్రీయమూ పరిపూర్ణమూ అయినా చర్చ 1950 ప్రాంతంలోనే మొదలయింది. బరో తులనాత్మక వర్ణ నిర్మాణంమీద 1940 దశాబ్దిలో వ్రాసిన వ్యాసాలూ; బరో, భట్టాచార్యల పర్జీ

---

1. Bishop Caldwell (1856, reprinted 1956) "The most nearly related are Tamil and Malayalam...." (P. 40): "The farthest removed from each other are Tamil and Telugu." (P. 41): "It (i.e. Tulu) differs far more widely from Malayaalam than Malayaalam does from Tamil. It differs widely, but not so widely, from Canarese; still less so from Coorg. The dialect from which it differs most widely is Tamil" (P. 32).

గ్రంథం, ఎమెనోకోలామీ మీద వ్రాసిన గ్రంథం ఈ చర్చకి మూలాధారాలు అయ్యాయి.

మూలద్రావిడ భాష మొదట మూడు శాఖలుగా చీలిందనీ, అందువల్ల ద్రావిడ భాషలని మూడు పెద్ద ఉపకుటుంబాలుగా విభజించవచ్చునని పండితులంతా అంగీకరిస్తున్నారు.[1] అవి దక్షిణ ద్రావిడోపకుటుంబం ("South Dravidian" అనే పదాన్ని ఎల్. వి. రామస్వామి అయ్యర్ (1938లో), టి.బరో (1940, 47లలో) మొట్టమొదటగా వాడేరు; అప్పుడు వారు తెలుగును కూడా ఈ ఉపకుటుంబానికి చెందినదిగానే పరిగణించారు), మధ్య ద్రావిడోప కుటుంబం ("Central Dravidian" అనే పదాన్ని మొట్టమొదటగా టి.బరో (1947 లో) వాడేరు), ఉత్తర ద్రావిడోప కుటుంబం ("Northern Dravidian" అనే పదాన్ని మొట్ట మొదట సర్ డేనిస్ బ్రే The Brahui Language, Part II - The Brahui Problem (1934 లో) ఉపయోగించారు).

దక్షిణ ద్రావిడోప కుటుంబానికి చెందిన భాషలు ఏడు. అవి తమిళం, మలయాళం, కొడగు, కోత, తొద, కన్నడం (బడగ దీని మాండలికం), తుళు. కోత, తొద కన్నడానికి సన్నిహితమైనవని మొదట్లో పండితులు అనుకునే వారు. కాని ఎం.బి. ఎమెనో (1958) అవి తమిళ - మలయాళాలకి సన్నిహిత

---

1. ఇటీవల భద్రిరాజు కృష్ణమూర్తి (Gender and Number in Proto - Dravidian, IJDL 4 (No. 2) : 328-50 (1975), PP. 339, 347) మధ్య ద్రావిడోప కుటుంబంలోని శాఖలైన తెలుగు - కువి, కోలామీ - పర్జీ (చూ. 5. 3. (ii)) రెండు వేరు వేరు ఉప కుటుంబాలు అని ప్రతిపాదించారు. వీరి అభిప్రాయంలో ద్రావిడ భాషలలోవున్న ఉపకుటుంబాలు నాలుగు అన్నమాట. అవి : 1. దక్షిణ ద్రావిడం, 2. తెలుగు-కువి (దీనికి ఆయన దక్షిణ ద్రావిడం-II అని పేరు పెట్టేరు), 3. కోలామీ - పర్జీ (దీన్ని మాత్రమే ఆయన మధ్య ద్రావిడం అన్నారు), 4. ఉత్తర ద్రావిడం. ఈ ప్రతిపాదనకి ఆయన ఇచ్చిన ఆధారాలు విప్రతిపత్తికి అవకాశం కలవి కాబట్టి బలమైనవి కావు. పైగా ఆయన పెట్టిన కొత్తపేర్లు పఠితలలో భ్రమకి అవకాశం కలిగించాయి.

మైనవని నిరూపించారు. ఎల్. వి. రామస్వామి అయ్యర్ "The Affinities of the Kodagu Language" (1928)లో కొడగు తమిళ - మలయాళాలకి సన్నిహితమైనదని సూచించారు. తుళు విషయంలో కొంత అభిప్రాయభేదం ఉండేది. భద్రిరాజు కృష్ణమూర్తి (1961 : 272) తుళుని మూల మధ్య ద్రావిడ భాషకి ప్రత్యేక శాఖ అని చెప్పడానికి కొన్ని ఆధారాలు ఉన్నాయని అన్నారు. ఎం.బి. ఎమెనో (1967 : 365) తుళు స్థానాన్ని నిర్ణయించడం ఆ భాషని గురించిన వివరాలు సమగ్రంగా దొరికిన తరవాతే సాధ్యమవుతుందని చెప్పి, అప్పట్లో "తుళు దక్షిణ ద్రావిడభాష కాదు" అనే చాలామంది అభిప్రాయాన్ని అమోదించి, తుళులో భూతక్రియా నిర్మాణం ఈ అభిప్రాయాన్నే బలపరుస్తుందని చెప్పేరు.[1] ప్రస్తుత గ్రంథకర్త "The position of Tulu in Dravidian" *I L* 29 : 47-66) లో తుళు వర్ణ నిర్మాణ పదనిర్మాణాలని తులనాత్మకంగా వివరంగా పరిశీలించి అది దక్షిణ ద్రావిడభాషే అని నిర్ణయించారు. దీనికీ మిగిలిన దక్షిణ ద్రావిడ భాషలకీ మధ్య ఉన్న భేదాలకి ఇది మూల దక్షిణ ద్రావిడ భాషనించి మొట్టమొదట విడిపోయినది అవటమే కారణం అని నిరూపించారు. తుళు తప్ప మిగిలిన దక్షిణ భాషల పరస్పర సంబంధాలని గురించిన సమగ్ర చర్చ ఎమెనో 1967 వ్యాసంలో ఉంది.

మధ్య ద్రావిడోప కుటుంబానికి చెందిన భాషలు పదకొండు. అవి తెలుగు, గోండీ (కోయ దీని మాండలికం), కొండ, పెంగొ, మండ, కూయి, కువి,

---

1. M.B. Emeneau (1967:365) : "The position of Tulu vis-a-vis SDr. and CDr. still needs to be studied in detail. This study can only be made after sufficiently good evidence on the language and its dialects has been made available. Meanwhile, we may accept the generally held opinion that Tulu is not a member of the SDr. group; *prima facie*, the formation of the past tense bears this out."

కోలామీ (నాయక్డీ దీని మాండలికం), నాయకీ (ఛాందా), పర్జీ, గదబ (ఒల్లారీ, సాలూరు మాండలికాలు), తెలుగు మొదట్లో బరో, ఎల్. వి. రామస్వామి అయ్యర్‌ల చేత దక్షిణ ద్రావిడ భాషగానే పరిగణించబడింది. భద్రిరాజు కృష్ణ మూర్తి (1961, నాలుగో అధ్యాయం) తెలుగు వర్ణ నిర్మాణం అది దక్షిణ భాషలకీ మధ్యభాషలకీ మధ్యస్థానంలో ఉన్నదని సూచిస్తుందని చెప్పి, చివరకి దాని పద నిర్మాణం అది మధ్య ద్రావిడ భాష అని నిస్సంశయంగా నిరూపిస్తుం దనీ, తెలుగుకీ కూయి -కువి -కొండ ఉప కుటుంబానికి సన్నిహిత జన్మ సంబంధం ఉందనీ నిర్ణయించారు.[1] టి. బరో, సుధీభూషణ్ భట్టాచార్య (1953 : xi) కోలామీ, నాయకీ, పర్జీ, గదబ ఒక చిన్న ఉప కుటుంబమని సూచించారు. ఈ సిద్ధాంతానికి సమగ్రాధారాలు ఎమెనో (1955, పదో అధ్యాయం) ఇచ్చారు. బరో, భట్టాచార్య (అదే పుస్తకంలో) గోండీ, కొండ, కూయి, కువిల మధ్య సన్నిహిత సంబంధం ఉందని కూడా సూచించారు. ప్రస్తుత గ్రంథకర్త 1969 వ్యాసంలో మధ్య ద్రావిడ భాషలలో ముఖ్యమైన సదృశ పరిణామాలని ఇచ్చి, ఈ ఉప కుటుంబం అంతర్విభాగాన్ని గురించి కూడా చర్చించారు.

---

1. Bh. Krishnamurti (1961:269) : "The weight of comparative evidence discussed in some detail in this chapter is in favour of considering Telugu as an offshoot of the Central Dravidian branch of Proto-Dravidian with very intimate genetic relationship with the Kui-(Kuvi) Konda sub-group. Since it has also several exclusive features in common with South Dravidian in phonology rather than in morphology, it may be considered that Telugu has been in intimate geographical contact with the members of South Dravidian from a very remote past. The morphological evidence puts it rather conclusively with Central Dravidian."

ఉత్తర ద్రావిడోపకుటుంబానికి చెందిన భాషలు మూడు. అవి కూడుఖ్, మాల్తో, బ్రాహుయీ. కూడుఖ్, మాల్తోలు చాలా సన్నిహితమైనవనీ, వారి ఆచార వ్యవహారాలలో కూడా సామ్యాలు ఉన్నాయనీ కాల్డ్‌వెల్ కాలం నాటికే పండితులకి తెలుసు.[1] బ్రాహుయీలో ద్రావిడభాషా పదాలేకాక ద్రావిడ భాషా లక్షణాలు కూడా ఉన్నాయని చెప్పి కూడా కాల్డ్‌వెల్ దానిని ద్రావిడభాషగా పరిగణించక ద్రావిడభాషా లక్షణాలు ఉన్న ద్రావిడేతర భాషగా పరిగణించారు. బ్రాహుయీలో ద్రావిడ భాషా పదాలూ, లక్షణాలూ చాలా తక్కువగా ఉండడమే ఆయన ఇలా చెయ్యడానికి కారణమని ఆయనే చెప్పారు. ఈ భాషకి వ్యాకరణమూ నిఘంటువూ రచించిన సర్ డేనిస్ బ్రే కాల్డ్‌వెల్ అభిప్రాయాన్ని ఖండించి, అది ద్రావిడ భాషా కుటుంబంలోనిదే అని నిర్ణయించడమేకాక, దానికీ కూడుఖ్ మాల్తోలకీ విశిష్ట సంబంధం ఉందని సోపపత్తికంగా నిరూపించారు.[2]

---

1. Bishop Caldwell (1956:36) : "This tradition of the original identiy of the Maalers and the Oraaons is borne out by the evident affinity of their languages and as Colonel Daltion mentions, by the similarity of their customs."

2. Sir Denys De S. Bray (1909: 18-19): "There can be but one verdict on this evidence. This verdict is not that of Caldwell, who summed up his final position in the words 'The Brahui language, considered as a whole, seems to be derived from the same source as the Punjabi and Sindhi, but is evidently contains a Dravidian element', but the converse, first suggested by Lassen the early days of the study of the language and reasserted by Trumpp a quarter of a century ago. The Brahui language is sprung from the same sourse as the Dravidian language group; it has freely absorbed the alien vocabulary of Persian, Baluchi, Sindhi and other nigh-

ఉత్తర ద్రావిడోపకుటుంబం ప్రత్యేక లక్షణాలని ఎమెనో (1962, అయిదో అధ్యాయం) విశదంగా పరిశీలించారు.

ఈ మూడు ఉపకుటుంబాల ప్రత్యేక లక్షణాలూ ఈ కింద విడివిడిగా చర్చించబడతాయి. ఒక్కొక్క ఉపకుటుంబంలో భాషల పరస్పర సంబంధాలూ ఒక్కొక్క (ఉపకుటుంబ) మూలభాష ఇప్పటి భాషలుగా క్రమక్రమంగా ఎలా విడిపోయిందో కూడా చర్చించబడతాయి.

## 5.2. దక్షిణ ద్రావిడోప కుటుంబం

(i) దక్షిణ ద్రావిడోప కుటుంబం ప్రత్యేక లక్షణాలు :

1. పదాది *చకారలోపం. (చూ. 2.21).

తెలుగులో కూడా ఇటువంటి మార్పు ఉంది. ఈ విషయంలో తెలుగుకి దక్షిణభాషలకీ సామ్యం భౌగోళిక సాన్నిహిత్యంవల్ల వచ్చి ఉండాలి. అంటే, ఈ మార్పు దక్షిణభాషలనించి వాటి పక్కన ఉన్న తెలుగుకి వ్యాపించిఉండాలి. కోయలో ఈ మార్పు తెలుగు ప్రభావంవల్ల ఏర్పడి ఉంటుందని కూడా అన వచ్చు.

2. మూ. ద్రా. *ఉకారం పదాంతంలో ఇ̈ (అనోష్ఠీకృతోకారం) గా మారడం.

తమిళం, మలయాళం, కొడగు, తుళులలో పదాంతంలో ఉచ్చారణార్థకో కారం అనోష్ఠీకృతంగా ఉంటుంది. ఇది కొడగు, తుళులలో కొన్ని ఇతర పరి

---

bouring languages, but in spite of their in roads its grammatical system has preserved a sturdy existence." (1934:20) "Thus the phonetic and etymological evidences converge towards Brahui's special affinity with the northerly Dravidian languages, which was the conclusion enunciated by Professor J. Bloch some time ago on morphological grounds."

ణామాలవల్ల ప్రత్యేక వర్ణం అయింది. కాని తమిళ, మలయాళాలలో ఇది ఉకా రానికి సవర్ణమే. ప్రామాణిక కన్నడంలో ఉచ్చారణార్థకోకారం ఓష్ఠీకృతమే కాని, కొన్ని కన్నడ మాండలికాలలో ఇది అనోష్ఠీకృతం. కోత, తొదలలో ఇకారం తప్ప మిగిలిన అచ్చులు పదాంతంలో లోపిస్తాయి కాబట్టి వాటిలో ఇది లేదు. దక్షిణేతరభాషలలో ఉచ్చారణార్థకోకారం ఉన్నవాటిలో అది ఓష్ఠీకృతమే. కాబట్టి దక్షిణ భాషలలో ఉచ్చారణార్థకోకారం అనోష్ఠీకృతంగా ఉండడం వాటి ప్రత్యేక లక్షణం అని చెప్పవచ్చు.

3. ఇ/ఎ, ఉ/ఒ ల మార్పు (చూ. 2.15).

4. స్త్రీ లింగ సంవర్గ సృష్టి (Creation of the feminine category). (చూ. పేజీలు- 186 188, 190).

5 మూ. ద్రా. *య ఎ గా మారడం. (చూ. పేజీలు 230-234).

6. వ్యతిరేకాసమాపక క్రియలలో దంత్యం చేరడం. (చూ. 392-393).

7. అమహత్ బహువచన ప్రత్యయ వైకల్పికత్వం (చూ. 209.)

8. భూతప్రాతిపదిక నిర్మాణం (చూ. 343-344).

9. భవిష్యత్కాలిక ప్రత్యయమైన *ప్ప ప్రయోగబాహుళ్యం (చూ. 371-372).

10. ఆశీరాద్యర్థక (Optative) ప్రయోగం.

*క్క- (*క) ప్రత్యయం ఆశీరాద్యర్థకంగా దక్షిణభాష లన్నింటిలోనూ ప్రచురంగా ఉంది. తుళులో ఇది ఉభయప్రేరణార్థకం (Hortative)గా ఉంది. (చూ. పేజీ. 428).

11. *వేంట్-అనే సహాయక క్రియ ప్రయోగం.

దక్షిణ భాషలలోనే *వేంట్ - 'వేఁడు' అనే క్రియ అవశ్యకతని సూచించే సహాయక క్రియగా ప్రయుక్త మవుతుంది. ఇది తుమున్నర్థకం తర వాత వస్తుంది. ఇది వ్యతిరేక ప్రత్యయంతో కూడా వస్తుంది: త. చెయ్యవేంటుం 'చెయ్యాలి; చెయ్యవేంటా(ం) 'చెయ్యక్కర్లేదు.'

12. మూ. ద్రా. *ళ లు మిగిలి ఉండడం.

13. కొన్ని పదాలు.

దక్షిణ భాషలలో మిగిలిన భాషలలో లేని పదాలు 200 లకు పైగా ఉన్నాయి. ఉదాహరణలు:

త. అరణై 'ఒకరకం బల్లి', మ. అరణ, క. అరణె, రాణె, తు. ఆరణె. (204)

త. అరి, అరిసి 'బియ్యం', మ. అరి, కోత. అక్య్, తొ. అశ్క్య్, క. కొడ. అక్కి-, తు. అరి, అక్కి-. (215)

త. ఇలై 'ఆకు', మ. ఇల, కోత. ఎల్, తొ. ఎస్, క. ఎలె, ఎల, కొడ. ఎలకండ, తు. ఎలె, ఇరె. (497)

త. ఎళ్, 'నువ్వులు', మ. ఎళ్, ఎళ్ళు, కోత. ఎణ్, 'నూనె', క. ఎళ్, ఎళ్ళు, కొడ. ఎళ్ళు, తు. ఎణ్ మె. (854)

త. మ. కోత. క. కేళ్ 'విను, అడుగు', తొ. కేళ్-, కొండ కేళ్-, కొండ కేళ్-, తు. కేణు-. (2017)

త. మ. తోల్ "ఓడిపోవు', కోత. చోల్-, త్వోల్-, క. సోల్, కొడ. చోల్-, తు. శోల్-, సోలు, సొపు. (3558)

త. మంచళ్ 'పసుపు'. మ. మఞ్ఞళ్, క. మంజళ్, కొడ. మంజ, తు. మంజళు. (4635)

త. వాళై 'అరటి', మ. వాళ, కోత. వాగ్, వాయ్, తొ. పావ్, క. బాళె, బాళె, కొడ, బాళె, తు. బారె, బాళె. (5373)

త. వేలై 'పని', మ. వేల, తు. బేలె. (5540)

త. వై 'తిట్టు (క్రియ)', కోత. వయ్శ్ 'తిట్టు'. క. బయ్. బయ్యు 'తిట్టు (క్రియ'), కొడ. బయ్య్-, తు, బయ్యాట 'తిట్టు'. (5550)

(ii) దక్షిణ భాషల అంతర్విభాగం.

(అ) మూలదక్షిణ ద్రావిడం నించి మొదట తుళు విడిపోయింది. తుళు విడిపోగా మిగిలిన తమిళ-కన్నడ సముదాయంలో ఈ కింద ఇచ్చిన మార్పులు వచ్చాయి:

1 అమహత్ బహువచన ప్రత్యయంగా *కళ్ మిగిలింది; *ళ్ పోయింది. తుళులో రెండూ ఉన్నాయి.

2. ఔపవిభక్తిక ప్రత్యయమైన *త్ర్ మకారాంత పదాలకే పరిమితమైంది.

8. ఈ భాషలో '5', '8' సూచించే సంఖ్యలలో దంత్యం అధికంగా చేరింది.

త. అయ్ంతు, '5', మ. అంచు, కోత. అంజ్, తొ. ఉజ్, కొడ. అంజు, క. అయిదు : తు. అయ్ను, తె. ఏను.

త. మ. ఎట్టు '8', కోత. ఎట్, తొ. ఒట్, కొడ. ఎట్టు, క. ఎంటు : తు. ఎనిమిది (దంత్యం ఇకారం తరవాత మూర్ధన్యంగా మారింది).

4. వ్యతిరేక ప్రత్యయమైన *ఆ అచ్చుతో మొదలయ్యే పురుష ప్రత్యయాల (అమహత్ ఏకవచన, బహువచనాలు తప్ప) ముందు లోపించింది.

(ఆ) తమిళ - కన్నడ సముదాయం తరవాత కాలంలో తమిళం - తొద, కన్నడం అనే రెండు భాగాలుగా చీలింది.

తమిళం - తొద సముదాయంలో ఈ కింద ఇచ్చిన మార్పులు వచ్చాయి: 1. అనునాసిక సహిత ద్విరుక్త స్పర్శంలో అనునాసికం లోపించింది; 2. ఇ, య ల తరవాత దంత్యాలు, తాలవ్యాలుగా మారేయి; 3. ప్రేరణా ప్రేరణార్థాలు కూడా కాలప్రత్యయాలవల్ల వ్యక్తీకరించబడుతున్నాయి. దక్షిణ భాషలలో ఈ సముదాయంలోనే అప్రేరణంలో (అనునాసిక సహిత) స్పర్శం : ప్రేరణంలో ద్విరుక్త స్పర్శం అనే సంబంధం నిలిచి ఉంది.

(ఇ) తమిళం - తొద సముదాయం తరవాత తమిళం - మలయాళం - కొడగు, కోత - తొద అని రెండు భాగాలుగా చీలిపోయింది.

కోత - తొద సముదాయంలో ఈ కింద ఇచ్చిన మార్పులు వచ్చాయి : 1. ప్రాచీనమైన భూత ప్రాతిపదికే భూత కాలానికీ, వర్తమాన కాలానికీ ప్రాతిపదిక అవడం; 2. ప్రథమ పురుషలో లింగవచన భేదం పోవడం; 3. ఉభయార్థక సర్వనామంలో పదాది నకార లోపం (కోత. అమ్ (అమ్-), తొ. ఒమ్ (ఒమ్-) <మూ. ద్రా. *నామ్ (నమ్-)); 4. ఇ తప్ప మిగిలిన నిష్పాదక ప్రత్యయాల లోపం. క్రియలలో ఉభయార్థకానికి ప్రత్యేక ప్రత్యయం దక్షిణ భాషలలో ఈ రెండింటిలోనే నిలిచి ఉంది.

(ఈ) తమిళం - మలయాళం - కొడగు సముదాయంలో నించి మొదట కొడగు విడిపోయింది. ఈ మూడూ ఒకటిగా ఉన్నప్పుడు జరిగిన కొన్ని మార్పులు : 1. యుష్మదస్మదర్థక బహువచన సర్వనామాలకి కళ్ ప్రత్యయం చేరడం; 2. షష్ఠీ విభక్తి ప్రత్యయంగా - ఉదైయ అనేదాని ప్రయోగం.

(ఉ) తమిళ - మళయాళ సముదాయం (ప్రాచీన తమిళం)లో ఇతర పరిణామాలు : 1. *క - > చ- (మూర్ధన్యం తరవాత లేని తాలవ్యాచ్చు ముందు); అచ్చుల మధ్య కకారం కూడా తాలవ్యాచ్చు ముందు చగా మారింది. 2. *ఎ, *ఒ → ఇ, ఉ (అకారం ముందు); 3. ద్వితీయా విభక్తి ప్రత్యయం *-అయ్.

## 5. 3. మధ్య ద్రావిడోపకుటుంబం

మధ్య ద్రావిడోపకుటుంబంలో భాషల మధ్య వైవిధ్యం ఎక్కువగా కనపడుతుంది. మిగిలిన రెండు ఉపకుటుంబాలలో ఉన్న భాషల మధ్య ఉన్నంత సాన్నిహిత్యం ఈ భాషలకి లేదు. దీనికి కారణం మూల మధ్యద్రావిడం మూలోత్తర ద్రావిడాలకన్న చాలా కాలం ముందే చీలిపోవడం మొదలుపెట్టి ఉండడం అయి ఉంటుంది. అయినా ఈ ఉపకుటుంబంలో భాషలు ఇంచుమించు అన్నిటిలోనూ కనపడే ప్రత్యేక లక్షణాలు చాలా ఉన్నాయి. కాబట్టి ఈ భాష లన్నిటినీ ఒకే ఉపకుటుంబంగా పరిగణించడం సమంజసమే.

(i) మధ్య ద్రావిడోపకుటుంబం ప్రత్యేక లక్షణాలు :

1. లింగవచన భేదం (చూ. పేజీ 186.)

2. *-అళ్‌తో ఉన్న బంధు స్త్రీవాచక పదాలు (చూ. పేజీలు 188-189.)

3. అమహత్ బహువచన ప్రత్యయ నిత్యత్వం (చూ. పేజీ 209.)

4. మూ. ద్రా. *య- > అ- (చూ. పేజీలు 230, 234.)

5. యుష్మదర్థక సర్వనామాలలో *న- లోపం. (చూ. పేజీలు 240, 243.)

6. మహదేకవచన సర్వనామం (చూ. పేజీలు 246-247.)

7. క్త్వార్థక ప్రత్యయం *-చి (చూ. పేజీలు 349-352)

8. భూత వ్యతిరేక క్రియ (తెలుగు, గోండిలలో తప్ప), (చూ. పేజీ 392)

9. వ్యతిరేక క్త్వార్థకం (చూ. పేజీ 392).

10. భవిష్యత్‌కాలిక ప్రత్యయమైన *త్త (*త) ప్రయోగ బాహుళ్యం (చూ. పేజీ 372).

11. కొన్ని పదాలు :

మధ్యభాషలో మాత్రం ఉన్న పదాల సంఖ్య 50 కి పైగా ఉంది. ఉదాహరణలు.

తె. డప్పి, దప్పి, దప్పిక, కో అడ్డ్- 'దాహంవేయు', నా. అడ్ 'దాహం', ప, గ. అండ్ -'దాహం / ఆకలివేయు'. (109)

తె. రాలు, రాల్చు, కో. రాల్-, రాప్-, నా. రాల్-, రాల్ప్-, గోం. అర్-, అరూస్-, కొం. అర్-, అరప్-, పెం. అర్-, రత్-, మం. రె-, రెత్- (కోలామీ, నాయకీ పదాలు తెలుగు నించి వచ్చినవి). (233)

ప. ఏదిర్, ఏయిర్ 'వడగళ్లు', గ. ఆదిర్, ఆదుర్, కొం. ఆన్‌ఙ్‌గ, గోం. ఆదుర్, పెం. ఆంజ్‌గ, మం. ఆంజ్‌గి, కూయి. ఆజి, కువి. అజ్జి, అజ్జి. (406)

తె. ఇలుగు, ఈలుగు, 'నీలుగు, 'చచ్చు', ప. గ. ఈల్ 'పడు'. (548)

(తు. ఉజ్జెరు 'రోకలి') ప. ఉయ్ప్- '(బియ్యం) దంపు', గ. ఉయుప్-, గోం. ఉస్-, పెం. కూయి ఉహ్-, మం. ఉహ్క్-, కువి. ఉహ్-. (583)

(త. ఉళువై 'పులి'), తె. దువ్వు, కో. దువ, దూ (<తె.) ప. దూ (<తె.) గోం. డువ్, డువ్వాల్. (692)

కో. నా. నా (ఛాం.) ఉద్- 'కూచును', ప. ఉంద్-, గ, ఉండ్-, గోం. ఉద్-, (తె. ఉండు-?). (725)

కో. నా. నా (ఛాం.) ప. గ. గోం., కొం పెం. మం. కూయి కువి. ఏంద్- 'నాట్యంచేయు'. (895)

కో. నా. (ఛాం.), కత్క్- 'పడగొట్టు, నరుకు', ప. కత్-, గ. కొం. పెం. మం. కూయి కువి కత్-, (1208)

తె. ఆకు, గోం. ఆకీ, కొం. అక్, పెం. మం. ఆకి, కూయి. కువి. ఆకు. (335)

ప. గుణ్జి 'గుడ్లగూబ' గోం. కుంజి, కొం. కూయి, కువి. గుంజి. (1647)

ప. గ. పేప్- (పేత్ -) 'పైకివచ్చు, కనపడు', గోం. పెసీ. (4382)

తె. మఱంది, మఱందలు, కో. మరాన్, మర్ందాల్, గోం. మర్ండాడ్ 'మరది', కూయి. మ్రీగెంజు 'మరది', మ్రీగలి 'మరదలు', కువి. మ్రాందెసి, మ్రాయెంజు 'మరది'. (4762)

ప. మెది 'మామిడి', నా (ఛాం.) మగ్గె, గ. మయ్గిల్, మయ్గా, గోం. మర్కా, పెం. మస్క, నుం. మహ్కె, కూయి మహ, కువి. మహ్? అ. (4772)

తె. వండు, ప. వెంద్-. వెండ్-, నా (ఛాం.) వద్ద్-, గ. వండ్-, పెం. మం. వంజ్-, కూయి కువి. వజ్ -. (5329)

గ. వంగెర్ 'తాలువు', గోం. వెంజేర్ 'నాలుక', కొం. వెతొల్. పెం. మం. వెందుల్, కూయి. వంగొసి, వంజుస్, కువి. వెందొరి. (5470)

(ii) మధ్యభాషల అంతర్విభాగం.

(అ) మూల మధ్య ద్రావిడభాష మొట్టమొదట రెండు విభాగాలుగా చీలిపోయింది. అవి తెలుగు - కువి, కోలామీ - పర్జీ. కోలామీ - పర్జీ ఉప కుటుంబం ప్రత్యేక లక్షణాలు :

1. అమహత్ బహువచన ప్రత్యయాలు *కళ్, *ళ్ రెండూ మిగిలి ఉండడం; 2. కొన్ని పదాలలో అమహత్ బహువచన ప్రత్యయంగా *వ ఉపయోగం; 3. *ఎంక్ అనే తుమ్మునర్థక ప్రత్యయం; 4. రెండు, మూడు, నాలుగు సంఖ్యలలో స్త్రీలని సూచించే ప్రత్యేక రూపాల సృష్టి; 5. -అడ్ (-ఒడ్), -నడ్ (-నొడ్) అనే తృతీయావిభక్తి ప్రత్యయం, మొ.

(ఆ) కోలామీ- పర్జీ సముదాయం తరువాత కాలంలో కోలామీ - నాయకీ, పర్జీ - గదబ అనే రెండుగా చీలిపోయింది. కోలామీ - నాయకీలలో ఉన్న ఇతర పరిణామాలు : 1, భూత ప్రత్యయమైన త అన్ని క్రియలకీ వ్యాపించడం; 2. వ్యతిరేక ప్రత్యయమైన *అ ఎగా మారడం; 3. అమహదేకవచన భవిష్య త్క్రియలలో ఉన్/అన్ (<*ఉమ్) నిలిచిఉండడం; 4. తద్ధర్మ ధాతుజవిశేషణ ప్రత్యయం -ఎక; 5. -నె-మ్ (ఏ.వ.), -నె-ర్ (బ.వ.)తో నిషేధ క్రియ.

మూ. దా. ళ కి ఈ భాషలలో భిన్నపరిణామాలు ఉన్నాయి. అది కోలామీలో రగ మారితే నాయకీలో యగా మారుతుంది. లేక లోపిస్తుంది. నాయకీలో పదాంత లకారం లోపిస్తుంది. (ఈ మార్పు అదిలాబాద్ కోలామీలోకూడా ఉంది).

(ఇ) పర్జీ - గదబలలో ఈ కింద ఇచ్చిన ప్రత్యేకతలు ఉన్నాయి:

1. *ట్జ, *న్జ < ట్ట, ండ (పర్జీలో ఈ శాన్యమూండలికంలో మాత్రమే); 2. మూ. ద్రా. ళ ఇతర హల్లులతో కలియకుండా డ గా మారడం; 3. *చ > ఇ; 4. * ఇప్త్ > ఇత్ (భూత ప్రాతి పదికలో); 5. ప/త లతో అంతమయ్యే క్రియలు; 6. భూత ప్రత్యయమైన *ంత పర్జీలో ఇ గానూ గదబలో న గానూ ఉండడం (ఈ, య, రలతో అంతమయ్యే క్రియలలో); 7. ధాతుజ విశేషణం

చివర -అన్ ఉండడం; 8. -మె- న్ (ఏ. వ.); -మొ- ర్ (బ.వ.) తో నిషేధ క్రియ; 9. తుమున్నర్థకంలో ప కి క ఆదేశమవడం.

(ఈ) తెలుగు - కువి భాషలు ఏక భాషగా ఉన్న కాలంలో ఈ కింద ఇచ్చిన మార్పులు జరిగేయి: 1. వర్ణవ్యత్యయమూ, అచ్చుల ఏకీకరణం (గోండీ కొండలలో మొదట్లో అజాదులైన పదాలలో మాత్రమే వర్ణవ్యత్యయం జరుగుతుంది); 2. యుష్మ దస్మదర్థక సర్వనామాల ఔపవిభక్తిక రూపాలలోనే వర్ణవ్యత్యయం, మూ. మ. ద్రా, *అన్., *అమ్-, *ఇన్-; *ఇమ్- లు వర్ణ వ్యత్యయంవల్ల క్రమంగా నా-. మా-, నీ-, మీ-లు గా మారేయి. అర్వాచీ నాంధ్రం, కొన్ని గోండీ మాండలికాలు, కొండ, కూయి మాండలికం, కువిలలో ఈ ఔపవిభక్తిక రూపాల సామ్యంవల్ల ప్రథమావిభక్తి రూపాలుకూడా ఏకవచ నంలో నకారాన్నీ బహువచనంలో మకారాన్నీ పదాదిని చేర్చుకొన్నాయి. 3. ముఖ్యంగా విధ్యర్థక క్రియలలో *ట్ అనే కొత్త బహువచన ప్రత్యయం సృష్టించబడింది.

ఈ సముదాయంనించి తెలుగు మొట్టమొదట విడిపోయింది.

(ఉ) గోండీ - కువి సముదాయంలో ప్రత్యేక పరిణామాలు :

1. *ళ>ఢ; 2. *ఴ > ఢ; 3. *గ> *ఙ; 4 అమహత్ బహు వచన ప్రత్యయం (అచ్చు తరవాత) *ంక్, (హల్లుతరువాత) *క్: 5. మహతీ బహువచన ప్రత్యయం -స్క్-; 6, న (<*న, *ణ) లతో అంతమయ్యే క్రియల భూత ప్రాతిపదికలలో *న్ద, *ంట లు *ఙ్జ, *ట్ట లుగా మారడం; 7. *నిట్ట్ -/ *నెట్ట్- 'నింపు', *వెట్ట్ - 'మాట్లాడు, చెప్పు' అనే క్రియలు *నిన్ట్- 'నింపు', *వెన్ట్ - 'మాట్లాడు, చెప్పు' అనే క్రియలు *నిన్ద్- 'నిండు', *వెన్- 'విను' అనే వాటి ప్రేరణలుగా సృష్టించబడటం; 8. వ్యతిరేక ప్రత్యయం *-వా-; 9, మూలగోండీ- - కువిలో *మఱి 'జంతువుపిల్ల' అనే దాని అర్థం 'కొడుకు'గానూ, మూ. ద్రా *యాఱ్ 'ఏరు, నది' (<మూల గోండీ - కువి *ఏఱ్) అనే దాని అర్థం 'నీరు' గానూ మారడం: 10 మూల గోండీ - కువిలో *వెరంచ్ 'వేలు' (:త. మ. విరల్, తె. వ్రేలు), *పిఱ్ 'వాన' (: త. మ. పెయ్ 'వాన కురియు') అనే పదాల చివర కొత్తగా వచ్చి చేరిన హల్లులు.

ఈ సముదాయం నించి గోండీ మొదట విడిపోయింది. అని చెప్పటానికి ఆధారాలు ఉన్నాయి. మిగిలిన భాష లన్నిటిలోనూ ఉన్న ఈ అంశాలు గోండీలో లేవు:

1. వ్యతిరేక భూత క్రియాపదాలు; 2, క్రియలలో గమన (Motion Particle); యుష్మదస్మదర్థక సర్వనామాలతో క్రియ సంబంధించినపుడు దానికే చేరే ప్రత్యయం. ఇవి గోండీలో లేవు కాని ఈ సముదాయానికి చెందిన మిగిలిన భాష లన్నింటిలోనూ ఉన్నాయి. కాబట్టి ఈ సముదాయంలో గోండీ మొదట విడిపోయి ఉండాలి.

(ఈ) కొండ - కువి సముదాయం ప్రత్యేక లక్షణాలు : 1. వ్యతిరేక భూత క్రియాపదాలు : 2. క్రియలలో గమన సూచక ప్రత్యయం (Motion Particle); 3. యుష్మదస్మదర్థకాలు కర్మగా ఉన్నప్పుడు క్రియలో ప్రత్యేక ప్రత్యయం; 4. నిష్పాదక ప్రత్యయాలలో అప్రేరణంలో (అనునాసిక సహిత) నాదస్పర్శం : ప్రేరణంలో ద్విరుక్త శ్వాస స్పర్శం - ఈ సంబంధం నిలిచి ఉండడం; 5. కొన్ని పదాలలో మూర్ధన్య *ణ కారం మిగిలి ఉండడం.

కొండ ఈ సముదాయం నించి మొదట విడిపోయింది.

(ఎ) పెంగొ - మండ - కూయి - కువి సముదాయం ప్రత్యేక లక్షణాలు: 1. క్రియలలో పౌనఃపున్యార్థద్యోతకం (Plural Action) అయిన ప్రత్యయం [ప (బ), క] ఉండడం; 2. దంతమూలీయాలైన *ల, *ళ, *న్ల లు తాలవ్యాలుగా మారడం; 4. ఉభయార్థక పురుష ప్రత్యయం *-అస్.

ఈ నాలుగు భాషల పరస్పర సంబంధం మీదా, వీటికీ కొండకీ గల సంబంధం మీదా ఇంకా పరిశోధన జరగవలసి ఉంది. మూల పెంగొ - మండ - కూయి - కువి మూల పెంగొ - మండ, మూల కూయి - కువి అనే రెండు భాగాలుగా చీలిపోయిందనే విషయం స్పష్టం. మండని గురించిన వివరాలకి చూ. బరో A sketch of Manda grammar in comparison with Pengo, *Dravidian Linguistics - V* (Annamalai University, 1976),

pp. 39-56. పెంగొకి కొండకి రెండు విషయాలలో సామీప్యం ఉంది. అవి 1. బంధువాచక పదాలు ప్రథమపురుష నామంతో వాడినపుడు ఒక ప్రత్యేక ప్రత్యయాన్ని కలిగి ఉండడం (పెంగొ -హి, కొండ - సి); 2. తుమున్నర్థక ప్రత్యయం తెజ్ (దెజ్). కొండ గోండీలలో ఉభయార్థక పురుష ప్రత్యయం -అట్ అవడం కూడా గమనించదగినది.

## 5.4. ఉత్తర ద్రావిడోపకుటుంబం :

(i) ఉత్తర ద్రావిడోపకుటుంబం ప్రత్యేక లక్షణాలు :

1. మూ. ద్రా. *క- > ఖ- (*ఇ, *ఈ, *ఉ, *ఊ లు కాక మిగిలిన అచ్చుల ముందు). (చూ. పేజీలు 136-139.)

2 మూ. ద్రా. *వ- > బ-. (చూ. పేజీ. 158.)

3. మూ. ద్రా. *చ- > క (*ఉ, *ఊ, *ఎ, *ఏల ముందు). (చూ. పేజీ. 143.)

4. యుష్మదస్మదర్థకైక వచన సర్వనామాల ఔపవిభక్తిక రూపాలు (చూ. పేజీలు 230-240.)

5. భూతప్రత్యయం *-క-. (చూ. పేజీలు 348-349.)

6. భవిష్యత్ కాల ప్రత్యయం *-ఒ-, (చూ. పేజీ 371.)

7. *-అక్ ప్రత్యయంతో విధ్యర్థకం, (చూ. పేజీ 425.)

8. బ్రాహుయిలో సమాపక క్రియ ఇన్ / కా - 'పోవు' అనే క్రియ అతిశయార్థద్యోతక సహాయక క్రియగా ప్రయోగించ బడుతుంది (రెండు క్రియ లలోనూ కాలం, పురుష ప్రత్యయాలు సమానంగా ఉంటాయి) : కస్క్ ఇనా 'చచ్చిపోయాడు'.

కుడుఖ్‌లో కూడా కా - 'పోవు' అనే క్రియ ఇలాగే ఉపయోగించబడు తుంది: కెచ్చా కెరా 'చచ్చిపోయింది'.

ఈ సహాయక క్రియ ఉత్తర భాషలలో ఒక ప్రత్యేకత.

9. ఉత్తర భాషలలో కొన్ని క్రియలలో చకారం భూత ప్రత్యయంగా ఉంది.

భూత ప్రత్యయమైన చకారం మూల ద్రావిడ భాషకి చెందినదే అయినా అది ఉత్తరభాషలలో కొన్ని క్రియలలో ఉండడం వాటి ప్రత్యేకత అని చెప్పవచ్చు.

**10.** ప్రశ్నార్థక సర్వనామం, కూ. నే 'ఎవరు' మా నేరె(హ్)'ఎవడు,' నేరి (త్) /నే (త్) 'ఎవర్తె' నేరెర్ 'ఎవరు,' బ్రా. దేర్, దే 'ఎవరు,' ఇవన్నీ మూ. ఉ. ద్రా. *నే నించి వచ్చినవి (చూ. పేజీ. 252).

**11.** అర్థవిపరిణామం. దక్షిణ మధ్య భాషల (మూల ద్రావిడం)లో *మన్ - అనే క్రియ అర్థం 'ఉండు, జీవించు' ఉత్తర భాషలలో దీని అర్థం 'అవు.'

కూ. తుంగల్, మా, తుంగ్లే, బ్రా. తుఘ్- వీటి అర్థం 'కల.' ఇవి మూ. ద్రా. *తూంక్- 'వేళ్ళాడు, నిద్రపోవు' అనే దానినుంచి వచ్చినవి. దీనికి 'కల' అనే అర్థ విపరిణామం ఉత్తర భాషలలోనే ఉంది.

**12.** కొన్ని పదాలలో ఉత్తర ద్రావిడ భాషలలో ప్రత్యేకమైన నిష్పాదక ప్రత్యయాలు ఉన్నాయి.

కూ, మరగ్ '(జంతువు) కొమ్ము,' మా. మర్గు, బ్రా. మర్ఖ్ ( : త. మరుప్పు; ఉత్తర భాషలలో *-అక్ ప్రత్యయం కొత్తగా చేరింది.)

కూ. ఖేఁసో 'ఎరుపు, ఎర్ర,' మా. ఖేసొ. బ్రా. ఖీసున్ ( : త. తె. చెం-; ఉత్తర భాషలలో *-చ్ - అనే కొత్త ప్రత్యయం).

కూ. మాం. పింజ్ - 'పేరుపెట్టు.' బ్రా. పిన్ 'పేరు.' ( : త. మ. పెయిర్, పేర్, తె, పేరు, ఉత్తర భాషలలో (*-ంచ్) అనే కొత్త ప్రత్యయం.)

**13.** కొన్ని ప్రత్యేక పదాలు :

కూ. మా. ఇర్చ్- 'గీకు, గోకు,' బ్రా. ఇరిస్ 'దువ్వెన' (**493**).

కూ. మా. ఖోస్ - 'దంపు,' బ్రా. ఖోష్క్- - 'రాయు' (**2189**).

కూ. చక్ఖ్ - 'గుచ్చు,' మా. చఖ్ - 'పొడుచు', బ్రా. జఖ్ఖ్ - 'గుచ్చు' (**2278**).

కూ. బేక్ 'ఉప్పు', మా. బేకు, బ్రా, బే. (**4428**)

కూ. మోజ్‌ఖా, మోస్‌గా 'పొగ,' మొజొఖ్ - 'పొగవచ్చు,' మా. మొగ్-, బ్రా. మోల్ 'పొగ'. (5131)

కూ. ఖింబ్, ఖిమ్‌చ్ - 'కౌగిలించుకొను', బ్రా. ఖుంబ్ 'కౌగిలింత.' (1558)

మా. పిల్‌ఖ్ - 'పిండు' బ్రా. పిల్-. (4183)

(ii) ఉత్తర భాషల అంతర్విభాగం.

మూలోత్తర ద్రావిడం నించి బ్రాహుయీ మొదట్లో విడిపోయింది. బ్రాహుయీ విడిపోయిన తరవాత చాలా కాలం వరకూ కూడుఖ్ మాల్తోలు ఏక భాషగానే ఉంది, అవి ఇటీవల కాలంలోనే భిన్న భాషలుగా మారేయి. బ్రాహుయీ కూడుఖ్ - మాల్తోల నించి చాలాకాలం క్రితం విడిపోవడం వల్లనే బ్రాహుయీకీ వాటికీ మధ్య చాలా భేదాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకి, కూడుఖ్ - మాల్తోలో అమహద్బహువచన ప్రత్యయం లేదు; బ్రాహుయీలో ఉంది. బ్రాహుయీలో వ్యతిరేక క్రియలు మిగిలిఉన్నాయి; కూడుఖ్ - మాల్తోలలో అవి నశించాయి కూడుఖ్ - మాల్తోలలో అస్మదర్థక బహువచన సర్వనామం, ఉభయార్థక సర్వ నామం మిగిలి ఉన్నాయి; బ్రాహుయీలో ఈ భేదం నశించింది. భూతకాల భూతేతర కాల ప్రత్యయాలతో కూడా వీటి మధ్య భేదాలు ఉన్నాయి.

కూడుఖ్ - మాల్తోలలో ప్రత్యేక పరిణామాలు :

1. *ఆ>స, ర; 2. *ఙ్జ>త్త; 3. *న్జ>ంద; 4. *ళ>φ (లోపం); 5. స్త్రీల భాషకి పురుషుల భాషకి మధ్య భేదం.

కూడుఖ్ - మాల్తోలలో మాత్రమే ఉన్న పదాల సంఖ్య సుమారు 150. ఈ రెండు భాషలకి మధ్య భేదం చాలా స్వల్పం.

కింద ఇచ్చిన ద్రావిడ భాషల కుటుంబ వృక్ష పటం మూలద్రావిడ భాష క్రమక్రమంగా ఇప్పటి భాషలుగా ఎలా విడిపోయిందో సూచిస్తుంది. ఏ రెండు భాషల మధ్య అయినా సాన్నిహిత్యం ఎంత ఉందో కూడా దీనివల్ల తెలుసుకో వచ్చు. (ఇది ఆధునిక పరిశోధన ఆధారంగా గీయబడింది. కాబట్టి దీనికీ కొన్ని ఇతర గ్రంథాలలో ఉన్న కుటుంబ వృక్ష పటాలకి మధ్య భేదం ఉంది.)


మూలద్రావిడల
మూ.ద.ద్రా.
మూ.మ.ద్రా.
మూ.ఉ.ద్రా.
మూల తె.-కు.వి
మూల గోం.-కువి
మూల కొండ-కువి
మూల పెం-కువి.
మూల కో.-ప.
మూల త.-క.
మూల త -తొద.
మూల త.-కొడ.
మూల త.మ.
మూల కోత-తొద.
మూల పెం.మం.
మూల కూయి-కువి
మూల కో.నా.
మూల ప.గ.
మూల కూ.మా.
త.
మ.
కొడ.
కోత
తొద
క.
తు.
తె.
గోం.
కొం.
పెం.
మం
కూయి
కువి
కో.
నా.
ప.
గ.
కూ.
మా.
బ్రా.
౪౫౧